# అఖిలాంధ్ర వీర సంస్మరణ కుసుమాంజలి

(దేశ స్వాతంత్ర్యోద్యమంలో
త్యాగంచేసి నిర్మాణ కార్యక్రమదీక్షితులై,
పరమపదించిన వీర నరనారీమణుల
చరిత్రల సంగ్రహము)

అఖిలాంధ్ర వీర సంస్మరణ మందిరం
వారిచే ప్రకటితము

సర్వస్వామ్యములు

వెల రు. 2-8-0



మట్టిలోనుండి మహావీరులనుసృజించిన మహాత్ముడు, చిందరవందరలైన నాటి జాతియస్వాతంత్ర్య ప్రవాహములు, పరిస్థితులను, తన అపూర్వ సమన్వయసమ్మేళన ప్రతిభతో బిగించి సాధించిన మేటి, మానవలక్ష్యాలమిదనే నొప్పుఱిగం యుగము యొక్క దృష్టిని తనఉద్యమానుష్ఠానములంవల్ల సాధనపై పుమరల్చిన ఋషిసత్తముడు

పేరు

ఆంధ్రోద్యమ పితామహ దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు

విశ్వదాత, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు

ముట్నూరి కృష్ణారావుగారు

చిలుకూరు వీరభద్రరావుగారు

ఆంధ్రవీర అల్లూరి శ్రీరామరాజుగారు

జాతీయపతాకవీర బత్తిన మొగలయ్యగారు

ఆంధ్రరాష్ట్రవీర పొట్టి శ్రీరాములుగారు

# పీఠిక

ఈ ప్రచురణకు పీఠిక దేశభక్తులచే వ్రాసి యిచ్చుటకు ఉభయుల సంకల్పం. అది జరుగకపోయినా వారి నిర్యాణంకు కొద్దికాలం ముందుగా నాటి పత్రికలలో ప్రకటించిన ఈ క్రింది హెచ్చరికనే పీఠికగా ఇట ప్రకటిస్తున్నాం.

# వీర సంస్మరణ మందిరం

## కొండ వెంకటప్పయ్యగారు

పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు గ్రామంలో "వీర సంస్మరణ మందిరము" 1942 సంవత్సరం ఏప్రిలుమాసములో స్థాపింపబడినది. ఇందు కాంగ్రెసు కార్యక్రమములో పాల్గొని పరమపదించిన త్యాగమూర్తులైన కాంగ్రెసు ప్రచారకుల ఛాయాపటములను నిలుపవలెనని ఉద్దేశింపబడినది. మరియు నిందు కనుగుణముగ వారి జీవితచరిత్రలను కూడ నొక పుస్తకముగ ప్రకటింపవలెననియును ప్రయత్నములు సాగుచున్నవి. అట్టి ప్రచారకుల జీవితచరిత్రాంశములను తెలుపవలేనని

శర్మగారు పత్రికలద్వారా కాంగ్రెసు అభిమానులను కోరినప్ప టికి యింతవరకను అట్టి సంజాయిషీ ఎవరును పంపకపోవుట శోచనీయమైన విషయము. ఆ సంజాయిషీ సమకూర్చుటకుగాను కొవ్వూరు వాస్తవ్యులును ఈసంస్థల నిర్వహణములో శ్రీ శర్మ గారికి తోడ్పడుచున్నట్టియు శ్రీ కె వి. యస్. అప్పారావుగా రిపుడాంధ్రజిల్లాలలో సంచారము చేయుచున్నారు. ఇది నిక్క- ముగ పవిత్రమైన కార్యమైనందున, మనతోడగూడి పనిజేసి దివంగతులైన, సోదర ప్రచారకుల చిరకాల సంస్మరణార్థము శ్రీ నందేశ్వరశర్మగారు పూనుకొనిన యీ మహాత్కార్యమును నెరవేర్చుట మన కర్తవ్యమని తలంచి కాంగ్రెసు అభిమా నులు యెల్లరును- యీ కార్యమునందు సానుభూతి గల వారికి, తమకు తెలిసిన వివరము సంజాయిషీ యిచ్చి తోడ్పడుదురు గాక యని కోరుచున్నాను

ఈ సంస్మరణమందిర ప్రతిష్ఠాపనకుపూర్వమే కాంగ్రెసు ప్రచారకులలో ఐకమత్యమును, రాజకీయార్థిక విషయ పరిజ్ఞా నమును, కార్యదీక్షను పెంపొందించుటకు కాంగ్రెసు ప్రచారక సమితి ప్రారంభింపబడి రాజ్యాంగ, ఆర్థిక, విజ్ఞాన వ్యాపకము వలె స్థాపింపబడినది ఆయుయ విజ్ఞానవ్యాప్తికి పార్వగ్రంధములను నిర్ణయముగావించి శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్యగారు మొదలగు విద్యాధికుల సానుభూతి సహాయము లతో పరీక్షలుకూడ నడిపింపబడి ఉత్తీర్ణులైనవారికి పట్టప్రదా నములు చేయబడుచున్నవి. కొండపల్లి ఉద్ధరణ కార్యము

ఋంచుకొని జోడింపబడి, విశాఖపట్టణంజిల్లా మాడుగుల ప్రాంతపు కొండజాతులకు విద్యా పాఠశాలలు స్థాపించియు, నూలు వడకుట, నేతనేయుట, మొదలగు పనులు సహితము సాగించబడు చున్నవి. అఖిలభారత హరిజన సేవకసంఘ కార్యకర్త్రి గారైన శ్రీ ఠక్కురు బాపాగారు స్వయంగా ఆ జనులమధ్య జరుగుచున్న కార్యక్రమమును వీక్షించి, సంపూర్ణ సానుభూతిని ప్రకటించి, ద్రవ్యసహాయమును కూడ అప్పటప్పటికి చేయుచు తత్కార్యాభివృద్ధిని ప్రోత్సహించుచున్నారు. ఈ ఉద్యమము మహాత్మా గాంధిగారి యొక్క ఆశీస్సులను కూడా బడసినది.

ఈపైన నుడివిన సంస్థల కన్నిటికిని యీ వీర సంస్మరణ మందిరముననే కార్యస్థానములు వేర్వేరుగా ఎర్పరుపబడియున్నవి మరియు నందు రమారమి రు. 1500 ల విలువగల రాజ్యాంగ, ఆర్థిక విషయములను గూర్చిన ప్రమాణగ్రంథములు కల ఒక గ్రంథాలయము కూడ నెలకొల్పబడినది ఇట్లు అనన్యమైన ప్రాధాన్యత వహించిన యీ వీరసంస్మరణమందిరం ఆంధ్ర దేశమున ప్రజల హృదయము నాకర్షించి యాత్రస్థానముగ విలసిల్లుగాకయని ఆశించుచున్నాను.

ఇట్టి సంస్థయొక్క మహత్కార్యమును ఏకైక దీక్షతో నెరవేర్చుచున్న శ్రీ సోమేశ్వరశర్మగారు యీమధ్య కాలమున మిక్కిలి అనారోగ్యస్థితిలో యుండి పరమేశ్వరుని కృపవలన, ప్రాణాపాయము తప్పించుకొని, నేటికి స్వగ్రామము

వదలి యితరగ్రామ సంచారము చేయలేని బలహీనస్థితిలో యున్నారు. వారుపూనిన యీకార్యములో యిప్పటికి తోడ్పడుచున్నవారు పై నుడివిన అప్పారావుగారు ఎం. ఏ. పరీక్షయందు కృతార్థులైన యువకులు. వీరు కార్యోత్సాహముతో స్వార్థమును పాటింపక పనిచేయుచున్నారు. కావున యిట్టిత్యాగశీలు రొనర్చుచున్న సత్కార్యముల ప్రయోజనములను బాగుగా గమనించి ఎల్లరును తగురీతి సహాయ మొనర్తురుగాక యని కోరుచున్నాను

# స మీ క్ష

ఈ పీఠసంస్మరణ కార్యక్రమం ఈమందిరము నందలి మూడు సంస్థలలో మొదటిది. రెండవది — కొండజాతి సేవ. మూడవది గ్రామిక ధర్మరాజ్య వైజ్ఞానిక పరిశోధన. దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారు ది 13-4-1942 తేదీని గాంధీజీ యొక్క యు డాక్టరు రాజేంద్రప్రసాద్, డాక్టరు పట్టాభి సీతారామయ్య మున్నగువారి ఆశీర్వాదాలతో, ఈ ఉద్యమ ప్రోత్సాహకులైన, త్యాగులైన ప్రచారక మిత్రుల సమక్షమున (చూ. ఛాయాపటము) ప్రారంభోత్సవం జరిగించారు. ఇందులోని కొండజాతి శాఖకు జెందిన భాగము అంతకు పూర్వమే ఆదిమజాతి సేవాపితామహులు శ్రీ ఠక్కర్ బాపా గారు ఆవిష్కరణ చేశారు ఈ మందిరమున నేడు అలంకరింపబడి ఛాయాపటములు—డాక్టరు సుబ్రహ్మణ్యం, శనివారపు సుబ్బారావు, గజవిల్లి రామచంద్రరావు; దేవత శ్రీరామమూర్తి, కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, ఎల్లాయి సన్యాసయ్య, మద్దూరి వెంకటరమణమ్మ, దేశభక్త వెంకటప్పయ్య, ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య, గాంధీజి, కొమ్మారెడ్డి ఆంజనేయులు, అల్లూరి శ్రీరామరాజుగార్ల చాయాపటములు ఆచార్య వినోబా, స్వామి సీతారాం, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు, [illegible] మద్దూరి అన్నపూర్ణయ్యగార్లచే ఆవిష్కరింపబడినవి. మేము సంపాదించిన ఇర్ర కి॥ శే॥ ప్రీతిల మాంకొండ చిన్న ఛాయాపటము ద్రవ్యాభావము వలన ఆవిష్కరింప వీలులేకపోయినది.

ఇందులో ప్రచురింపబడిన సుశ్లోకులయొక్క వ్యక్తి జీవిత చరిత్రలను సమిష్టిగా చూస్తే, ఆంధ్ర దేశ జాతీయజీవితం, స్వరాజ్యోద్యమం ప్రారంభించే నాటికి మొత్తం దేశంయొక్క నైతిక, సాంఘిక, రాజకీయ జీవితమున్ను, ఎంతదాస్య సంకులంగా వుండినదియు, ఈ ప్రచారక వ్యక్తులు తమత్యాగము త్యాగక్రమ బలముతో స్వరాజ్యమున కనువైన స్థితిలోనికి దానినెలా తీసుకువచ్చిందీ బోధపడగలదు. వీరంతా మహా నాయకులు కాకపోవచ్చును. అఖిలభారతిఖ్యాతి కూడా వీరికి లేకపోవచ్చును ఇందులో చాలామంది జీవితాలలో సంపూర్ణ త్యాగము, నిరంతర దేశసేవా తత్పరతకూడ లేకపోవచ్చును కాని ఒక్కొక్కరి జీవితములోను "విస్ఫులింగము" లాంటి ఒక్కొక్క త్యాగాంశ—నిర్మాణ కార్యక్రమాంశ—బుద్ధిప్రతిభయొక్క అంశ—అనువ్యష్టి కానుకలతో దేశమాత పాదముల ముందర అర్పణ అర్ధ్యానికి "ఇంటిలో పుష్పము ఈశ్వరుని మెడలో ఒకదండ" అన్నట్లుగా అదే బ్రహ్మాండమైన బ్రిటిషు సామ్రాజ్యపు నిరంకుశపాలన అనేకోటకు "గుభేలు" "గుభేలు" ధ్వనులతోటి ఫిరంగి గుండ్లులాగ -1921, 1930, 1942 సం॥ రంలలో గాంధీజీ నాయకత్వాన అహింసా సూత్ర ప్రధానముగా నడచిన ఈ ఉద్యమాలు, ప్రపంచ పరిస్థితులు, అజాద్‌హిందుఫౌజు నిర్మాణము సహాయపడగా—ఈకోట గోడలను బ్రద్దలుకొట్టేశాయి.

ఈ కాంగ్రెస్ జాతీయోద్యమం — ఏకొద్దిమంది చదువు కొన్నవారో లేవదీసిన దనియు, పురుషుల ఉద్యమమనియు, లేక మధ్యతరగతివారి ఉద్యమమనియు, దక్షిణ దేశంలో పుద్యోగాలు లేక బ్రాహ్మణులు లేవదీసిన ఉద్యమమనియు, పూర్వము కొందరు చేసిన ఆక్షేపణలకు ఈ చరిత్రలే సమాధాన మిస్తాయి. నిజమే. బ్రిటిషు తూర్పు ఇండియా కంపెనీ వారు తమకు గులాములుగా గుమాస్తాలకొరకు ప్రారంభించిన కాలేజీలలో తన వేద, వేదాంత విజ్ఞాన వైశద్యంగల బుద్ధి, విశ్వశాంతి దృష్టియుక్తమైన జాతీయత, అనుష్ఠానమును గాలి యిచ్చి పొట్టకూటికై పదవులకై విజాతీయ ప్రభుత్వాన్ని బలపర్చి దేశపు దాస్యపు శృంఖలాలను బలంచేసింది, ఒక నాడు ఒకతరం భారత ప్రజ — ఒక పరిస్థితిలో కాంగ్రెసు "అర్జీల" తో కాలము గడుపవలసిన సమయం (1885 — 1905) కూడ ఇదియే. ఆనాటి బ్రిటిషు మద్దతుదారులకే గాక అట్టి సామంత ధన, పదవీమోహితులైన మధ్యతరగతివారిలో ఆనాడు ఈ బ్రాహ్మణులు ప్రముఖంగా నుండిరి. గాని ఈ చరిత్రలు చదివినప్పుడు అందుకు ప్రాయశ్చిత్తంగా దేశ విముక్తికొరకు జరిగిన ప్రథమ (1920 — 21) సమిష్టి బలిదానంలో వీరి జీవితాలే ఆహుతి ద్రవ్యంగా నుండుట సంతోషకరం ఈయజ్ఞాలలో అవభృథస్నానం చేసి, పదవీవ్యామోహమనే బురదలో మలినం గాకుండా ఇనతలనే ఉండి. ప్రజా సేవ, శ్రామిక సేవచేస్తూ సన్నాతులై ఆదర్శజీవితాలు గడిపే

ప్రచారక జిజ్ఞాసువులందరు బ్రాహ్మ్యమును ఈ కలియుగంలో కూడా స్థాపించినవా రవుతారు.

ఈ యావత్తు చరిత్రలు పరిశీలిస్తే — ప్లీడర్లు, డాక్టర్లు, ప్రొఫెసర్లు, విద్యాధికులు, విద్యార్థులు సంఘసంస్కర్తలు మొఖాసాదార్లు పూర్వాచార పరాయణులు, భోగపరాయణులు, అసూర్యంపశ్యలైన యువతులుతో ప్రారంభించి — అక్షరాస్యులు, ప్రయిమరీ తరగతులు చదివినవారు, సాలీలు, సాతానులు, కూలీలు, గ్రామకరణాలు, మునసబులు, విదేశీయవర్తకులు, కల్లుపాటదార్లు, కార్మికులు, రైతులు, గ్రామపంచాయతీదార్లు, హరిజనులు, కొండజాతివారి వరకున్నూ — గ్రంథకర్తలు, గాయకులు, నటులు, వస్తాదులు, పత్రికారచయితలు, కవులు మున్నగు అన్నివృత్తుల, అన్నికళలవారి, ఇంకామాట్లాడితే క్రైస్తవ మహమ్మదీయ ప్రచారకులసహా అన్నిమతాలవారియొక్క సమష్టిత్యాగం ఇది.

ఎర్రమడ్డి పోడుచుకునిజీవి చే శ్రామికులతో, పశువుల పేడ తీసుకొంటూ కళ్ళాపు చల్లుకోవడంకంటె ప్రపంచంలేని వనితలతో, కాలేజిపండితులు, భౌతిక శాస్త్రవేత్తలు, రసపిపాసకులు, ఉన్నతవంశ సంభూతులు, లాయర్లు, డాక్టర్లను నివసింపచేసిన ఆ రాజమండ్రి కడియాలు, ఏయవేలూరు, అలిపూర్, కన్ననూరు, నాగపూర్, హైదరాబాద్, వరంగల్ మున్నగుజైలు జీవితాలు ఎంతకఠినశ్రమములైనవి, నేను తలచుకుంటే! నిరతాన్న ప్రదాతలు, దరిద్రనారాయణులుకు

ఏక వేదిక అయింది ఈ ఆంధ్రజాతీయ సేవారంగం ఆరోజులో. పదవీపంపకములుకు ఆపవిత్ర కాలంలో క్షేత్రంలో స్థానమేది? కొందరు దంపతీ యుక్తముగ జైలుకు వెళ్లారు, కొందరు భర్తలు ఇవతల సేవకార్యాలు నిర్వహిస్తూ ఉంటూ, భార్యలను పంపారు చాలామంది భార్యలు తమభర్తలు త్యాగ రంగంలోకి ఉరుకుటకు అంగీకరించారు. భార్యకు ఇష్టంలేకుండా వెళ్ళినభర్తలున్న గలరు తల్లిదండ్రుల ధిక్కరించి రంగంలో కురికిన పుత్రులనేకులు గలరు. భర్తకు ఇష్టంలేకుండా వెళ్ళిన భార్య ఉన్నదేమో తెలియదు. భర్తజైలులోనో, పైరింగు లోనో చనిపోతే ఆమాటవిని అనువులుబాసినట్టియు, ఆక్షణం నుంచి సేవారంగంలోదిగి ప్రాణార్పణం చేసినట్టియు — "సహాగమనమును" ఇట్టి నవీన పరిస్థితి కనుసంధానంచేసి అనుష్ఠించినపతివ్రతలు ఇందు లేకపోలేదు. శిష్టాచారసంపన్నులైన పూర్వానువాసినులు, వృద్ధమాతలు కూడ ఇందు పనిచేసిరి. ఈవిధంగా అన్ని సంబంధాలు, అన్ని వృత్తులు, అన్ని వర్గాలు, అన్ని వయస్సుల వారియొక్క సమిష్టి త్యాగము, అన్ని ధర్మాల సవిరాకరణంలో దేశస్వాతంత్ర్యసిద్ధికై ఈవిశాలాంధ్రగాంగెను సాధాని పోషించినదనియు, ఇందువల్ల పై గార్వ్ పక్షములు పిస్సారనిలనియు ఋజువుకాగలదు

కాంగ్రెసు పుట్టిన నాటినుంచి ముస్లిములు, స్వదేశీ మాతరం ఉద్యమము నాటివారు, పూర్వపు విప్లవోద్యమములవారు, సంఘసంస్కరణ, మహాసేవ మున్నగు ఇతర రంగాల

వారు, వీరుగాక పంజాబుహత్య-కిలాఫత్ సమస్యల వల్లను 1920 సం॥ లో ఉద్రేకం ఉచ్ఛస్థితిలో నున్న దేశముకు సర్వ సమన్వయంగా గాంధీజీ ఇచ్చిన కార్యక్రమం అనగా ఒక సంవత్సరంలోనే స్వరాజ్యం సాధించే ఉద్బోధల వలనను, తటాలున రంగములోనికి ఉరికిన వారివలనను - రకరకాల ఉపనదులు, గ్రామ ప్రవాహాలు, చెఱువు కట్టలు తెగుట వలన ఏర్పడిన ఆకస్మిక వర్షప్రవాహాలు వలె - 1920 సం॥ నాటికి యీ జాతీయ సేవాసమరసముద్రం పూర్ణమై పొంగింది మరియు వీరిలో అనేకులు తమ వ్యాపారములలోను, ఉద్యోగాల లోను గల గొప్ప భవిష్యత్‌ను త్యాగం చేస్తే, మరికొందరు కేవలం రౌడీలుగాను, హీనజీవులుగాను, మారిపోవలసినవారు ఈఉద్యమంలో ప్రవేశించుటచే త్యాగమూర్తులుగాను, గొప్ప దేశసేవకులు గాను పరిణమించారు.

వీరిలో జైలులోనుంచి వచ్చిన తరువాత - చట సంక్రమించిన వ్యాధులను లెక్క చేయక ఎక్కువ పలుకుబడి, సమదృష్టియున్నవారు వ్యక్తిపరంగాను, సమిష్టిగాను, నిర్మాణ కార్యక్రమము చేస్తూండినవారు గలరు. దారిద్ర్యాది అనవకాశములవలన కేవలము జైల్లి ప్రోగ్రాములకే పోయిన వారున్ను కలరు కొద్దిమంది అయినా వీరిలో సంస్థలను నిర్మించి ప్రవర్తింపజేసి 'సర్దారులు' గా పరమపదించడము గర్వింపదగినది. ఈకీర్తిశేషులు నిర్మించిన ఆ సంస్థల పోషణ

నేడు దేశము మీాదను, జాతీయ ప్రభుత్వము మీాదను యున్నది.

వీరి నేరములు - వీరి దేశాభిమానము, దేశభక్తి ప్రోత్సహించు ఉపన్యాసములు, "మాకొద్దీ తెల్లదొరతనం" మున్నగు పాటలు, విదేశవస్త్రదహనం, బహిష్కారము, స్వదేశీస్వీకారం, తాటిచెట్లను నరుకుట, కల్లుసారాయి పికెటింగు, పౌరసభలు చేయుట, అమ్మ పుల్లరిపన్నులు, భూమి పన్నును, ఫారెస్టు వసూళ్ల నిరాకరణ, బ్రిటిషు నిరంకుశపు సర్కారు ఉత్తరువుల ఉల్లంఘనము, హింసానాత్మకమాయె యుద్ధ సహాయ నిరాకరణ, బీదల గంజిలోకి కూడ అవసరమైన ఉప్పుపన్ను నిరసన, అట్టి ఉప్పుచేయు సత్యాగ్రహము, సామ్రాజ్య యుద్ధాలకుగాను సిపాయిలను పేరుతో యీడ్చుకొని పోవుచున్న 'మేకల' ను లిని ఆపడము, దానికి డబ్బు వసూలు సనికిరాదనడము, అప్పట్లో బ్రిటిష్ దాస్యాన్ని పెంపొందించే ఉద్యోగాలు, పోస్టులు, కాలేజీలు, శాసనసభల బహిష్కార ప్రబోధము — ఇవి

ఏ సాధనంతో వీరు యీా ధర్మయుద్ధాన్ని జరిగించారు? నిరాయుధులై "అహింస", బహిరంగ పద్ధతులతో దీనిని సాగించారు. దీనిని బ్రిటిష్ సామ్రాజ్యతత్వం ఏలా ఎదుర్కొన్నది? కాల్పులు, లాఠీదెబ్బలు, పొట్టలపై ప్రాకించడం, బుర్రలు, కాళ్లు, చేతులు, విరగగొట్టడము, బహిరంగంగా వీరిని "లా" పేరుతో పోలీసు ఉద్యోగస్థుల మాటయే

శీర్పుగా న్యాయాధిపతులు జైళ్లు,జుర్మానా శిక్షలూ వేయ డము, ఆ జైళ్లలో గానుగులు లాగించడము, తిరగళ్లు విసిరించడము, పురుగులు మేకులుతో గూడిన అసహ్యాహ తిండి "దేవతాపులుసు" పోయుడము, ఏమని అడిగితే జైళ్ల లోనే లాఠీలతో మోదడము, చీకటి కొట్లలో పడవేయ డము, తరచు జైలునుండి మార్చడము, రోగాలు వస్తే వైద్య చికిత్స లేకపోవడం మున్నగు హింసాసాధన విధానాలు — నిర్దోషులు అమాయక ప్రవర్తన కలిగిన దేశంలోని ఈ లక్షల కొలది ప్రజాప్రచారములపై ప్రజాస్వామ్యము వ్యక్తి స్వాతం త్ర్యమునకు పేరు పొందినదని చెప్పుకొనుచున్న బ్రిటిషు జాతి పేరుతో, ఈ దేశమున ఆ, ప్రభుత్వంవాని నౌకర్లచే ప్రయో గింపబడినవి. ఒక ప్రచారకుడు తన్ను నిర్హేతుకంగా లాఠీలతో రోడ్డుమీద పోలీసులు చావమోదుతూంటే మోదినందుకు చింతపడక ప్రజలను అశాంతచిత్తులు, ఉద్రిక్తులు కావలెనని ప్రతిమాటకునే "ప్రహ్లాదతత్వం" ఆ కాలంలో పుష్టి చెంది నదనుట అతిశయోక్తి కాదు

1921 సం॥ రంలో స్వరాజ్యంను కావలసిన బలిదాన పరిమాణము మనకు తెలియదు. చాలా తీక్షణ సంపత్తి అంత గాలేదు. ఒకసంవత్సరం త్యాగంచేస్తే మనం సుఖంగా ఉండవచ్చుననియు, తిరిగి మన మన-వృత్తులు స్థలలోనికి భద్రంగా పోవచ్చుననియు చాలమంది అనుకొన్నారు అది సంవత్సర స్వరాజ్య కార్యక్రమం కాదనియు మున్నందు

స్వరాజ్య సంపాదనకై స్థిరసత్తాలేక "ఒక అపూర్వం" ను పుట్టించే యజ్ఞఘట్టమని అప్పుడు మనలో ఎందరు తెలిసి కొన్నారు? ఈవైఫల్యం చాలమంది త్యాగులను వెనక్కు తీసి కొనిపోయినను, మరికొందరిలోని తాత్కాలిక క్రోదేశాన్ని దీక్ష క్రిందమార్చి సంస్కృతులైన సేవకగణానికి ఇదినాంది అయినది.

1920 నాగపూర్ కాంగ్రెసుతో ప్రారంభించిన—కోటి రూపాయలు కోటిపాపలాసభ్యులు—త్రివిధ బహిష్కారం మొదలు పన్నుల నిరాకరణం వరకు నడచిన ఈఉద్యమం చౌరీచౌరా హత్యలతో అంతమై అప్పుడు దీనివిలువ తెలియకపోయినా—జాతిలో స్వరాజ్య పరమైన దృఢసంస్కారము ఆసేతుశీతనగ పర్యంతము కల్గించి బ్రిటిషు సామ్రాజ్యవృక్షపు కూకంటి వేళ్లను, భావదాస్యాన్ని కదిపేసింది ఝుంఝూమారుతంలాగ—తాను పిమ్మట అదృశ్యమైనా. 40 కోట్లజాతిలో ఒకసంస్కారము ఏర్పడిన తరువాత ఒకఅల్పసంఖ్యాకమగు విదేశీయ దాస్యతను పోనాడి ఫలంపొందడం ఎంతటిది?

---

* ఈ 1921-40 అమధ్య అహింసాయుత దేశస్వాతంత్ర్య ఉద్యమ సంస్కారమే క్రమంగా మతసాంఘిక పారస్పరికళ ఆర్థిక సాంఘికాది అనేకసర్వతోముఖ నవ్యఉద్యమాలకు సామ్యవాద, సర్వోదయ, గ్రామిక ధర్మరాజ్య, రామరాజ్య, గ్రామస్వరాజ్యాది సమన్వయాలకు యోచనలకు చాతదితర పరిణామాలకు ఒకఉద్దీపనశక్తి అయింది. ఇందలి ప్రముఖ ప్రరతుల జీవితపు రీటుల—ఉదప్రయోగాలు అప్పుడే సంఘంలోకి—భావాలోకి ప్రాకినవి.

ఆసాంస్కృతిక వాతావరణలో ఏర్పడే ప్రతి పరిస్థితి, వచ్చే ప్రతిఘట్టం, కలిగే ప్రతి చిల్లరసంఘటన జాతి తన కామిత ఫలానికి అనుసంధానం చేసుకోగలదు. ఇదియే చీరాల పేరాల పౌరనిర్గమనం, పెదనందిపాడు పన్నుల నిరాకరణం, పిమ్మట వచ్చిన నాగపూర్ జండా సత్యాగ్రహం నౌకాళీ గురుకాబాగ్ సత్యాగ్రహం, బార్డోలీ పన్నుల నిరాకరణ, కృష్ణాగోదావరి రీ సెటిల్‌మెంటు పన్నుల ఆందోళన, శాసన సభా ప్రవేశం, నిర్గమనం, ఉప్పు సత్యాగ్రహం. చివరకు "క్విట్ ఇండియా" ఉద్యమాలు, ఇంకా అనేక శ్రామికవాద ఉద్యమాల సమిష్టి అర్థం. వీటిలో ఒక ఉద్యమం పోయిన పిమ్మట మరియొకటి వస్తోందంటే ఈ మొత్తము జాతీయ స్వాతంత్ర్యోద్యమ ప్రవాహంలో ఒకమెట్టు తన "అనుయాయి" ని ముందు దాని కందించి తానులయమగుచున్నదనుట కంటె ఒకమెట్టు రెండవ మెట్టుగా క్రిందపరిణమించుచున్నదనుట యుక్తం. ఒక ఉద్యమంలో ఉన్న గుణం మరియొక ఉద్యమానికి ఉండదు. ఉద్యమం జనసామాన్య వ్యాప్తి అగుచున్న కొలది "గుణం" కంటె "మొత్తం" లావు

చివరకు 1940-42లోని "క్విట్ ఇండియా" ఉద్యమం దేశాన్నంతా ఆవరిస్తే అజాద్ హింద్ ఫౌజు, సేనలోకి జాతీయ విప్లవతత్వాగ్ని ప్రవేశపెట్టింది. బ్రిటిషు మంత్రివర్గంవారు దూరదృష్టి కలిగి, యుద్ధం ముగిసిన వెంటనే నూతనాధ్యాయం ప్రారంభిస్తూన్నామని చెప్పడం, తాత్కాలిక ప్రజా

ప్రభుత్వం ఏర్పర్చడం, దానిపై ముస్లింలీగువారి పేచీ, అంతః కలహాలు, దేశము రెండు స్వతంత్ర రాజ్యాల క్రింద విభాగము అవడం మహోద్రిక్త రక్తపాతాలతో, గాంధీజీహత్యతో ఆంధ్రలో మాన్యోన్మానసిక పుత్రుల భీకరచర్యలతో 15-8-48 సం॥రం తేదీ ప్రకటన ప్రకారం స్వతంత్రమైన భారతజాతీయ జీవితముయొక్క శకప్రారంభం అయినది. ఈసమయంలోని రజాకార్ ముస్లింలు నైజాం ఆంధ్రలో గావించిన దోపిడీలు, మానభంగాలు, దుండగాలు వర్ణనాతీతములు. జాతీయపతాకం పెట్టినందుకు, శాంతిరక్షణదళములలో చేరినందుకు కాంగ్రెసు ప్రచారకులు అనేకమంది చంపబడిరి. ఇందులో అనేకమంది తమ దీక్షను వీడక అహింసాత్మకమైన ఆత్మార్పణ చేశారు. మరికొంతమంది వీరమరణం నొందారు.

వీరినన్నిటిని ధైర్యసాహస, కార్యదీక్షలతో నెదుర్కొని అఖండ హిందూస్థానంలో మనం పొందిన రాజకీయ స్వాతంత్ర్యం స్థిరపర్చడంలో, మనం ప్రభుత్వం కొంతవరకు పొందింది దీనినింకను బలపరచి, లోట్లను దిద్ది, ప్రాథమిక ధర్మపరంగా సర్వోదయంగా మన ప్రజారాజ్యం చురుకుగా ముందుకు నడచుటలో ఈవీరుల జీవితాలలోని త్యాగసాహసాలు నిష్కామకర్మ, కార్యదీక్ష మున్నగు ఉత్తమాంశాలు మనయెదుట ఆ ప్రస్తుత జ్యోతిర్మయ జగత్తులోనుండి ధృవనక్షత్రంలాగ ప్రకాశిస్తూ, మనకు ఉద్బోధనచేయుగాక. వీరి త్యాగచరిత్ర, ప్రాచీన ఆంధ్రపౌరుషాన్ని ఆంధ్రుల ఉత్తమ

సంస్కృతిని, తిరిగి మనయందు ప్రేరేపించి అఖిలభారత దేశం లోను ఆంధ్రులకొక ప్రత్యేక స్థానాన్ని గుర్తింపజేసింది. అట్టి రాష్ట్రవీరుల చరిత్ర — రెండు చాంద్రాయణముల కాలము, ప్రపంచ దేశాల్లో ఈకలియుగంలో కనివిని యెరుగని విధమున మానవుల వాస్తవిక జీవితానికి సంబంధించిన — బ్రిటిషు సామ్రాజ్య తత్వముయొక్క పశుతుల్యమైన రాజకీయ నిర్బంధ విధానాన్ని — అహింసా సత్యసాధనలతో నెదుర్కొని లోకానికి నవ్యసాధనామార్గాన్ని చూపి చరితార్థమైన భారత వర్ష చరిత్రలో భాగం — ప్రధానభాగం అయియున్నది. ఈ 28 సంవత్సరాల ఉద్యమాలలో అప్పటి "లా" కు కూడ వ్యతిరేకంగా అత్యాచారాలు గావించినకోస్తా ఆంధ్రలోని ఉద్యోగులు, వీరిని మరపించే, దేశాభిమానులను చిత్రవధలు గావించిన అప్పటినైజాంలోని రజాకర్లు, పోలీసుఉద్యోగు లున్నూ వీరికుటుంబములు ఈనేటి స్వరాజ్యభారతంలో మామూలు పౌరహక్కు లనుభవిస్తూన్నారంటే, ఇది ఈ ఉద్యమ మహత్త్వమే, భారతీయుల సహనశీలతయే. నేడు ఈవిధంగా దీని ప్రవక్తమైన గాంధీఋషియు ఆయన అనుయాయులైన అట్టి ఈవీరులున్ను ధన్యులే. ఇక రాష్ట్రం తరించడం ఎలా? దేశస్వాతంత్ర్యం సౌభాగ్యాల కోసం, సాంఘిక ధర్మంకోసం, ఆత్మార్పణచేసిన, ఇట్టి వీరులకు వారి కుటుంబాలకు వారి సంస్థలకు స్వరాజ్య, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ ములు, సంఘము అవసరసహాయము చేయుట ఇందుకు ప్రథమ

సోపానము. ఇట్టి సహాయుని రాకరణం ఇంతవరకు మదరాసు ప్రభుత్వం చేసింది!

ప్రపంచం పుట్టింది మొదలు కార్యసాధనములు, రస స్ఫూర్తి రంగాలు నేటివరకు నాలుగు. ఒప్పించడం (జ్ఞాన సంవాదం, జిజ్ఞాస), నొప్పించడం (యుద్ధం, హింసాత్మకోద్దీపన), కరగించడం (అహింసా సత్యాగ్రహం), పొంగించడం (కళా రసస్ఫూర్తి) నేను యుగధర్మాన్ని బట్టిన్ని మానవుడు ఉన్నత కక్ష్య లోకి పరిణమించడానికి మొదటిదాన్ని వృద్ధిచేసుకుంటూ మూడునాలుగు సాధనలకే ఊతంఇవ్వడం అవసరమవుతూంది. కాని ఆ కాలధర్మములనుబట్టి ఒకటిరెండు సాధనలను అత్యున్నత స్థాయిని పూర్వం అనుష్ఠించిన జిజ్ఞాసువులు వీరులున్ను కలరు. నేను వాస్తవికంగా చూస్తే పండితరాయలు నాటి నుంచి రాధాకృష్ణ్ంరకు ఖ్యాతికెక్కిన మొదలు శ్రీరామరాజు వరకు ఆంధ్రగోత్రం మొదలు ఎల్లాయి సన్నయ్య, ప్రతాపరెడ్డి, మొగులయ్య వరకు ఈ ఆంధ్రగడ్డ విజ్ఞాన, శౌర్యవీరత్వం; దయా, శాంతవీరత్వాలను ప్రసవించడంలో "మేటియే" కాని తాను దానిని ప్రశంసించుకోడంమాట అటావుంచి—గుర్తించుకోవడంలో కూడా "మేటియే" — పైనుండి ఆవ్యక్తికో ఆఉద్యమానికో గౌరవం వచ్చిన పిమ్మట "మా ఆంధ్రుు" డని ప్రాకులాడుతారు. కాని ఇంతకుపూర్వం మగధ నుండి తంజావూరు, కటకంనుండి కొంకణం వరకు ఆంధ్రులు సామ్రాజ్యంనడిపిన రోజుల్లో కూడా ఇప్పటి స్వవీర, స్వవైజ్ఞానిక, ఔదాసీన్యం ఊహించుటకు వీలులేదు. ఆనాడు కూడా తన వీరులను వైజ్ఞానికులను అన్యప్రదేశ ప్రథమగౌరవాలకు

అప్పటి ఆంధ్రం పాల్పడచేస్తే నాటిపౌన్నత్యా అనంభవం నేటి ఆంధ్ర రాష్ట్ర ప్రవతరణ సుముహూర్తము సన్నైనా ఈ ఉద్యమ నైతికికి ఆంధ్రులు సుముహూర్తం చేసినదానిని త్వరత్వరగా అలవరచుకొనుట అత్యవసరం.

ఈ వీరుల త్యాగములును పొట్టి శ్రీరాములుగారి రాష్ట్రానికైన ఆత్మార్పణయున్ను ఈ నూతన రాష్ట్రాన్ని సర్వశోభాయమానముగా చేయు కృషికై ప్రతి ఆంధ్రుని ఉద్దీపించుగాక!

ఇందులోని ఒక చరిత్ర పొడుగు, పొట్టిని బట్టి ఆ వ్యక్తి వీరత్వం, విజ్ఞానం, కార్యదీక్షయున్ను పాఠకులు మదింపు చేయకుందురుగాక. అది మా చరిత్ర సేకరణావకాశంమీద యున్నది. మరియు ఇంకను సంపాదించవలసిన మహాత్యాగుల చరిత్రలు అనేకవందలు ఇప్పటికిన్ని మిగిలిపోయినవి 1947 సం॥రంలో ఈ కృషిని తీవ్రంగా ప్రారంభించిన, దీనికి కాంగ్రెసు సహా ఎట్టి ప్రోత్సాహము ఇవ్వించని వాతావరణంలో ఈ బీద సంస్థ ఇంత శ్రమతో ఈ మాత్రంగా నయినా స్వధర్మాన్ని నెరవేర్చుకొని తీరించడమే దేశం గమనించవలసిన విషయం. పోనీ, ఈ ప్రచురణ ఇకా ఆపుదామంటే ఇప్పటికే చాలా కాలాతీతమైనది. ఇప్పుడైనా ఆంధ్రదేశం ఇందుకు తగిన ప్రోత్సాహం ఇవ్వింస్తుందా, ఇంకా ఈ కృషిని సాగించడానికి సంసిద్ధులమే.

ఈ చరిత్రలు సంపాదనలో అత్యంత శ్రమకోర్చి సంచారముచేసి జయప్రదమైన కృషిసల్పిన ప్రచారక మిత్రుడు, రాజకీయత్యాగి, ఆ మరికొంతము ఈ సంపాదనానికి అండగా నుండిన ప్రియమిత్రుడు తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రి

వీరభద్రపురం వాస్తవ్యులు, ది 10-1-50 తేదీని స్వర్గస్థులైన శ్రీ కలగ సత్యనారాయణగారి మందిర సేవను పేర్కొనటకు ఈ "సమీక్ష" యే యుక్తస్థానము. ఈ చరిత్రలు సంపాదనలో తెలంగాణం మొదలు శ్రీకాకుళం వరకు సహాయపడిన సోదరీమణులు అనేకులు గలరు. వారందరికి మా కృతజ్ఞతలు. ఆవిధంగా చరిత్రలు వ్రాసియిచ్చినవారి నామములు ఆచరిత క్రింద ప్రచురింపబడినవి. ఇక ఈ సంస్థలలాంటి నూతన స్వప్నాలను కంటూండడం, ఇతరులు విస్మరించిన కార్యాలను ప్రారంభించడం అనేవి చిత్రపాత్ర ఈ ధర్మకర్తదైతే సౌధములకు పునాదిలాగ, పైకి కనబడని విధముగ ఈ సేవా వైజ్ఞానిక కార్యక్రమాల నిరంతర ఓర్మితో నైపుణ్యంతో సాగించడం, సహాయపడడం అనునది, బహుశా, ఉగ్గుపాలతోనే బీజరూపంతో గలిగి, రెండుదశల త్యాగసేవా జీవితంలో ఈ ధర్మకర్త మొదలు వినోబాభావేజీ వరకు ఖాదర ప్రచారక సాహచర్యంలో వృద్ధిపర్చుకొన్న ఈమందిర కార్యదర్శి—పోనీ తత్వార్థంలో—ఇప్పటి మా దృష్టిలో ఏకైక కానస్థాత—మిత్రుడు శ్రీ కేశిరాజు నృసింహ అప్పారావు (ఉ. భా. ప్రవీణ) హిందీ విశారద M A గారి — ఈ వీరులచరిత్రల సంపాదనకృషి సహా — మందిరసంస్థలసేవను మేము పేర్కొనాలా? లేక ఆయన మమ్ములను పేర్కొనాలా? అనేసమస్యను అపరిష్కృతంగా ఇప్పటికి ఆలాగే ఉంచెదముగాక.

ఇక పత్రికలు. నేడు రాష్ట్రంలోని రెండు తెలుగుదైనిక పత్రికలున్న ఈసంస్థల ఇతరకార్యక్రమాలకు తోడుపడడం మాట అటుంచి ఈ వీరసంస్మరణ కార్యక్రమ సహాయదృష్టిలో కూడా మాకు నేడు లేనివే అయిపోయినవి. "త్రిలింగ" పత్రిక

ఈ అజ్ఞాతవీరసంస్మరణంలో చూపుచున్న శ్రద్ధ గమనించదగి నది. నిరంతర కార్యక్రమ భారంలో నుండి ఈసంస్థలు పత్రికలు వారి వెనకాల వాపోలాడడం అసంభవం అందుచేత ఈసంస్థ లపక్ష పత్రిక "యుగధర్మ" యే నేను మాకున్న వెలుపలలో కాంక్షీ మన స్ఫూర్తి సంబంధం. ఈపత్రికను ఇతోధికంగా ప్రోత్స హిస్తూ దీనిద్వారా రాష్ట్రానికి అందించుకొన్న – ప్రతిసాలున శత్రుహత్త మహాలయమనాటి ఆంధ్రవీర సంస్మరణ కార్యక్ర మాన్ని ఈ విశాలాంధ్ర రాష్ట్రం – కొండలలో, పల్లెలలో బస్తీ లలో అమలు జరుపు గాక!

ఆత్మతరణమే లక్ష్యంగా సాహసించిన ఈఅసమగ్ర, అసం పూర్ణ, కార్యక్రమమునకు, మన్నిస్తూ. ఈగ్రంథములోని పొర బాట్లు, లోట్లు యేవైనయున్నచో తెలిపిన్ని, ఈ ఉద్యమం సాంతముగా సాగడానికి సర్వ విధములా సహాయపడ్డ, ఆంధ్రా న్ని లోకాన్ని అర్థించుచున్నాము ఈ గ్రంథ ముద్రణసంకల్పం ఆంధ్రరాష్ట్రావతరణ దృష్టిలో తటాలున పుట్టిన వెంటనే ప్రతి స్పందించి వీరభక్తి ఔదార్యంతో అచ్చొత్తించి ముహూర్తానికి అందించిన మామిత్రులు రాజమహేంద్రవర సరస్వతీ ముద్ర ణాలయాధిపతులు శ్రీ నాగేశ్వరరావు గారిసేవను సదరు కార్యాలయ శ్రామిక మిత్రుల తోడ్పాటును పేర్కొనకుండా దీనిని ముగింపజాలము.

| | |
|---|---|
| అఖిలాంధ్ర వీర సంస్మరణమందిర<br>గోష్పదీ క్షేత్రం<br>కొవ్వూరు. ప. గోదావరి<br>మకాం. కర్నూలు 1. 10. 53 | ఇట్లు<br>రె. మం. శర్మ<br>ధర్మకర్త. |

# INAUGURATION OF THE VEERASMARANA MANDIR



*Standing* — 1 Sri R M Sarma 2 Sri K V N Appa Rao 3 Sri Desabhakta Konda Venkatappayya 4 Sri Sheik Mastan 5 Sri V Ramakrishna Rao
*Sitting* — 1 Sri G Jogayya Sarma 2 Sri S Bojji Dora 3 Sri S Ramamurti 4 Sri B Sarangi Sayi 5 Sri K Gopala Rao 6 Sri K Venkataswami

# ఆంధ్రోద్యమ పితామహ

# దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు

(17 - 2 - 1866 – 15 - 8 - 49)

గాంధీజీ అనుయాయిగా అక్షరాల పేరెన్నికగన్న దేశభక్తుడు, ప్రఖ్యాత ఆంధ్రనాయకుడైన శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు. 1866 ఫిబ్రవరి 17 వ తేదీని గుంటూరులో జన్మించారు. చెన్నపురిలో కాలేజీ చదువు పూర్తిజేసి, న్యాయవాది పరీక్షలో ఉత్తీర్ణులై బందరులో న్యాయవాదవృత్తిని ప్రారంభించారు. ఈయన కృష్ణాజిల్లా సంఘాన్ని స్థాపించి, దాని తరఫున కృష్ణాపత్రికను నెలకొల్పి రాజకీయంగాను, సాంస్కృతికంగాను, ప్రజాదృక్పథాన్ని సవ్యమైన మార్గాన్ని రూపొందించారు.

1911 సం॥ రంలో జరిగిన బెంగాలు విభజన ఈయనను ఉద్రేకపూరితుల్ని గావించింది. ఆంధ్రోద్యమ ప్రారంభకులైన వీరు 1915 సం॥ రంలో దీని నిర్వహణకై న్యాయవాదవృత్తిని విసర్జించారు. 1911 లో భాషాప్రయుక్త రాష్ట్రఉద్యమాన్ని ప్రచారముజేసి 1913 సం॥ రంలో బాపట్లలో ప్రప్రథమముగా ఆంధ్రమహాసభా సమావేశాన్ని ఏర్పాటుజేసిన ఆంధ్రోద్యమ పితామహుడు. శ్రీ ముట్నూరి కృష్ణరావుకు

పూర్వం కృష్ణాపత్రికను నిర్వహించిన విశుద్ధ రచయిత. జన్మాంతము గాంధీజీ ఆశయాలయెడ అచంచల విశ్వాసము గలిగి దేశభక్తియుతుడై, ప్రజాశ్రేయస్సు లక్ష్యముగా జవసత్వా లున్నంతకాలము శ్రమపడిన నిష్కామకర్మయోగి. ఆంధ్రనాయకులను ఏకోన్ముఖులుగ జేయునిమిత్తం ఆంధ్రప్రజా పరిషత్తును సమావేశపరచుటకు కృషిజేసిన ధీరోదాత్తుడు. కాంగ్రెసులో పెరుగుతూ వచ్చిన స్వార్థపరత్వాన్ని ఖండించిన మహానైతిక సంపన్నుడు.

1916 సం॥ రంలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాన్ని, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని లక్నో కాంగ్రెసుకు మెమోరాండం అందజేసిన ఆంధ్రమహాసభ స్థాయిసంఘానికి ఈయన ప్రధాన కార్యదర్శి. పిమ్మట ఆంధ్రోద్యమానికి రాయలసీమవారి తోడ్పాటును సంఘటింప జేసినది శ్రీపంతులుగారే. ఈసందర్భంలో ఆయన రాయల సీమకు పలుసార్లు రాయబారం జరిపారు.

1917 సం॥ రంలో ఈయన ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గురించి విజ్ఞప్తి జేయడానికి మాంటెగు-ఛెలమ్స్ ఫర్డులవద్దకు రాయబారిగా వెడలారు.

1918 సం॥ రంలో శ్రీ న్యాపతి రామచంద్రరావు పంతులు మద్రాసు శాసనసభాసభ్యత్వాన్ని విడనాడి జాయింటు పార్లమెంటరీ కమిటి యెదుట నితవాదుల పక్షాన

సాక్ష్యం జెప్పడానికి పోయినప్పుడు ఆంధ్రోద్యమాన్ని నిర్వాకి మాత్రముగా నడుపుచు నిఖిలాంధ్రుల హృచ్ఛీనుల పూజ్యులైన వెలిగిన ఈ దేశభక్తుడు సభ్యత్వానికి నిలువబడి అధికసంఖ్యా కులచే నెన్నుకోబడుటచే ఈయన ప్రజాభిరతి విదితమవుతూంది. ఈయన శాసనసభలోనున్న కాలమున గ్రంథాలయాలకు ప్రభుత్వం వారిచే పిరాళమిప్పించడానికి కృషిచేశారు 19 9 సం॥ రంలో జరిగిన జలియన్‌వాలాబాగు (పంజాబు) హత్యలపాలైన కుటుంబములకొరకు విరాళాలు వసూలుచేసి పంపించారు.

1925 – 1929 సం॥ వరకు ఈయన చరఖాసంఘంలో శాశ్వత సభ్యుడుగానుండి శుద్ధఖద్దరు ప్రచారం జేశారు. దక్షిణభారత హిందీప్రచార మండలితరఫున పనిజేసి, హిందీ భాషను అందరూ నేర్వవలెనని ప్రోత్సహించారు. పంచమ ఆంధ్ర మహాసభకు నెల్లూరులో వారధ్యక్షపదవి నలంకరించారు. దేశబంధు చిత్తరంజనదాసు కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చినపుడు 1923 సం॥రంలో అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా పనిజేశారు ఆంధ్రరాష్ట్రంలో 1921లో ఓటుఇవ్వరాదనిన్ని, గుంటూరులో పెదనందిపాడుపన్ను ల నిరాకరణోద్యమాన్ని సాగించిన్ని, గాంధీజీని ఆశ్చర్యచకితుణ్ని జేసిన కార్యదక్షుడు. తదాదిగా గాంధీజి ప్రియ అనుచరులలో నొకరై భారత స్వాతంత్ర్యసమరంలో అగ్రగామిగా వ్యవహరించారు. 1921, 1930 (ఉప్పుసత్యాగ్రహం) 1932 లోని ఉద్యమాలలో పాల్గొని జైలుకి వెళ్లారు 1940 – 45 వరకు

వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని కారాగారశిక్ష ననుభవించారు.

1923 సం॥రంలో కాకినాడ కాంగ్రెసుకు రిశెప్షన్ కమిటీ చైర్మన్‌గా నెన్నుకోబడ్డారు. 1929 సం॥రంలో విశాఖపట్టణములో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ వర్కింగుకమిటీ ప్రెసిడెంటుగా నెన్నుకోబడ్డారు. ఇదిగాక వీరు అఖిల ఆంధ్ర ప్రజాపరిషత్ ( బెజవాడ ) అధ్యక్షుడుగా పనిజేసిరి శ్రీ సెడింబి హనుమంతరావుగారితో కలిసి, జాతీయ కళాశాల స్థాపనను, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారితో కలిసి గుంటూరు శారదానికేతన స్థాపనజేసి జాతీయ విద్యాప్రచారము గావించారు.

1937 సం॥రంలో మద్రాసు శాసనసభా సభ్యులుగా తిరిగి ఎన్నుకోబడ్డారు. అపుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తీవ్రకృషి సలిపినారు. ఆసంవత్సరమే ఆంధ్ర మహాసభ రజతోత్సవాలు జరిగాయి ఆ సభలలో రాయలసీమ, కోస్తా ఆంధ్రులమధ్య సామరస్యాన్ని కుదర్చడాని కేర్పడిన కమిటీలో వారు సభ్యులుగా నుండి శ్రీబాగ్ ఒడంబడికను సాధించారు.

1938 మార్చి 30 తేదీని మద్రాసు రాష్ట్రాన్ని భాషాప్రయుక్తంగా విభజింపవలసినదిగా మద్రాసు శాసనసభలో తీర్మానాన్ని ప్రతిపాదించారు.

ది 23—4—1942 న ఇక్కడి అఖిలాంధ్ర వీరసంస్మరణ మందిర ప్రారంభోత్సవం చేశారు. ఈవిధముగా స్వీయ ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని విడువక యావజ్జీవం ప్రజాసేవ జేసిన ధన్యజీవి ఆంధ్రజాతి భవిష్యత్ పురోగమనానికి ఈ రున ఒక ఉజ్జ్వలధృవతార పంతులుగారు పరిశుద్ధచిత్తం కలవారు. ఆవేశ పూరితుడైన వ్యక్తి, దేశభక్తుడు దైవభక్తుడు. ఆత్మత్యాగం, నైతికచింతన మూర్తిగట్టిన గొప్ప ఆంధ్రుడు. గొప్ప జ్ఞాపకశక్తి కలవారై ప్రజాహిత జీవనంలో చివరవరకు నిమగ్నుడైన మహనీయుడు. గాంధీజీ బోధించిన నిర్మాణాత్మక కార్యక్రమాన్ని వీరు శ్రద్ధాభక్తులతో అమలు జరిపించారు.

1949 ఆగష్టు 15 తేదీ ఉదయం 8-30 గంటలకు "ఋషి పుంగవుడు, రాజనీతిజ్ఞుడునైన గాంధీజీ నాయకత్వం క్రింద మనం స్వాతంత్ర్యం సంపాదించాము. ఈస్వరాజ్యఫలం మనకు చాలా శీఘ్రంగా, సులువుగా లభ్యమైంది. అందువల్లనే దాని విలువను, ప్రశస్తిని, మనం గుర్తించలేక పోతున్నాము. స్వాతంత్ర్యం సిద్ధించిన పిమ్మట చాలాశోచనీయమైన సంఘట నలు జరిగాయి అందులో అత్యంత విషాదకరమైనది గాంధీజీ హత్య, మహాత్ముడాశించినవిధంగా ప్రజలందరు నడచుకోవాలి. ఆయన మనకు బోధించిన సిద్ధాంతాల ప్రభావంచేత భారత దేశం త్వరలోనే ప్రపంచానికి మార్గదర్శకంగాగలదని

ఆశిస్తున్నాను." అని అంతిమసందేశంయిస్తు పంతులుగారు అసువులను బాశారు.

ఈమహాత్ముని త్యాగశక్తిని, క్రమశిక్షణను, ఫ్రానిష్ఠని ప్రశంసించుచు భారతప్రధాని నెహ్రూపండితుడు, భారత రాజ్యాంగ పరిషదధ్యక్షుడు బాబురాజేంద్రప్రసాద్, ఆంధ్ర కేసరి, డాక్టర్ పట్టాభివంటి ప్రభృతులు. ప్రముఖులంతా కన్నీటిధారలగార్చి వీరిమరణము తీరనిలోటని విలపించిరి.

ఆంధ్రరాష్ట్రోద్యమ పితామహునిగాను, అఖిల భారత నాయకునిగాను, గాంధీజీ ప్రియసహచరునిగాను పత్రికలు, ఉపన్యాసకులు, చరిత్రకారులు నేడు వ్రాస్తున్న అంశాలను తిరిగి పునరుక్తిముచేయుట ఈ వ్యాసంయొక్క ఉద్దేశముకాదు. దేశభక్తునితో ఈ పుంభిరముగ మాకు 10 సం॥ నుంచిగల అనుచర సహచరత్వములోని ముఖ్యఘట్టాలను ఇక్కడపొందుపఱచు చున్నాము.—

అది 1941 సం॥ మందువేసవి ప్రారంభము. ఒహుశః దేశ భక్తుని వ్రాతవల్లనే అనుకుంటాను గాంధీజీ నిర్మాణకార్యక్రమ ప్రచారకలిస్టులో నావంటివానినికూడా చేర్చి ఈవల ఉంచుట కాజ్ఞాపించారు. "క్విట్టిండియా" ఉద్యమంలో ఆంధ్రనాయకు లందరూ జైలునకు వెళ్ళిరి. తాత్కాలికంగా దేశం స్తబ్ధమైనది. మా సేవారంగమైన విశాఖపట్టణంజిల్లా ఏజన్సీలో యుద్ధఫండు పేరుతో మురాదారులు కొండజాతిప్రజలవద్ద నిర్బంధపు వసూళ్లు చేయుట తిరిగి 'వెట్టీలు,' 'గొత్తీలు' చేయించుట మొదలుపెట్టి

నారు. కాంగ్రెసుజెండాలు తగులబెట్టి కొండవారి నెత్తిమీది టోపీలు లాగేశారు. ఒకమూల ప్రజలలో నిరుత్సాహము మరొకమూల ఉద్రేకముకూడా బయలు దేరు చున్నాయి. అసహాయస్థితిలో నున్నాము. ఈపై అక్రమాలు అధికారులకు తెలియపరిచాము. విచారణ జరుపుతామన్నారు ఉద్రే-కపూరితమైన ప్రశ్నలు ఆవిచారణలో ఏర్పడతాయి. పెద్దలు సన్నిధానమున నుండుట మంచిదని తోచింది. కాని పెద్ద హృదయంకల పెద్దకావాలి. వెంకటప్పయ్యగారిని కోరినది కల్లా, 'నేనున్నాను – నీకేమీ ఫరవాలేదు' అని తక్షణం 3-4-41 తేదీ మాడుగుల ఠాణావద్ద జరిగిన విచారణకు గుంటూరునుండి గంతేసివచ్చినారు. అదిమాకు ఎంత "ధీమా" నిచ్చిందో ఇప్పుడు వర్ణించలేకపోయినా స్వప్నంలో కూడా అది ఆనందము నిప్పుడూ యిస్తూనేఉంది. వెంకటప్పయ్యగారి సాన్నిధ్యము ఆనాడుజరిగిన వేలకొలది కొండజాతులవారితో కూడిన ఆ సబు-కలెక్టరు విచారణకు ఒక హోదానిచ్చింది. దేశభక్తుని గౌరవార్థం వందలకొలది కొండజాతి సోదరులు నూలువడుకుపోటీని జరిపారు పిమ్మట దేశభక్తుడు సభలో ఇచ్చిన దివ్యసందేశాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాము

"మీరు ఈసభలో నేడుచూపించిన శాంతము, శిక్షణ నాకు నచ్చినవి. వెలుపలి ప్రాంతాలలోఉండే మేము సభలు జరుగుతూన్నప్పుడు ఈవిధంగా నిశ్శబ్దంగా ఉండడం అనేది మిమ్ములను జూచి నేర్చుకోవాలి. మీకు జరిగించుచున్న

నూలువడికే కార్యక్రమం చాలామంచిది. దానిలోగలతత్వము మహత్తరమైనది మీరనేక ఉద్రేకమగు పరిస్థితులలో గూడ అహింసను కాపాడగలిగినందులకు సంతసిల్లుచున్నాను. అహింసయే మీకును దేశమునకును ప్రపంచమునకును బంధ విముక్తి చేయగలదు మీరు గాంధిజీయొక్క దృష్టిలో నిరంతరము వున్నారని తెలుసుకోవలెను. నేను వార్ధా వెళ్ళినప్పుడు వారు మీ యోగక్షేమముల నడిగిరి. వారే శ్రీధక్కరు బాపాను మీవద్దకుపంపించిరి. మహాత్ముడు మీయోగక్షేమమును విచారణచేయడం మీఅదృష్టం. శ్రీమందేశ్వర శర్మగారి కృషినిగూర్చి అభినందిస్తున్నాను ఏపరిస్థితులలోగూడ మీరు అహింసను వదలరాదని తిరిగి హెచ్చరించుచున్నాను."

## వీ ర మం ది ర ప్ర వే శో త్స వ ఘ ట్ట ము

దీ 23—4—42 తేదీని ఈవీరమందిర ప్రవేశోత్సవము జరుపుటకు నిశ్చయించుకున్నాము. అప్పటికే నాకుము౦దు రానున్న దీర్ఘవ్యాధిలక్షణాలు ప్రవేశించాయి. గోదావరీబ్రిడ్జి జర్మనీవారో, జపానువారో బ్రద్దలుగొట్టుతారనే భయం వ్యాపించి కొవ్వూరు రాజమండ్రిగ్రామాలు గోదావరిగట్టు సమీప గృహాలన్నిఖాళీ అయాయి రాజకీయంగా దేశం నిర్మానుష్యం అయింది. తీవ్రనిర్బంధం సాగుచున్నది. ఇట్టి పరిస్థితులలో దేశభక్తుడు సన్నిధానమందుండి ఆసుముహూర్తం సాగించకపోతే, ఆసుబ్రహ్మణ్యం, శనివారం, గజవిల్లి, కొమ్మా

రెడ్డిగార్ల ఛాయాపటాలకు వేసిన అఖద్దరుమప్పటిని ఎత్తకపోతే జన్మలో ఈఉద్యమం ఇకముందు సాగుతుందా? ఆరోజున ఆయన త్రికరణశుద్ధిగా వేసిన లశీర్వచనాంకురమే యుద్ధఘట్టాలను వ్యాధిఘట్టాలను ఈమందిర కార్యదర్శిగారు మున్నగువారు పొందిన నిర్బంధాలు, ప్రమాదాలఘట్టాలను దాటించి నేడు ఈస్థాయినిప్పించిందని నాదృఢ నమ్మకం.

## ఆ ఖ రి స ం ద ర్శ న ం

పురుషాతీతమైన శక్తి ఒకటి ఉన్నదని నిరూపించడానికి ఈ అనుభవం సహాయపడుతోంది. రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులవారి ప్రత్యేకాహ్వానంపైని పీఠమందిర ప్రతినిధిగా ఆంధ్రకన్వెన్షనుకు బెజవాడ వెళ్ళితిని. అక్కడనుండి గ్రామిక కేంద్రప్రచారసంకల్పము కలిగింది. పవిత్రమైన మరీచ్యాశ్రమ దర్శనంలో దుష్యంతునకు శకుంతలా పుత్రదర్శనం అయాచితంగా కలిగినట్లుగా గుంటూరు మిత్రుల ఆహ్వానంలో గ్రామిక కేంద్ర స్థాపనమేగాక, దేశభక్తుల దర్శనభాగ్యంకూడా లభించింది. బహుశః వారి అవసానమునకు కొద్దిరోజుల గడువు మాత్రంగల ఆముహూర్తం నూవంటి వారిఅనుచరుల నాకర్షించే సత్తాకలిగినదేమో! ది 27-7-49 సాయంకాలం నేను స్థానిక వైజ్ఞానిక కేంద్ర కార్యదర్శి శ్రీ ముదునూరు వెంకటేశ్వరరావు, మిత్రుడు శ్రీకందిమెళ్ళ సత్యనారాయణ గార్లతో దేశభక్తుని సందర్శనం చేసితిని ఆశ్చర్యమేమంటె

ఆంధ్రకస్వేచ్ఛనుకు ఆయన రాలేపోవుటచే ఆయ ఏదో గొప్పసుస్తీలో స్పృహకూడా లేకుండా ఉంటారని నేను ఊహించాను. నేనప్పటికి వారిని చూచి 6 ఏళ్లు అయింది. నిరంతర ఉత్తరప్రత్యుత్తరాలు నడుస్తున్నా. కాని ఆముఖము ఆవర్చస్సు ఆచిరునవ్వులలో ఎంతమాత్రము. మార్పులేదు. అతినిశితంగా వీరినుందిరం ండజాతి గ్రామిక కార్యక్రమాలను ప్రశ్నించి వీరమంత ప్రచారకసోదరులు శ్రీ అప్పారావుగారు మొదలగువారినిగూర్చియేగాక యజమానులు పిల్లలను గూర్చికూడ ఎట్టిమరుపులేకుండా కుశలప్రశ్నలను వేశారు. ప్రస్తుతంమేము సంపాదించిన వీ ఉచరిత్రలగు వీరి గ్రామ గోంగా "నన్నుకొద్దిరోజులలో మీరు చరిత్రలోనే చేర్చగల" రని చిరునవ్వుతో అన్నారు. తిరిగి నాకోరికపైన వీరికథ అంగీకరించారు. అప్పటి వారిస్థితిని చూచి పొరబడి మేమే కొంచెము సుస్తీ చేశాము ఇంతలో నాచేతులోనున్న ఇటీవల ప్రచురించిన "గ్రామికధర్మరాజ్య" అను ఆంగ్లగ్రంథాన్ని నామిన స్త్రీప్తికి వారి ప్రక్కమీదపెట్టినాను వారుసోత్సాహులై వివరములు తెలుసుకున్నారు. కాని మార్క్సీయ గాంధీయ అద్వైత విజ్ఞాన పరిశీలన పూర్వకమైన ఈవైఖరి వారిదృష్టిలో అందులో అట్టిఅనారోగ్య స్థితిలో వారికి ఎంతవరకు నచ్చు తుందో అనియు, అనవసరంగా వారి మనస్సుకు కొంత శ్రమ కల్పించినానేమో అనియు నాలోనేను ఈగ్రంథము వీరియెదుట నుంచినానే అని నొచ్చుకుంటున్నాను కాని

ఈక్రింది అమృతసందేశాన్ని వారు మాకిప్పించి ఈఉద్యమాన్ని నేడుఅత్యంత ఉత్తేజితముచేసి పునీతము గావించినారు. "నిజమైనకమ్యూనిజము అద్వైతస్థితియే. కాని నేడు కమ్యూనిస్టు లనుకొనువారి చేతులలో నిది పొరపాటు దారులలో నడుస్తోంది. మోక్షకామి ధర్మరాజ్యవైఖరి నేటిదేశపరిస్థితులలో అవసరం. ఆప్రచారంమీరు సాగించవలసిందే. వదల వద్దు" అని వారిప్పించిన ఆదేశసందేశాలే నాకు నాదుర్బల దేహానికి అమృతబలాన్ని ఇచ్చి హైదరాబాదు వరంగల్లులలో కూడా ఈవైజ్ఞానిక కేంద్రాల స్థాపనలో అధికంగా ఉద్దీపన శక్తులయ్యాయి. దేశభక్తుడు ఆంధ్రరాష్ట్రోద్యమవాది, అనేక నిర్మాణ కార్యక్రమాలకు బలదాత గాంధీజీకి ప్రియసహచరుడేకాక, అద్వైతత్వాన్ని నవ్యపరిస్థితులలో అభివృద్ధిపరంగా వికసింపజేసే 83 సం॥ వయస్సుగల ఒక యువకహృదయుడని ఆరోజు, అనగా వీరినిర్యాణానికి 18 రోజులు ముందుగా నేను తెలుసుకున్నాను. ఇట్టి అస్మదుద్దేశకునకు ఈపవిత్ర దశాహ్నమున "సోహం" సిద్ధినికోరుచు తపించడమైనది. ఈమందిరం, ప్రచారకసమితికార్యాలలో దేశభక్తులు, సేవ, ప్రసంగాలఘట్టాలు అప్పుడప్పుడు విశదీకరిస్తుంటాము.

రె. మం. శ

(యుగధర్మ సంపాదకీయము)

30—8—1949

# ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు

(2 - 6 - 1889 — 10 - 6 - 28)

పండితుడు, కవి, రసజ్ఞుడు, గాయకుడు, కళారాధకుడు దేశసేవా తత్పరుడు, నిష్కామయోగి, బ్రాహ్మణ మతవ్యాపకుడు, రామదండు నిర్మాతయు నైన శ్రీ గోపాలకృష్ణుడు దుగ్గిరాల కోదండరామస్వామి, సీతమాంబగార్ల గర్భశుక్తి ముక్తాఫలముగ నవతరించెను. ఇతడు 2-6-1889 సం॥ రంలో నందిగామ తాలూకాలోని-పెనుగంచిప్రోలు గ్రామంలో జన్మించెను. ఇతని స్వస్థలం కూచినపూడి అగ్రహారం-ఇతని మూడవయేటనే తండ్రి మరణించుటచే, యితనిని పినతండ్రియగు శివరామయ్యగారు పోషించుచూ, అయిదవఏట అక్షరాభ్యాసము చేయించెను.

ఇతని కాటపాటలయందున్న అభినివేశము, రుచి, విద్యాభ్యాసంపైన లేకపోవుటచే-గురువులు యితనికి చక్కని సంస్కారము చేయలేకపోయిరి ఇతనికి 1903 సం॥ రంలో వివాహము జరిగెను. గుంటూరు కళాశాలలో ఎఫ్ ఏ. క్లాసు వరకు జదివెను

1907 సం॥ రంలో పంచాపకేశయ్యరుగారి సహాయముచే బాపట్లలో జాతీయనాట్యమండలిని స్థాపించెను.

దానిలో ప్రముఖ పాత్రలను ధరించుచుండెను. పిమ్మట గుంటూరులోని యువజన నాటకసంఘములో సభ్యుడై తన గానపటిమచే సదస్యుల నానందింపజేయుచుండెను. ఇంతలో రాజకీయోద్యమ మీయన నాకర్షించినది దేశములో అశాంతియు, అరాజకత్వమును, వంగదేశ విభజనానంతరం పెచ్చుపెరిగెను అనేక వంగవీరులి బ్రిటిషు బహిష్కారోద్యమ సమరములో మడిసిరి. ఇట్టి దేశకాల పరిస్థితులలో 1909 సం॥ రంలో బందరులో సమావేశమైన ద్వితీయ విద్యార్థి సమ్మేళనమునకు గోపాలకృష్ణుడేగి తోడిబాలురతో తమ భావి కర్తవ్యాన్ని గురించే తీవ్రముగ నాలోచించెను. • స్వరాజ్య సంపాదనకై విద్యార్థు లెల్లరును కృషిసల్పిరి. ఆ విద్యార్థి మహాసభలో అద్వితీయప్రాముఖ్యాన్ని గడించిన వారిలో ఇత డొకడు. 'జాతీయత-కళ' అను ఉపన్యాసమునిచ్చి శ్రోతలను చకితుల జేసెను.

రాచకీయ విషయములలో శ్రద్ధవహింపుచు స్వరాజ్య స్వధర్మ రక్షణ కాంక్ష నమితముగ వహించుచు, భావికాలమున దమకు లభింపనున్న యుచ్చస్థితికి పునాది నేర్పరచుకొనుచుండెను. అప్పటికే యతడు వాక్చాతుర్యమును, రసగ్రహణ పారీణతను, కార్యోత్సాహమును, మేధాశక్తిని గానపటిమను, అమితముగ బ్రదర్శింపసాగెను. అతులిత దేశాభిమానమే ఇతని నింతగొప్ప వానినిగను, కార్యదీక్షా పరతంత్రునిగను నొనర్చినవి.

పరదేశములయొక్క విజ్ఞానము నుసంపాదించినగాని లాభముండదను భావమప్పు డాంధ్ర దేశమునను, భారతదేశమునను వ్యాపించి యుంటకతన, గోపాలకృష్ణుని మనసున కోర్కె లిగురొత్త-మిత్రులగు నడింపల్లి నరసింహారాయల సాహచర్య ధనసహాయములచే, 1911 సం॥ రంలో ఇంగ్లాండునకు వెళ్లెను. ఇతడు లండనునగరంలో ప్రవేశపరీక్షయందు కృతార్థుడై, ఎడింబరో విశ్వవిద్యాలయములో వేదాంతశాస్త్రం, రాజ్యతంత్రం, వ్యవసాయ శాస్త్రముల నభ్యసించుచూ, అర్థశాస్త్రమున పట్టమును సంపాదించెను. ఎడింబరో భారత సంఘమున కితడు కార్యదర్శిత్వమును వహించి గౌరవమును గడించెను. 'Science of Economics is the Science of destruction' అనగా అర్థశాస్త్రము - నాశనకరమగు శాస్త్రమని ఇతని మతము. శారీరశాస్త్ర వైద్యశాస్త్రాలలో కూడా రెండుపట్టములను సంపాదించెను.

1914 - 1915 అతనికి శ్రీ అరవిందఘోష్ - తిలక్ మహాశయులపై మంచి అభిమానముండేది. మాండలే జైలు నుండి తిలకును విముక్తుని జేసినపుడు గొప్పయుత్సవమును జరపెను. భారతీయ విద్యార్థి సభలో ఉపన్యాసం జేయుచున్నపుడు ఒకనాడితనికి Dr A కుమారస్వామితో మైత్రిఘటిల్లెను. వీరిరువురుకలసి అభినయదర్పణమును వ్రాసిరి. ఇంగ్లండునకు రాయబారిగా వెడలిన గాంధీజీని ప్రప్రథమంగా దర్శించెను. ప్రపంచయుద్ధం ప్రారంభంకాగానే ఇతర విద్యార్థు

లతో బాటు మగిడి స్వదేశమునకు విచ్చేసెను. తిరిగివచ్చిన పిమ్మట ఎక్కడను ఉద్యోగం కొరకు ప్రయత్నింపక తోలు బొమ్మలు, జంగం కథలు, పురాణగాథలు, గానసభలు జేయుచు, పుణ్యక్షేత్రము ల దర్శించుచూ కాలక్షేపము సేయు చుండెను.

1917 సం॥రంలో ఇతడు వక సుందలానికి పోయి Sir Alexander దొరను కలువగా వీరికి విద్యావిభాగము లో నెల 1 కి రూ 200/లు జీతంపైని ఉద్యోగ మిప్పించెను. వెంటనే రాజమండ్రి ట్రయినింగు కాలేజీలో ఉద్యోగములో చేరెను. అధ్యాపకు లోకెల్ల మిన్నయై రాణించి మం చికీర్తిని గాంచెను. అద్వైత మతావలంబకుడును, భక్తపరుడును అగు టచే ప్రతినిత్యము స్నానసంధ్యాదిక పూజాకృత్యము లొనర్చిన పిమ్మట స్కూలునకు పోవుట అనుష్ఠించుటచే కాలేజీకి పోవునపు డాలస్య మగుచుండెను అప్పటి కాలేజీ ప్రిన్సిపాలు యితని ప్రవర్తనను చూచి గినిసి యితనిని పనికి రాజీనామా యివ్వవలసినదిగా నిర్బంధించెను. ఇతడు వెంటనే రాజీనామా దాఖలుచేసి 1918 లో బందరు జాతీయ కళాశాలలో అధ్యా పకుండుగా కుదురుకొనెను. ఇతని కాలములోనే యిక్కడ దేశీ యోద్యమం ప్రబలమైంది. అచిరకాలములోనె ఇతడీపనినుండి విరమించుకొనెను.

ప్రపంచ సంగ్రామము పరిసమాప్తి, దేశక్షోభ, గాంధీ నాయకత్వం, పంజాబు దురంతాలు, ఖిలాఫత్ అన్యాయాలు,

మున్నగు విషయాలు కాంగ్రెస్ దృక్పథమును మార్చివేసినవి. చీరాల గ్రామపురపాలక సంఘవ్యవహారాలలో పాల్గొని ప్రజల ఆదరాభిమానాలు చూరగొనెను

1921 సం॥రంలో గోపాలకృష్ణుని ఘనత ఆంధ్రలోకము గ్రహించెను. గాంధిమహాత్మునిచే ఉపక్రమింపబడిన అసహాయోద్యమములో పాల్గొనెను. ఇతనికి ప్రభుత్వంవారు య 60 ల భూమిని గోష్ఠిసంఘ నిర్మాణానికి — ప్రసాదించిరి.

## 1921 సం॥ ముఖ్యఘట్టాలు

గాంధీమహాత్ముని బెజవాడ యుపన్యాసము తర్జుమా చేసినందుల కితనికిచ్చిన పై భూమిని గవర్నమెంటు రద్దుచేశారు. జనవరి 21 గోదావరిజిల్లా విద్యార్థిసంఘసభకు అధ్యక్షత వహించెను- ఖద్దరుధరించుట, అహింసావ్రతం, అస్పృశ్యతనాశనం, సురాపాన నిషేధం మున్నగు పంచవిధ బహిష్కారాలు అమలుజరుపుటకు, మిత్రులగు భట్టిప్రోలు సూర్యప్రకాశరావు నరసింగరావులతో బయలుదేరి ఆంధ్రదేశమునందంతటను దీవ్ర ప్రచారమును జేసెను.

ఈసం॥ రంలోనే గుంటూరుజిల్లా రాజకీయ మహాసభ పొన్నూరులోజరిగెను. ఆసభలోనె యితనికి (10-6-21) ఆంధ్ర

రత్న బిరుదమీయబడెను. ఇతడు స్వరాజ్యసంపాదనకు శపథము తీసుకొని, Do or die-"యశోవా మృత్యుర్వా" అన్నస్థితినెదుర్కొని శాంతిసమరాన్ని నడిపి జయించడమో లేక రణరంగాన బోరాడి వీరస్వర్గమలంకరించడమో జరగాలని తీవ్రంగా ఆలోచించి, తనగ్రామంలో శపథంజేసెను ఒకటే ఆదర్శప్రాయమైన మతంవుండుట ఆర్యులందరికీ అవసరం అని సర్వమత సామరస్యం కల్పించడానికి పాటుపడినవ్యక్తిగనక, దానికొరకై సిక్కుల అకాలీ దళానికినీ, ఇంగ్లీషువారి స్కౌట్లుకు సమమైన ఫక్కీని రామదండును నిర్మించెను.

30-3-21 తేదీని బెజవాడలో జరుగుచున్న అఖిలభారత కాంగ్రెసుకమిటీకి స్పెషల్ ట్రయినుమీద వేయిమంది స్వచ్ఛంద భటవర్గమును దీసుకొనివచ్చెను. అచ్చట సమావేశమైన వాలంటీర్లుసేవచేయలేనితరి, అత్యద్భుతిముగా మహాసభజరిపించి, ప్రజల యొక్కయు, మహాత్మాగాంధీ, చిత్తరంజనదాసు, ఆలీసోదర్లు మున్నగువారి మన్ననలకుపాత్రుడై చీరాల, పేరాలరణరంగమునుజొచ్చి ప్రజాసేవజేసి నాయకుడని మెప్పొనుబడసెను

22-6-1920 లో ఆంధ్రవిద్యాపీఠగోష్ఠిని స్థాపించెను.

7-4-21 తేదీని గాంధిజీ చీరాలవెళ్లి రామనగర్ శంకుస్థాపనజేసెను. 1923 సం॥రంలో ఆంధ్రసోదర సమితినిస్థాపించెను. నాగపూర్ కాంగ్రెసుకువెళ్లెను. చీరాలసమీపమున రామభూమియనిపేరిడి 5 లక్షల రూపాయలు వెచ్చించి సైనిక శిక్షణాలయమును నెలకొల్పి వ్యవహరించెను

(2)

25—4—21 వరకు చీరాల మ్యునిసిపల్ వ్యవహారాలలో పన్నోని వ్యర్థముని తిలచి ఆనాడు చీరాల ప్రజలను అందరిని వెంటబెట్టుకొని, గ్రామాన్ని బహిష్కరించి, నిర్మానుష్యంగా జేసివైచెను. చీరాలప్రజలతో కలిసి పొలాలలో కాపురం చేస్తున్నప్పుడు బ్రహ్మపురములో ఆంధ్ర మహాసభ, రాష్ట్రీయ కాంగ్రెసు సభలు జరుపుచున్న పెద్దలు వీరి కాహ్వానము నందజేసిరి. అక్కడనున్న మండలాధికారి Rutherford దురాగ్రహపరు డగుటచే గోపాలకృష్ణుని ఉపన్యాసాన్ని ధిక్కరించుచు 144 శెక్షను జారీచేసెను. ఇతడా యుత్తరువును ధిక్కరించుటచే ఒక సంవత్సరము శిక్షింపబడెను.

ఈ సమయములోనే బందరుజిల్లా మేజస్ట్రేటు యితనికి 9 మాసాలు శిక్షను విధించెను. ఈ రెండు శిక్షలను అనుభవించి తిరుచునాపల్లి జైలునుండి 2-10-22న విముక్తుడయ్యెను. జైలునుండి వచ్చినదాదిగ తన స్వశక్తిప్రకారం సర్వులను ఉన్నతికి తీసుకుపోవలెనని బ్రాహ్మణ ప్రచారం చేయుచుండెను. కాంగ్రెస్ ప్రచారమునకు తన సాహిత్యాన్ని గ్రోలు గ్రాసవాసులు రూ 116/లకు తక్కువ కాకుండగా యివ్వవలెనని దీక్షవహించి కాంగ్రెసు సంఘమునకు వేల కొలది రూప్యములను ప్రోగుచేసి కానుకగా అర్పించెను. గాంధీజీ జైలుకు పోయిన కాంగ్రెసు కార్యక్రమము మందగమనముతో నడుచు రోజులగుటచే, ఈయన ప్రచారంతో ప్రజల

ఉత్సాహాతిశయములు రేకెత్తుటయు, స్వరాజ్యనిధి ప్రోగగు టయు (2-10-22) ఏకసమయంలో జరిగెను.

ఆసంవత్సరంలో చిత్తరంజనదాస్ అధ్యక్షతక్రిందనుగయ కాంగ్రెసు జరుగుచుండగా సతీసమేతుడై గోపాలకృష్ణుడు హాజరయ్యెను ఈకాంగ్రెస్ పిమ్మట No-changer గా నుండి పర్యటనము జేసెను. గయా కాంగ్రెసులో మహాసభ రెండు చీలికలయ్యెను.

10-7-23 నాగపూర్ అఖిలభారత కాంగ్రెస సభ కీతడు కార్యదర్శియై కార్యాలయమును బెజవాడకు మార్చెను. ఉత్తర దేశనాయకులకు దీసిపోవక తన జవాబు దారీని జాగ్రత్తగా నిర్వహించుచు భారతదేశమంతటను ప్రచార మొనర్చెను.

1924 సం॥ రంలో తూర్పుగోదావరి జిల్లాలో ఆల మూరులో జరిగిన జిల్లా మహాసభలోను, స్వచ్ఛంద మహా సభలోను, కోవూరులో జరిగిన రామదండు శిక్షాశిబిరము లోను కొంత ప్రచారము జేసెను.

ఆంధ్రదేశ మధ్యస్థమున కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో ఆంధ్రనాయకుల మంత్రాంగముచే అఖిలభారత కాంగ్రెస్ సభ్యత్వమునుండి యితనిని తొలగించిరి. సభ్యత్వ మేలేకున్నచో కార్యదర్శిత్వమితని కెట్లు సంప్రాప్తించును! ఇతడప్పుడు ఉత్తరదేశపు పర్యటనలో నుండుటచే తనకు జరిగిన ఆశాభంగానికి వగచి, ఎచ్చటనో స్థిరనివాస మేర్పర్చుకొని

కాలక్షేపము జేయ నిశ్చయించుకొనెను. గాంధీజీ కారాగార విముక్తులైన పిమ్మట గాంధీపూజానిధికిగాను కొంత దవ్య మును వసూలు జేసెను. మే నెలలో రామసప్తాహము వైభవముతో జరిపెను.

1923-1926 సం॥ లో కొవ్వూరు గీర్వాణవిద్యాపీఠముకు వీరు విచ్చేసి రామదండు శిక్షణ ఊరేగింపులు జరిగించి యువకులను అనేకమందిని ఉద్దీపితుల చేసిరి ఈతాలూకా అనంతపల్లిలో ఉద్దగిరి వారి మామిడి తోటలో వేలకొలదిగో జరిగిన తాలూకా రాజకీయ మహాసభ అధ్యక్ష పీఠమునుండి భావ గాంభీర్యము రసస్ఫూర్తితో ఇచ్చిన ఉపన్యాసము ఇప్పటికిని రసవత్తుగానే జ్ఞాపకం వస్తూంది

1925 జూను నెలలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిత్వానికి రాజీనామా నిచ్చెను.

1924 - 26 సంవత్సరాల మధ్యను ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు పమిడిపాడులోను, ఆలమూరు స్వచ్ఛంద సేవాసభకును, విశాఖజిల్లా మహాసభ (మాడుగుల) లోను, అధ్యక్షత వహించెను.

1926 లో గుంటూరు మండల సన్మానసభకు అధ్యక్షుడాయెను. నెల్లూరు, చెన్నపట్నం, బెజవాడ, బందరు, రాజోలు, అమలాపురం మున్నగుచోట్ల సంచారము చేసి ఆంధ్ర స్వరాజ్యపార్టీ, ఆంధ్ర కాంగ్రెస్ కార్యదర్శక పదవిని

వహించి, యథాశక్తిని రాజకీయాలలో పాల్గొనెను. ఈసమయం లోనే 'సాధన' అను ఆంగ్లవారపత్రిక నొకదానిని స్థాపించెను.

1926 సం॥ రం జూన్ నాటికి ఇతనికి వ్యగ్గత ఏర్పడి నటుల Lt. col. శాస్త్రి నిర్ణయించారు. 27-10-1926 లో నూతన గృహప్రవేశమహోత్సవము జేసుకొనెను.

10-6-28 తేదీని రాత్రి గం. 10-45 ని. కు గుంటూరులో దివంగతుడయ్యెను. చీరాల పేరాలలోనున్న రామనగరులో ఇతని కగ్నిసంస్కారము జేసిరి.

చివర రోజులలో తనకున్న ఆస్తిని రామనగరు పేరును సార్థక పరుచుటకై శ్రీరామాలయమును కట్టించుట కర్పించెను.

## 3 విశ్వదాత, దేశోద్ధారక బిరుదాంకితులు. కాశీనాథుని నాగేశ్వరరావుగారు

(1867 – 1938)

కృష్ణాజిల్లా ఎలకుర్రు గ్రామంలో కాశీనాథుని బుచ్చయ్యాగార్యులు శ్యామలాంబగార్ల సుకృత తపః ఫలముగా వీరు 1867 స. ॥ రంలో జన్మించారు అవిరళ కనకవృష్టిని గురిపించి, అత్యంతార్ద్రి ఘనహృదయుడై, అసంఖ్యాకుల అశ్రుధారల నభిషిక్తుడై, సుర విమానారూఢుడై, అమరపురి నలంక

రించాడు. విశ్వదాతి బహుళ సుగుణోన్మేష ప్రభాజాలము వెలార్చిన వీరవతింసుడై వీరస్వర్గమును జూరగొన్న త్యాగి- మహాపురుషులలో ఇతడు తలమానికము, తపస్వి, ఎముకలేని చేతితో ఆశ్రితులకు కాసులొసగిన మహాపురుషుడు, అసంఖ్యాకుల రక్షణముకై ధనసహాయము జేసినదాత.

ఇతని ప్రకృతి సుఖకరమైన గృహజీవితానికి కట్టుపడి యుండుట కంగీకరింపలేదు. ఇతని జిజ్ఞాసను పూర్తిగ వించి. తేజఃపూరితము జేయుటకు నల్గురి సహకారము వుండెను. అందులో మొదటివారు కన్నతల్లి ఈమె యతనిని బందరు కు విద్యాభ్యాసమునకు ఒంపెను ఈమె కతన ఆంగ్ల విద్య నభ్యసించుటచే-శరస్వర్గము... లోని పారశాల కామె పెరు బెట్టెను. నాడే నాగేశ్వరరాయలయాత్ర ఆరంభమైనది. ద్వితీయ ఘట్టములో చెన్నపురిలో కొంతదనుక రెంటాల వెంకటసుబ్బారావు కేలూత నొందెను. ఆంధ్రమహాపురుషు లకు నెలవైన క్రిష్టియన్ కాలేజీ ప్రిన్సిపలు డాక్టర్ మిల్లరు యొక్క జీవితం యితనికి ఆవశ్యకమైన వెల్గు నిచ్చిన ది

ఇతనికి సుబ్బారావు తన మేనకోడల నిచ్చి వివాహము గావించెను నాగేశ్వరరావు మనీషి, సుబ్బారావుగారి సర్వతోముఖ ప్రజ్ఞ నవలోకించుచూ, ఆతని ప్రబోధాలకు చెవులొగ్గి, దృష్టాంతాలకు కనులప్పగించి, అక్కరయగు రీతిని తనహృదయాన్ని ఉద్రేకించుకొనెను. నాగేశ్వరరావు యత్నాలన్నింటికీ సుబ్బారావు పూనికలు మేల్బంతులాయెను. ఇతని భావి

జీవిత భవననిర్మాణానికి పునాదిని సుబ్బారావు వేసిననూ, తన స్వీయయత్నాల చేతనే దానిని సంపూర్తి గావించుకొనెను. విక్టోరియా డిపోనుండి కొండొక భాగాన్ని కైకొని విలియం అండు కంపెనీ మూలబంధమున ప్రవేశింపజేసెను. అది క్రమ క్రమముగా పెరిగి అమృతాంజనం డిపో అయినది. దిన కర కిరణి వెలిగెడి విశ్వదాత జీవితానికి—సుబ్బారావు జీవితం అరుణోదయ మయ్యెను. ఇతని కుత్తేజన మిచ్చిన వారిలో నాలుగవనారు గాంధీజీ మహాత్ముని సఖ్యతచే నాగేశ్వరరావు ప్రతీక్ష తీవ్రముగా చలించెను తన సుఖశాంతులకును, ఆహార నిద్రలకును నీరువదలి, దరిద్రనారాయణుని సేవను ప్రధానాశయము గావించుకొని 63 వ ఏట దొలిమారును, పదంపడి రెండుపర్యాయములు కారాగారశిక్ష ననుభవించి, భయద క్షయవ్యాధిని తెచ్చుకొని దానికి తన జీవితాన్నంకితము జేసెను అనురాగ పూరితహృదయుడై, భక్తి భరితస్వాంతుడై, శ్రద్ధాప్రపూర్ణుడై, వ్యక్తుల పూతనామముల నుచ్చరించేవాడు

జిజ్ఞాసువగు నాగేశ్వరరావు ఈ కర్తవ్యాలను తోడ్తోడ నిర్వహించుచూ తన ఆంతరంగిక శక్తిని, హృదయమహత్త్వములను ప్రకటించువాడు. తొలిబోలు విజ్ఞానుల సాహచర్యము నిరంతరము నపేక్షించెను. అంతట ప్రజ్ఞాధురీణుడైన కొమర్రాజు లక్ష్మణరాయల అస్తమయానంతరం ఇతడాంధ్ర విజ్ఞాన

సర్వస్వమునకు కృషిసల్పెను. సుప్రసిద్ధ పరిశోధకులగు—శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మను దరిజేర్చుకొనెను. కళోపాసన, దేశసేవలకై సర్వశక్తులను వినియోగించెను.

ఈశ్వరుడు తన ఉత్కృష్ట కార్యనిర్వహణమున కీతని నియమించెను. గనుక ఇతని భావములు, క్రియలు, వాక్కులు, నడకలు, ఈశ్వరప్రేరితములు. సర్వతోముఖ ఆంధ్రసముద్ధరణానికి అక్కరమైన వ్యక్తియని ఈశుడు ఇతని నెన్నుకొనెను. అసమాన ప్రతిభాశాలి, వక్త, రచయితయునైన సుబ్బారావును యితడును సైదోడులు. ఇతని ఆంతరంగిక శక్తి గొప్పది. తనకర్తవ్య మీశ్వరప్రేరితమనినమ్మి, ఈ శక్తి వ్యక్తీకరణానికి, ఈశ్వరమహిమయే ఉత్తరవాదియని నమ్మి; తానందిన ఫల మీశ్వర ప్రత్యర్థముగా ప్రీజాళి చేతులలోబెట్టి దేశోద్ధారకుడు ధన్యజీవి యైనాడు. దైనికజీవితములో సంయమగుణాన్నను ష్ఠించిన మహాపురుషుడు. క్రమనిష్ఠచేతను, కఠోర తపను శ్రేణిను, తా నధిష్ఠించిన ఉత్తుంగశిఖరాన్నుంచి జారిపడకుండా త్రోవ నేర్పరచుకొని, ఈశ్వరుని వక్షములో స్థానము జేసుకొని ప్రవేశించిన మహనీయ గుణగరిష్ఠుడు — ఈయన 1938 లో పరమపదించెను.

---

# ముట్నూరి కృష్ణారావుగారు

(1877 – 23 - 6 - 45)

ఆంధ్ర దేశములో కృష్ణాపత్రికకుగల పూజ్యస్థానము, పలుకుబడి, అసాధారణము అనితరలభ్యము. వంగ దేశములో రవీంద్రకవి వివిధంగా తనగీతాలచే జాతీయభావాన్ని కైకొత్తించి దిగంత విశాలకీర్తి నార్జించాడో, అలాగే స్వరాజ్యోద్యమానికి ఆంధ్ర దేశంలో నామరూపాలు కల్పించి, పల్లె పల్లెలా, వాడవాడలా, తనపత్రికాముఖాన్ని అపార సేవజేసి, ఆంధ్రులను కాంగ్రెసుసంస్థను తనఋణములో వుంచుకొన్నాడు శ్రీ॥ శే॥ ముట్నూరు కృష్ణరాయలు.

అప్పటిలో ఆంధ్ర దేశంలో, జాతీయఉద్యమానికి మూల పురుషులైనవారిముగ్గురిలో ఇతడొకడు, మిగతావారు కోపల్లె హనుమంతరావు, భోగరాజు పట్టాభిసీతారామయ్య. శ్రీకృష్ణారావు జాతిమత విచక్షణలేని విశాల జాతీయభావాన్ని తనపత్రిక ద్వారా సాధించ దలచాడు.

బందరు నోబులుకాలేజీలో - ఎఫ్ - ఏ క్లాసు చదువుతూన్నప్పుడు, విద్యకు స్వస్తిజెప్పి వందేమాతరం ఉద్యమములో పాల్గొని వంగదేశం వెళ్ళి అచ్చట శ్రీబిపిన్‌చంద్ర పాల్ సాహచర్యంతో కొంతకాలం గడిపెను. పిమ్మట కొంత కాలానికి బందరుకు తిరిగివచ్చి కృష్ణాపత్రికను జేపట్టారు.

ఇతనికి పూర్వము ఈపత్రికను నడిపించి హనుమంతరావు, శ్రీకొండా వెంకటప్పయ్యగార్లు నడుపుచుండిరి. అప్పటినుండి వీరికి పత్రికా ప్రపంచములో ఒక విశిష్టస్థానాన్నిచ్చారు. పిమ్మట జాతీయ పరిశ్రమాభి వృద్ధికొరకు ఒక సబ్బు ఫ్యాక్టరీని నెలకొల్పారు. 1930 సం॥ రంలో ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని 2 సంవత్సరాలున్నూ, 1941 సం॥ రంలో వ్యక్తి సత్యాగ్రహములో ఆరునెలలున్నూ శ్రీ కృష్ణజన్మస్థానాన్నలంకరించారు.

ఇతనికి 'మౌనముద్రాలంకారు' లని బిరుదువుంది. వేదికపైకెక్కి గంభీర ఉపన్యాసాలియ్యడం అలవాటులేదు. కృష్ణాపత్రికలోని సంపాదకీయము, రచనలు అన్నీ అన్నీ ఉపన్యాసాలుగా చెప్పుకోనవచ్చును. వ్రాసినా మాట్లాడినా వీరిఅంతరాత్మ ప్రబోధాన్నిపట్టి నిర్మొగమాటముగా మాట్లాడేవ్యక్తి. మిత్రులకు, దర్బారీయులకు ఇతడొక ప్రఖ్యాత కళాశాల ఉపన్యాసకుడు. వేదాంతం, సైన్సు, కళలు, కవిత్వం- దేనినిగురించి అయినా బాగామాట్లాడగల సమర్థతగలవాడు.

భూగర్భశాస్త్రం మొదలు భరతనాట్యంవరకూ, ఆయుర్వేదం మొదలు ఆధునిక అల్ట్రావయొలెట్ రేస్ వరకు, అటు షేక్స్పియరు, ఇటు కాళిదాసు, ఒకవంక గాంధీజం- ఇంకోవంక కమ్యూనిజం- ఒకటేమిటి సర్వవిషయాలలోను, శాస్త్రాలలోను, సామాన్యజ్ఞానంతోకాక, కూలంకష పరిజ్ఞానంతో విమర్శించేవాడు. గిరీశంచెప్పినట్లు, కృష్ణగారితో మాట్లాడడం, వారి

సామాన్యచర్యలె (education) విద్యలాంటివి. కృష్ణాపత్రిక ఆఫీసుఅంటే కృష్ణరావుగారి దర్బారే. కవులు, గాయకులు వేదాంతులు, చిత్రకారులు, నటులు, రాజకీయవేత్తలు, కాంగ్రెసువాదులు, అన్ని వర్గాలవారు వారివారి అభిప్రాయాలను, సందేహాలను వెలిబుచ్చి సమాధానపడిపోతూ వుండేవారు. కాంగ్రెస్ వాలంటీర్ [illegible] కళోపాసకునివరకు, లంకాడి నాట్యకర్తె [illegible] స్వాములవరకు, ఎవరువచ్చినా వీరిదర్శనం [illegible] ఆబాదగుపురాన్ని ప్రతిబింబించే [illegible] కిరీటంలేని మకుటధారి- కృష్ణరాయలు [illegible] వేదాంతం, హాస్యం, కళాభిరుచి, కాంగ్రెస్ భక్తి, [illegible] అన్నింటికీ సమానస్థానమిచ్చి తనజీవితనాటకం [illegible] కల్పించుకొన్నారు.

[illegible] అస్తమయం ఆంధ్రులకు తీరని నష్టము కలిగించింది.

## ఆంధ్రచరిత్ర పరిశోధనన చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు

(1872 — 16-5-39)

ఆంధ్రులలో సంచలనము కలిగించి, జాతీయతా బీజములను నాటిన [illegible] వీరభద్రరావుగారొకరు

ఈయన లేనిచో ఆంధ్రజాతి వైశిష్ట్యమే మరుగుపడి వుండేది. జాతీయ ప్రబోధ మసమగ్రముగ నుండెడిది. ఆంధ్రాభ్యుదయం మృగ్యమై యుండెడిది. కొమర్రాజు లక్ష్మణరావుగారితో పాటు ఆంధ్రుల కొక విశిష్టత గలదని చరిత్ర — విజ్ఞానం నిరూపించినదివీరే. వార్ధక్యముచే దేహదార్ఢ్యము సడలినను, ధనాభావం, పరాధీనత, ఆంధ్రదేశపు ఔదాసీన్యం తన పరిశోధనల నిరాఘాటముగ జరుపుట కెట్టి యడ్డంకిని గలుగనీయ లేదు. మాతృభాషా చారిత్రక పరిశోధన సేవయే ప్రధాన లక్ష్యముగ నెంచి ఇతడు జీవితమును కృతకృత్యము గావించు కొనెను. ఆ వయస్సులో ఆయనకుగల అభినివేశం, జిజ్ఞాస, కార్యదీక్ష, యువకులను సైతము సిగ్గుపరచేది. ఈ యకుంఠిత కార్యదీక్షకు, ధీపటిమకు, ఏకాగ్రతకును గారణము ఆయన యౌవన ప్రాదుర్భావములో గ్రహించి యారాధించిన ఆదర్శములే. శ్రీ వీరేశలింగం పంతులు సంస్కరణాభిరతి, త్యాగశీలాలు ఇతని యువహృదయములో నిగూఢమై యున్న సంస్కరణాభిలాషను, దేశసేవానిరతిని, రగుల్కొల్పి యొక సంచలనాన్ని కలిగించాయి. దాని ఫలితంగా ఏలూరునుండి "దేశోపకారి" పత్రిక వీరిసంపాదకత్వాన్ని వెలువడింది. కొంత కాలానికి రాజమండ్రిలో "ఆంధ్రకేసరి"కి వారు సంపాదకులై, పత్రికా నిర్వహణలోనూ, వ్యాసరచనలోనూ తమకుగల అపూర్వ అనుభవాన్ని వినియోగించి సంఘులోపాలను హేళన

జేసి, పంతులుగారికి చేదోడు వాదోడై వారి పునర్వివా
హోద్యమానికి దోహదమిచ్చెను

ఇతని సంఘసంస్కరణాభిలాష అంతకంతకు విశాల
తరమై ఆంధ్రాభ్యుదయానికి నూతనమార్గము నన్వేషింప పూరి
గొల్పినది. ఆంధ్రులధోగతి చెందడానికి వారి మూఢమత
విశ్వాసాలే కారణమని గ్రహించెను.

వందేమాతరం ఉద్యమంతోబాటు ఆంధ్రోద్యమము
కూడా నుదయించింది. ఇతని ఆంధ్రుల చరిత్రరచన ఆ యుద్య
మానికి చాల సహాయకారి అయినది. ఆంధ్రజాతీయతా నిర్మా
ణోద్యమం ప్రారంభమైనది. ఆంధ్రజాతికంతా ఒకటే లక్ష్య
మైనది పత్రికాధిపతులకు వలయు సిద్ధహస్తం, సారస్వతో
పాసకులకు వలయు జిజ్ఞాస, ఏకాగ్రత, విమర్శకులకు వలయు
ధీశక్తి, నైశిత్యము, సంఘసంస్కర్తలకు వలయు దిట్టతనము,
విశాలహృదయం, జాతీయ నిర్మాతలకు వలయు దేశభక్తి,
ప్రసన్నత ఇతనిలో మూర్తీభవించినవి. ఇవన్ని యితని
రచనలో ప్రతిబింబితములయినవి. ఈయన 1921 సం॥
రంలో కొవ్వూరు తాలూకాపక్షమున రాష్ట్రకాంగ్రెసు
సభ్యులు 1918 సం॥రములో ఈ వీరమందిర ధర్మకర్త యువ
కుడుగా తల్లిదండ్రుల ప్రేరేపించి శాంతియుత వాతావరణకై
రాణ్మహేంద్రవరమునుండి ఈ గోవూరునకు నివాసం వచ్చిన
మొదటిరోజునుండి వీరు పరమపదించువరకు ఇతని ఇంటివద్దనే
తరచు పత్రికాపరనమో గోష్ఠియో చేయుచు కాలం గడు

పుచు ఈ ధర్మకర్త పూనిన ఉద్యమాలకు నైతికబలం ఒసగి యుండిన యువకహృదయం — దేహం ముసలిదైనా — ఈ వీరభద్రరావుగారిది. 1935 సం॥ రం లో ఇచ్చట నడుప బడిన ప్రచారక విద్యానిలయంలో ఆంధ్రుల చరిత్ర ఒక కథగా పాఠం చెప్పిరి. దేశసేవకై తనయావదాస్తిని, ఆరోగ్యమును కూడ గోల్పోయి, ఆంధ్రుల చరిత్ర జీర్ణసామ్రాజ్యం, నాయకురాలి దర్పం, శ్రీనాధుడు, తిమ్మరుసు, తిక్కన సోమయాజి మున్నగునవి రచించి, ఆంధ్రభాషామతల్లి పాదపీఠముపై నుంచి, ఆంధ్రదేశానికి జీవితాన్ని సర్పించెను

భారత స్వాతంత్ర్యయోధుడు - కొండజాతి ధర్మసంరక్షకుడు

## ఆంధ్రవీర అల్లూరి శ్రీరామరాజుగారు

## మోగల్లు (ప॥ గో॥)

( జననం 5-7-1897 నిర్యాణం 12-5-24 )

వీరరసస్ఫురితమైన ఘట్టాలలో ఈమన్య విప్లవం ఒకటి. ఇది కేవల ధర్మసంస్థాపనోద్దీపితమగుటచే పూజలందినది అంతకు పూర్వం ద్వారబంధాల చంద్రయ్య లేవదీసిన గంప పితూరీ కంటె నిది ఉన్నతస్థాయిని నడిచింది. వీరుల గన్న దేశము

ధన్యము. ఆవీర పూజలెరుగని జాతి నిష్పచ్ఛరమన్న యభి యుక్తోక్తులు సదా స్మరింప దగియున్నవి.

అట్టి వీరులగన్న ఆంధ్రమాతజన్మ ధన్యమైనది. విప్లవ నాటక సూత్రధారుడైన సీతారామరాజు పశ్చిమ గోదావరి జిల్లా మోగల్లు గ్రామములో 4-7-1897 సంవత్సరములో అల్లూరి వెంకటరామరాజు, నారాయణమ్మలకు జన్మించెను. చిన్ననాటనే తండ్రి గతించుటచే తన విజ్ఞాన జీవితనౌకకు చుక్కాని విరిగినట్లయ్యెను. దీనికితోడు దుర్భర దారిద్ర్యము గూడ సంప్రాప్తమయ్యెను అందుచే పినతండ్రియైన రామ కృష్ణంరాజుగారి సాయమున కొన్నాళ్ళు విశాఖ పట్టణంలోను, కొంతకాలము నరసాపురములోను కొన్నేండ్లు తునిలోను ఇతడు విద్యాభ్యాసము చేయవలసివచ్చెను. శ్రీరాజుగారికి ఇంగ్లీషు విద్యమీద అంత అభిలాష లేదు. చిన్ననాటినుండి భోగవిద్య కంటె యోగవిద్యమీద ఆసక్తిగల్గివుండెను. పాఠశాలలో నున్నపుడుకూడ భగవద్ధ్యానము ధర్మచింతలో కాలమును గడపెను దేశభక్తి వీరికి ఉగ్గుబాలతో వచ్చినది. ఆకారణముచే తానే విద్యకు స్వస్తి చెప్పి రానురాను నిస్సంగియై కాలినడకమీద ప్రపంచ యాత్ర చేయుటకు దొర కొనెను. ఈయాత్ర సందర్భములో ఇతనికి పృధ్వీసింగుతో నేస్త మేర్పడినది. ఆయూపుతో చిట్టగాంగు చేరుకొనెను.

కొన్నిరోజులకు స్వగ్రామముచేరి పూర్వపరిచితుడైన శ్రీయంతుతో స్నేహముజేసి అతని చెల్లెలైన సీతను గాఢ

ముగా ప్రేమించెను కాని దురదృష్టవశాత్తు ఆమె మరణించెను. ఇందుచేతనే యితని నామమునకు మొదట సీతనుజేర్చెను, గాన సీతారామరాజయ్యెను.

మంచి స్ఫురద్రూపి. మల్లెమొగ్గలవంటి పలువరున గలవాడు. మీసంకంటె గడ్డం ముందువచ్చిందట. ఇతనివద్ద మహానుభావుల లక్షణములున్నవి.

ఇతడు శాస్త్రములు, అద్వైతవాఙ్మయం, జ్యోతిష మును చదివెను. జ్యోతిషముపైని ఎక్కువ అభిమానంవుండెను. మంత్రశాస్త్రములోగూడ ప్రవేశముగలదు. వీరికి దేవతో పాసనకూడ యుండెడిదని ప్రతీతి గలదు. అది సిద్ధించక పూర్వమే పితూరీలో ప్రవేశించ వలసివచ్చిందట. ఆఉపాసనా మహిమచే భవిష్యత్తును సూచించెడివాడట.

ఒకనాడు తన అవ్వ చనిపోయెనని కృష్ణాదేవిపేటలోని ఒక మిత్రునితో చెప్పెనట దానినిజమును తెలుసుకొనుట కామిత్రుడు వుత్తరంవ్రాయగా సరిగా ఆ చెప్పిన కాలమునకే ఆమె మరణించెనట. ఇంకొకతూరి — తానున్నూ సైన్యాధి పతియైన మల్లుదొరయున్నూ, ఇద్దరుసైనికులతో కలసి అన్నవరము కొండనెక్కి దేవాలయములోకి పోబోతూ, కాకినాడనుండి లారీలలో పోలీసువారు వస్తున్నారు గనుక మనందిగిపోవచ్చునని మల్లుదొరతో యితడు చెప్పినసంగతి సత్యమేనని చెప్పుదురు. దానినిబట్టిచూడ ఇతడు గతానా గతవేదియని చెప్పడానికి సందియములేదు.

ఈకారణములవల్ల రాజు మహాత్ముడని కొండదొరలకు గాఢవిశ్వాసము కలదు. గాంధితత్వమునూ (టెర్రరిష్టుల) విప్లవకారుల పద్ధతిం యితడు బాగా జీర్ణము చేసుకొనెను.

వెనుక చెప్పిన సీతియనునాపె మరణమునకు కినిసి, ఆత్మశాంతికై అడవులకేగి పొన్నాళ్ళు సంబరపర్వతముపై తపస్సుచేసెను. కాని సిద్ధిపొందనికారణముచే పాపికొండలకు పయనమయ్యెను. ఈప్రాంతములో కాషాయాంబర ధారియై ఈబాలతపసి సంచరించేవాడు. ఈపర్యటనలో ఇతనికక్కడనున్న యాటవిక జాతులతో మైత్రికుదిరినది. వారి నికృష్టజీవిత మితని హృదయమును కలచివైచినది అందుచే వారి యోగక్షేమముల కితడు వాలివాడయ్యెను వారితనిని ఇలవేల్పుగా గొలుచుచుండిరి. పాపికొండలలోనివసిస్తే యితనికేమికీడు మూడునోయని వారితనిని కృష్ణదేవిపేట రామాలయంలో ప్రవేశపెట్టిరి. అచటరాజుగారి ధర్మోపదేశములను వినుచు మన్నెదొరలుగుంపులు గుంపులుగాజేరి పుత్తనిర్విశేషులై సపర్యలు చేయసాగిరి.

ఆరోజులలో మన్నెములకు రహదారీ సౌకర్యాలు కలిగించుటకు ప్రభుత్వమువారు రోడ్లు మొదలిడిరి. దాని నజమాయిషీచేయుటకు బాస్టియన్ అనువానిని తహసీల్దారుగా నియమించిరి. ఇతడు పరమకృపణుడు గాన కూలీలను వేధించి

ముప్పొద్దులు పనిచేయించి, చాలాతక్కువకూలి యిచ్చేవాడు. ఇదిగాక మురాజార్లను వశంజేసుకొని వారిద్వారా వీరిని రప్పించేవాడు. ఇతడుపెట్టే యీబాధలోర్వలేక ఆ కొండ దొరలు విప్లవం చేయుటకు సిద్ధపడిరి.

ఆరోజులలో అక్కడ 'గాంసోదర్లు' ని పిలువఁబడే మల్లుదొర, గంటము దొర అని యిద్దరన్నదమ్ములుండెడి వారు. వీరినికూడ వశం చేసుకుంటే తన ఆటలు బాగా సాగుతాయని, శాస్త్రియనే ఆలోచించి వారితో సంప్రదించగా, వీ రతనిని గేలిచేసిరి అంతట బాస్త్రికకు కోపం వచి వారి ఆస్తులను లాగుకొని, వారిమున్నబీ పొడబీకెను ఇంతలో రాజుగారి సంచారం. వీరియందు ప్రజలకు అభిమానం ఎక్కువగా ఏర్పడినది. అందులో గ్రామసోదర్లీతని కంరరక్షకులై నిల్చిరి. రాజు పల్లెలందు తిరిగి, పంచాయితీలు స్థాపించి ప్రజలలో త్రాగుడు మాన్పి, ఆప్రజాసమూహాన్ని ఏకముఖానికి తెచ్చెను.

రాజు ప్రజలని ప్రేరేపించి ప్రభుత్వం సాగనియ్యడం లేదని వెంటనే తాహసిల్దార్ గవర్నమెంటుకి అర్జీపంపెను. రాజప్పుడు రామాలయంలో వున్నాడని సర్కార్ నౌఖరులకు తెలిసి అతనిని మదలించుటకిచ్చుటకు పోయిరి. పైడి పుట్టువద్ద ౩౦ ఎకరాలపొలం ఇస్తామని అతనిని భ్రమ

పెట్టిరి కాని ఈ ధీరచిత్తుడు వారిమాయలకు లొంగలేదు. తాసిల్దార్ మరంతాలకు ఓర్వలేక కొండవారలు సమ్మె కట్టిరి. విప్లవం చేకొత్తిడి బాస్టియన్ దౌర్జన్యము నరికట్టుటకు గాజు 22-9-1922 సం॥ రంలో చింతపల్లి పోలీస్ స్టేషన్ మీదికి దాడివెడలెను వెంటనే అచ్చట ఖైదీలను విడిపించి ఆయుధ సామగ్రిని వశపర్చుకొనిరి. పిమ్మట కృష్ణదేవి పేట స్టేషన్, రాజవొమ్మంగి స్టేషన్ కూడా కొల్లగొట్టెను. అచటి అధికారు లితని కాళ్లపై బడి ప్రాణములను దక్కించుకొని ఎటులకైకి పోయినా గాంసోదర్లు యితనికెలుండగా నుండెవారు.

ఈవిషయము గూర్చి పోలీసులు పై అధికార్లకు తంతి వార్తను పంపిరి వెంటనే సూపరింటెండెంటు, డిప్యూటి కలెక్టర్ ఏజన్సీ కమిషనర్ వచ్చి రాజును బంధీజేసి నర్సీపట్నంలో ఎర్పంధించిరి. రాజును పట్టుకొనుటకు (Tieman Inui) ట్రెమన్ కూకోరు నాయకత్వం క్రింద పోలీసులు బయలుదేరి విఫలులైరి. పిదప సాండర్సు, టాలర్డు అను యిద్దరి రాంగ్లి సేనానులు బయలుదేరిరిగాని వారిద్దరు రాజుమురాచే జంపబడిరి. ఈసందర్భములో రాజుమురా జరిపిన గొరిల్లా యుద్ధపద్ధతు లద్భుతావహమైనవి రాజు సంపెడి ఋరపకాయు టపాను చూచి బ్రిటిష్ సైన్యము బెదిరిపోయినవి. అందులో అడ్డ తీగెల ముట్టడి ప్రఖ్యాతమైనది. పేరుచెప్పి ప్రతిస్టేషన్ కొల్ల

గొట్టెను రామరాజుగారు  కాని బ్రిటిష్‌వారి నెవరినీ అక్ర
మక్రమంగా చంపలేదు

రాజుగారిని పట్టిస్తే గొప్పబహుమాన మిస్తామని ప్రక
టించారుగాని, ఎవరికినీ పట్టియిచ్చుటకు సాధ్యం కాలేదు.

చివరకు రాజుగారి యనుచరులలో వకనైన అగ్గిరాజు
మూలమున వారిలో వారికి అంతర్విరోధములు ప్రాప్తించెను.

రాజును పట్టియివ్వమని మన్నెప్రజలను కడుహింసిం
చుటచేత, రాజు తనంతటతానె దొరికిపోవుట కుద్యుక్తుడయ్యెన.
ఇదెంతమాత్రం కొండదొరల కిష్టములేదు. ఈసమయము
లోనే అచ్చటికి పృధ్వీసింగు వచ్చినట్లొక వదంతి కలదు.
రాజున్ను సింగున్ను వకనిర్ణయామునకు వచ్చిరట

ఈమన్నె విప్లవము నడంచుటకు (Rutherford)
రూధర్‌ఫర్డు దొరని కలెక్టర్‌గా నియమించిరి. అతిడు చండ
శాసనుడు. ఇతని ఆధ్వర్యమున పోలీసు మరొకమిడతలదండు
లాగ అరణ్యంమీద కెగబడ్డది ఈదండు సూచికాభేద్య
ముగా గన్పట్టెను. అనుకొన్న ప్రకారం రాజుగారి అనుచ
ర్లొక్కరొక్కరే పట్టుబడిరి.

ప్రప్రథమమున మల్లుదొర ఒకసానిదాని మూలమున
బయటపడెను. అతనిని కఠిన నిర్బంధ చర్యలచే జీవచ్ఛవ

మునుజేసి దుమ్ములు విరుగగొట్టిరి. తరువాత అగ్గిరాజు పట్టుబడెను. మిగిలినవారు రాజు, గంటందొర, వీరిలో రామరాజును బోలిన బాలయోగి యొకడు రేవులోస్నానం జేయుచు, ఏటిదగ్గరకు వచ్చిన మున్సబు కొడుకుని పాలు దెమ్మని కోరగా, ఆతనియందున్న భక్తిచే బాలుడూరిలోనికి పరుగెత్తి పోవుచుండెను. ఈ బాలుని పోలీసులు పట్టుకొని నిజము దెల్సుకొని ఏటివద్దకువచ్చి, రాజుని ప్రశ్నించి, అతడే తాము కోరినవాడని వెంటనే పెడరెక్కలు విరిచికట్టి రొమ్మునై పిస్తోలుతో పేల్చి చంపివేసిరని పూర్వప్రతీతి.

## మరియొక నవీన ప్రతీతి.

శ్రీ రాజుగారే కొండగ్రామాలపై బ్రిటిషు సైనికులు సాగించిన అతిఘోర నీచాతినీచ దారుణాలు సహింపజాలక హృదయంకరిగి స్వయముగా కృష్ణదేవిపేటవచ్చి పట్టుపడెననియు, దానిపైన కమాండరు "రాజుగారూ! మిమ్ములను విచారణకుం పెట్టిన ఏమిచెప్పెదరూ?" అని పశ్నింపగా "మీలో అనేకమంది కొండలలోని అధికారులు మొదట్లోచూపిన లాలోచి పద్ధతి, కొండజాతి ప్రజలపట్ల గావించిన అధర్మాలు, దారుణాలు బైటపెట్టకుండా నేనుచావను" అని సమాధానమిచ్చెననియు, అందుపైన కమాండరు, ఉద్యోగులు సమాలోచన చేసికొని ఇతనికి విచారణావకాశం ఇచ్చిన ముమ్మతము కొంప ములుగాలునను భయముతో ఆయనను చెట్టునకు (ది 12-5-24)

కట్టికాల్చి వేసి రాజుగారు పారిపోవుచుండగా  ఫైరుచేయవలసి వచ్చినదని ప్రకటించిరనియు మరియొకకథ  వీరి విపులచరిత్ర వేరే ప్రత్యేకగ్రంధాక్రింద త్వరలో వెలువడును

శ్రీరాజుగారి తల్లిగారును వారి సోదరులును ఈఖాందిర సభ్యులునుఅగు శ్రీఅల్లూరి సత్యనారాయణరాజుగారు కూడా వీరు వీరస్వర్గమును అలంకరించిరన్లే నమ్ముచున్నారు.

రాజుగారి అంగరక్షకులలో గంటందొర 6-6-1934సం॥ రంలో ముద్ద మొనర్చి సానుచరుగ వీరస్వర్గ మలంకరించెను.

మల్లుదొర మాత్రం తన మేనల్లుడి కపటపు వర్తనచే బట్టుబడి దొరతనం వారిచే ద్వీపాంతర శిక్ష ననుభవించెను

1937 సం॥రంలో కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చినతర్వాత పదమూడు సంవత్సరాల అనంతరం ఇతడు విడుదల చేయ బడెను. నేడు భారత పార్లమెంటు సభ్యుడు.

శ్రీ రాజుగారివంటి వీరశిఖామణుల చరిత్రం పవిత్ర మైనది. ఆయన ఆంధ్రుడు కావడం మనము గర్వించదగినది.

ఇతని దివ్యచరిత్ర సువర్ణాక్షరములతో భారతదేశ చరిత్రలో లిఖింపబడును గాక! ఇతని నామస్మరణ ఆంధ్ర యువకులకు తారక మగుగాక! వీరుల జన్మలు ఏరుల జన్మలు ధన్యత గాము లంటారు గాంధీజీ కూడ ఈ ఆంధ్రవీరుని — సాధ

నతో భేదించినా — ఉగ్గడించుచు "శ్రీ రామరాజువంటి విరులు అనేకమంది భరతదేశంలో పుట్టాలి" అన్నారు. భారత స్వాతంత్ర్య విప్లవవీరులైన శ్రీ శివాజీ — రాణాప్రతాప్ మహాశయుల నామములు మన హృదయ సీమలలో నెంత వరకు ప్రతిబింబించునో అంతదాక శ్రీ రాజుగారి నామము కూడ ప్రతిఫలింపక తీరదు

ఆంధ్ర శ్రామిక ధర్మరాజ్య సభవారు విశాఖజిల్లా లోని పై కృష్ణదేవిపేటలో వీరి, గంటందొరగారి దేహదహన పవిత్రక్షేత్రమున సం॥ 1950 రంలో వేదికను శిలాశాసనమును నిర్మించి కృతార్థులైరి. ఇచట శ్రీ రామరాజు శ్రామిక కేంద్రం అని ఒకటి స్థాపించబడినది ఒక ఆరామము నిర్దిష్టమైన కొండజాతి సేవాకార్యక్రమము శ్రీ రాజుగారి పేరిట ఇచ్చట వర్ధిల్లాలని వీరి ఆశయం.

ఈ సభపక్షమున కార్యదర్శిగారు అప్పటి కాంగ్రెసు అధ్యక్షులు పట్టాభి సీతారామయ్యగారి సిఫార్సు ఉత్తరముతో 11-4-50 తేదీని అప్పటి ప్రధానమంత్రిప్పి శర్మగారి కడ లూరు జైలు మిత్రుడు శ్రీ కుమారస్వామి రాజాగారిని ఈ ఆంధ్రవీరుని కుటుంబమునకు ఆర్థిక సహాయమునకై కోరిరి, సదరు కోరిక కొంతకాలము త్రొక్కిపెట్టి ఈ ప్రధానిగారు చివరకు నిరాకరణోత్తరము పంపించడము మిత్రులు శ్రీ దిగు

మర్తి రామస్వామి ఎం. ఎల్. ఎ గారు ఇందును గూర్చి శాసనసభలో ప్రశ్నించగా ఇది వ్యక్తిగతవిషయమని తెలుపుటయు కూడా చరిత్రాంశములుగా చేర్చతగినవి.

## జాతీయపతాక వీర బత్తిన మొగలయ్యగారు

### ఓరుగల్లు

( జ. 1913 — ని 11-8-46 )

1913 సం॥ రంలో వరంగలుకోటలో గౌడకులమందితడు జన్మించెను. ప్రాథమికవిద్యనుమాత్రం బడసెను. సహృదయుడు, జాతీయాభిమాని, కాంగ్రెస్ వాలంటీరుగా పనిచేసెను.

1944 సం॥రంలో నిజాంరాష్ట్ర సారస్వతపరిషత్ మహాసభ ఓరుగల్లుకోటలో శంభుని దేవాలయముముందు జరుగుచుండగా, కొంతమంది రౌడీలువచ్చి అల్లరిచేయగా వాళ్ళనెదుర్కొని ఏకాకిగాపోరాడెను. ఆపోరాటములో ఇతని కాలు విరిగెను అయినప్పటికీ కాంగ్రెసు ఉద్యమాన్ని అతిపట్టుదలతోను ఉత్సాహముతోను గ్రామపర్యటనంచేసి తీవ్రప్రచారం జేశాడు.

11 ఆగష్టు 1946 సం॥రం తేదీని అఖిలభారత పాకిస్థాన్ దినముగా పరిగణించవలసినదని లీగునాయకులు ప్రకటించారు. ఆనాడు చేయవలసిన కార్యక్రమాన్ని వివరిస్తూ రహస్యంగా ఆజ్ఞలుఇదివరకే ఇవ్వబడ్డాయి. హైదరాబాదు లీగుఅయిన అంజుమను ఇత్తెహాదుల్ ముసల్మీనువారు ఈఆజ్ఞపై అందరికంటె అతిభక్తిగా ఆనాడు దారుణ హింసాకాండను నైజాంలో జరిగించారు దానికిగురియై విరక్త్యంతో స్వర్గమలంకరించిన వీరుడు బత్తిని మొగులయ్యగారు. ఈయన ఒకనాడు ప్రతాప రుద్ర చక్రవర్తి, వీరవనితరుద్రమదేవిచే సుభిక్షమైన పరిపాలన చేయబడి అనేకమైన శిల్పములను, కళలనుపోషించి ప్రసిద్ధ అలంకారశాస్త్ర పండితులైన విద్యానాథులవంటి వారికి స్థానమై ఆంధ్రకీర్తిని ఖండ ఖండాంతరములకు వ్యాపింప జేసిన వరంగల్ కోటపైన జాతీయపతాకం ఎగురవేసి నిండుజాతీయాభిమానంతో దానిని రక్షిస్తూన్నారు. లీగు ఆజ్ఞకు నాలుగురోజులు పూర్వమే ఆగష్టు 11 తేదినాడే వరంగల్ కోటలో వందలకొలది రజాకరుదుండగీండ్లు ఆయుధాలు ధరించి కోటఆవరణలోకి విజృంభించారు అహింసావీరుడు మొగులయ్య చలించలేదు. జాతీయపతాకమును ఎగురవేసిన ధీరుడు తానేనని సగర్వముగా నిలబడ్డాడు ఒక్కొక్క అవయవమే ఖండించారు ఇదంతా తల్లిసమక్షమున, కాని మొగులయ్య చలించలేదు. చివరకు శరీరమంతయు ఖండించారు. ఈదుండగీడుల నాయకుడైన ఖాసింషరీఫ్ పుష్పమాలాలం

కృతుడై పిమ్మటడా రేగాడు. మా యెదుట శ్రీ మొగులయ్య తల్లి గతిసాలునమేము ఈక్షేత్రం దర్శించినపుడు ఈవివరములు తెలుపుతూంటె ఉత్తరరామచరిత్రలోని 'అపిగ్రావారోదిత్యపిదళతి వజ్రస్యహృదయం' అని మహాకవిభవభూతి కరుణారసానికి గల సత్తాని గూర్చి తెలిపిన వాక్యాలు నిజమనిపించింది. బత్తిన మొగులయ్య అమరజీవి అతని ఆత్మ నిజాంరాష్ట్రములోని ప్రజాహృదయాలమీద గాఢంగా హత్తుకొనివుంది ఈరాష్ట్రపు రాజకీయోద్యమ చరిత్రలో గాయపడిన వికలాంగులైన వారి చరిత్రలో మొగులయ్య చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖింపబడి యుంటుంది. వీరి సంస్మరణము అఖిల ఆంధ్రదేశానికి పరమ పవిత్రధర్మము

## ఆంధ్రరాష్ట్ర వీర పొట్టి శ్రీరాములు గారు

( 1-7-1901 15-12-52 )

ఈయన 1-7-1901 తేదీని మదరాసు నగరమందు సుప్రసిద్ధ వైశ్యవంశమున జన్మించిరి.

శానిటరీ ఇంజనీరింగు కోర్సునందుత్తీర్ణుడై బొంబాయి లో G I P రైల్వేలో ఇంజనీరింగు ఉద్యోగము చేయు

ఆంధ్రులు కలిసి రాజీనామాకు వస్తేనేగాని తాము ఏమి చేయజాలమనే మాటనే పదేపదే చెప్పుచుండిరి. ఈలాంటి పూర్వ బ్రిటీషుభక్తి ప్రకటనల కాంధ్రం నివ్వెరపోయి చూస్తూంగ ఈస్థితిలో ఈఆత్మ బలిదానవీరుడు రంగంలోకి ఉరికాడు. ముక్కోటి ఆంధ్రలోకమే కాకుండ అఖలభారత దృష్టి వెంటనే మదరాసు వెంకటరంగం మొదలి వీధిలో ఈ అంపశయ్యవైపు వాలింది ఈప్రాయోపవేశానికి కొన్ని మాసాలకుపూర్వం మిత్రులు శ్రీరాములుగారు గాంధీస్మారకనిధి సంచాలకులుగా ఈ మందిరానికిన్ని ఇందలి కొండజాతి కార్యక్రమం పర్యవేక్షణకుగాను విశాఖజిల్లా మాడుగుల కొండలలో జరుగుచున్న నూలు వడుకు వయోజన విద్యా కార్యరంగంకుకూడా విచ్చేసిరి. కొండజాతికార్య క్రమ సంబంధంలో వచ్చిన ఈయన జీవితానికి ఇంత త్వరలో ఈమందిర వీరుల చరిత్ర రచనతో ప్రసక్తివచ్చునని ఆరోజున ఎవరు అనుకోగలరు? పైగా ఆకొండలలోని ఈయన పర్య వేక్షణకూడా మా ంజాతి ప్రచారకులకు వింతగా కనబడింది. ఇట్టివ్యక్తిలోనుంచి అట్టిమహా ఆత్మార్పణ జ్వాలపుట్టడం పైన తెలిపిన తేలిక పరిచయ దృష్టిలో కొంత ఆశ్చర్యం కలుగ జేసినా, సిద్ధిని పొంది నింగికి దృష్టినాటించిన ఆంధ్ర గడ్డ తపము నుండి రావలసిన ప్రతిక్రియా దృష్టిలోను, ఈగడ్డలో 'వీర ప్రసవత' కింకను కొరతలేదను నిరూపణకునూ, సర్వోదయ బీజములకు ఒకప్పుడు సంశయాత్మతలేని భక్తిక్షేత్రమే యుక్త

మను ప్రతిపాదనకున్ను, శ్రీరామరూపంగా ఈదయావీరత్వా యజ్ఞం ప్రభవిల్లి వర్ధిల్లి సార్థకమగుట యుక్తమే— ఈ ప్రాయోపవేశపు రోజుల్లో విశేషమేమనగా ఎంతమంది మిత్రులు శ్రీ రాములుగారి దగ్గరకువచ్చి ఆయనను కోరినను అచంచలుడగుటయేగాక తాను స్పృహతప్పే స్థితిలోనికి వచ్చినప్పుడు కూడా ఒకమూల తన కెట్టిఔషధములు ప్రయోగించకూడదనియు మరియొకమూల దేశము ఎట్టిఅశాంతిలోకి దిగకూడదని ఇచ్చిన సందేశమే సకాలంలో నెహ్రూ పండితుడు ఆంధ్ర రాష్ట్ర ప్రకటనచేసి శ్రీరాములు ప్రాణరక్షణ చేయుటకవకాశంలేదా అను ప్రశ్నకు నెహ్రూపండితుని అంతరాత్మయే సమాధాన మివ్వాలిగాని మరి ఎవరితరము ? శ్రీరాములుగారు పొడుగుగీత మార్గముననే పోయిరి. అయితే అంతకు పూర్వపు ప్రాయోపవేశము వలెనే ఇదియు విరమింపబడునను ఆశయేమి, ఇటీవలి ఆంధ్రజీవిత సంకలత్వాన్ని బట్టియేమి, ఢిల్లీనాయక వర్గాన్ని ఆంధ్రగడ్డయొక్క సత్తా స్థితిగతుల సరియైన మదింపు వేయనివ్వినది కాదేమో !

ఏదైతేనేమి 19-10-52 తేదీని ఈయన ప్రారంభించిన ప్రాయోపవేశం 15-12-52 తేదీ రాత్రి 11 గంటల 20 నిముషములవరకు 58 రోజులు సాగించి యజ్ఞబలి అయిన పిమ్మట ఆంధ్రప్రజానీకంలో మహా సంక్షోభం బయలుదేర తప్పిస్తూ ఉంటే చకితుడై నెహ్రూపండితుడు రాష్ట్రస్థాపన ప్రకటనచే

కాడంటే — ఈ ఉద్యమంలో ఇంతకు పూర్వపు సభలు నాయభాగాలు ఉద్యమాలు ఒక ఎత్తైతేగాయి. శ్రీ రాములు బలిదానం దీనికి మించిన ఎత్తుతో తూగిందనుట నిశ్చయం. ఆంధ్రగడ్డ ఆరోజున శౌర్యవీరుడైన ఖడ్గతిక్కనను ఏలా కన గలిగిందో, నేగు దయావీరుడైన శ్రీరాములున్ని అలాగే కన్నదైనది.

ఇందులో అనేక ప్రశ్నలు వస్తూన్నాయి. శ్రీరాములు సంకల్పప్రకారం ఆంధ్రరాష్ట్రసిద్ధి అయినట్టా? అయితే ఆయన మదరాసు నగరమునందే బలిదానమునుటలో సంకల్పము, సంబు ఏమి? ఒక రోజున కేవల ఆంధ్రప్రదేశమై, నేడు ఆంధ్ర అరవ ప్రజలందరుల కృషివల్ల ఈ అభివృద్ధికి వచ్చిన మదరాసు నగరమును విచారణయినా లేకుండా, పోనీ సమిష్టి రాజ ధానిగా గాని చివరకు తాత్కాలికి రాజధానిగా గాని ఉంచి అందువల్ల నేడు అన్నివిధాలా ఆర్థికదుస్థితిలోఉన్న యీ ఆంధ్రానికే గాక అరవసోదరులకు కూడా సౌకర్యం ఉండు టను గమనించక — ఉద్యోగస్థుల విభాగాలతో గూడా ఈ కర్నూలులో గుడారాల జీవితంక్రింద రాజధాని ఏలా అంగీకరించారు? అలాగే బళ్లారి పట్టణంలోటు, ఇంకా అనేక లోట్లతో కూడిన ఈ ఆంధ్రరాష్ట్రం సకలాంగమా? వికలాంగమా? ఇది అంతా విధిలేక ఈ రాష్ట్ర విభజనకు పూను కున్న ఢిల్లీనాయకత్వంవారి కృతమా? లేక తెరవెనక ఎవరు

ఈ గ్రంథాన్ని నడిపిస్తూన్నారు? అనే ప్రశ్నలకు కాలము, పరిస్థితులు, ఢిల్లీ నాయకవర్గం, అరవనాయకులేగాక నేటి ఆంధ్ర, నాయకత్వం కూడా సమాధాన మివ్వవలసిన రోజులు ఉండును.

ఇట్టి లోట్లతోకూడిన రాష్ట్రం సంగ్రహనే అంగీకరించి శ్రీరాములు ప్రాణనష్టము తరువాత సంక్షోభమును ఆంధ్ర నాయకులు కాపాడిన ఉండదా? అని ఇంకో ప్రశ్నవస్తోంది క్రియలో కొంతవరకు ఆప్పటిస్థితికి ఇప్పటిస్థితికి తేడాతక్కువే. కాని నెహ్రూపండితులు విధించిన తమిళ ఆంధ్ర అంగీకారంపై రాష్ట్రస్థాపన ఇప్పటో అసంభవం పైగా మదరాసు ఖ్యాతి మినహాయింపులుసహా ఇప్పటి ఢిల్లీప్రభుత్వ ప్రకటనలోని లోట్లు ఆంధ్రుల అంగీకారముద్రతోవచ్చినవిగాక కేవలంవారి స్వయంముద్ర జారీచేయబడిన ఆంధ్రరాష్ట్ర ప్రకటనలోనివి. అందుచేత ఈలోట్లనుగూర్చి నైతికంగను న్యాయయుక్తము గను కృషిసల్పుటకు ఆంధ్రులహక్కుకు నేడు ఇందువల్ల భంగం కలుగదు ఇదియే శ్రీరాములుబలిదానంవల్ల ఆంధ్రులకు నేడు మిగిలిన వాస్తవికంలోని సంగతి.

---

# విషయసూచిక

గంజాం

| జననం మరణం | కార్యరంగం | పుటలు |
|---|---|---|
| జ 10—4—1869 | బరంపురం | 1—5 |
| 1889—1944 | బరంపురం | 5—11 |
| 1902—1935 | బరంపురం | 12—13 |
| 1836—1942 | బరంపురం | 14 |
| 1905—1942 | గంజాం | 15—16 |
| 1892—1942 | కొంకణాపుట్టు | 17—19 |
| | | |
| 27-12-1903 – 16-6-40 | ఇచ్ఛాపురం | 20—29 |
| 1893 – 18-12-52 | | 29—31 |
| మ 1940 | మందసా | 31—34 |
| 1908—1931 | పలాసా | 34—36 |
| 1901—1943 | మామిడిపల్లి | 36—37 |
| 1895—1939 | శ్రీకాకుళం | 38—39 |
| 1901—8-8-41 | లోహారుజోల | 40—41 |
| | | |
| 1896—19-7-37 | విజయనగరం | 42—43 |
| 1898—1934 | విజయనగరం | 44—45 |
| 1878—1935 | విజయనగరం | 45—48 |
| 1889—1-9-1945 | విజయనగరం | 49—50 |

౧౮. కరుణాకరం సుబ్బారావుగారు

౧౯ వసన్తరావు బుచ్చిసుందరరావుగారు

౨౦. కొల్లూరు సూర్యనారాయణ గుప్తగారు

౨౧ భమిడిపాటి చినయజ్ఞనారాయణ శర్మగారు

౨౨. శ్రీమతి మూలా వెంకమాంబగారు

౨౩. శ్రీమతి శిష్టా లింగమ్మగారు

౨౪. కపిలవాయి వీరభద్రుడుగారు

తూర్పుగోదావరి జిల్లా

౨౫. కందుల వీరరాఘవస్వామి

౨౬. డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారు

౨౭. దేశసేవిక, వేదాంతం కమలాదేవి

౨౮. బారు రాజారావుగారు

౨౯. నడింపల్లి సుబ్బరాజుగారు ఎం. ఎల్. సి.

౩౦. సామవేదం అచ్యుతరామయ్యగారు

౩౧. నాళం చినభీమరాజుగారు

౩౨. గ్రంధి నరసింహంగారు

౩౩. రామినీడి రంగనాయకులుగారు

౩౪. సబ్బారపు అప్పలస్వామిగారు

౩౫. గాడిచెర్ల రామమూర్తిగారు

౩౬. వడ్లమూడి బుల్లిసుబ్బరాజుగారు

౩౭ గుత్తి సుబ్బరాజుగారు

౩౮. ధరణీప్రగడ శేషగిరిరావుగారు

౩౯. మాచిరాజు శ్రీరామచంద్రమూర్తిగారు (బండరాముడు

౪౦. శ్రీమతి శివరాజు వెంకటసుబ్బమ్మ

౪౧. దయానిధి పాలకోడేటి శ్యామలాంబగారు

౪౨ మల్లిడి సత్యనారాయణ రెడ్డిగారు

౪౩. మామిడి లక్ష్మీపతిగారు

౪౪. పెన్మెత్స సూర్యనారాయణరాజుగారు

౪౫ శ్రీమతి మద్దూరి వెంకటరమణమ్మ

౪౬ సుసర్ల శ్రీరామనరసింహంగారు

౪౭ ఉక్కోల్లు ప్రకాశంగారు

౪౮ కుందపాక రంగయ్యనాయుగారు

౪౯ నభ్నపీస్ కృష్ణారావుగారు

౫౦. కోడేటి రంగాచార్యులుగారు

౫౧ పప్పు అప్పయ్యదాసుగారు

౫౨ దేవులపల్లి సూర్యనారాయణమూర్తిగారు

పశ్చిమగోదావరి జిల్లా

౫౩. గజవిల్లి రామచంద్రరావుగారు

౫౪. సర్దార్ దండు నారాయణరాజుగారు

౫౫ వేలూరి సత్యనారాయణగారు

౫౬. మంగిపూడి పురుషోత్తమశర్మ

౫౭. పిరాల వీరభద్రరావు

౫౮. జనాబ్ డాక్టర్ నసీరహమ్మద్

౫౯ తూము రామారావుగారు

౬౦ సూరికుచ్చి సూర్యనారాయణగారు

| | | |
|---|---|---|
| — | రాజమండ్రి | 114—116 |
| 1857—20-8-1931 | రాజమండ్రి | 116 |
| 12-6-1902-18-6-53 | రాజమండ్రి | 117—118 |
| మ. 1944— | కత్తుకులూరు | 118—119 |
| — | రాజమండ్రి | 120 |
| 3-3-1906-6-3-44 | ర్యాలి | 121 |
| 3-౨-1906-6-12-43 | రాజమండ్రి | 122 |
| -జూత్రె 1899—1-1-46 | ర్యాలి | 123—124 |
| 1893—1943 | భట్నవిల్లి | 124—126 |
| 1886—1941 | కాకినాడ | 126—127 |
| — | పోణంగిపల్లి | 127—128 |
| — | తుని | 128 |
| 1887-ప్రాంతం-1952 సెప్టెంబరు | కాకినాడ | 129—130 |
| 1892—6-5-1938 | — | 130 132 |
| — | ఏలూరు | 133—134 |
| 15-10-1889-1944 | ఏలూరు | 134—135 |
| 1898—1943 | భీమవరం | 136—138 |
| 1897—16-2-1949 | పిప్పర | 139—143 |
| 1895—1939 | తాడేపల్లిగూడెం | 144—146 |
| 27-4-1878—1937 | తాడెపల్లిగూడెం | 146—150 |
| — | పోలవరం | 151—152 |
| — | నిడదవోలు | 152—153 |

౬౧. ఈడూరి సత్యన్నారాయణగారు

౬౨. మానప్రగడ సుందరమ్మగారు

౬౩. భూపతిరాజు సోమరాజుగారు

౬౪. సామవేదం సత్యనారాయణగారు

౬౫. గొట్టుముక్కల బలరామరాజుగారు

౬౬. వేగేసిన నారాయణరాజుగారు

౬౭. ఉద్దండి శ్రీరాములుగారు

౬౮. ఇందుకూరి సుబ్బరాజుగారు

౬౯. సూరంపూడి మహాలక్ష్మమ్మగారు

౭౦. చోడే రామలింగయ్య చౌదరిగారు

౭౧. భాస్కర్ల ఈశ్వరదత్తుడుగారు

౭౨. చెంగల్వ చిట్టుపంతులుగారు

౭౩. హనుమంతవఝుల జోగయ్యశర్మగారు

౭౪. వడ్లమాని లక్ష్మీనరసింహంగారు

౭౫. 'కులపతి' అడవి బాపిరాజుగారు

౭౬. దోనేపూడి లక్ష్మయ్యగారు

౭౭. నెక్కలపు వీరయ్యగారు

౭౮. కొమ్మారెడ్డి సత్యనారాయణగారు

### కృష్ణా జిల్లా

౭౯. చొప్పన మాణిక్యాంబగారు

౮౦ రామిరెడ్డి సుబ్బారెడ్డిగారు

౮౧. పీసపాటి వెంకటసుబ్బారావుగారు

౮౨. రాయప్రోలు శీతారామరాజుగారు

౮౩. వెలిదండ్ల హనుమంతరావుగారు L M S.

## గుంటూరు జిల్లా

౮౪. గార్లపాటి శివసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

౮౫. భీమవరపు లక్ష్మణరావుగారు

౮౬. గార్లపాటి హనుమంతరావుగారు

౮౭. కాశిరాజు అశ్వత్థనారాయణగారు

౮౮. నల్లగొంత జానకిరామయ్యగారు

౮౯. పెరుమాళ్ళ శాయన్నశ్రేష్టిగారు

౯౦. తిరుణగారి వెంకటనరసనూరిగారు

౯౧. బిట్రగుంట వెంకన్నగారు

౯౨ మన్నె నాగయ్యగారు

౯౩. మందపాటి పూర్ణచంద్ర రావుగారు

౯౪. అక్కల పాపిరెడ్డిగారు

౯౫. పెండ్యాల నరశింహారావుగారు

౬౬ మట్టి వెంకటప్పారెడ్డిగారు

౬౭. మాటూరి శివసత్యనారాయణగారు

౬౮. అనఘ సుందరరావుగారు

౯౯ వైశ్యరత్న శింగపల్లి రామస్వామిగుప్తగారు

౧౦౦. వేములపల్లి రామకోటయ్యగారు

౧౦౧. పుట్టగుంట నరసింహయ్యచౌదరిగారు

౧౦౨ పుట్టగుంట రాఘవయ్య చౌదరిగారు

౧౦౩. చిమట మట్టయ్యగారు

౧౦౪. పుణ్యాల వేరయ్యగారు

౧౦౫. యనమ్మదల అప్పయ్యగారు

౧౦౬ యార్లగడ్డ రామకృష్ణ చౌదరిగారు

౧౦౭ మద్ది రాధాకృష్ణయ్యగారు

౧౦౮. డాక్టరు చంద్రమౌళి రామారావుగారుL M P బాపట్ల

౧౦౯ చల్లపల్లి లక్ష్మీనారాయణగారు

౧౧౦. లంక ఆంజనేయులుగారు

౧౧౧. అన్నంరాజు వెంకట్రావుగారు

౧౧౨. కొత్తా చలపతిగారు

౧౧౩. గొంది బాలయ్యగారు

౧౧౪. రామస్వామిగారు

౧౧౫. పాలంకిపాటి పద్మనాభరావుగారు

౧౧౬. కలిదిండి సీతమ్మగారు

౧౧౭. మాచిరాజు రామమూర్తిగారు

౧౧౮. కుప్పా గోపాలశాస్త్రిగారు

౧౧౯. రామినేని అప్పయ్యగారు

౧౨౦. గంధం నాగేశ్వరరావుగారు

౧౨౧ ఆకుమండ్ల ఉషాదేవిగారు

౧౨౨ ఉబ్బరాజు జానకిరామయ్యగారు

౧౨౩. కడిమూల ఏనాదయ్యగారు

౧౨౪. తూములూరి వెంకటసుబ్బారావుగారు

౧౨౫. కొమ్మూరి రామలింగంగారు

౧౨౬ పిన్నమనేని కనకయ్యగారు.

౧౨౭ గోళ్ళమూడి వెంకటప్పయ్యగారు

౧౨౮. షేకు చంగీషాగారు

౧౨౯. మర్లపాటి అయ్యవారప్పగారు

౧౩౦ గుత్తా సుందరమ్మగారు

౧౩౧. తుమ్మల తులశమ్మగారు

నెల్లూరు జిల్లా

౧౩౨. ఓరుగంటి మహాలక్ష్మమ్మగారు

కడప జిల్లా

౧౩౩. బాణా కంబగిరి రెడ్డిగారు

౧౩౪. ఆరవేటు సుబ్బరాయుడుగారు

౧౩౫. రేకూరు సుబ్బారావుగారు

తెలంగాణా

౧౩౬ కేలుకాని వెంకట నారాయణగారు

౧౩౭. కొల్లూరు బాలకృష్ణయ్యగారు

౧౩౮. ఒసిరెడ్డి నరసయ్యగారు

౧౩౯ కెనికుంట రామిరెడ్డిగారు

౧౪౦. పడమటి కృష్ణమ్మ గారు కొడుకు మాలకనకయ్యగారు

౧౪౧. —లక్ష్మణదేవుగారు

౧౪౨. మద్ది జనార్ధనంగారు

౧౪౩. పుల్ల రాఘవరావుగారు

౧౪౪. వాసిరెడ్డి సత్యనారాయణగారు

౧౪౫ కె రజితంగారు

౧౪౬. యాబా రామయ్యగారు

| | | |
|---|---|---|
| — | అమ్మనబ్రోలు | 242—243 |
| 1887—1942 | మర్లపాడు | 243 |
| 1904—1937 | గుత్తావారిపాలెం | 244 |
| జ 1912 | కావూరు | 244—245 |
| — | నెల్లూరు | 246—248 |
| 1852—194- జ | [illegible]తా॥ సాతవారిఉప్పలపాడు | 249 |
| 1907—1942 | ముద్దనూరు | 249—250 |
| — | సున్నపురాళ్లపల్లి | 250 |
| 1918—1947 | సిరికొండ | 251—252 |
| 1914—27-11-47 | ఇప్పగూడెం | 252—253 |
| 1919—27-11-1948 | సముద్రాల , జనగాం | 253—254 |
| — | రేనికుంట | 254—255 |
| 1885—1946 | — | 255—256 |
| 1920—1945 | కరీంబాగా వరంగల్ జిల్లా | 256—257 |
| 1918—4-1-44 | వరంగల్ | 257—258 |
| 1889—5-8-48 | గార్ల (జాగీరుదారు, సత్యనారాయణపురం (మానుకోట తా॥) | 258—259 |
| 1904—18-8-48 | పొగుళ్ళ(హుజూర్ నగర్ తా॥ | 259—260 |
| 1905—4-2-1949 | నెక్కొండ వరంగల్ తా॥ | 260—261 |
| 1882—9-7-47 | అన్నారుగూడెంమధిర తా॥ | 261 |

౧౪౭. డి. కృష్ణయ్యగారు

౧౪౮. షేకు బాలాసాహేబుగారు

౧౪౯. సారె రాములుగారు

౧౫౦ పుట్లోజు బాపిరాజుగారు

౧౫౧. నెమిలికొండ నరసింహారెడ్డిగారు

౧౫౨. గెంటాల సీతారామారావుగారు

౧౫౩. పాకనాటి ప్రతాపరెడ్డిగారు

౧౫౪. బత్తైన ముత్యాలింగంగారు

౧౫౫. కోనాయిగూడెం దాడి

౧౫౬. కోణతాపల్లి దాడి

౧౫౭. ముద్దనూరు దాడి

౧౫౮. కోటకొండ దాడి

౧౫౯. గారంపల్లి దాడి

౧౬౦. మరిపెద్దగ్రామం దాడి

౧౬౧. దేవత శ్రీరామమూర్తిగారు

౧౬౨. తల్లాప్రగడ సూర్యనారాయణరావు పంతులుగారు

౧౬౩. వల్లూరి సూర్యనారాయణరావుగారు

౧౬౪. విశాఖజిల్లా, మాడుగుల కొండజాతి సేవాభీష్ముడు, కామయ్యగారు

౧౬౫. శ్రీకొత్త సూర్యనారాయణమూర్తిగారు

౧౬౬. బంగారు రాఘవయ్యగారు

౧౬౭. కొత్తపల్లి వెంకయ్యగారు.

౧౬౮. ముద్దాల ధర్మయ్యగారు

| | | |
|---|---|---|
| 19— —9-9-19 | భీమవరం నల్గొండ జిల్లా | |
| జ. 1904 | రంగుక్ష, మిరియాలగూడెం తా॥ | 262—263 |
| 1916—19-12-18 | సూర్యాపేట | 263—264 |
| 1906 | పెద్దపాడు | 264—265 |
| 1892—9-4-1948 | నాభాకం, హైదరాబాదు | 235—266 |
| 1903—5-11-1948 | జమ్మంమొట్టు | 263—267 |
| జ. 1915 [illegible] తా. చిననంగపరం, వరంగల్ జిల్లా | | 267—268 |
| 1925—1948 | ఓరుగల్లుకోట | 268—269 |
| — | — | 269 |
| — | — | 269—270 |
| — | మధిర తాలూకా | 270 |
| — | — | 270—271 |
| — | — | 271 |
| — | — | 272 |
| మ. [illegible]-9-41 | రాజమండ్రి | 273 |
| — | కొవ్వూరు | 274—278 |
| 1866-28-4-1937 | గౌతమాశ్రమము-కొవ్వూరు | 278-280 |
| — | కామయ్యపేట | 281—284 |
| — | సీతానగరం | 285 |
| — | రాజమండ్రి | 285—286 |
| — | వీరభద్రపురం | 286 |
| — | రఘుదేవపురం | 287 |

౧౬౯. కనికెళ్ళ నారాయిడుగారు
౧౨౦. చాగంటి వీరభద్రరావుగారు
౧౨౧. శంకరమంచి సుబ్రహ్మణ్యంగారు
౧౨౨. శ్రీమతి బులుసు సుభద్రమ్మ
౧౨౩. గుమ్మిడిదల సుబ్బారావుగారు
౧౨౪. నిష్ఠల శ్రీరామమూర్తిగారు
౧౨౫. మామిడి దేవేంద్రుడుగారు
౧౨౬. చంద్రాభట్ల దత్తాత్రేయులుగారు
౧౨౭ ఉపాధ్యాయుల సూర్యచింతామణిగారు
౧౨౮. ముంజులూరి జనార్ధనరావుగారు
౧౨౯. పందిరి వీరన్నగారు
౧౩౦. తురగా శ్రీరామమూర్తిగారు
౧౩౧. చామకూరి పకీరుగారు
౧౩౨. తళ్ళారి నరసింహంగారు
౧౩౩. మద్దూరి నరసింహంగారు
౧౩౪. బొమ్మగంటి శ్రీరామమూర్తి శర్మగారు
౧౩౫. భూపతిరాజు వెంకటేశ్వరరాజుగారు
౧౩౬. బొల్లాప్రగడ సుందర గోపాలరావుగారు
౧౩౭. దామోజీపురపు నరసింహారావుగారు
౧౩౮. అల్లూరి రామకృష్ణంరాజుగారు
౧౩౯. వేదాంతం వెంకటకృష్ణయ్యగారు
౧౪౦. జొన్నవిత్తుల గురునాథంగారు
౧౪౧. ధుమంతరావు వెంకటసుబ్బారాయుడుగారు

| | | |
|---|---|---|
| — | వంగలపూడి | 288 |
| — | రాజమండ్రి | 288 |
| — | ధవళేశ్వరం తూ॥ గో॥ | 289 |
| — | కాకినాడ తూ॥ గో॥ | 289—290 |
| — | కాకినాడ | 290 |
| — | పెదమండవల్లి | 291 |
| జ. 1885— | రాజమండ్రి | 291—292 |
| — | రాజమండ్రి | 293 |
| — | రాజమండ్రి | 293—294 |
| — | రాజమండ్రి | 294 |
| — | రాజమండ్రి | 295 |
| — | అమలాపురం | 295—296 |
| — | రాజమండ్రి | 296 |
| 1903—1938 | కోటకేశవరం | 297 |
| — | రఘుదేవపురం | 297 |
| 1893—1939 | నిడదవోలు | 298 |
| మ 1938 | ఖండవిల్లిపిర్కా (పెరవలి) | 299 |
| — | రాజమండ్రి | 299—300 |
| — | తాడేపల్లిగూడెం | 300 |
| — | భీమవరం | 300—301 |
| — | కాకినాడ | 301—302 |
| — | చేబ్రోలు | 302—303 |
| 27-1-1884-9-9-1949 | ధువంతుని గూడెం | 304 |

# అఖిలాంధ్ర వీర సంస్మరణ కుసుమాంజలి

గాంధీజీ నాయకత్వాన కాంగ్రెసు జరిపిన జాతీయ స్వాతంత్ర్యసమరంలో పాల్గొని కీర్తిశేషులైన ఆంధ్ర అహింసా వీర - నర, నారీమణులు - నిర్మాణ కార్యప్రచారకులు.

## గంజాం

## ౧. శ్రీ వరాహగిరి వెంకటజోగయ్య పంతులుగారు, బరంపురం

( 10 – 4 – 1869 )

సంయుక్తరాష్ట్రములలో (యునైటెడ్ ప్రోవిన్సెస్) నెహ్రూకుటుంబము రాజకీయరంగములో ఎట్టిప్రఖ్యాతిని సంపాదించెనో, ఆంధ్రరాష్ట్రములో 'వరహాగిరి' వారి కుటుంబ మట్టి ఖ్యాతినే ఆర్జించెను. మోతీలాలు, జవహర్‌లాల్ నెహ్రూలు తండ్రికొడుకులు న్యాయశాస్త్ర ప్రవీణులై వెలసిరి. దానికి తోడు శ్రీమతి విజయలక్ష్మి (మోతిలాలుగారి కుమార్తె) అంతర్జాతీయ దూతగా (Inter-national Ambassador) ఎంతో ఖ్యాతినార్జించెను.

ఆలాగుననే వరహాగిరి జోగయ్య పంతులుగారు, వారి కుమారుడైన వి. వి. గిరిగారు న్యాయశాస్త్రప్రవీణులు

గిరిగారి సోదరి శ్రీమతి ఆ. లక్ష్మీనారాయణమ్మగారు కూడా దేశసేవికగా పనిచేసెను. ఈమె ఒరిస్సా శాసనసభలో సభ్యురాలుగా నుండెను.

శ్రీ జోగయ్యపంతులుగారు 10 ఏప్రియల్ 1869 సం॥ రంలో జన్మించిరి వీరు బరంపురం, రాజమండ్రి కళాశాలలలోను, చెన్నపురి న్యాయశాస్త్ర విద్యాలయం లోను విద్య నభ్యసించిరి. వీరు గంజాంజిల్లా, బరంపురంలో 1893 సం॥ రంలో న్యాయవాదివృత్తిని ప్రారంభించి 1929 సం॥ రంలో మదరాస్ హైకోర్టు వకీలుగా అంగీకరింపబడిరి. శక్తి వంచనలేక వారు రాజకీయంగాను, సాంఘికంగాను దేశ ఔన్నత్యమునకు చాలా పాటుపడిరి 1894 సం॥ రం నుండి వీరు భారతీయ జాతీయసభలో సభ్యులుగా నుండిరి మరియు జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షపదవినిగూడ చాలసంవత్సరములు నిర్వహించిరి.

ఇదిగాక బరంపుర పట్టణములో జరిపిన ప్రావిన్షియల్ అసోసియేషన్. సోషల్, ఇండస్ట్రియల్ సభలలో కార్యదర్శిగను, XII Madras Provincial Soc Conference రిసెప్షన్ కమిటీ చైర్మన్‌గాను కూడ పనిజేసెను. విజయనగరములో జరుపబడిన విశాఖజిల్లా ఇండస్ట్రియల్ కమిటీ అధ్యక్షతను వహించెను. గంజాం జిల్లా హరిజన్ కమిటీ అధ్యక్షుడుగాకూడ నుండెను. వీరు 8 సంవత్సరములు గవర్నమెంటుప్లీడరుగాను, పబ్లికు ప్రోసిక్యూటరుగాను బరంపురంలో పనిజేసిరి. కొన్ని సంవత్సరాలు

గంజాం ప్లీడర్ల సంఘమున కధ్యక్షుడుగ నుండెను. 1931-32 సం॥ లలో లండనులోని ప్రీవీకౌన్సిలు జుడిషియల్ కమిటీవారియెదుట 'Counsel' గా చిన్నకిమిడి అప్పీలులోను, పర్లాకిమిడి రాజా వారి కొనమోల కేసులోను హాజరై ప్రాతినిధ్యమును వహించెను.

బాల్యమునుండి ప్రజాహితయక కార్యములలో పాల్గొనుచు, భారత జాతీయ సభలో పనిజేయుచుండెను. ఈయన 1907 సం॥లో సూరత్‌లో జరిగిన కన్వెన్షన్ కమిటీ సభ్యులుగా నుండి, దానితరువాతంతరం, 1908 సం॥ లో అలహాబాద్‌లో జరిగిన అఖిలభారత సమావేశంలో చెన్నరాజధాని ప్రతినిధిగా పనిజేసెను.

1927-28 సం॥రంలో విశాఖపట్నం జిల్లా ముఖ్యనగరములు అనగా చికాకోలు, బారువా సోంపేట, బరంపట్నం, నరసన్నపేట, కోటబొమ్మాళి, విజయనగరం పార్వతీపురం, చోడవరం, అనకాపల్లి—మున్నగు చోట్ల స్థానిక ప్రజా పరిపాలన విషయములు వారియిక్కట్లును గురించి విమర్శించి, అనేక సభలు జరిపెను. 1928 సం॥ రం గుంటూరులో జరిగిన ఆంధ్ర ప్రొవిన్షియల్ రైలుప్రయాణీక సంఘసభ కధ్యక్షతను వహించెను.

ఈసభలో మూడవ తరగతి ప్రయాణీకుల కష్టములను గూర్చియు, ఇండియన్ రైల్వే పరిపాలన మున్నగు విషయములను చర్చించి వానిని తొలగించుటకు సలహానిచ్చెను. వారు కశింకోట 'carriage station' పెట్టుటకు కారణభూతులు.

మరియు ఆ సం॥ లో విశాఖజిల్లాలో అధిక వర్షపాతముచే పైరులకు నష్టము వచ్చుటచే క్షామనివారణమునకై గవర్నమెంటు వారికి సలహాను పంపెను.

మహాత్మా గాంధీజీగారు, ప్రెసిడెంటు బాబు రాజేంద్ర ప్రసాదుగారు విశాఖజిల్లాలో పర్యటనము జేసినపుడు వీరికి తగిన సహాయం జేసెరి. వీరు, రైతులు - జమీందార్ల విషయమగు వివాదములలో మధ్యవర్తులుగా నిలిచి వారి మనస్పర్ధలను తొలగించి సంఘీభావము జేకూర్చి కృతకృత్యులైరి.

1931 to 1935 సం॥ రంలలో జరిగిన ఆంధ్రమహాసభ కధ్యక్షపదవిని వహించి ఆ యుద్యోగమును 1935 సంవత్సరాంతము వరకు నిర్వహించిరి 1931 సం॥ రం లో లండను నగరమును దర్శించినపుడు ఆంధ్రప్రజల తరపున, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకై (Sec. of State for India) ఇండియా కార్యదర్శిగారి ఉత్తరువునకు వేచియుండెను. ఈ సం॥ రం లోనే వారు ఎడింబరో నగరమున కరిగి అచ్చటనున్న ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి, గ్లాస్‌గో, డబ్లిన్ బ్రిటిష్ యూనివర్సిటీలో చదువుచున్న విద్యార్థుల సంఘమునకు (ఇండియన్ స్టూడెంట్సు యూనియన్‌లో) ఉపన్యాసము నిచ్చెను. మరియు వారు లండన్‌నుండి ఆక్స్‌ఫర్డ్‌నకు విమానంపై వెళ్లిరి. అచ్చట లండన్‌లోని House of Commons వారి సభలకేగి వారి కార్యక్రమమును వీక్షించెను.

1932సం॥రంలో లండన్‌కు వెళ్లి ఉత్కళ రాష్ట్ర (formation నిర్మాణం విషయంలో ఆంధ్ర రాష్ట్ర సరిహద్దుల నిర్ణయాన్ని గూర్చి ప్రచురపరచెను.

తరువాత వీరు బరంపురంలోని కల్లికోట రాజావారి కాలేజికి ఉపాధ్యాయుడుగా నుండిరి. మునిసిపల్ కౌన్సిలు, తాలూకాబోర్డుల సభ్యులుగా నుండిరి. గంజాం డి॥ బోర్డు, బరంపురం యూనియన్ క్లబ్బుల కివ్యక్షుడు. 1914-29 గంజాం జిల్లా కోఆపరేటివ్ బ్యాంకు ప్రసిడెంటు - మున్నగు పదవులు జేసిరి. వారు స్వదేశ, స్వరాజ్యోద్యమ పక్షపాతి. రాజకీయ ఖైదీలను పోలీసువారు హింసించుటచే సానుభూతిని చూపి వారికై తగు చర్యలు జరిపెను. మరియు బరంపురంలో విదేశ వస్త్రవిక్రయ బహిష్కారం కల్లుదుకాణాల పికిటింగు చేసినందుకు వీరిని గూడ గవర్నమెంటువారు శిక్షించిరి వీరాజన్మాంతర ఖద్దరు ధారులు, దేశసేవకై పాటుపడి తనువును జాలించిరి.

## ౨. ఎల్లాయి సన్యాయిగారు – బరంపురం

(1889 – 1944)

వీరు సుప్రసిద్ధ ద్రావిడశాఖకు చెందిన బ్రాహ్మణులు. వీరు 1889 సం॥ బరంపురం గ్రామమందు జన్మించిరి. అప్పటికి వీరి కుటుంబ పరిస్థితులు బాగా ఉండేవి. వీరొక యేడాది

వయసు గలవారై యుండగనే వీరి తండ్రి గారు మరణించిరి. వీరికి ఒక అక్కగారు మాత్రమే యున్నారు. తల్లిగారు వీరికి పదునైదు సంవత్సరాలు వచ్చేవరకూ జీవించి ఉన్నారు. వీరు బాల్యమున ప్రాథమిక విద్యాభ్యాససమయముననే, కసరత్ అన్నా, కుస్తీలు, ఆటపాటలుఅన్నా, సాముగరిడీలన్నా ఎక్కువ ఆసక్తి గలిగి ఉండేవారు వీరుయుక్తవయస్కులైన పిమ్మట నొక సందర్భమున నెల్లూరుబంటితో పోరి గెలుపు గొన్న వీరులు. వీరు మాధ్యమిక విద్యను పూర్తి చేసిరి.

అటు పిమ్మట బరంపురంలోనే హరిజన పాఠశాలలో ఉపాధ్యాయులుగా ప్రవేశించిరి ఈపదవిలో నుండగనే మేన మామగారు అయిన పూడిపెద్ది కృష్ణమూర్తి గారు తమ పెద్ద కుమార్తె నిచ్చి వివాహము చేసిరి.

వీరు 1908 వ సంవత్సరంలోనే "వందే మాతరం" ఉద్యమమున బాల్గొని జాతీయాశయముల జిత్రింప జేసికొనిరి. 1919 వ సంవత్సరమున బ్రహ్మసమాజము జేరి తత్సమాజా శయబోధకులుగా యా ప్రాంతములయందు పనిచేయుచుండెడి వారు

ఇంతలో 1920 వ సంవత్సరం వచ్చింది. గాంధీమహా శయుల తొలిపలుకు వినవచ్చింది. వెంటనే బరంపురం గ్రామంలో కాంగ్రెసు సంఘమును స్థాపించి తాము ప్రప్రథమ అధ్యక్షులుగా ఉంటూ ఉద్యోగమునకు రాజీనామా నిచ్చిరి.

1921 లో 'ఓటు ఇవ్వరా'దను ప్రచారం సందర్భంలో బరంపురం మేస్ట్రీటువల్ల అవమానములు శిక్షబొంది నెల రోజులు బరంపురం జైలులోను అయిదు నెలలు బళ్లారి జైలులోను ఉండిరి.

జైలునుంచి వచ్చిన తర్వాత నిర్మాణకార్యక్రమమును చేబూన్నవారై స్వయముగ నూలుతీయుట నేయించుట బట్టలు నేయుట నేయించుట కాంగ్రెస్ ప్రాథమిక సభ్యులను విరివిగా చేర్పించుట కాంగ్రెస్ సిద్ధాంతములను జిల్లాలోనున్న మూల మూలల గ్రామములు తిరిగి తీవ్రప్రచారము చేయుట మున్నగు కార్యముల నొనర్చుచుండెడివారు.

1926 లో స్వరాజ్యపార్టీ తరఫున కృషిచేసి ఆపార్టీకి అఖండవిజయము చేకూర్చినవారిలో వీరు నొకరు

1928 వ సంవత్సరంలో కాకినాడలో హిందూస్థానీ సేవాదళం పెట్టకపూర్వమే, యీయన యీ జిల్లాలలో ప్రథమమున సేవాదళము నొకదానిని స్థాపించి దానికి కెప్టెన్‌గా నుండి పనిచేయుచుండగా, 1929–30 ప్రాంతములో శ్రీబులుసు సాంబమూర్తిగారు వీరి విధానమును కనపెట్టుటకు స్వయముగ వచ్చి వారి సేవకు సంతోషించి, వీరిసూత్రములనే అనుసరించి కాకినాడలోకూడ వీరి నాయకత్వంక్రిందనే హిందూస్థానీ సేవా దళమును నడిపించిరి.

కాకినాడలో సేవాదళం పూర్తిచేసి యింకను ట్రయినింగుబొందు నుద్దేశముతో వీరు బొంబాయివెళ్ళిరి. అందు

ప్రథమ కక్ష్యలో నుత్తీర్ణులై సబర్మతీ ఆశ్రమమునకు జని రెండు మూడు మాసములు మహాత్ముని సేవయొనర్చి తిరిగి కాకినాడకు వచ్చిరి.

వీరావిధమున తిరిగివచ్చిన వెంటనే పోలీసువారు నిష్కారణముగ వీరిని తీవ్రమైన లాటీ చార్జికి గురి చేసిరి. అయినను వీరులక్ష్యముచేయక ఉప్పుసత్యాగ్రహమున పాల్గొని సముద్ర తీరమైన గోపాలపురములో (గంజాంజిల్లా) తమనాయకత్వంక్రింద నొక దళమును తీసికొనివెళ్ళి ఉప్పును పండించిరి పిమ్మట వెంటనే వీరు నౌపడా ఉప్పుకొఠారులమీదికి దాడి వెడలిన సందర్భమున వీరిని రెండవసారి అరెస్టుచేసి బరంపురం తీసికొని వచ్చిరి. మేజిస్ట్రీటు కేసు విచారించి ఆఱు మాసములు శిక్ష విధించిన మీదట బళ్ళారి సెంట్రల్ జైలుకు పంపిరి. వీరు శిక్ష ననుభవించి వచ్చునప్పటికి యింకను ఉద్యమము సాగు చున్నందున తిరిగి యుద్యమమున పాల్గొనిరి అప్పట్లో ఉద్యమమున పాల్గొనకుండ ప్రజలను భయపెట్టుటకు యీ గ్రామంలో కాల్పులు జరిగెను. దానికిని జంకక వీరు ముందు నిలువబడిరి.

ఆ కాల్పుల సందర్భంలోనే యీ గ్రామనివాసులైన కరణం అయ్యబాబు అనే వారు గుళ్ళు తగిలి చనిపోయిరిగూడ. ఆ వీరుని శవమును వీరి నాయకత్వంక్రింద బ్రహ్మాండంగా ఊరంతా ఊరేగించిరి. ఆసందర్భమున చాలదొమ్మీలు జరిగినవి ఆ దొమ్మీలకు స్టేషన్‌లో ఉన్న పోలీసులంతా హడలి యెక్కడి వారక్కడ పారిపోయి దాక్కున్నారు. మరు

నాడు పోలీసు బందోబస్తు యెక్కువైపోయింది వీరున్నూ సేవాదళం వారిని వెంటబెట్టుకొనిపోయి ఇంటింటా శాంతిప్రచారము చేయుచు రెండవనాడు ఆంధ్రభాషాభివర్ధనీ సమాజములో మీటింగుపెట్టి గవర్నమెంటువారిచర్యలను ఖండించుచు ఉపన్యసించుచుండిరి వెంటనే పోలీసు వారలువచ్చి వీరిని, వీరి సతీమణి యగు సూరమ్మగారిని బావమఱదులగు పెద సూర్యనారాయణ చినసూర్యనారాయణ చిదంబరశాస్త్రి గార్లను చినసూర్యనారాయణగారి భార్య రమణమ్మగారిని మరి యింకా అచట జేరిన సభ్యులలో అనేకులను తీవ్రముగా లాఠీచార్జి చేసి బాధించిరి. అంతటితో తృప్తిపడక వీరందరిని అరెస్టుచేసి జాయింటుమేజిస్ట్రీటుకడ కేసు పెట్టిరి.

ఆ న్యాయాధికారి కేసు విచారించి శ్రీసన్నాయిగారికి మూడు సంవత్సరములును వీరి సతీరత్నమగు సూరమ్మగారికి ఒక సంవత్సరమున్నూ తతిమ్మావారికి ఆరేసి మాసములునూ కఠినశిక్ష విధించి బళ్ళారి సెంట్రల్ జైలునకు పంపిరి.

అందు జైలు అధికారు లొనర్చు దారుణ కృత్యము లు చూడలేకను, పెట్టుబాధలు సహింపలేకను శ్రీసన్నాయిగారు నిరశనవ్రతమునకు బూనిరి వీరీ నిరశనవ్రతమును డెబ్బది దినములు కొనసాగించిరి అపుడు గవర్నమెంటువారు సిగ్గిల్లి పోయి జైలుసిబ్బందిని యితరచోట్లకు మార్చి బళ్ళారిజైలునకు క్రొత్తవారిని వేయుటయేగాక వీరితో న్యాయబారములు జరిపి

వీరి కోర్కెలను అనగా Jail wantings అన్నిటిని తీర్చిన పిదపనే వీరు తమ నిరశన వ్రతమును విరమించిరి.

పిమ్మట కొన్ని దినములకు వీరిని వీరి బంధువులనుండి విడదీసి తిరుచునాపల్లి పంపిరి. వీరి సతీరత్నమగు సూరమ్మ గారిని చినసూర్యనారాయణగారి సతీరత్నమగు రమణమ్మ గారినిగూడ మొదట రాయవేలూరు జైలునకును పిదప కెన్ననూరు చెంనాలకును పంపిరి.

శ్రీసన్నాయిగారిని ఒకటిన్నర సంవత్సరం శిక్షననుభవించినపిదప గాంధీయిర్విన్ ఒడంబడికలో వదలివేసిరి

తరువాత వ్యక్తిసత్యాగ్రహంలో గూడ పాల్గొనగా నాలుగు మాసములు శిక్షవిధించి బరంపురములోనే ఉంచిరి. కాంగ్రెస్ విరామకాలంలోగూడా పని మానక అతి శ్రద్ధా భక్తులతో చేయుచుండెడివారు. 1942 వ సంవత్సరం ఏప్రిల్ నెలలో కేంద్రప్రభుత్వమువారు వీరిని వీరి మామగారైన పూడిపెద్ది కృష్ణమూర్తిగారిని——————కేసులో 302, 436 సెక్షనులక్రింద ఇళ్లు సోదాచూచి అరెస్టుచేసి డిటెన్యూలుగా బరంపురం జైలులో వారంరోజులుంచి పిదప కటకం జైలుకు తీసుకు వెళ్ళినారు వీరుభయులును ఆరుమాసములు ఆ జైలులో నుండిరి. ఆతరువాత శ్రీసన్నాయిగారిని సెక్యూరిటీ ప్రిజనరుగా నుంచి వారి మామగారిని వదలివేసిరి. పిమ్మట కొన్నినాళ్ళకు శ్రీసన్నాయిగారిని బరంపురంజైలునకే పంపవేసిరి. బరంపురం జైలులో జ్వరము తగిలినందున ఆసుపత్రిలోనుంచిరి.

ఆ జ్వరము తగ్గక పూర్తిగ హెచ్చినది. తుదకు వారా జ్వరముతోనే 1944 వ సంవత్సరమున కార్తీకబహుళ ఏకాదశి నాడు వీరస్వర్గ మలంకరించిరి. అతి ప్రయత్నము చేసినమీదట శవమును అతికష్టముపైన వీరి కుటుంబమువారి కొసగిరి. బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగినపదప శవమునకు యథావిధిగ దహన సంస్కారాదులు జరిగినవి.

వీరికి నలువురు మగపిల్లలును ఇద్దరు ఆడపిల్లలును గలరు ఆడపిల్లలు వివాహితలై కాపురములకు బోయిరి.

మొత్తము మీద వీరి జీవిత చరిత్ర మహోత్కృష్టమైన దగుటయేగాక భారతజాతీయజీవితం అంతఃకలహములతో నిండి నిరాడంబరము నిస్స్వార్థము నైన సేవను కోరుచున్న యీరోజులలో యువకుల కాదర్శప్రాయము గాజాలియున్నది.

ఇట్టి ధీరాగ్రేసరులు త్యాగవతంసులునైన శ్రీసన్యాయిగారు మనలను విడిచనటం తీరనిలోటు

యువకులెల్లరును వీరిజీవితమునందలి యుత్తమాదర్శములగు త్యాగధైర్యాది సద్గుణముల నలవరించుకొని తమతమ జీవితములను చక్కదిద్దుకొందురుగాక.

వీరి సతీమణి సూరమ్మగారు కూడ గాంధిమహాత్ముని మరణమును విని ఆ అఘాతమును తట్టుకొనజాలక గుండె బ్రద్దలై మరణించినది. ఈ దంపతు లిద్దరు ఆదర్శజీవులనుట కెట్టి సందియమును లేదు.

# 3. జయంతి కృష్ణారావుగారు-బరంపురం

( 1902 – 1935 )

వీరు 1902లో బరంపురం గ్రామమున జన్మించిరి. 1914 వ సంవత్సరమున అనగా పండ్రెండు సంవత్సరముల చిఱుత వయసుననే తమ యన్నగారైన శ్రీ వెంకటనారాయణగారితో బాటు తాము ను సంఘసంస్కరణోద్యమమునకు బూనుకొనిరి.

వీరికి మొదటినుంచీ తెలుగు అంటే ప్రత్యేకాభిమానం. పిన్ననాడే ఆంధ్రంలో మంచిసాహిత్యం అలవఱచుకొన్నారు. కళింగదేశ చరిత్రలో మంచిపరిశోధన జరిపారు.

కమ్యూనిజం అంటేకూడా వీరికి ఆదరాభిమానాలు అధికంగా ఉండెవి. కృష్ణారావుగారు 1921 లో Intermediate పరీక్షలో నుత్తీర్ణులైనారు. మంచి శాంతమూర్తి, దీర్ఘాలోచన గలవారు

చిన్నతనంలోనే Inter ప్యాసయ్యా గూడా దేశమాత పిలుపువిని చదువుకట్టిపెట్టి ఉద్యమంలో ప్రవేశించిన త్యాగశాలి.

వీరు "నో ఓట్సు కాంపెయిన్" లో పనిచేసిరి. అపుడు బరంపురం పోలీసులు వీరిని అరెస్టు చేసిరి. ఆ కేసులో రెండు సం త్సరములు శిక్షవిధించి కడలూరు జైలుకు పంపిరి.

జైలుఅధికారుల నిరంకుశ చర్యలకు అసమ్మతి సూచకముగా వీరు నిరశనవ్రతము బూనిరి. ఇందుకు ఫలితముగ

ప్రభుత్వమువారు వీరికి యేకాంతవాసశిక్ష బారుఫెట్టర్సు మొదలగు అదనపు శిక్షలు గూడ విధించిరి.

1923లో జైలునుండి విడుదలయైవచ్చినపిదప శ్రీకాకుళం హైస్కూలులో కొన్నిదినములు ఉపాధ్యాయులుగా పనిచేసిరి.

విశ్రామ కాలములో హరిజనసేవ అస్పృశ్యతా నివారణము, రాట్నపరిశోధనము, చరిత్ర పరిశోధనము మున్నగు కార్యక్రమముల (అతి శాంతితో) గొనసాగించుచుండుటయే గాక బ్రహ్మసమాజ ప్రచారముద్వారా సంఘసంస్కరణముకు గూడ యత్నించుచుండెడివారు.

వీరు 1935 జులై నెలలో మరణించిరి వీరికి ముగ్గురు మగపిల్లలును ఇరువురు ఆడపిల్లలును గలరు. ప్రస్తుతము వీరి భార్యయు పిల్లలు నెక్కడ నున్నారో తెలియదు.

మిక్కిలి యుత్సాహముగలవారే యయ్యును కుటుంబ భారమధికమగుటచే తిరిగి జైలునకు వెళ్ళలేకపోయిరి.

వీరు జైలుకు వెళ్ళకుండా నిర్మాణకార్యక్రమం కొనసాగించే రోజుల్లోనే కొన్నిపుస్తకములుగూడ వ్రాసిరి. వానిలో శాతవాహనుల చరిత్ర-కళింగసామ్రాజ్య చరిత్ర-గాంధీ-బాలకృష్ణుడు అనేవి ముఖ్యములైనవి. విదేశవస్త్రదహనము—కోర్టుల బహిష్కరణము మున్నగునవియు రచించిరి.

వీరికి యిల్లుగడవని కష్టస్థితిలో శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు భారతికి సబ్ఎడిటరుగా నియమించి కొంతకాల మాదరించిరి.

# ౮. మంత్రాల పత్ర్మినః సింహంగారు
## బరంపురం
### (1886 – 1942)

వీరు సుప్రసిద్ధ వెలనాటి శాఖకు చెందిన వారు. 1886 వ సంవత్సరంలో శ్రీకాకుళంలో జన్మించిరి. అప్పట్లో వీరి కుటుంబము సాధారణ పరిస్థితులు మాత్రమే గలిగియుండెడిది. వీరు విజయనగరం కళాశాలలో ఇంటర్‌మీడియట్ వరకు జదివిరి. సాల్టు డిపార్టుమెంటులో సబిన్‌స్పెక్టరుగా పనిచేయు చుండెడి వారు. 1921 వ సంవత్సరంలో ఆ పదవికి రాజీనామా నిచ్చి, కాంగ్రెస్ ఉద్యమంలో ప్రవేశించి, తీవ్రప్రచారము చేయుచుండెడివారు. 1922 వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో పర్లాకిమిడిలో కల్లుపాకలవద్ద పికెటింగుచేయగా, గవర్నమెంటువారు అరెస్టుచేసి, 1936 వ సంవత్సరం మార్చి నెలలో నలుబది రోజులు శిక్షవిధించి, బరంపురం జిల్లాజైలులో నుంచిరి.

తదాది వీరు కాంగ్రెస్ ప్రచారకులుగానుండి నిర్మాణ కార్యక్రమ మొనర్చుచుండిరి. అందు నూలు వడికించుట, తాముస్వయముగ నూలువడకుట, అస్పృశ్యతా నివారణ, ఖాదీహాకింగు, కాంగ్రెస్ మెంబర్లను చేర్చుట, మున్నగునవి వారిదినచర్యలు. వీరు 1935 – 1936 వరకు అఖిల భారత చరఖాసంఘం ఆంధ్రశాఖ తరఫున బరంపురంలో పనిచేసిరి.

# ౫. సోమయాజుల లక్ష్మీకాంతరావుగారు

## గంజాం

( 1905 – 1942 )

వీరు 1905 లో పలంత్రి అనే గ్రామంలో జన్మించిరి వేగినాటి శాఖకు చెందినవారు వీరు అయిదుగురు అన్నదమ్ములు, ముగ్గురు అప్పచెల్లెండ్రు. వీరిదే ఆయూరి గ్రామ కరణీకం.

వీరు లోయరు సెకండరీ పరీక్ష చదివి హయ్యర్ గ్రేడు పరీక్ష వ్రాసెరి. వీరు ట్రైనింగు వ్రాసెదారన్న మాటే గాని, అటు కరణీకమూ వదలి పెట్టారు కాటు ఏచకాగికి వేయలేదు

వీరు 1925 నుంచి జాతీయోద్యమంలో చేరి కాంగ్రెస్ మెంబర్లను ఎక్కువగా చేర్పిస్తూ ఖద్దరు పరిశ్రమ పున్నగ నిర్మాణ కార్యక్రమములో ఎక్కువగా కృషిచేస్తూ ఉండేవారు.

1930 లో వీరు ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందున అరెస్టయి శ్రీకాకుళం మేజిస్ట్రేటుచే ఆరుమాసములు శిక్ష విధింపబడిరి.

ఆశిక్షననుభవించి విడుదలయైన వెంటనే మరల చట్టధిక్కార నేరంక్రింద మరియొక ఆరుమాసములు విధింపబడి

రాజమండ్రి సెంట్రలు జైలులో కొంతకాలము, బళ్ళారి జైలులో కొంతకాలము గడిపిరి.

31 వ తేదీన బరంపురం ఒరిస్సా ప్రావిన్సులో కలిసినపుడు చరఖాఆంధ్ర శాఖను గూడ నిచ్చటనుండి తీసివేసిరి. అందుచే వీరు నాపని మానుకొన వలసినవారైరి.

అప్పటి నుండియు వీరు కుటుంబపోషణమునకును చాల కష్టపడ వలసినవారైరి. వీ రట్లు నిత్యదరిద్ర దేవతారాధకు లయ్యును మిగుల నుత్సాహశక్తి గలిగి శాంతియుతముగ స్థానిక కాంగ్రెస్ సేవ చేయుచు మిత్రులవలన బోషింపబడు చుండెడివారు.

వీరి కిరువురు కొమరులును ఒక్క కొమరితయు గలరు. ఇట్టి కటికదరిద్రావస్థలో వీరు 1942 సంవత్సరం డిసెంబరు నెలలో విరేచనములవల్ల మిక్కిలిబాధపడి స్వర్గస్థులైరి.

ఇప్పుడు వీరి భార్యయు బిడ్డలును తాతానగరంలో ఉంటున్నారు.

(మిత్రుడు సహకార్యకర్తయు నగు
జల్లేపల్లి కామేశ్వరరావు)
19-2-1946

## ౬. దొడ్ల రాముడుగారు (హరిజన్) గొడు కొంకణాపుట్టి

( 1892 – 1942 )

వీరు 1892 సంవత్సరములో గొడు కొంకణాపుట్టి అనే గ్రామంలో హరిజన కులమున జన్మించిరి. వీరిది మిగుల పెద కుటుంబం. కుటుంబంలో మొత్తం అయిదారుగురు ఉండేవారు.

ఈయన చిన్ననాటి నుండియు సత్యవాది స్వాతంత్ర్య పిపాసి. స్వేచ్ఛావ్యవహారాభిలాష వీరిలో యెక్కువగా ప్రతిభాసిస్తూ ఉండేది. వీరి అదృష్టవశాత్తు సమానగుణప్రపత్తులుగల అర్ధాంగియే అమరుటచేత స్వీయాశయములు ఈయన చక్కగ నెరవేర్చుకొన గలుగుచుండెడివారు.

వీరు కొన్నినాళ్లు ఎస్టేటులో ఫారెస్టుగార్డుగా పనిచేసిరి. కాని ఆ దుర్మార్గాలు చేయలేకను, చూడలేక అసహ్యంవేసి ఆ ఉద్యోగానికి రాజీనామా యిచ్చివేసిరి. అప్పటినుండియు జమీందారుగారికి వీరికి పూర్తిగా ఎడమొగం పెడమొగమై పోయింది. అందుచేతనే జమీందారుగారు వీరి స్వంతభూమిలో కొంతభాగము అక్రమంగా ఎస్టేటులో కలుపుకొనిరి.

వీరు ఏమీ చదువుకోలేదు. కాని మహాఅనుభవశాలి. మంచి ఉపాయశాలి. ఎక్కడి [illegible] పనియైనా తాను స్వయంగా చేస్తేనే గాని తృప్తి పడేవారుగారు

1937 లో జాతీయోద్యమమున ఎన్నికలద్వారా ప్రవే శించి శ్రీ శ్యామసుందరరావుగార్కి కుడిభుజంగా ఉంటూ ఉండేవారు.

1933 నుంచి సవర కొండజాతి సంఘంలో మల్లి పెద్ది కృష్ణమూర్తిగారితోబాటు సభ్యులుగా ఉండేవారు.

కోర్టు ఆఫ్ వార్డ్సు హయాములో ఎస్టేటుపైన తిరుగు బాటుచేసి జయముబొంది కలక్టరుచేత ఎస్టేటు దివానుదే తప్పు అనిపించిరి.

పై తిరుగుబాటు (అక్రమజప్తుల విషయంలో) సంద ర్భంలో వీరిని తీవ్రముగా లాటిచార్జి చేసిరి.

అయిదవ అఖిలభారత కిసానుసభలో ట్రూప్‌లీడరుగా నుండి జమీన్దారీ పద్ధతిఅనే బొమ్మను ప్రభుత్వమువారి ఆజ్ఞలను ధిక్కరించి ఊరేగించి తగులబెట్టిరి.

1940 యేప్రిలునెలలో జరిగిన మందసా కాల్పులలో రైతులు భీతిల్లి చెట్టుకొకరు పుట్టకొకరుగా దాగుకొనిన సందర్భమున వీరు స్వయముగబోయి వారిలోని పిరికితనమును బోద్రోలి తమ యపూర్వ వాక్చాతుర్యమున వారిలో ధైర్య స్థైర్యములు పురికొల్పి యుద్యమమును నిరాఘాటముగా సాగించిరి.

వ్యవసాయమే తమవృత్తిగా పెట్టుకొనిరి ఖద్దరు దీక్షా వాది. వీరు 1941 శిస్తు(అక్రమబకాయీ)లను చెల్లించకపోవుట

చేత ఎస్టేటువారి ప్రోద్బలంబిగాగ పెట్టబడిన కుట్రకేసులో శ్రీకాకుళం శాయంపు మేజస్ట్రేటు గారు నాలుగు మాసములు కఠినశిక్ష విధించి రాజమండ్రి సెంట్రల్ జైలునకు పంపారు. జైలులో వీరికి 'సి' తరగతి నిచ్చిరి.

విశ్రాంతి యనుమాటలేక నిరంతరము నిగ్రాహారములు మాని పనిచేయుచును జైలుకు వెళ్ళుట, అందు 'సి' తరగతి కఠినశిక్ష, ఏటితో వీరి యారోగ్యము పూర్తిగా చెడిపోయినది. అందుచేతనే జైలునుండి వచ్చిన కొలదిదినములకే 1942 వ సంవత్సరం మే నెలలో మరణించిరి.

ప్రస్తుతము వీరి కుమారుడును భార్యయు నున్నారు. వ్యవసాయము చేసికొనుచున్నారన్నమాటయేగాని కుటుం బము గడచుట కష్టముగానే యున్నది.

మొత్తమునకు వీరిలోగల విశేష మేమనగా ఊరక విప్లవస్వభావము గలిగి విప్లవవాది యగుటయేగాక ప్రజా నీకమున దానిని రేకెత్తించి వారిలో ధైర్య స్థైర్యములు పాదుకొల్పి యుద్యమము నానాటను కొనసాగింప గలు గుటయే.

(మల్లిపెద్ది కృష్ణమూర్తి.)

---

శ్రీకాకుళం జిల్లా

# ౩. పుల్లెల శ్యామసుందర రావుగారు

## ఇచ్ఛాపురం

( 27-12-1903 – 16-6-40 )

వీరు ది 27–12–1903 సంవత్సరము తేదీని జన్మించిరి. ఇచ్ఛాపురం వాస్తవ్యులు శ్రీ పుల్లెల వెంకటరమణయ్య పంతులుగారి రెండవకుమారుడు. వీరు ఐదుగురు అన్నదమ్ములు, ఇద్దరు అప్పచెల్లెండ్రు. తండ్రిగారు సజీవులు. తల్లిగారు ఫిబ్రవరి 1913 ప్రాంతములో స్వర్గస్థులైరి.

వీరి చిన్నతనమున వీరికి గొప్ప భూవసతి కలదు. తండ్రిగారికి ప్రజాసేవ, జాతీయోద్యమము అభిమాన పాత్రములు. వీరికి ఇచ్ఛాపురము, బరంపురము, విజయనగరము, మదరాసు నగరములలో విద్యాభ్యాసము సాగెను. చిన్నతనములోనే ఏనుగులకు, పాములకు ఎదురు వెళ్లుటమున్నగు సాహసకార్యములు, నాటకములలో వేషములు వేయుట మున్నగు కళాభిరుచి, ఆటలలో అందరిని గెలుచుటలో ఉత్సాహము నేర్పరితనము మున్నగు గుణములుండుటయే గాక విద్యయందును అన్నిటిలో ప్రథముడుగా నుండువారు.

. ఈయన లెక్కలలో ప్రెసిడెన్సీకి ప్రథముడుగావచ్చుట జూచి సర్ బి.ఎన్. శర్మగారు వీరిని అమెరికాకు పంపించి ఇంజనీ

రింగు చదివించుటకై సలహా నీయగా తండ్రిగారందుకు సమ్మతించి ప్రయత్నములు చేసినను శ్రీయన అందుకు సమ్మతింపక దేశసేవచేయుటకే నిశ్చయించిరి.

వీరు విజయనగరంలో ఇంటరుమీడియేట్ సీనియర్ క్లాసు చదువుచుండగనే మహాత్ముని శంఖారావంబిని పరీక్షలు కాకండనె ధారాల

శాసనసభల బహిష్కారమునకై వీరు తీవ్రప్రచారం చేయుచుండగా వీరిపై పోలీసువారు 'సర్వైలెన్సు' పెట్టి తండ్రిగారితో మీకుమారుని జాగ్రత్త పెట్టుకోవలసినదని చెప్పిరి. దానిపై తండ్రిగారు ఈపనులు మానుకొమ్మని ప్రతిమాలుకొనిరి కాని శ్యామసుందరరావు గారు ధైర్యముతో "నాకర్తవ్యమును నేనుమానను, మీకిష్టము లేనిచో ఎక్కడికైనను పోయియైనను నాధర్మమును నెరవేర్చెద"నని సమాధానము చెప్పిరి.

అప్పుడు తండ్రిగారు పుత్రప్రేమచే నీయనమీద ఏమి నేరములు మోపబడునోయని జంకి, ఈయననెట్లైనను షూటియొకమార్గమున ప్రవేశపెట్టవలెనని కొచ్చిన్‌లో కొబ్బరిపీచు పరిశ్రమ నేర్చుకొనుట కనుమిషపై వీరిని వీరి అన్నగారగు సీతారామయ్యగారిని అతికష్టముపై ప్యాసుపోర్టులు సంపాదించి కొచ్చిన్ పంపించిరి. అక్కడ మూడుమాసములేఉండి ఆ పరిశ్రమలో శిక్షణపొంది ఇంటికి తిరిగివచ్చిరి.

1922లో ఈ అన్నదమ్ములిద్దరిచేత మనదేశంలో కొబ్బరిపీచు వ్యాపారం పెట్టించుటకై వీరి తండ్రిగారు ఆలోచించి

సాధనసంపత్తి చేకూర్చుకొని సిద్ధపడగా కల్లుసారా పికెటింగు ఉద్యమం వచ్చింది. అంతట వీరిద్దరు తండ్రిగారిని జోకొట్టి తమతోకూడా శ్రీబృందావనసంపడా, దివాకర పట్నాయకు, గరిమెళ్ల కుమారస్వామి, బులుసు యజ్ఞేశం మున్నగువారిని తొమ్మండుగురను తీసికొని జాతీయజెండాలతో కల్లుపాటలు పాడవద్దని బోధచేయగా వీరందరని డిప్యూటీ సూపరింటెండెంటు చట్టవిరుద్ధసంఘముగా ఏర్పడినారని నేరముమోపి ఇచ్ఛాపురం మేజిస్ట్రేటుఅయిన శ్రీ న్యాపతి శ్రీనివాసరావు పంతులుగారి వద్ద కేసుపెట్టిరి ఆయన అందరికీ ఆరేసిమాసాలు కఠినశిక్ష విధించి బరంపురం జెయిలునకు పంపిరి. అక్కడ నెలరోజులు గడచినపిమ్మట తిరిగి 108 సెక్షన్‌క్రింద అందరినీకలిపి మరొక కేసు కల్పించి ఇంకొకనెల శిక్ష పెంచినారు. అక్కడ జైలు సదుపాయముల కొరకు ఆందోళన చెయ్యగా శ్యామసుందర రావుగారినిమాత్రం కడలూరుజైలునకు మార్చిరి. వీరి విడుదల సమయమునకు వీరితండ్రిగారు కడలూరువెళ్లి విడుదల అయినపిమ్మట రామేశ్వరం మున్నగు దక్షిణాది యాత్రలు చేయించి ఇంటికితీసికొనివచ్చిరి.

1923 మొదలు ఖద్దరు ఉద్యమమందు ఎక్కువ శ్రద్ధ వహించి రాట్నములు చేయించి అందఱకు ఉచితముగా పంచి పెట్టుట, తాను నూలువడికి ఇతరులచే వడికించుట, బట్టలు నేయించుట, ఆబట్టలు ఇంటింటికి తిరిగి అమ్ముట, మున్నగునవి

ఆయన దినచర్యలోని పనులు 1922 లో విదేశవస్త్రదహనం కూడ తీవ్రముగా సాగించిరి

ఇంతదీక్షతో జాతీయోద్యమములకని చేయుచున్నను గృహకృత్యములతో నెప్పుడును అశ్రద్ధచూపకపోవుట శ్యామసుందరరావుగారి యందలి విశేషము. తండ్రిగారిని విశ్రాంతిగా నుంచుకొని తానే భూములమీదనే పై అజమాయిషి చేసికొనుచు, సంసారకృత్యములను చక్కబెట్టుచుండెడివారు

930 లో ఉప్పుసత్యాగ్రహంలో ఈజిల్లాకు నాయకత్వం వహించి నౌపడా ఉప్పుకొఠారుమీదకు దాడివెడలగా వీరిని నిర్బంధించి శ్రీకాకుళం జాయింటు మేజిస్ట్రేటు ఏడాది కఠినశిక్ష విధించి, 'సి' క్లాసు ఇచ్చి రాజమండ్రి జైలులో కొంతకాలమును, రాయవెలూరు జైలులో కొంతకాలమును ఉంచిరి. తిరిగి యింటికి వచ్చుటతోడనే 144 సెక్షన్ క్రింద ఊరుదాటకూడదని పోలీసువారు ఉత్తరువు చేయగా 1932లో ఆ సెక్షన్ ధిక్కరించి తిరిగి 6 మాసములు, సి క్లాసు పొంది, రాజమండ్రి జైలుకు వెళ్లిరి.

జైలునుండి తిరిగి వచ్చినతర్వాత యూనియన్ పంచాయితీబోర్డు అధ్యక్షులుగను, కోఆపరేటివు సొసైటీ అధ్యక్షులుగను, కోఆపరేటివు యూనియనకు కార్యదర్శిగను, డిస్ట్రిక్టు బోర్డు సభ్యులుగను, సెంట్రలు బ్యాంకు అధ్యక్షులుగను, ఈవిధమగు హోదాలలో ప్రజాసేవచేయుచు అందరి మన్న

నలకు పాత్రులై యుండేవారు. పట్టణకాంగ్రెసు మొదలు అఖిలభారత కాంగ్రెసు వఱకు అన్నిసంఘములందును సభ్యులై యుండుటయేగాక ఆంధ్రమహాసభలో కూడ ప్రముఖపాత్రను ధరించి యుండేవారు. 1934-35 లో ఆంధ్ర మహాసభకు కార్యదర్శిగా నుండి అప్పుడు బర్మాలో జరిగిన ఆంధ్రోద్యమానికి అక్కడ నాయకత్వం వహించి "ప్రజావాణి" అనే వారపత్రిక నొకదానిని స్థాపించి అఖండ సేవ చేసిరి. ఈ పత్రికకు ప్రారంభోత్సవము శ్రీ రాజేంద్రప్రసాదు గారిచే చేయించిరి. తరువాత కాంగ్రెసువారు టెక్కలి నియోజకవర్గమున కీయబడను శాసనసభకు నిలువబెట్టగా సర్ ఎ పి పాత్రోను తొమ్మిదివేల హెచ్చువోట్లతో ఓడించి జయమందిరి. అప్పటికే వీరు ఆంధ్ర రాష్ట్ర కిసాను సభకు అధ్యక్షులుగా కూడా ఉండేవారు. 1940 సం॥ రములో వీరి ఆధ్వర్యంక్రింద పలాసాలో అఖిల భారత కిసాన్‌సభ మోహన్‌సింగుబక్షా అధ్యక్షతను జయప్రదంగా జరిగినది ఆ సంవత్సరమే మంద సాలో రైతులు తిరుగుబాటు చేయగా చక్రవర్తి అనే కలెక్టరు దగ్గరనుండి తుపాకికాల్పు జరిపించెను ఆ సందర్భములో శ్యామసుందరరావుగారు కలెక్టరుతో మాట్లాడబోగా వీరిమూలముననే ఇదిఅంతయు జరిగినదని, ఏపాపము ఎఱుగని వీరిని 'ఇంటరన్' చేసిరి 1940 మే 16 తేదీని ఈ ఆర్డరు వచ్చినది. జూన్ 16 నాటికి మలేరియాచే నకాల మృత్యువు వాతపడుట జరిగినది.

వీరికి మొదటి వివాహం 1920 లో ఒరంపురం కాపు ర్ఫంలు తాడెపల్లి పట్టాభిరామయ్య పంతులుగారి కుమార్తెను నిచ్చి చేసిరి. ఆమె ఇద్దరు మగపిల్లలనుగని 1925 లో మరణించెను. రెండవ వివాహం 1926 లో తుని కాపురస్తులు చివుకుల సీతారామయ్యగారి కుమార్తె నిచ్చి చేసిరి. కాని 1928 లో ఈమె ప్రసవమై చనిపోయినది. మూడవ వివాహం 1929 లో పిఠాపురం వాస్తవ్యులైన వారణాసి శేషగిరిరావు గారి కుమార్తె నిచ్చి చేసిరి. ఈమెకు ఇద్దఱు కుమాళ్లు, ఇద్దఱు కుమార్తెలు మొత్తం నలుగురు కుమాళ్లు, ఇద్దఱు కుమార్తెలు ఉన్నారు.

1921 లో మొదట వీరన్నదమ్ములిద్దరూ జైలుకు వెళ్లినప్పుడు వీరి ప్రథమ భార్యయగు సుందరమ్మగారు కూడ జెండా పుచ్చుకొని బయలుదేరగా పెద్దలు నివారించి మానిపించుట చాల కష్టమాయెను.

ఈమె పెద్దకుమారుడైన శ్రీ పట్టాభిరామయ్య స్కూలు ఫైనలువఱకు చదివెను. ఇతనికి తండ్రిగారు పోయినప్పటి నుండియు ఉ-ర్ధ్వవ్యాధి పట్టుకొని ఎన్నిమందు లిప్పించినను తగ్గుటలేదు. రెండవ కుమారుడైన వెంకటరమణయ్యకు పిచ్చి ఎత్తినది రెండేండ్లనుండి విశాఖపట్టణం మెంటల్ ఆసుపత్రిలో నున్నాడు.

మూడవ భార్య, పిల్లలు ఇచ్ఛాపురము ననే యున్నారు. వీరి కుటుంబంవారు 1936 లో విభక్తులగుటవల్ల ఆస్తి చీలి

పోయినది. తరువాత నున్నదానిలో చాలమట్టుకు అప్పులవారి పరమైనది. ఇప్పుడు వారికుటుంబము జరుగుటకు చాలీచాలని ఆస్తిమాత్రమె నిలిచియున్నది.

వీరి అన్నదమ్ములలో వీరితో నిద్దఱును, ఒక అప్ప గారును మరణించిరి

వీరు కాంగ్రెసు కార్యక్రమమునే గాక ఇతర ప్రజాహిత కార్యక్రమమునుగూడ చిత్తశుద్ధితో దీక్షతోడనే కొనసాగించు వారు పంచాయతిబోర్డు అధ్యక్షులుగా నున్నప్పుడు "రామ కృష్ణ లైబ్రరీ" కి నాలుగువేలరూపాయలతో నొకభవనము ను నిర్మించిరి. రామకృష్ణసేవాసమితియందు వీరి కెక్కువ అభిమా నము 1923 ప్రాంతములో తుపానునష్టము చెందిన ప్రజకు ఈ సమితిపక్షమున వీరు అపారసేవచేసి ప్రజల ప్రశంసల నందిరి. 1935-36 లో పెక్కలి కరువు వచ్చినప్పుడు వీరున్ను, గౌతు లచ్చన్నగారున్ను, దువ్వా సూర్యనారాయణరెడ్డిగారున్ను కలసి పనిచేసిరి. వీరు స్థాపించిన "ఫ్రూటుగ్రోయింగు అసోసి యేషన్" ఇప్పుడు ఫలవంతమయినది. ప్రొటెక్టెడ్ వాటరుసప్లై, ఎలెక్ట్రిక్కు డ్రెయినేజి మున్నగు ప్రణాళికలలో వీరిపాత్ర ప్రశంస నీయమైనది.

ఆంధ్రోద్యమ విషయమున వీరిసేవ వర్ణనాతీత మైనది. ఆంధ్రదేశమునుండి విడదీసి బరంపురం, పర్లాకిమిడి, జయపురం యెస్టేటువఱకు ఒరిస్సాలో కలిపినపుడు ఇచ్ఛాపురంతాలూకా ఈయనపట్టువల్లను, ఈయన జరిపించిన ఆందోళనవల్లను, నిలిచి

పోయినదన్న అందతిశయోక్తి లేదు. ఈసందర్భములోనే వీరు మొదటిసారి బర్మా వెడలిరి. 1937 జూలై శివతేవని శ్రీ సత్యనారాయణ, మల్లిపెద్ది కృష్ణమూర్తి మున్నగువారితో, కిసానులను చేసికొని ఇచ్ఛాపురంనుండి మద్రాసునకు కాలినడకను యాత్ర సాగించిన వీరుడు. కిసాను ఉద్యమ [illegible] కి కొండ[illegible]ము

వీరు 1938 లో వేసవి పాఠశాలను తెలుగు ప్రాంతములో రాజకీయ చైతన్యమును కలుగజేయుటకు విశేషధనమును వెచ్చించి నడిపిరి. ఆంధ్రదేశమునుండి చాలమంది విద్యార్థులు వచ్చి శిక్షణ పొందిరి.

జమీందారీల విచారణకై యేర్పడిన ప్రకాశం కమిటీ యెదుట జమీందారీ దుష్పరిపాలనను గురించి *సమగ్రమైన సాక్ష్యబలంతో కూడిన నివేదికలతో ఆంధ్రరాష్ట్ర రైతు సంఘమువారి కెంతో తోడ్పడెను.

ఈవిధముగా శ్యామసుందరరావువలె సర్వతోముఖ కార్యశూరులు వేలకువేల కిసానులనేకాదు, జనసామాన్యాన్ని ఉద్దీపనచేసె వీరులు, ఆంధ్రప్రచారకులలో లెక్కకు ఉంటారు. స్థానికపరిపాలనలో, రంగూన్ బాధితులసేవలో, కొబ్బరిపీచు పరిశ్రమలో, పండ్లతోటల పరిశ్రమలో, గ్రామమునకు నీటి సరఫరా మున్నగునవి చేయుటలో చూపిన బుద్ధిసూక్ష్మతే, యూనివర్సిటిలో లెక్కలలో రాష్ట్రానికంతకూ మొదటివాడుగా నిల్చిన తెలివితేటల అంకురాలే. డఫ్ కమిటీ యెదుట ఒరిస్సా

ఆంధ్రసరిహద్దులను గురించిచేసిన మహోద్యమంక్రింద వేలకు వేల కిసానులలో వర్గచైతన్యంకలిగించిన విప్లవశక్తి గాను, అఖిల భారత కిసానుమహాసభ నిర్వహించిన దక్షతగాను, పిమ్మట పరిణమించినది. స్థానికసమస్యలలో పనిచేయువారు, శాంతి యుత వాతావరణంలో పనిచేయుట కలవాటుపడినవారు విప్లవ శక్తులను విజృంభింపచేయులేరని అంటారు. ఇది శ్యాంబాబు యొక్క జీవితంలో అసత్యమని ఋజువు చేయబడింది. ఇట్లని గర్వము, అహంకారము అనేవి ఆయనకు చాలాతక్కువ. ఎప్పుడూ తాను విద్యార్థిననియే, జ్ఞానరసాన్ని నిరంతరం పానం చేయాలనే కోరుచుండును. కడలూరుజైలులో శ్రీమందేశ్వర శర్మగారితో పేరున్నప్పుడు ప్రతిరోజున క్రమముతప్పకుండ తన గదిలోనికి శర్మగారిని తీసికొనివెళ్ళి చుట్టుపట్ల గదులలో నహా నాలుగుకంబళ్లు తెచ్చిపరచి శ్రీసూర్యనారాయణరెడ్డి మున్నగు యువకులను సమావేశపర్చి శ్రీనారాయణమూర్తి మొదలైన మిత్రులసమక్షమున ఎప్పటులన్యాండుఆక్టు పాఠము ప్రారంభించ మనేవారు. "సికి. నేను పాఠమేమిటయ్యా ? అంటే "నేనింకా చాలా తెలుసుకోవాలి జైల్లో" అని 215 సెక్షనులు సవిమర్శగా శర్మగారిచే పాఠముచెప్పించి అనేకమంది యువకులకు పినలు పరిజ్ఞానం కలిగించినాడు. ఆయనప్రోత్సాహం వల్లనే శర్మగారు "జమీందారైతు సమస్య" అను పొత్తము రచించుటకు పూనైనది. జనసామాన్య విప్లవాల్లో, కార్యక్రమాల్లో ఎంత ధీరుడో, దయాంతఃకరణలో అంతఆర్ద్రహృదయుడగుట వలననే

మండనాకాల్పుల అనంతరం విక్షేపంగా హతులైన వారిపట్ల ఆయనపొందిన పరితాపమే వ్యాధిరూపంగా పరిణమించిన దని అంటారు ఏదైనను సర్వతోముఖంగా అన్ని రంగాల లోను, విరరంగాలలోను సుందరనృత్యంచేసి యశఃకాయుడై నాడు పనశ్యామసుందరం.

## ౫. గరిమెళ్ళ సత్యనారాయణగారు

( 1893 – 18-12-52 )

ఇతడు శ్రీకాకుళముజిల్లాలోని గోనెపాడుఅగ్రహారముగా 1893 సం॥రంన జన్మించెను ఇతనిశైశవము నరసన్నపేటదగ్గరనున్న 'ప్రియా' అగ్రహారంలో గడిచింది అక్కడి సుప్రసిద్ధ భూస్వాములు కన్నేపల్లివారితని బంధువులు. కన్నేపల్లి లక్ష్మీనరసింహం శాస్త్రి రితని విద్యాకృషికి దోహద మిచ్చెను. రాజమండ్రిలో కీ. శే. శ్రీపాద కామేశ్వర రావు ఎం. ఏ. గారి యింట్లోవుండి విద్యాసంపూర్తి జేసెను. గంజాంకలెక్టరేటులోను, విజయనగరం హైస్కూలులోను మాష్టరుజేసి L. T పరీక్షకు రాజమండ్రి కెళ్లెను.

అపుడు దేశంలోని విద్యార్థులు, స్వరాజ్యసాధనకోసం, అసహాయోద్యమంలో దిగరించవాలని, ఇంచుకూడ చదువుకు స్వస్తిచెప్పి ఉద్యమంలో కాలుకాదం, ఇతడు జాపిము చేయికవి

'మూకొద్దీ తెల్లదొరతనము' గండాలు దండాలు 'భారతి మాతా' అన్న ఇతనిపాటలు యావదాంధ్రావనిని మార్మోగించాయి. వాటిని పాడినవాళ్ళనుకూడా జైలులోపెట్టారు ఈయన చాలాకాలం జైలుశిక్షననుభవించి, ఆసమయంలోనే విద్వాంసులైన తోడి ఖైదీమిత్రులసాయాన, 'కురళ్' అను దానిని అర్థత్రయసర్వస్వముఅను వచనకావ్యముగా అనువదించారు. 'నాండియార్' అను నీతిగ్రంథాన్ని 'ద్రవిడభర్తృహరి' అను పేరిట తెనిగించారు లెక్కలేనిపాట వ్రాశారు. ఆంగ్లములో Heart of the Nation. అను పద్యకావ్యాన్ని వ్రాశారు ఈయనను విచారణ చేయుచున్న రాజమండ్రీ మేజస్ట్రేటు "మీపై నేరము మోపబడినది యేమి చెబుతారు?" అనిఅడుగగా, "ఇదిగో వ్రాసుకోండి. "కూలిపోతూన్నాదీ కూలిపోతున్నాది ఈమూర్ఖ బ్రిటిషుప్రభుత్వం మూలామట్టంతోటి" అని మరియొక గంగాప్రవాహంలాంటి గీతంతో వాఙ్మూలం ఇచ్చిన వాల్మీకిధార గలవారు

ద్రవిడదేశంలో శ్రీసుబ్రహ్మణ్యభారతి ఎంతకీర్తిని గడించి, మహాత్యాగియై చివరకు తిండిలేక దుర్మరణం పాలయ్యాడో, అలాగే దేశంకోసం త్యాగంచేసియూ నాయకులచే గమనింపబడక, తిండికి కష్టపడుతున్నా ఈషణ్మాత్రమూ చింతించక, దేహాన్ని విడిచారు.

ఇతడు కొంతకాలం, గృహలక్ష్మి పత్రికా ఆఫీసులో పనిచేసి, తుదకు కంటిజబ్బుచే ఏపనిచేయుడం సాధ్యపడక,

ఉదారులైనటువంటి వావిళ్ళవారి గుప్తదానాలలో కాలం గడిపాడు. ఇతనికి నలుగురు కొమార్తెలు. అందులోముగ్గురు వివాహితలు. ఆఖరిపిల్ల ఆయన అవసానదశలో దగ్గరనేవుంది. దిక్కులేని అనాథయైనది. ఆమెకు ఉదారుల సహాయంతప్ప వేరేగతి లేదు.

ఆయనవ్రాసిన కురళ్, భక్తిగీతాలను ముద్రించి వాని వలన వచ్చే పైకాన్ని యీ పిల్లకివ్వడానికి శ్రీ వావిళ్ళవారు పూనుకున్నారు.

అజ్ఞాతవాసాన్ని గడిపి మృతిజెందిన శ్రీ సత్యనారాయణ నిష్కల్మషపవిత్రఆత్మకు శాంతి చేకూరుగాక. ఇతడు 18-12-52 తేదీని మరణించెను.

## ౯. శ్రీమతి సాసుమాను వీరగున్నమ్మ మందసా

( —1940 )

ఆదినుండియు తెన్గుదేశము వీరాంగనలకు పుట్టినిల్లు. వారి సాహస కార్యములను మనము కథలుగా చెప్పుకొను చున్నాము. మననాయకురాండ్రు మగువమాంచాల రుద్రాంబ దుర్గలక్ష్మి ప్రభృతులు ఆంధ్రస్త్రీ పౌరుష రేఖలను దిద్ది తీర్చినారు.

ఆకోటికి చెందినదే శ్రీమతి వీరగున్నమ్మ. ఉత్తర విశాఖపట్టణ-జిల్లాలో చిన్న జమీందారీ గ్రామమైన మందసా యీామె జన్మస్థలం. ఈ ఎస్టేటు ఒకప్పుడు అక్రమ పరిపాలనకు లోనై అభివృద్ధినిరోధక కార్యములకు గురియగుటచే ఆవూరి దివాంజీగారిని ప్రభుత్వంవారు బర్తరఫ్ జేసిరి.

ఈ ఎస్టేటు కోర్టు ఆఫ్ వార్డ్సు వారి స్వాధీనములో నున్నపుడు రైతు లేబాధలు ఎరుగిరు ఏ దివానైతే తీసి వేయబడ్డారో తిరిగీ అతడే ఉద్యోగానికి వచ్చి ప్రజలవద్ద లంచాలు పుచ్చుకొని హింసించడం మొదలు పెట్టాడు.

సబ్ కలెక్టర్ గారి కృషి ఫలితంగా జమీందారు రైతు లకు కుదిరిన రాజీ ఇతడగుగుపెట్టడంలోనే భగ్నం చేశాడు. దానితో రైతుల కష్టము లెక్కువయాయి. రైతులంతా నిరు త్సాహు లయ్యారు మందసాకాల్పులకు పూర్వపుపరిస్థితు లీవిధంగా వున్నాయి.

జమీందారీ వుద్యోగస్థులు మామూళ్లిమ్మని రైతుల్ని బాధించడం ఇవ్వనివారినికొట్టడం అడవిలో కట్టెలుదెచ్చుకొన్న బండివానికి రు 1-4-0 ఛార్జీ వసూలు చెయ్యడం పాతబకాయి లన్నీ పూర్తిగా యిచ్చి మరీ కదలమని నిర్బంధించడం మున్నగు చర్యలకు ప్రజలు తట్టుకోలేక పోయారు.

29-2-1940 తేదీని రైతులు కర్రలు తీసుకొని అడవికి పోయి బండ్లు తోలుకువస్తూవుంటే, మామూళ్లకోసం అంవరు

అధికార్లు ఒంక్ష నాపేశారు ఆరోజు గొప్ప యుద్ధమయ్యేదే గాని, రైతునాయకులు సర్ది గాటు చెశారు.

మందనా దివానుగున్నా బుడార్సింగ్ జమీందారు కుహ్న జరిగిన వ్రాతచర్యలే ఈ మందసాకాల్వులకు పునాది.

రైతులు మందసాఅడవులను బహిష్కరించి బుడార్సింగ్ పోయి కర్రలు తెచ్చుకొని అడవులలోకి పోయి కట్టెలుకొట్టి తెచ్చుకొనిరి. మందసా తాసిల్దారు తమ మామూళ్లు పోయాయన్న అక్కసుచే నిరపరాధులైనవారిని నిర్బంధించి వారి కట్టెలను స్వాధీనం చేయమన్నారు కాని రైతులు పర్మిట్లు చూపినా వినలేదు ఆనాటికి తిరిగివెళ్లి 30 తారీఖున తాసిల్దారు,సబుకలెక్టరు, డిప్యూటీసూపరింటెంటు, కాన్ స్టెబుల్సు దళంలో తయారైవచ్చి అక్కడవున్న పద్మనాభం, మహంతి నారాయణ జగన్నాధం కాక మరి నలుగురిని కలిపి అరెస్టు చేసిరి. ఇది శుద్ధ అన్యాయచర్య దానిని చూచి తతిమ్మా రైతులంతా "వారినికూడ అరెస్టు చేయవలసిన" దని స్పర్ధపడిరి. కాని వీరిని అరెస్టు చేయలేదు మొదటి ఏడుగురిని కలెక్టరు జామీనుపైన విడుదల చేసినాడు

కాని దివాంజి యీ జామీనుకు వప్పుకో లేదు. కాని వెంటనె రద్దుచేయబడెను. ఈచర్యను చూచుటచే గున్న మ్మకి చాలాకష్టమనిపించినది. ఈమె ఒక పేదస సారి. యిల్లు నిద్దు కోవడంఅంటే కోటిమీదపని గనకదీపం వప్పించవలసిం చాలాసరిదా. తగాదాల ... ఈమె రైతుబిడ్డ

గనుక, మందసా రైతులపైని సానుభూతి కలది. ఆచార్య రంగా గారి దివ్యవాణి ఈమెలో నొక దివ్యశక్తిని కలిగించింది. ఎక్కడ రైతుసభలన్నా నడుముగట్టి నిలబడేది.

1940 సం॥ములో మందసా ప్రాంతాన్ని గొప్పరైతు మహాసభ జరిగినది. తత్ఫలితంగా రైతులోకమున గొప్ప చైతన్యం కలిగి, ఎస్టేటుదార్ల అవినీతికి క్రుద్ధులై గొప్ప విప్లవం బయలు దేరదీశారు. ఈవిప్లవంలో ధైర్యంగా నిలబడి ఇలపై నారితిరిగినది ఈ వీరవనిత. ఈమె కలెక్టరుచర్య అన్యాయమని ఖండింపగా, కలెక్టర్, పోలీసులకు సైగ చేసి ఆమెను కాల్చిచంపించెను. ఈమె సిందుచూరాలు ఈమెతో బాటు నార్ల జగన్న. శర్రకాళి గుంటుచక్రవా శి, గు ట నినారాయణ కాడ మృతి జెందారు

ఈ రక్తబలిలో మందసా ఎస్టేటు శాంతించింది ఈమె వీరవనిత. అమరత్వమాపిని ఈ గాధ జరిగినచోటు రాజమణి పురం, ప్రస్తుతం దానిని వీరగున్నమ్మపుర మంటారు.

## ౧౦. గుండుగోల కృష్ణమూర్తిగారు-పలాసా

( 1908 – 1931 )

వీరు విశాఖపట్టణంజిల్లా టెక్కలి తాలూకా పలాసా గ్రామ కాపురస్థులు. సుప్రసిద్ధ వెలనాటి శాఖకు చెందినవారు.

వీరు 1908 వ సంవత్సరం మే నెలలో యీ గ్రామంలోనే పుట్టినారు వీరికి ఇరువురు సోదరీమణులు గలరు. బాల్యమున స్కూలులో అన్ని విషయములయందును మిక్కిలి సునిశితబుద్ధి గలవారనిపించుకొనుటయే గాక ఆటపాటల యందును మిక్కిలి పేరు గాంచిరి. వీరిది సామాన్యకుటుంబము వీరు లోయరు సెకండరిలో విద్య నాపవేయవలసిన వారైరి.

అల్పవయస్సుననే కుటుంబ భారమును వహింపవలసిన వారయ్యును వీరు 1928 వ సంవత్సరమున జాతీయోద్యమమున ప్రవేశించి మిక్కిలి శ్రద్ధాభక్తులతో పనిచేసిరి.

వీరు నిర్మాణకార్యక్రమము నొనర్చుచు నూలు వడకుట వడికించుట అస్పృశ్యతానివారణ ప్రచారము హరిజన వాడలలో పారిశుద్ధ్యము బోధించుట విద్యాప్రచారము అను వీనియందత్యంతము కృషిచేసిరి. జూన్ నెల 1930 సంవత్సరంలో పూడిరేవులో ఉప్పుతయారుచేయగా పోలీసువారి [illegible]వచ్చి అసిస్టెంటు సూపరింటెండెంటు వీరిని, చల్లాల వెంకటప్పయ్య గారిని, పెంట రామమూర్తిగారిని, జనార్దనరావు మొదలైన వారిని అరెస్టుచేసి టెక్కలి గ్రామంలో డిప్యూటీ తహశీల్దారు వద్ద కేసుపెట్టిరి. వారు కేసు విచారించి కృష్ణమూర్తిగారికి ఒక సంవత్సరము కఠినశిక్షయు తతిమ్మావారికి ఆరేసి మాసములును శిక్ష విధించి బరంపురం పంపిరి. అక్కడినుండి మరియొక నెలకు బళ్ళారి క్యాంపు జైలునకును మార్చిరి. మరి రెండు నెలలు గడచినపిదప శ్రీకృష్ణమూర్తిగారిని వేలూరు

చెరసాలకు పంపిరి. అచట వీరిని B తరగతి ఖైదీగా చూచు నట్లు ఉత్తర్వుచేసిరి. వేలూరు జైలునుండి వీరు శిక్షాకాలము పూర్తికాగా 1931 వ సంవత్సరమున విడుదలనైు వచ్చిరి. జైలులోనే వీరికి తీవ్రమైన అజీర్ణవ్యాధి యేర్పడియుండెను. ఇంటికి వచ్చిన పదిదినములలోనె పై వ్యాధివలన నెక్కువ బాధపడి 1931 వ సంవత్సరం జూన్ నెలలో పరమపదించిరి

వీరు జైలుకు వెళ్ళునాటికి నాలుగు నెలల కుమారుడు గలడు. వీరి తల్లిగారును భార్యయు పిల్లవాడును ఈ యూరనే యున్నారు. చాలీచాలని భూవసతిమాత్రం గలదు. మొత్తము నకు చాల యిబ్బంది పడుచు వీరెట్లో దినములు వెళ్ళబుచ్చు చున్నారు.

---

## ౧౧ కర్ణేని రామదాసుగారు - మామిడిపల్లి

( 1901 – 1943 )

వీరు 1901 వ సంవత్సరమున మామిడిపల్లి గ్రామంలో పద్మశాలీలముగ జన్మించిరి. ఈయన ప్రాథమిక విద్యమాత్ర మభ్యసించిరి. వీరికి బాల్యమునుండియు ధైర్యసాహసోపేత ములైన కార్యములన్న నాసక్తి మెండు.

1930 నుండియు వీరు జాతీయోద్యమవాదులై మిక్కిలి దీక్షతో పనచేయుచుండెడివారు. కాని వీరికి పదవి అంటే

పరమఅసహ్యంగా ఉండేవి. అందుచేతనే కాంగ్రెసు కమి టీలోనూ ఉండెవారుగాదు. సముద్ర ప్రాన్తములయందు జమీందారీ ప్రాన్తములలో యెక్కువగా ప్రజాసేవ చేస్తూ ఉండేవారు.

శుద్ధఖద్దరు తప్ప యింకొకటి కట్టేవారుకారు. నూలు స్వయంగా వడికి తానే స్వయముగ మగ్గమువీాద నేసి తమ దారాపుత్రులచేత గూడ ఖద్దరే కట్టించుచు ప్రమాణం తప్పని సత్యశీలుడు.

వీరు 1943 ఫిబ్రవరిలో ఆగష్టు ఉద్యమంలో పాల్గొనిరి. దొరతనమువారు ఒకసంవత్సరము శిక్షవిధించిరి. జైలులో రక్తవిరేచనము లారంభమై రెండు మాసములు యమయాతన ననుభవించు చున్నను ప్రభుత్వమువారు గుక్కెడునుందు వీరి గొంతులో పోసినపాపమున బోలేదు తుదకా వ్యాధితో వీరు జైలులోనే పరమపదించిరి.

ప్రస్తుతము వీరిభార్యయు నిరువురు పిల్లలును మామిడి పల్లిలో నున్నారు పిల్లలు వ్యవసాయము చేసికొనుచున్నారు. మొత్తమువీాద వీరిలో ఉన్నగొప్పతనం యేమంటె తాము దేనినైతే చెప్పేవారో దానిని తు. చ. తప్పకుండ అక్షరశః ఆచరించి చూపుతూ ఉండేవారు.

# ౧౨. ఎల్లాపంతుల కృష్ణమూర్తిగారు

## శ్రీకాకుళం

( 1895 – 1939 )

వీరు 1895 వ సంవత్సరమున శ్రీకాకుళంలో వేగినాటి శాఖకు జెందిన యొక సుప్రసిద్ధ కుటుంబమున జన్మించిరి. వీరు భూస్వాములు. వీరు అయిదవ తరగతి వరకు చదువుకొనిరి

వీరు 1922 లో సత్యాగ్రహోద్యమమున ప్రవేశించిరి. 'సివిల్ డిజొబిడియన్సు మూవ్మెంటు' లో వీరిని అరెస్టు చేసి ఆ కేసులో శ్రీకాకుళం మేజిస్ట్రేటు ఆరుమాసములు శిక్షవిధించి రాజమండ్రి జైలుకు పంపిరి

వీరు విడుదలయైన పిదప నిర్మాణకార్యక్రమము నాచరించుచుండిరి. అంతేగాక వీరు లెక్కలేనన్ని రాట్నములను ఉచితముగా బీదలకిచ్చుచు నూలువడుకు నుద్యమమును ప్రజానీకమున నెక్కువగా వ్యాప్తి జేసిరి.

1930 లో ఉప్పు సత్యాగ్రహమున బాల్గొనిరి. వారి గ్రామములోనే వారి నాయకత్వమున ఉప్పు పండించిరి. మరల వీరిని పోలీసువారు అరెస్టుచేసి శిక్ష విధించగా మరల ఆరు మాసములు రాజమండ్రి జైలులో శిక్షననుభవించిరి.

తిరిగి 1932 లో 'సివిల్ డిజొబీడియన్సు' ఉద్యమమున బాల్గొనగా ఒక సంవత్సరం శిక్షవిధించి కడలూరు సెంట్రలు జైలుకు పంపిరి.

ఏరు శిక్ష ముగిసిన పమ్మట అనారోగ్య కారణమున యితర యే కార్యక్రమములలోను పాల్గొనకి పాట్న పరిశ్రమయే అభిమానం ... సి ... ని పనిచేయుచుండి.

1939 లో క్షయరోగి పీడితులై అక్టోబరు నెలలో స్వర్గస్థులైరి

వీరు పరమ శాన్తి స్వభావులు పరోపకార పరాయణులు. నిర్మాణ కార్యకలాపములన్న ఎరకి పట్టుదల మెండు. మొత్తమునకు వీరి జీవితమంతయు ప్రజాహితైక కార్యములలోనే గడిపిరి.

వీరు మరణించునరికి వీరి యాస్తి యంతయు జీర్ణించి పోయినది. వీరికొక కుమారుడును కుమార్తెయు గలరు. ఆడపిల్లకు వివాహమై కాపురము చేయుచున్నది. వీరి భార్యయు కుమారుడును శ్రీకాకుళం తాలూకా కొమ్ముపలస గ్రామంలో ఉన్నారు పిల్లవాడింకను మైనరు. వీరు కష్టముపై నెట్లో కాపురము వెళ్లదీసికొనుచున్నారు

(మండ కామేశం)

# ౧౩. ఈదు తవిటి నాయుడుగారు

## లోహరుజోల

( 1901 – 8 - 8 - 41 )

వీరు 1901 వ సంవత్సరమున సుప్రసిద్ధ కాపుకులమున జన్మించిరి. వీరిది సామాన్యమగు కుటుంబము. ఈయన బాల్యము నుండియు మిక్కిలి ధైర్యసాహసములు గలవారు.

ప్రాథమిక విద్యాభ్యాసానన్తరమే కుటుంబ పరిస్థితుల ననుసరించి వ్యవసాయము చేయానవలసిన వారైరి.

1930 వ సంవత్సరము నుండియు కాంగ్రెసు ప్రాథమిక సభ్యులై తాము తప్పక ప్రతిదినము నూలువడుకుచుండుటయే గాక కొన్ని రాట్నములు పెట్టి వడికించుచు నుండెడివారు కూడ.

వీరువ్యవసాయికులగుటచే ప్రత్తి పండించుటలో నేర్పు గడించి, తాముచేయు నిర్మాణకార్య క్రమమున నిగియు నొక యజ్ఞముగ తాలూకాయంతయు తిరిగి ఫలవ త్తమైన ప్రచారము చేయుచుండెడివారు వీరిట్టి పనులనన్నిటిని తమస్వంతపనులకన్న నెక్కువగ మిక్కిలి ఓర్పుతో చేయుచుండెడివారు.

1941 వ సంవత్సరములో వీరు స్వగ్రామముననే వ్యక్తి సత్యాగ్రహము జరుపగా పోలీసు వారు అరెస్టుచేసిరి.

ఆ కేసులో శ్రీకాకుళం ఫస్టుక్లాసు మేజస్ట్రేటు వీరికి నాలుగు మాసములు శిక్షవిధించెను. వీరిని శ్రీకాకుళం సబ్ జైలులోనే ఉంచిరి. జైలులోనే వీరికి జబ్బుచేసినది. ప్రభుత్వము వారు జైలులో వీరికి వైద్యసహాయ మింతయు నిప్పింపకైరి. విడుదలగ్గైన పిదపను ఆజబ్బుతోనే మంచంపట్టి చాలాబాధ పడి తుదకు 8-8-41 లో చనిపోయిరి. ప్రస్తుతం వీరి తల్లిగారు భార్యయు ఒకమైనరుకుమారుడును స్వగ్రామముననే యున్నారు. వీరికి కొలదిగ భూవసతికలదు.

---

విశాఖపట్నం జిల్లా

# ౧౪. డాక్టరు యేచూరి వేంకట్రామయ్యగారు

## విజయనగరం

( 1896 – 19-7-37 )

వీరు 1896 లో అక్టోబరు ౭వ తేదీన విజయనగరంలో ఒకసుప్రసిద్ధ వెలనాటి కుటుంబమున జన్మించిరి. వీరికి యిరువురు అప్పచెల్లెళ్లు ఉండేవారు. వీరి తండ్రిగారు విజయనగరం కాలేజీకి ప్రిన్సిపాలుగాను రెండుసార్లు ఎస్టేటు దివానుగాను పనిచేసిరి.

వీరి కాలేజీలోనే ఇంటరుప్యాసై బి. ఏ. చదువుతూ 1925 లో సీమ వెళ్ళిరి. 22–12–25 న ఫ్రాన్సులో D Sc. అనే టైటిల్ ఇచ్చారు. 10–2–26 న వీరు ఇంగ్లండునుంచి స్వదేశం వచ్చారు.

తరువాత వీరు నైజాంకాలేజీలో ప్రధానవిజ్ఞాన శాస్త్రోపాధ్యాయుడు గా నియమితులైరి. వీరు Aurora Borealis. అనే సైన్సు పుస్తకం వ్రాసిరి. వీరు సూర్యకిరణాలమీద అనేక విషయాలు కనిపెట్టారు. ఇప్పుడు తయారు చేయబడుచున్న "వనస్పతి" వీరుకనిపెట్టినదే.

వీరు 1932 నుంచి జాతీయకార్యక్రమములలో శ్రద్ధ వహించిరి. నిర్మాణ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొంటూ

ఉండేవారు. ఖద్దరు విషయంలో చాలాశ్రద్ధవహించి పనిచేసే వారు. వీరి యింటిలో పరీక్షకుచూచిన మన్నా ఒకవిదేశీనూలు పోగుకూడా ఉండేదిగాదు. కాంగ్రెస్ ఉద్యమానికి వీరెప్పుడూ చాలా విరివిగా విరాళాలిస్తూ ఉండేవారు.

వీరు తమప్రచారబలంచేత కాంగ్రెస్‌లో ఎప్పుడూ అంతులేని మెంబర్లచేర్చి, వారిచేతను ఎన్నైనంతవరకూ నిర్మాణ కార్యక్రమం చేయిస్తూ ఉద్యమానికి అంతులేని బలంచేకూరుస్తూ ఉండేవారు

1938 లో కాంగ్రెస్ టిక్కెట్టుమీద వీరు విజ.ఉ.నగరం వైస్‌ఛేర్మనుగా ఎన్నుకోబడ్డారు

వీరు వేదశాస్త్రాదులందెంతయు ప్రమాణబద్ధగలవారు. నిరతాన్నప్రదాత. శమదమాదిసద్గుణ సంపన్నులు.

వీరికి మొదటినుండియు గుండెజబ్బు ఉండుటవలన వీరు జైలుకువెళ్ళే ప్రోగ్రాములోమాత్రము పాల్గొనలేదు

19–7–1937 న గుండె ఆగిపోయి వీరు మరణించిరి.

వీరికి నలుగురుకొమార్తెలు ఒక కుమారుడును కలరు. కుమారుడింకను మైనరు.

ప్రస్తుతము వీరి పతీమణియు సంతానమును విజయ నగరముననే యున్నారు

## ౧౫. గాదె బలరామదాసుగారు
## విజయనగరం
( 1898 – 1934 )

వీరు 1898 లో పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులో జన్మించిరి గోల్కొండ వేపార్ల శాఖకు చెందినవారు. వీరు అన్నదమ్ములు ముగ్గురిలోను కనిష్ఠులు.

వీరు విజయనగరం కాలేజీలో ఇంటరు చదివారు. 1920 జాతీయోద్యమం ఆరంభింపబడినతోనే మొదటి పిలుపులోనే చదువుకు స్వస్తిచెప్పి రంగంలోకి దూకారు

నోఓట్సు కాంపైనులోను విదేశవస్త్ర బహిష్కారం విదేశవస్త్ర దహనం మద్యపాన నిషేధం మొదలైన వాటిలో తీవ్రప్రచారంచేసి మంచిఫలితాలను చూసారు.

తుదకు వీరిని 1922 లో పోలీసువారు అరెస్టుచేసి విజయనగరం మేజిస్ట్రేటువద్ద కేసుపెట్టారు. ఆ కేసులో వీరికి ఆరు మాసాలు శిక్షపడ్డది బరంపురం జైలులో శిక్షాకాలం గడిపారు

జైలునుంచి విడుదలయ్యెవచ్చిన పిదప పాలిక వేలరూపాయల స్వంతపెట్టుబడితో పత్తికొని రాట్నాలు ఉచితంగాపంచి పెట్టి ఆపత్తితో యేకులు చేయించి దారం తీయిస్తూ విరివిగా ఖద్దరు ప్రచారానికి తోడ్పడ్డారు.

ఖద్దరు ప్రచారమే వీరు దినచర్యగా గడుపుతూ తుదకు 1934 నవంబరు నెలలో టైఫాయిడ్ జ్వరపడితుదై మరణించారు.

## ౨౬. పేకుపల్లి సీతారామస్వామిగారు
## విజయనగరం
## ( 1878 — 1935 )

వీరు 1878 వ సంవత్సరంలో వీరవల్లి తాలూకా పోతలవలస గ్రామంలో జన్మించారు. వీరు సుప్రసిద్ధ వెలనాటి శాఖకు జెందినవారు. అన్నదమ్ములిద్దరిలో వీరే కనిష్ఠులు. ఒక అప్పగారుండేవారు. తండ్రిగారు చిన్నతనముననే గతించారు.

వీరు బాల్యంనుంచీ కూడా చాలా ధైర్యసాహసాలు గలవారు. వీరికి ఆటపాటల్లో ఆసక్తి జాస్తి. అయితే ఆట పాటల్లో ఆసక్తి ఉన్న యితర బాలురవలె గాక వీరు చదువు సంధ్యల్లోనూ ప్రథమకక్ష్యనుంచీ యెప్పుడూ క్రిందికి దిగే వారుగారు కనుకనే వీరు ఉపాధ్యాయులచేతనేగాక పౌరుల చేతనూ గూడ మన్నన పొందుతూ ఉండేవారు.

వీరు విజయనగరం కళాశాలలో మెట్రిక్యులేషన్ పరీక్షలో నుత్తీర్ణులైరి వీరికి మొదటినుండియు చెప్పకొన

దగిన ఆస్తి యేమీలేదు. అందుచేత చదువు పూర్తికాగానే భీమునిపట్నంలో ఓడ కర్తకుల దగ్గర గుమాస్తాగా ప్రవేశించారు.

1905 లో వీరు స్వంతంగా నారవ్యాపారం ప్రారంభించారు. వీరు యూరోపియన్ కంపెనీలకు సరుకెక్కువగా సప్లయి చేస్తూ ఉండేవారు

1915—16 సంవత్సరాల్లో భీమునిపట్నం మ్యునిసిపల్ చైర్మనుగా పనిచేశారు వారి పదవిలో ఉన్నప్పుడు పుర పారిశుద్ధ్యము విషయమై యెక్కువ శ్రద్ధవహించి స్వయంగా అన్నివిధములా ప్రతినిత్యము తనిఖీ చూస్తూ ఉండేవారు.

వీరు 1908 వందేమాతరం ఉద్యమం ఆరంభమైన నాటి నుంచీగూడ కలకత్తా మొదలైనపట్టణాలకు వెళ్లి జాతీయ ఉపన్యాసాలు వింటూఉండేవారు

19 7 లో ఆగ్రామంలో పెన్సిళ్ళఫ్యాక్టరీ పెట్టించిరి. భీమునిపట్టణంనుంచి కొంత కంది దేహంగులను కలకత్తాతీసికొని వెళ్లి, స్టాకిన్సుమేజోళ్లు బనియనులు మొదలైన అల్లిక సామానులు తయారుచేయుటకు వలయుశిక్షణమును వీరి స్వంత ఖర్చుపై యిప్పిస్తూ ఉండేవారు. అక్కడినుండి కొంత యంత్రపు పనిముట్లను తెప్పించి గొప్పవ్యాపారం నడిపించారు

వీరికి కలప వ్యాపారంగూడా బాగాఉండేది. 1920 నుంచీ యీప్రాంతపు ఉద్యమాలకు ఆదిపురుషులు వీరే అప్పుడే రాట్నాలు చేయించి ఉచితంగా అందరికీ పంచిపెట్టారు.

వీరు నిరతాన్నప్రదాతలని పేరుపొందారు. ఎంతమంది అతిథిఅభ్యాగతులు వచ్చినా విసుగు విరామంలేకుండా భోజనం పెడుతూండేవారు

విదేశవస్త్ర బహిష్కరణోద్యమంలో ముందంజవేసి యెక్కువశ్రద్ధవహించి మూలమూలల గుడ్డలు తెచ్చి తగలేస్తూ ఉండెవారు ఈజిల్లాకాంగ్రెస్ సంఘానికి కావలసినఖర్చంతా వీరేభరిస్తూ ఉండేవారు ఇంతేగాక ఏసంస్థవారు వచ్చినాసరే లెక్కలేకుండా విరాళాలిస్తూ ఉండెవారు.

వీరు 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో స్వయంగా పాల్గొన్నారు. విజయనగరంనుంచీ భమిడిపాటి యజ్ఞనారాయణశర్మ తెన్నేటివిశ్వనాథం. గుప్త, దిగుమర్తి రామస్వామి, మారేపల్లి రామచంద్రకవి గార్లతో వీరుకూడా విశాఖపట్టణం వరకూనడచి అంతవరకూ శిబిరములూ సంతర్పణములూ హంగామాలతో విశాఖపట్నంచేరి అక్కడ బసదొరక్క పోతే వీరి కళ్లాల అసీతీ, శిబిరానికి యిచ్చివేసిరి. అక్కడ వీరినాయకత్వం క్రింద ఉప్పు పండించిరి.

వీరు వీరి సతీమణి అయిన బుచ్చి రామాయమ్మగారు, శేకుమళ్ళ వరాహనృసింహంగారు, వీరిసతీమణి సీతారామమ్మగారు ఇంకా వీరిబంధువులు మొదలైనవారుకూడా పై ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని విశేషంగాఉప్పు పండించిరి. ప్రభుత్వమువారు వీరందరినీ అరెస్టుచేసి విశాఖపట్టణం జాయంటు మేజస్ట్రేటుకడ కేసుపెట్టిరి అందు వీరికొక యేడాదియు, తతిమ్మా

వారికి ఆ కేసినూనముులును శిక్షవిధించిరి వీరికిమాత్రం "బి" క్లాసునిచ్చిరి మొగట బరంపురంజైలులోనుంచి తరువాత రాయవేలూరు జైలునకు మార్చిరి వీరు బులుసు రామా జోగారావుగారితో కలిసి ఉంటూ ఉండేవారు.

జైలులో అనేక విధములుగా అనేక మందికి ఉపకార ములు చేస్తూ ఉండేవారు. మొత్తంమీద వీరు జైలుజీవితం చాలా నిర్మలంగా గడిపారు

జైలునుంచి రావడంతోనే యీ జిల్లాకాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా ప్రజలకోరికలపైన ఒప్పుకొనిరి. మిగుల శ్రద్ధతో పనిచేసిరి.

వాలంటీర్లకు వీరిగృహం కల్పవృక్షము. వీరు ప్రజాను రంజకులు, సత్యసంధులు, అని పేరుపడిరి వీరు వ్యాపార మార్గంలో గూడ అసత్యమనేమాట యెఱుగరు

1935 యేప్రెలులో వీరికొక కురుపు లేచింది. దానికి విశాఖపట్టణం జనరల్ ఆసుపత్రిలో శస్త్రచికిత్స చేసిరి. ఆపరేషనైనతరువాత వీరు ఆరురోజులు మాత్రమే జీవించి అకస్మాత్తుగా మరణించిరి.

వీరికి నలుగురు కుమాళ్ళును నలుగురు కొమార్తెలును గలరు. వీరి సతీమణియు వీరి సన్తానమును సరియైన యాదరణ లేక అవస్థపడుచున్నారు. గురదృష్టవశమున పెద్దకుమారుడు గూడ పోవుటచేత సరియైన దక్షతలేక చెట్టుకొక పిట్టగా తలా ఒకచోటకిపోయి యెవరిపొట్ట వారు పోసుకొనుచున్నారు

# ౧౭. కడిమిశెట్టి రామమూర్తి గారు

## విజయనగరం

( 1889 – 1-9-1945 )

వీరు 1889 ఏప్రిలు నెలలో విజయనగరమున సుప్రసిద్ధ ఆర్యవైశ్య కులమున జన్మించిరి. విజయనగరం కాలేజీలో మెట్రిక్యులేషన్ వరకు చదివిరి. స్కూలులో చదివేటప్పుడు అందరితో కలసి మెలసి ఉండెవారు.

అప్పటిలో వీరిది సామాన్య వ్యాపారం. 1918 లో విదేశవస్త్ర దుకాణమును స్థాపించిరి. కాని 1921-22 సంవత్సరాల్లో విదేశవస్త్రదహనోద్యమ మారంభమైనది. ఆసమయంలో వీరు మూడు నాలుగువేల రూపాయల విలువగల తమ షాపునంతనూ సంతోషంగా దహనమున కిచ్చివేసిరి.

1922 వ సంవత్సరంలో వీరు జిల్లా మొదటిదళమున వాలంటీరుగాచేరి పికెటింగు చేయగా పోలీసువారు అరెస్టు చేసిరి. విజయనగరం మేజస్ట్రేటుగారు విచారించి ఆరుమాసములు రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపిరి.

1923 లో తిరిగి రావడంతోటే ఖద్దరు ఉత్పత్తి కార్యక్రమంతోపాటు ఖద్దరు షాపును పెట్టిరి. జాతీయపాఠశాలను కూడ స్థాపించిరి.

నిర్మాణ కార్యక్రమంలో వీరూ ఒకసభ్యులుగా ఉండి స్వయంగా పనులుచేస్తూ చేయిస్తూ ఉండేవారు.

వీరు జైలునుంచి రావడంతోనే శరీరం పాడయి దీర్ఘ వ్యాధిక్రింపదిగి యెంతకును ఆవ్యాధి కుదరక బాధపడుతూ గూడా కాంగ్రెస్ పనులు మాత్రం యథావిధిగా జరిపిస్తూనే ఉండెవారు.

వీరిల్లా ఆ దీర్ఘవ్యాధితో బాధపడిపడి తుదకు 1-4-1945 న వీరస్వర్గమలంకరించిరి. వీరికి ముగ్గురుకూతుళ్ళు ఒకకుమారుడు కలరు. వీరిసతీమణియు 1945 లోనే గతించినది. ప్రస్తుత మీాయన కుమారుడు కుటుంబ భరణార్థ మీాయూరనే చిన్న వ్యాపారము చేయుచున్నాడు. ఖద్దరు అభిమాని. ఈయనచేయు చిన్నవ్యాపారముతో కుటుంబమల్లే సాగినాగ ట్లుగా నున్నది

## ౧౨. కరుణాకరం సుబ్బారావుగారు

## విజయనగరం

( 3-7-18 8 – 19-6-43 )

వీరు వెలనాటిశాఖకు జెందిన బ్రాహ్మణులు. 1898 జులై 3 వ తెదీన శ్రీకాకుళం తాలూకా ప్రియాగ్రహారంలో జన్మించిరి. వీరిద్దరు అన్నదమ్ములు. అంకు వీరగ్రజులు. వీరికి పండ్రెండవ యేటనే వీరి తండ్రిగారైన వేంకట నరసయ్యగారు

చనిపోయిరి. పందొమ్మిదవ యేడు వచ్చేసరికి తల్లిగారు కూడ మరణించిరి. తండ్రిగారు మరణించునప్పటికే వీరికి ప్రాథమికవిద్య పూర్తి యగుటయే గాక ఆంధ్రములోను సంస్కృతములోను కొంత పరిచయము కలిగి యుండెను. పై యుభయభాషల యందలి పరిచయ సాహాయ్యమునను వస్తుతః ఉన్న సూక్ష్మ బుద్ధి విశేషమునను బాల్యమునందే జ్యోతిశ్శాస్త్రమున మంచి పాండిత్యము సంపాదించిరి.

మేనమామగారు పర్లాకిమిడిలో నుండుటవలన చదువబోయి మహారాజా విద్యాశాలను చేయుటవలన వీరికి చెడుగుడు క్రికెట్టు బంతియాట మున్నగువాటిలో మంచి నైపుణ్యమును ప్రవేశమును గలవు. అందుచేత ప్రతి ఆటలోను కెప్టెన్ పదవి వీరికే లభ్యమవుతూ ఉండేది.

వీరికి సంగీతమునందును మంచి ప్రవేశము గలదు. వీరు ఏడవ సంవత్సరములోనే ఆంధ్ర నాటకరంగంమీదికి ఎక్కారు. యుక్తవయస్సు అనగా పదునెనిమిదియేండ్లు వచ్చేటప్పటికే ప్రధానపాత్రలు ధరిస్తూ వచ్చారు.

వీరికి యిరువదియవయేట వివాహమైంది. అప్పట్లో D. A. V కళాశాలలో ఉపాధ్యాయులుగా ఉన్న శ్రీ భమిడి పాటి వెంకయ్యగారి జ్యేష్ఠపుత్రిక వీరి సతీమణి

వీరు 1920 లో ఇంటరుపరీక్షకు వెళ్ళుట మానివేసి జాతీయోద్యమమున చేరిరి, గాని 22 వ సంవత్సరంలోనే కుటుంబ పరిస్థితుల ననుసరించి కళాశాలలో చేరవలసినవారైరి

వీరు 1925 లో పట్టభద్రులైరి పిదప మదరాసు లాకాలేజీలో న్యాయవాది పరీక్షకు చదివిరి. తరువాత విజయ నగరంలోనే ప్రాక్టీసు పెట్టిరి. ఏదియెట్లైనను వీరునూలువడ కుట మున్నగు నియమములనుమాత్ర మెప్పుడును మానకుండిరి.

వీరు స్వయముగ నూరవనెంబరు నూలు తీయుటయే గాక అట్టివారిని చాలమందిని తయారుచేసిరి. అంతేగాక వీరు ఉచితముగ పంచిపెట్టు రాట్నములకంతులేదు హరిజనసేవ మున్నగునవే ఆయన దినచర్యలైపోయినవి.

వీరు విజయనగరములో కాంగ్రెస్ తరఫున కరపత్రముల ద్వారా చాలా సంచలనం కలిగించిరి. 1925 నుంచి టవున్ జిల్లాల కాంగ్రెస్ కమిటీలకు హాజరవుతూ ఉండేవారు. "ఆలిండియా ప్రావిన్షియల్ కమిటి" లలోగూడా మెంబరుగా ఉండేవారు.

రంగాగారు ఈ ప్రాంతమునకు వచ్చినపుడు వారితో వీరు ఐక్యమై జిల్లాకిసాన్ మహాసభకు, హరిజన్ సభకు అభ్యర్థులుగా ఉండేవారు.

1930 ఉప్పుసత్యాగ్రహ సమయంలో పోలీసువారు వీరియిల్లు పలుమార్లు సోదాలుచేశారు. ఆసమయంలో యీ జిల్లామొత్తంలో వీరి పలుకుబడి అధికంగా ఉండెది.

తరువాత గాంధి యిర్విన్ ఒడంబడికలో వీరిని అరెస్టు చేయలేదు. ఆపిదప జిల్లాకాంగ్రెస్ సంఘానికి జాయంటు కార్యదర్శిగాను ఉండేవారు.

అప్పట్లో వీరు కార్యక్రమం బహునేర్పుతోనూ చాక చక్యంతోనూ నడుపుతూ ఉండేవారు.

1933 వ సంవత్సరంలో నెల్లిమర్ల లేబరు స్ట్రయికులో నాయకత్వం వహించి ఉద్యమమును బహు చాకచక్యంగా నడిపించి లేబరును గెలిపించిరి.

1936వ సంవత్సరంలో విశాఖ తూర్పుగోదావరిజిల్లా లలో "ఫ్యాక్టరీస్ అండ్ డాక్ లేబరు" స్థానాలకు M L A కాంగ్రెస్ అభ్యర్థిగా ఎం. వి. రెడ్డి, డి. సైమన్‌గార్లకు, పోటీగా నిలచి అసంఖ్యాకములైన హెచ్చుఓట్లతో గెలిచిరి.

లేబరుపార్టీ నొకదానిని స్థాపించి వారికి ప్రత్యేకంగా కాలనీలుకట్టించి నెల్లిమర్లను, అందలి పారిశ్రామికులను ఒక దారికి తెచ్చి వారికెన్నియో శాశ్వతములగు వసతులను సౌఖ్యములను గలుగజేసిరి.

1940 లో వీరు వ్యక్తిసత్యాగ్రహంలో పాల్గొన్నందున పోలీసువారు అరెస్టుచేసిరి. జాయింటుమేజిస్ట్రేటువద్ద కేసుపెట్టిరి. ఆ కేసులో వీరికి ఒకసంవత్సరం ఖైదు, 250 రూపాయలు జరి మానావేసి "బి" క్లాసిచ్చి తిరుచినాపల్లిజైలుకు పంపిరి. వీరికి జైలులో నున్నంతకాలం అరుచుగా జబ్బుచేస్తూ ఉండేది. అందుచేత 4మాసాలైనతర్వాత A క్లాసుకు మార్చారు. ఎన్ని కష్టములు గలిగినా వీరు మొత్తం శిక్ష పూర్తిగా అనుభవించి విడుదలయైరాగానే 1942లో వీరిని ఇంటర్న్ చేసిరి.

వీరిని యింటరన్ చేసినపుడు గూడ వీరికి దేహస్థితి సరిగా లేకపోయినందున వారిస్థితి గాంధీగారికి అప్పీలు చేయబడెను అపుడు గాంధీగారు సత్యాగ్రహము చేయనక్కరలేదు, శరీరస్థితి చూచుకొమ్మని అనుజ్ఞయిచ్చిరి.

కాని అప్పటికిని వీరికి విశ్రాన్తియను మాటయేలేదు. ఏప్రజాసంస్థలోగాని ఏయుద్యమంలోగాని వీరి సలహాలేనిదే అప్పట్లో పని జరిగేదికాదు వీరు ఆంధ్రరాష్ట్ర జమీన్‌రైతు సంఘంలో ముఖ్యసభ్యులుగా ఉండి జమీన్దారీ విచారణ సంఘ ర్భములో సదరు సంఘాధ్యక్షులైన శ్రీ శర్మగారి కెంతయో

మొత్తముమీద వీరు నిరాడంబర కార్యకర్తలు విధివిరామములేని కార్యభారము తన్నిర్వహణము కారణముగా 1943 లో వీరికి జలోదరమారంభమైనది కొన్నాళ్ళు చాల బాధపడి తుదకు జూన్ 1 వ తేదీని వీరుస్వర్గమలంకరించిరి.

వీరి భార్యయు ముగ్గురు కుమారులను నలుగురు కూతుళ్ళును ప్రస్తుత మిచటనే యున్నారు. పిత్రార్జితం బాగాతు ఏకొద్దిగానో ఉన్నది. కలోగంజోగా కాలక్షేపం చేస్తున్నారు.

విజయనగరం
2-3-1946

(కరుణాకరం వెంకటనరసింహమూర్తి)

## ౧౬ వసన్తరావు బుచ్చిసుందర రావుగారు

### విశాఖపట్టణం

( 1887 — 3-3-1937 )

1887 వ సంవత్సరం విశాఖపట్టణంలో జన్మించిరి. వీరు కరణ కమ్మ వ్యాపారుల శాఖకు చెందినవారు వీరు ముగ్గురు అన్నదమ్ములు. అందులో వీరు రెండవవారు. వీరికి అయిదుగురు ఆడుబుట్టువులుగూడ గలరు.

ఆదిలో వీరు దామర యెస్టేటు మొఖాసాదారు. చిన్నప్పటినుండి మంచి జాతీయాభిమానంగల ఉదారపురుషులు వీరి వంశంలోవారంతా.

మెట్రిక్యులేషన్ చదువుతూ 1908 లోనే వీరు "వందేమాతరం" ఉద్యమంలో పాల్గొన్నందున విశాఖపట్టణం కళాశాలాధికారులు కళాశాలా ప్రవేశమును బహిష్కరించిరి.

వీరు మరుసంవత్సరం మదరాసు కళాశాలలో చేరిరి. 1917 లో బి. ఏ. మొదటిసంవత్సరం చదువుచుండగా విద్యార్థి ఉద్యమంరాగా దానిలో వీరు నాయకత్వంవహించి జేగీయమానముగ నడిపించిరి. అచటను వీరికి T C యిచ్చి పంపివేసిరి. పిదప తిరువేంద్రములో రెండుసంవత్సరములు చదివి ప్యాసైరి. పిమ్మట వీరు న్యాయశాస్త్రముచదివి 1920లో యీయూరనే ప్రాక్టీసుపెట్టిరి. ఆరుమాసములు ప్రాక్టీసు చేసిరి.

పిమ్మట కాంగ్రెస్ నోవోట్స్ కాంపెయిన్‌లో అఖండ మైన ప్రచారంచేసిరి. 1921లో విశాఖలో నొక వాలెంటీర్ల శిబిరము నొకదానిని నడిపించిరి.

ఆరోజుల్లో విదేశవస్త్ర దహనం బాగా చేస్తూ ఉండే వారు. విదేశవస్త్రములు వస్తువులు అమ్మే దుకాణాలవద్ద పికెటింగు చేయుట నూలు తీయించుట ప్రారంభించినవారు వీరే.

వీరు 1921 కాంగ్రెస్ మహాసభనుంచి వస్తూ ఉండగా వారిచ్చిన ఉపన్యాసములకుగాను పోలీసువారు అరెస్టుచేసి స్థానిక మేజస్ట్రీటువద్ద కేసు పెట్టిరి. ఆ కేసులో వీరికి ఆరు మాసాలు శిక్ష విధించిరి. రాజమండ్రీ సెంట్రల్ జైలుకు పంపిరి.

వీరు స్వరాజ్యపార్టీలో యీ నియోజకవర్గమునకు స్వరాజ్యపార్టీ తరఫున నిలువబడిరి. జస్టిస్ భానోజీరావుకు యెదురు పార్టీగా నిలువబడి ఎనిమిది ఓట్ల తేడాలో ఓడి పోయిరి.

వీరు పల్లెలవెంట విస్తారంగా తిరిగి కాంగ్రెస్ సందేశ ములను చాటుతూ ఉండేవారు. చాలాకాలం నుంచి ఉబ్బసపు బాధ ఉన్నా దాన్నిగూడా లక్ష్యం చేయకుండా విశేషంగా ప్రచారం చేస్తూ ఉండెవారు. పట్టుదల, పరిస్థితు లె కూలంగా ఉన్నా లక్ష్యం చేయుకుండుట వీరి సహజగుణము.

ఈనాటి పటాటోప భూయిష్ఠములైన వేషభాషలు వీరి కెంత మాత్రము నచ్చవు. నిరాడంబర జీవులు.

1930 లో ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో వీరు ఉపన్యాసా లిచ్చారని అరెస్టు చేశారు. మరునాడే గవర్న మెంటు వారు కేసు తీసేసుకున్నారు 1937 లో కాంగ్రెస్ యెలక్షనులలో తీవ్రంగా ప్రచారంచేసి కాంగ్రెస్ విజయాని కెంతో తోడ్పడిరి.

3—3—1937 న (స్పెయిన్ డే మీటింగు) జరిపి ఆ మీటింగులో ఉపన్యసించి టవున్ హాలునకు వచ్చి కుర్చీలో కూర్చుండి యుండగా కొంచెము ఆయాసము వచ్చినట్లయి మరణించిరి.

వీరు గతించునప్పటికి వీరికి చాలా అప్పులు గలవు. అందుచేత ప్రభుత్వమువారు రిసీవరును అప్పాయంటు చేసిరి. పిదప అప్పులక్రింద ఆస్తియంతయు వేలము వేయించిరి.

వీరి కిరువురు ఆడపిల్లలు గలరు. వీరి సతీమణి పిల్లలతో సేయూరనే నివసించుచున్నారు కుటుంబభరణము కష్టముగా నున్నది.

(లక్ష్మీనారాయణ రావు)

6—3—40

# ౨౦. కొల్లూరు సూర్యనారాయణగుప్తగారు

## విశాఖపట్టణం

( 1891 – 5-3-1945 )

1891 వ సంవత్సరమున వీరు విశాఖపట్టణమున ఆర్య వైశ్య కుటుంబమున జన్మించిరి. వీరి వంశము చాల ప్రసిద్ధి జెందినది. వీరు నల్వురు అన్నదమ్ములు, నలుగురు అక్క చెల్లెండ్రు. వీరి పసితనముననే తలిదండ్రులు స్వర్గస్థులైరి. వీరి పెద్దలు రంగూన్ లో కలప వ్యాపారం చేస్తూ ఉండేవారు.

వీరు 1926 వ సంవత్సరం వచ్చేసరికి B A ప్యాసయిరి. అయితే 1920 నుంచీగూడా వీరు ఖద్దరు దీక్షవహించడమేగాక కాంగ్రెసు సభలో ఉపన్యాసాలు గూడా తరుచు ఇస్తూ ఉండేవారు.

1927–28 సంవత్సరములలో విశాఖపట్టణం C. B M హైస్కూలులో ఉపాధ్యాయవృత్తియందుండిరి. 1929 లో మదరాసు లాకాలేజీలో వకీలు పరీక్షకు చదివి ఉత్తీర్ణులై విశాఖపట్టణంలోనే ప్రాక్టీసు పెట్టిరి.

1930 లో వీరిని ఉప్పుసత్యాగ్రహ సందర్భమున కాంగ్రెసువారు మాండలిక దళాధిపతిగా నియమించిరి. అపుడు వీరు సత్యాగ్రహంచేసిన సందర్భమున ప్రభుత్వమువారు

అరెస్టు చేసిరి. విశాఖ మేజస్ట్రీటుగారు వీరికి ఆరుమాసములు శిక్షవిధించి బరంపురం జైలుకు పంపిరి. తరువాత యిరువది రోజులకే వీరు రాయవెల్లూరుకు మార్చబడిరి. శిక్షానంతరమున జైలునుంచి వచ్చిన తోడనే మరల న్యాయవాదిగా ప్రాక్టీసు చేయనారంభించిరి

1924 వ సంవత్సరం లగాయతు వీరు నిర్మాణకార్య క్రమానుసారం పల్లెలకుపోయి నూలువడికించి నేయించిఆబట్టలు కొట్లోపెట్టి అమ్మించేవారు. ఈజిల్లాలో ఖద్దరు వ్యాప్తిచేసిన వారిలో వీరుచాలాముఖ్యులు

వీరు బాల్యంనుండియు నేదేవిధియొక సంస్థలోజేరి దేశసేవ చేయుచునేయుండిరి, చాలకాలం ఆంధ్రమహాసభలకు వాలంటీరుగా వెళ్ళుచుస్తూనే ఉండేవారు. వీరు వాలంటీరుగా పని చేయని జాతీయోద్యమమే లేదన్నను అతిశయోక్తి గాజాలదు.

వీరు కేవలము సేవానిరతులేగాక సంఘ సంస్కరణాభి లాషులును. జాతీయోద్యమములయందువలెనే సంఘసంస్కరణమునందును వీరిది . బందంజయే వితంతూద్వాహముల నెన్నిటినో ప్రోత్సహించి యెందరో అనాధబాలికల విషమము జీవితముల నమృతమయములుగా మార్చివేసిరి.

వీరికి మంచిప్రాక్టీసు ఉండేది. నెల 1 కి సుమారు ఏడు ఎనిమిదివందలు కళ్ళచూచే వారు అయితే యెంతసంపాదన పరులో అంత దానపరులును శ్రీ వి. వి. గిరిగారు లేబరుమంత్రి అవడంతోటే " బై ఎలక్షన్ " లో వారిస్థానే వీరు ( సెంట్రల్)

M. L A గా నియమింపబడిరి. వీరు శారదా బిల్లుకు దోహదమిప్పించినవారిలో ప్రధానులు.

వీరు 20-3-41 న వ్యక్తి సత్యాగ్రహం చేయగా ఆరు మాసములు శిక్ష విధించి 'ఎ' క్లాసు నిచ్చి అల్లిపురం క్యాంపు జైలుకు పంపిరి. జైలు అధికారులకు వీరికి పడేది గాదు. ఎప్పుడు సౌకర్యములకొరకై వీరికీ వారికీ తగవు లాటలు జరుగుతూ ఉండేవి

వీరు మహా పట్టుదలగలవారు. న్యాయం కొరకు ఏ ఆటంకములనూ లక్ష్యపెట్టకుండా పోట్లాడుతూ ఉండే వారు వీరిని వీరిసహచరులు, తోటిప్రచారకులు గురుతుల్యు లుగా భావిస్తూ ఉండేవారు.

వీరు 1924 నుంచి 1927 వరకు విశాఖ మ్యునిసిపల్ కౌన్సిలరుగా నుండిరి. ఆకాలమున వీరు మ్యునిసిపల్ వ్యవహారములను మిక్కిలి చాకచక్యముగను మిక్కిలి కట్టుదిట్టము గను నడిపెంచిరి.

వీరు చాలకాలము డిస్ట్రిక్టు కాంగ్రెసు సంఘమునకున్ను హరిజన సంఘమునకున్ను కార్యదర్శిగా పనిజేసిరి.

వీరికి 1944 లో గుండెజబ్బు ఆరంభమైంది. అవిశ్రాంతంగా పనిచేయడంవల్లనే వీరి కీవ్యాధి యేర్పడ్డది. వీరు దీనితో చాలా బాధపడ్డారు

1945 వ సంవత్సరం మార్చి మొదటవారం ప్రారంభమైన కేంద్ర శాసనసభలకు వెళ్ళారు. ఆ సభలో ఉత్తర

విశాఖజిల్లా కిరువునుగూర్చి గంభీరోపన్యాస మిచ్చారు. ఉపన్యాసానన్తరం సీటుమీద కూర్చున్నవారికి కూర్చున్న ప్లే గుండె ఆగిపోయినది. ఈ విధముగా 5—3—45 న ఎసెంబ్లీ హాలులోనే వీరు పరమపదించిరి. ప్రభుత్వమువా రాత్యుతక ళేబర మును విమానముపై తీసికొనివచ్చి విశాఖపట్టణముననున్న వారి కుటుంబీకుల కు ఒప్పగించిరి. హాస్పటలు కారుపై శ్మశాన మునకు గొంపోయి దహనసంస్కారాదులను జరిపించిరి.

వీరికి నలుగురు కొమరులును ఐదుగురు కొమార్తెలును గలరు. పెద్దకుమారుడు అసిస్టెంటుడైరక్టరుఆఫ్ రేషనింగుగా పనిచేయుచున్నారు. రెండవవారు ఇంటర్‌మీడియేట్ పరీక్ష ప్యాసైనారు. తతిమ్మావారు చిన్నవారు. వీరిసతీమణియు పిల్లలును ప్రస్తుతము విశాఖపట్టణములోనే యున్నారు.

విజయనగరం }
3—3—46 }

## ౨౧. భమిడిపాటి చినయజ్ఞనారాయణ శర్మగారు, మాడుగుల (విశాఖ)

( నందన — 23-3-38 )

వీరు నందనసంవత్సరం పుష్యశుద్ధ త్రయోదశి శని వారం రోజున మాడుగుల గ్రామంలో జన్మించిరి. వీరు వెల

నాటి శాఖకు చెందినవారు. వీరిద్దరు అన్నదమ్ములు. వీరే జ్యేష్ఠులు. ఇద్దరు అప్పచెల్లెండ్రు.

వీరు అనకాపల్లిలో మూడవఫారము వరకు చదువు కొనిరి. తరువాత A. V N కాలేజీలో Metriculation పరీక్ష నిచ్చిరి.

అప్పట్లో వీరిఆస్తి చాలా పెద్దది. అగ్రహారీకులు. వీరు 1920 సంవత్సరంలోనే జాతీయోద్యమములో ప్రవేశించి యీప్రాన్తమున తీవ్రప్రచారము చేసిరి.

1924 లో జిల్లాబోర్డు వైస్‌ప్రెసిడెంటుగాను పిమ్మట ప్రసిడెంటుగాను గూడ కాంగ్రెస్ టిక్కెట్టుపై యెన్నుకొన బడిరి.

వీరే నిర్మాణకార్యక్రమము విషయమున చాలశ్రద్ధగా పనిచేయుచుండెడివారు. ఖద్దరు విషయంలో వీరు మిక్కిలి శ్రద్ధ వహించేవారు. వీరు స్వయముగా నొక ఖద్దరు కొట్టు కూడ పెట్టిరి.

పదునైదు సంవత్సరములు మాడుగుల పంచాయతీ బోర్డు అధ్యక్షులుగా ఉండి యెన్నో పురోభివృద్ధికార్యక్రమ ముల నొనర్చిరి.

వీరు ఉత్తమశ్రేణికి జెందిన నటకులుగూడ, ఆంధ్ర నాట్యకళాపరిషత్తుకు వీరు చాలకాలము కార్యదర్శిగా పని చేసిరి.

1930 లో ఉప్పుసత్యాగ్రహంలో విశాఖపట్టణం శిబిరానికి ప్రచారకులుగా ఉండి అక్కడ ఉప్పు చేయగా పోలీసువారు అరెస్టు చేసిరి. విశాఖ మేజస్ట్రీటు ఆరుమాసాలు శిక్ష విధించి మదరాసు పంపిరి. అక్కడ జైలులో తిండి సరిగా లేగని నిరశనవ్రతము బూనిరి ప్రభుత్వమువా రంత వీరికి 'బి' తరగతి నిచ్చి రాయవేలూరు పంపిరి. వీరు శిక్షాకాలమైజైలునుండి రావడంతోటే ప్రభుత్వమువారు చురల జైలును పంపిరి. పిమ్మట గాంధీ ఇర్విన్ ఒడంబడికలో వీరిని విడిచి వేసిరి

వీరు జిల్లా అండ్ ప్రావిన్షియల్ కాంగ్రెస్ కమిటి సభ్యులుగా చాలకాలము ఉంటూవచ్చారు.

వీరు కార్యకర్తలేగాక కవులుగూడ. శూర బొబ్బిలి, ప్రభాకర విజయం, నందనుధ మొదలైన నాటకములు రచించిరి

ఈయన విశాఖపట్టణంలో ఉప్పు వేలం వేస్తూ ఉండగా గుప్పిడిలోని ఉప్పు ఎంత ప్రయత్నించిగూడ కలెక్టరుగారు తీయించలేక పోయినారు. పోలీసు లెందరో ప్రయత్నించీగూడా గుప్పిడి తీయలేక పోయారు. చెయ్యిఅంతా రక్తమయమైపోయినా వీరు చేతిలోని ఉప్పుమాత్రం జారవిడిచారుగారు. తుదకు పోలీసువారు విఫలమనోరథులై వెళ్ళిపోయారు. తరువాత ఆఉప్పు వేలం వేయగా గుప్తగారి భార్య పాతికరూపాయలకు కొనుక్కున్నది.

వీరికి కసరత్తునం దెక్కువ అభిమానము. కత్తిసాము లోను బాణాకఱ్ఱ త్రిప్పుటలోను వీరికెక్కువ లాఘవముండేది జిల్లాలో ఉండే ప్రజలందరికీ వీరిమొకల అభిమానం ఉండేది.

వీరిఉపన్యాసం పండితపామర జనానురంజకంగా ఉండేది. వీరు జిల్లాబోర్డు సభ్యులుగా ఉన్నప్పుడు గవర్నరుకు సమ్మాన మీయటానికి బోర్డు ఆలోచించే సందర్భంలో ఈయన వద్దని గట్టిగా దెబ్బలాడటమేగాక బ్రిటీషుప్రభుత్వ విధానమును, అధి కారుల కిట్టి సమ్మానముల నిచ్చుట పద్ధతిని చాలదూషించిరి. అప్పటి కలెక్టరు ఈవిషయం చూచాయగా తెలిసి బోర్డు ప్రెసిడెంటు శ్రీ చింతలపాటి నరసింహరాజుగారిని బోర్డులో యేమిమాట్లాడినదు వివరము లిమ్మని సంజాయిషీ అడుగగా శ్రీ రాజుగారు- అవి యింటిగొడవలవంటివి, మీకడుగరాదు మేము చెప్పరాదు అని నిక్కచ్చిగా చెప్పివేసిరి కాని సమ్మానమీయవలయునను తీర్మానముమాత్రము తీర్మానింప బడినది. అయితే వీరా సమావేశమునకు వెళ్లుట మానివేసిరి.

వీరి సతీమణి సింహాచలమ్మగారును మిక్కిలి విజ్ఞాన వతి అగుటచే వీరికి యుద్యమమునందెంతయు తోడ్పడు చుండెడి వారు. అంతేగాక ఆమెగారును కొన్ని సంవత్సరములు తాలూకాబోర్డు సభ్యురాలుగా ఉండి ప్రజాసేవ నొనర్చిరి.

1935 లో యజ్ఞనారాయణ శర్మగారికి రాచపుండు లేచినది. దానితోనే వీరు చాలాబాధపడి తుదకు 23—3—38 ని చోడవరం గ్రామమున పరమపదించిరి.

ఇపుడు వీరి భార్యయు కుమారుడును కుమార్తెయు స్వగ్రామముననే యున్నారు. వీరికి మొదటఉన్న ఆస్తిలో యిపుడు పదవవంతు మాత్రము నిలచియున్నది. పిల్లవాడు IV Form వరకు చదువుకున్నాడు.

వీరు ఓపినంతవట్టు ఆంధ్రభాషాసేవను ఒనర్చి ఆంధ్రుల యాదరాభిమానములకు బాత్రులైరి.

వీరు నిరతాన్నదాతలుగాను పరోపకారపారీణులుగాను ఆంధ్రదేశముననేగాదు భారతమునందును వాసిగాంచిరి.

## ౨౨. శ్రీమతి మూలా వెంకమాంబగారు

(1886 – 1938)

1886 సం॥ రంలో శ్రీ కురుపాం, ఎష్టేటు దివానుగా నైన ఆతి అప్పడుగారి ప్రథమపుత్రికగా జన్మించి, విజయనగరం ఎష్టేటు Land Revenue Supervisor లాండ్ రివెన్యూ సూపర్వైజర్‌గా పనిచేసిన మూలా సత్యనారాయణగారిని చేబట్టినది.

1921 సం॥ రం॥ [illegible] జాతీయోద్యమములో పని [illegible] జేసి బొబ్బిలి[illegible] శ్రీ [illegible] భట్టర్

రమణమ్మగారితో కలిసి కాంగ్రెస్ ప్రచారమునకు వెళ్లగా రమణమ్మగారిని 144 సెక్షన్ ప్రకారం శిక్షింపగా ఆసందర్భమున సభజరిపి, నాటినుండియు చనిపోవువరకు కాంగ్రెస్ సేవను సాగించెను.

4 జనవరి 1932 సంIIరంలో కాంగ్రెస్ ఆదేశానుసారము విదేశ వస్త్ర బహిష్కరణోద్యమమునందు విజయనగరంలో పికెటింగ్ చేయగా నాల్గుమాసాలు శిక్షవిధించి C క్లాసునిచ్చిరి.

1932-33లో కాంగ్రెస్ అక్రమసంస్థగా ప్రకటింపబడెను. అట్టిసమయమున నరిసెపట్నం తాలూకా కైలాసపట్నములో రాజకీయసభలు జరుపగా మూడుమాసాలు కఠినశిక్షవిధించి, C క్లాసు, 200 రూIIలు జరిమానా విధించిరి. ఈమె జరిమానా చెల్లించక పోవుటచే చరాస్తిని జప్తుచేసిరి.

ఈమె ఖద్దరుప్రచారమునకు యెక్కువ పాటుపడెను. మహిళాసంఘమున కపారమైన సేవనుజేసి, స్త్రీవిద్య-స్త్రీస్వాతంత్ర్యముకొరకు పాటుపడెను. వితంతువైన తనకుమార్తెకు వైద్యవిద్యను చెప్పించెను.

1938 శ్రావణపూర్ణిమనాడు ఏరవల్లితాలూకా పెడిచర్ల గ్రామమునందు దివంగతురాలయ్యెను.

(M. నారాయణరావు)

# ౨౩. శ్రీమతి శిష్టా రంగమ్మ

## దిమిలి, విశాఖజిల్లా

( 1870 – 1949 )

జననము 1881 సం॥రం ఈమె నిరాకరణసహాయోద్యమము ప్రారంభమునుండి కాంగ్రెసులో పాల్గొనెను. 930 సం॥ర లో ఉప్పు సత్యాగ్రహములో చేరినందుకు మూడు మాసములు జైలు శిక్ష ననుభవించెను.

1932 సం॥రంలో కైలాసపట్నంలో జిల్లా కాంగ్రెస్ సమావేశము జరుపుచుండగా నిర్బంధింపబడి ఆరు మాసములు ప్రభుత్వము వారిచే 'C' class ఖైదీగా శిక్షింపబడెను.

1940, 1942 సం॥రంలో ఆగష్టు వుద్యమంలో జేరి కరపత్రాలు పంచినందుకు చెరి 3 మాసములు శిక్షింపబడి రాయవెల్లూరు జైలున కంపబడెను.

ఈమె కొడుకులు కోడండ్రు అంతా కాంగ్రెసు ఉద్యమంలో పనిజేసి కారాగార శిక్ష ననుభవించిరి.

1929 సం॥ లో సైమన్ కమిషను బహిష్కరించి నందుకు శిక్షింపబడెను.

1926 సం॥ లో ప్రభుత్వమువారు కృష్ణా గోదావరి జిల్లాల రైతులపై నివిధించిన అదనపుపన్నులను రైతులు చెల్లింపజాలమని ఆందోళనచేయుగా, బర్డోలిలో పన్నుల నిరాకరణను జయప్రదముగా జరుపుట చూచి, ముఖ్యముగా, పశ్చిమ, తూర్పు గోదావరిజిల్లాలలో రైతుసంఘాలను లేవదీ, చేయుబడిన తీవ్ర ఆందోళనకు భయపడి కీ. శే. ఆరోగ్యస్వామి మొదల్యారు అధ్యక్షతక్రింద ఒక అనధికారసంఘాన్ని చేర్చి విచారించుట కేర్పాట్లుజేసిరి ఈ సంఘంలో శ్రీ స్వామి ముఖ్యసభ్యుడు. వీరు 60 సంవత్సరాలు పన్నులెచ్చింప కూడదని సూచించి వుండిరి

1935 లో కాంగ్రెస్ వర్కింగు కమిటీ సభ్యుడుగా ఎన్నుకోబడెను.

1937 లో చెన్నపురిశాసన సభ్యుడుగా Congress ticket పైని ఎన్నకోబడెను.

1940 సం॥ రం వ్యక్తిసత్యాగ్రహ ఉద్యమమున పాల్గొన్నందుకు 1 సం॥ శిక్షింపబడెను

అఖిల భారత కాంగ్రెస్‌లోకూడ సభ్యులుగా నుండిరి : పెద్దాపురం తోటవిందు సందర్భంలో 1930 లో లాటిచార్జికి గురియగుటయే కాకుండా, ప్రభుత్వపు కాల్పుల సందర్భంలో ధైర్యంగానిలిచి ఎదుర్కొన్న వీరశిఖామణి ఆఖరు పర్యాయం

కాంగ్రెసు శాసనసభాసభ్యులుగా రాజమండ్రి నియోజక వర్గ మున ఎన్నుకోబడెను.

1945 అక్టోబరులో మరణించెను అవసానకాలములో నోట్ (will) విలువ్రాసి, కాంగ్రెస్ మొదలగు ధర్మసంస్థ లకు పుత్రులతోబాటు ఆస్థినిదానమిచ్చిన – దానకర్ణుడు –

## ౨౬. డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యము గారు

## సీతానగరం సత్యాగ్రహాశ్రమ స్థాపకులు

(12-10-1891 – 23-12-1936)

ఆంధ్రదేశమున ననేక జాతీయవీరులకు జన్మస్థానమై వాసికెక్కిన గుంటూరు మండలమునందలి కొండవీటి సీమ లోని ఫిరంగిపురమున ది 12 అక్టోబరు 1891 సం॥రం తేదీని శ్రీ సుబ్రహ్మణ్యముగారు జన్మించిరి. వీరు తెలగాణ్యశాఖకు జెందిన బ్రాహ్మణవంశజులు. వీరి తండ్రిగారు ఆయుర్వేద వైద్యులు. వీరిద్దరు సోదరులలో నీయన రెండవవాడు. అప్పట్లో వీరి కుటుంబము పేదది. శ్రీ సుబ్రహ్మణ్యముగారు మెట్రిక్యు

లేషన్ వఱకు చదివిరి ఆకాలములో వైద్యవృత్తియందు ప్రజల కెక్కువ ఆదరముండెది ఈ విద్యకు చెన్నరాజధాని కంటె బంగాళాదేశమునందు విద్యావిధానము బాగుండెనని పెక్కుమంది ఆంధ్రులతోపాటు వీరుకూడా వెళ్లి నాలుగు సంవత్సరములు వైద్యవిద్య నభ్యసించి 1915—16 సంవత్సరము లో రాజమహేంద్రవరం వచ్చి ప్రాక్టీసు ప్రారంభించిరి. ప్రారంభములోనే చాల ధనమును, గౌరవ మర్యాదలను ఆర్జింపసాగిరి. నెలకు సుమారు వేయిరూపాయలు సంపాదించెడివారు. అప్పట్లోనె అనేకమంది బీదవిద్యార్థులకు గుప్తదానములు చేయుచుండెడివారు.

1916-17 సంవత్సరములలో వచ్చిన 'హోంరూలు' ఆందోళనలో పాల్గొని సహాయకార్యదర్శిగా పనిచేసిరి. 1920 లో వచ్చిన సత్యాగ్రహోద్యమములో తీవ్రముగా పని చేసిన యోధుడు. అప్పుడే తనకువచ్చు ధనాదాయమును తృణప్రాయముగా నెంచిన ధీరుడు అప్పటికి ప్రజలవలన రావలసిన సొమ్ముకూడా విడిచిపెట్టి ఉద్యమములో దుమికిరి. వీరు మంచి వక్తలగుటచే తూర్పుగోదావరి జిల్లాలోనే కాక ఆంధ్రదేశమందంతటను అచిరకాలముననే ప్రఖ్యాతిగాంచిరి. వీరు చేసిన కృషిఫలితంగా 1921 లో మొట్టమొదటిసారి ప్రభుత్వమువారి కోపాగ్నికి గురియై కడలూరు చెరసాలలో నొక సంవత్సరము కఠినశిక్ష ననుభవించిరి.

1923 సం॥లో కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభలో వాల్గొని అపారమైన సేవచేసి ఆసభ అత్యంతజయప్రదముగా నెరవేరుటకు కారకులలో నొకరైరి.

1924 వ సంవత్సరములో నిర్మాణ కార్యక్రమములో తీవ్రముగా పనిచేసిరి అప్పట్లో ఒయలుదేరిన స్వరాజ్యపార్టీయందు విరికేమాత్రం నమ్మకము లేకపోయెను. గ్రామపునర్నిర్మాణము మనదేశమునకు ముక్తియని నమ్మి రాజమండ్రిని వదలి అచ్చటికి సుమారు పదునాలుగు మైళ్లదూరములోనున్న సీతానగరంగ్రామంలో నివాసమేర్పరచుకొని నిర్మాణకార్యక్రమమును కొనసాగించుచుండెడివారు.

1925 లో వీరు స్వంతకృషివలన 13 ఎకరముల భూమిలో 20 వేల రూపాయిలు వ్యయపరచి సీతానగరమునందే ఒకఆశ్రమమును స్థాపించిరి దీనికి సత్యాగ్రహాశ్రమమని పేరుపెట్టబడెను తామును తమసహచరులును కుటుంబములతోగూడ నీయాశ్రమమునందుండి గాత్రింబవళ్లు శ్రమపడి ఖద్దరుఉత్పత్తిని గూర్చి ప్రచారముచేసి ఆంధ్రదేశములో ఖద్దరుప్రచారమున సీతానగరం ఆశ్రమమునకు అగ్రస్థానమును సంపాదించిరి ఆశ్రమవాసుల నందఱను తన కుటుంబములోని వారివలె చూచుకొనుచు, వారందరి ఆదరాభిమానములకు పాత్రుడై ఆదర్శమైన ఆశ్రమ ధర్మములు నిర్వర్తించెను.

1929 సం॥రములో గాంధీమహాత్ముడు ఖాదీ ప్రచారమునకై ఆంధ్రదేశమునకు వచ్చినపుడు ఈఆశ్రమమునకు స్వాయ

ముగావచ్చి ఇచ్చటిపనినిజూచి మెచ్చుకొని తమ ఆశీర్వాద మును, తూర్పుగోదావరిజిల్లాలో ఏసూ్రైన నిధినుండి 25 వేల రూపాయలను ఇచ్చిరి.

1930 లో ఉప్పుసత్యాగ్రహం ప్రారంభమైన సందర్భ ములో సీతానగరమునుండి వీరి నాయకత్వంక్రింద శాంతి సైనికదళం కాలినడకను జిల్లా అంతటా ప్రచారం జరిపి కాకినాడ చేరిరి అప్పుడె కాకినాడలో రెండవసారి వీని అరెస్టుచేసి తిరిగి కడలూరు ఏడాదిశిక్షవేసి పంపిరి గాంధీ-ఇర్విన్ ఒడంబడిక సందర్భములో విడుదలచెంది ఇంటికివచ్చి వెంటనే విశ్రాంతి యైనను తీసుకొనక జిల్లాఅంతటను విదేశ వస్త్ర-వస్తు బహిష్కార ప్రచారమును సాగించిరి.

1932 లో పంజాబు హత్యలను మించినట్టి లాటీచార్జి ము స్థానికంగాను చేయగా సహించిన ధీరుడు వీరి ఆశ్రమ ముపై గూడ దాడీసలిపి దానిని రుద్రభూమిగా చేసివదలిరి అప్పటినుండియు వీరి ఆరోగ్యముచెడి క్రమముగా క్షయ వ్యాధిలోనికి దింపెను. మూడవసారి ప్రభుత్వము అరెస్టు చేసినప్పుడు డిఫెన్సు పెట్టుకొనగా నిర్దోషులని వదిలివేసిరి. కాని వెంటనే ప్రభుత్వమింకొక సెక్షను క్రింద వీరి నరస్టుచేసి ఆరునెలలు శిక్షించి జైలుకు పంపిరి. అది పూర్తిచేసికొని వచ్చిన పిమ్మట ఆశ్రమం ప్రభుత్వం స్వాధీనంలో నుండుటచే సీతానగరమునందే నాలుగువర్షములమధ్య హరిజనాశ్రమము నొకదానిని స్థాపించి నిర్మాణ కార్యక్రమము సాగించిరి.

హరిజనులకు భోజనముపెట్టి విద్యల చెప్పించుచుండెడివారు తరువాత కొంతకాలమునకు సత్యాగ్రహాశ్రమమును విశేష నష్టముతో ప్రభుత్వంవారు వీరికి స్వాధీన పర్చిరి. ఈ రెండు ఆశ్రమములను జీవితాంతము వఱకు నడపిరి. క్షయవ్యాధి లోనికి దింపిన పిమ్మట కూడ వీరు పని మానకపోవుటచే నావ్యాధి ముదిరిపోయినది. కొంతకాలం మదనపల్లి, బళ్లారి రాజమండ్రి శానిటోరియములందు చికిత్సనొందగాని లాభము లేకపోయినది చివఱకు ది 23 డిశంబరు 1936 సం॥ రం తేదీని వైకుంఠ ఏకాదశినాడు శ్రీ సుబ్రహ్మణ్యముగారు భౌతికశరీరమును వీడి వీరస్వర్గ మలంకరించిరి.

శ్రీ సుబ్రహ్మణ్యముగారి తల్లి లక్ష్మీనరసమ్మగారు వీరమాతయేగాక వీరవనితయై వాసికెక్కెను ఈమె తన పుత్రుల నిద్దఱిని దేశసేవకై అర్పించెను. తాను కూడ వేల కొలది రూప్యముల ఖద్దరు వస్త్రములను హాకింగుచేసి పన్యాసములు, పాటలు పాడుచు కాంగ్రెసు సందేశమును ఎల్లెపల్లెకు వ్యాపింపజేసిన దేశసేవాపరాయణురాలు ఈమె ప్రబోధమున అనేక గౌరవకుటుంబములకు చెందినస్త్రీలు దేశసేవికలుగా మారిరి. తన స్త్రీ ధర్మమునుగాని, నిష్ఠనుగాని వదలకుండ ప్రచారము చేసెను ఈమెలోనున్న విశేషమేమనగా తాను ప్రచారము నిమిత్తమెవ్వరింటికి వెళ్లినప్పు డాయింటి వారికికూడా వంటసహాయము శిశుపోషణ విషయములలో సలహాలిచ్చుట చేయుచు నాకుటుంబములోనే ఒకవ్యక్తిగ

మెలగుచు నందరకు ఆదరపాత్రయై యుండెడిది. ఈమె 1930 లో సీతానగరాశ్రమమునుండి స్వర్గమునకు తరలెను.

ఈమెకోడలును, శ్రీ సుబ్రహ్మణ్యముగారి సతీమణియు నగు కామేశ్వరమ్మగారు వాడ పతికి దగినసతి యనిపించుకొని కాలేజీలు, విదేశవస్త్ర దుకాణములు పికెటింగు చేయుట యందును, తిలకు స్వరాజ్యనిధి ప్రోగుచేయుట, కాంగ్రెసు సభ్యుల జేర్పించుట, మున్నగు కార్యములలో పాల్గొని భర్తకు బాసటయై నిలిచిన వీరనారీమణి. తాను నిత్యము రాట్నము వడుకుచు, హిందీనేర్చుకొనుచు నితరులకు బోధించుచుండెడిది. 1939 లో ఆశ్వీయుజ బహుళ ఏకాదశి దినమున నీపుణ్యాత్మురాలు భర్తృసన్నిధి కేగెను.

## ౨౭ దేశసేవిక: వేదాంతం కమలాదేవి కాకినాడ

( 5 - 5 - 1897 — 14 - 7 - 40 )

ప్రాణుల జననమరణములు, తత్సంబంధుకోటికి మోదఖేదములు గల్గించుట సహజమే కాని యేప్రాణి జననమరణములు బహుసంఖ్యాకులకు సంతోష సంతాపములు గల్గించునో యాప్రాణి బ్రతుకు ధన్యమగును.

అట్టివారిలో ఒకరు శ్రీమతి కమలాదేవిగారు. ఏ దేశము యొక్క పుత్రపుత్రికామణుల మహనీయవర్తనము చేతను, త్యాగకృత్యములచేతను, ఔన్నత్యమును సంపాదింతురో, ఆ ఔన్నత్యం ఆజాతిసల్పే వీరపూజలమీందనే ఆధారపడి నిల్చి వుండును. ఆవీరులయొక్క చరిత్రలను మననము చేసుకుంటూ వారి అడుగుజాడలలో ఆజాతి నడచినపుడే ఆ దేశం గొప్పది కాగల్గుతుంది.

ఆ ఔన్నత్యజ్యోతి ఆరిపోకుండా చిరంజీవిత్వం పొంద ఎలెనంటే — వీరపూజ నిల్చివుండవలెను. ఇది దేశములో ఎప్పుడదృశ్యమగునో ఆనాడె దానిపతనం ప్రారంభించును.

ఈవిషయములోనే ఆంధ్ర దేశము వెనుకబడిపోవుచున్న దని చెప్పుట ఎంతయు విషాదకరమైన సంగతి. • ఆంధ్రమాత వీరమాత ఆమెగర్భమున ఆణిముత్యాలవంటి వీరసంతానం పుట్టింది. అట్టివారిలో వకరైన వీరనారి కమలాదేవికి ఆంధ్ర జాతి ఎంతో ఋణపడి వున్నది. ఆఋణమును తీర్చుడముకాని, ఆమెను పూజించడము కాని యీజాతిపూనుకొనలేదు. ఆమెను గౌరవించడం మనలను మనము గౌరవించుకొనుటయే. ఆ గౌరవం ఆ ప్రత్యేకవ్యక్తికికాదు, అది జాతికి ప్రత్యేకత నిచ్చును. [illegible] చేకూరును.

ఆమె [illegible] ప్రజ్ఞావంతురాలుగాను, ఒక వీరనారీ మణిగాను మనకు తెలుసును. ఆమె, రాజకీయ రంగములో [illegible] ఆమె [illegible] ఒ

రాచకార్య ధు ణగాకూడా ప్రజలామోదించేవారు. ఆమె ఖ్యాతి దేశదేశాలు ప్రాకేది దానితో ఆంధ్రజాతికి ప్రత్యేక ప్రాధన ్య ్ లిగేది

కాని ఆమెను చిరస్థాయిగా జేయుటకాపెజీవిత చరిత్రను 'వీర నారీమణుల' పట్టీలో చేర్చవలెను.

ఆమె భౌతిక దేహమును త్యజించినప్పటికీ ఆమె యొక్క అగణిత దేశసేవాపరంపరలచే ఆమె 'అమృతజీవిని' గా నిల్చియున్నది.

ఆమె స్థైర్యములు, సిద్ధాంతకార్యదీక్ష మొదలైనవన్నియు హృదయములలో నూత్నకాంతి జ్యోతులను వెలిగించినది

ఆ జ్యోతు లాంధ్రయువతీమణుల రక్తనాళములలో సర్వదా ప్రకాశించుచునే ఉండును.

తన స్వార్థరహితమైన దేశసేవలో తన కేకాక, ఆంధ్రమహిళా ప్రపంచమునకు కూడా ఒక నూతన శకారంభమైన చరిత్రను సృష్టించినది.

ఆమె అన్ని విధములైన అనుభవములలోను పరిపూర్ణమై పుట్టిననాటినుండి ఒకే విధమైన విజయవంతముగు జీవితమును గడిపిన ధన్యురాలు.

ఆమె జీవితము, జీవితక్రమము మొదలైనవి సోదరాంధ్ర మహిళామణు లనుసరించుటకు ఆదర్శములు. శీలప్రాభవము, రాజకీయచైతన్యము సాంఘికనిర్మాణము మొదలైన సద్గుణ

ములు ఒకేవక చోట కూడివున్న ఇటువంటి నారీమణిని సంఘ జీవితములో మనం కలిగివుండుట చాలా అరుదు.

ఇట్టి అపురూపమైన పుష్పమును కలిగివున్న ఆంధ్రభూమి ప్రత్యేకముగ చాలా గర్వించవలసి వున్నది.

విద్వత్కుటుంబీకులు, సనాతన ధర్మావలంబకులునైన కడపజిల్లా నందలూరు వాస్తవ్యులగు ప్రతాపగిరి గోపాల కృష్ణయ్య భ్రమరాంబగార్లకు 5-5-1897 సం॥ రం లో ఐదవ సంతతిగ శ్రీ కమల జన్మించినది. సిరిసంపదలలో తులతూగుచు విజ్ఞానశేముషీధురంధరుడై వకీలు వృత్తియందున్న తండ్రిగారి శిక్షణయు, విద్యార్థులగు సోదర సోదరీమణుల సాంగత్యము నీపె కుదారబుద్ధిని ప్రసాదించినవి. బొంబాయిలో చారిత్రక అధ్యాపకులుగానున్న ప్రతాపగిరి రామమూర్తిగా రాపె సోదరుడే.

వివాహం : 1908 సం॥ రం లో ఆపె పండ్రెండవయేట బాపట్ల నివాసులైన శ్రీ వేదాంతం పురుషోత్తమశర్మగారి ద్వితీయపుత్రులగు వెంకటకృష్ణయ్యగారి నీపె వివాహమాడెను.

పిమ్మట కృష్ణయ్యగారు కాకినాడ అనాథశరణాలయమున ప్రధానోపాధ్యాయులుగ నుండి అచ్చట సాధుల నుద్ధరింప బూనుకొనిన నాథుని కోర్కెలను ఆపె సఫలీకృతము జేసెను బ్రహ్మసామాజికులైనవారి నానాడు బంధువులు బహిష్కరించి అనేకవిధముల బాధింపజొచ్చిరి.

వైద్యవృత్తి నవలంబించినచో ప్రజాసేవ జేయుట కెక్కు-డవకాశములు గల్గునని సంకల్పించి కలకత్తా ఏగుచున్న భర్త నీమె ననుసరించినది. విద్యార్థిదశనుండియు సంఘసంస్కారము నకు, ప్రజాసేవకును ఆత్మార్పణమొనర్ప నిశ్చయించుకొన్న వారలలో కృష్ణయ్యగారొకరు.

## సాంఘిక జీవితం

వారి ఉత్సాహమే-వారి ప్రోద్బలమే కమలాదేవిని ధన్యజీవితగ జేసినవి. దీనికితోడు కలకత్తాలో స్త్రీజనోద్ధరణకై తమ సర్వస్వమును ధారవోసి పాటుబడిన శ్రీమతి సుప్రభాదేవి గారి సాహచర్యభాగ్య మీమెకు లభించినది. భర్తనాటిన సద్భావములకా సుప్రభాదేవి దోహదముచేసి, కమలాదేవి గారికి హృదయపరిపాకము గల్గించినది.

ఫలితంగా ఈమె సాంఘిక, రాజకీయాలలో ఉత్సాహముతో పాల్గొని సేవ చేసినది.

ఆ కాలంలోనే అందుల కనువైన వాఙ్మయపరిజ్ఞానము, నాంగ్లేయ వంగ భాషలలో సముపార్జించి అనేక గ్రంథములను [illegible] బరించి, స్వయంకృషిచే [illegible]పై సాహిత్యాభిరుచిని పెంపొందజేసుకొనెను.

1919 కాకినాడలో భర్త వైద్యవృత్తి నవలంబించి [illegible] సాంఘిక విద్రోహ ప్రాయములచే [illegible] కుటుంబ [illegible] నైన [illegible] వెలిని [illegible]. అయినను స్థైర్యము

భర్త ఆశయములను ప్రోత్సహించి, సార్ధకసహధర్మ చారిణి అయ్యెను. ఈమె మహిళోద్యమములో ప్రవేశించి మార్గదర్శిని అయ్యెను. తద్వారా ఈ ఉద్యమమునకు ఒక రూపును కల్పించినది.

ప్రసవసంబంధమైన (Maternity course) చికిత్సలకు భర్తను వెంబడించి సహాయపడుచుండెడిది. అనాధశిశువులను కన్న బిడ్డలమాదిరి పోషించి వారికి విద్యాబుద్ధులను గరపెడిది. అందుచే వీరిగృహము, 'అనాధశరణాలయం'గా మారిపోయినది.

## రా జ కీ య జీ వి తం

1920 సం॥రం లో మహాత్ముని శంఖారావములో గాఢ సుషుప్తియందున్న యావద్భారత దేశము మేల్కాంచెను. దాస్యవిమోచనము, సాంఘిక సేవ, జాతీయోన్నతి మున్నగు ఉదార ఆశయము లిదివరకే వాడుకొనియున్న యీ దంపతుల హృదయములలో మహాత్ముని ప్రబోధం తటిల్లతవలె సంచలనం కలిగించినది. సహాయ నిరాకరణోద్యమంలో యీ దంపతులు లీనమైపోయి, తమ కార్యదీక్షలో, యింటినిగూడ మర చుటయు, వారి యత్నశ్రద్ధఫలితముగ 'స్వరాజ్య' మను వారి శిశు వస్తమించుటయు సంభవించెను. కష్టదశలో సైతము, అఖిలభారత శాసనోల్లంఘన విచారణ సంఘసభ్యులకు సామర్లకోటలో కమలాదేవిగారు . . న జిల్లా ప్రజల తరఫున వారి కాహ్వానమిచ్చి వినతిపత్రమును చదివి సమర్పించిరి.

1923 సం॥రంలో జరిగిన కాకినాడ కాంగ్రెస్‌తో ఈమె వ్యక్తిత్వము దేశవిఖ్యాతమైనది. కాంగ్రెస్ సూత్రధారుడైన శ్రీ బులుసు సాంబమూర్తి త్యాగమహిమ ఈపె నాకర్షించినది.

ఇంట పసిబిడ్డలు. గృహభారమును నిర్వహించుకొనుటకు వేరెవ్వరు దక్షత లేరు. ఐనను దేశసేవయే ఆ దంపతులకు స్వార్థముకంటె నత్యంతప్రియమైనది. నారులకు గృహనిర్వాణము బిడ్డల పోషణమును వదలివేసిరి.

స్వచ్ఛంద సేవకాదళానికి ఈమె (Lady Commandant) అధిపురాలుగను, ఆరోగ్య వైద్యశాఖలకు కృష్ణయ్యగారు నాయకుడుగను అహర్నిశాదులు పాటుపడి 38 వ జాతీయ మహాసభకు తోడ్పడి తమ యాస్తులను, మిత్రకోటిని, తమ చిన్నబిడ్డలను, తల్లినికూడ స్వచ్ఛందసైన్యములో జేర్చి దేశసేవకు తమ సర్వస్వము నర్పించిరి. ఇదిగాక స్త్రీయుద్యమ వ్యాప్తికి పాటుబడుచుండెడిది. ఈపె కార్యనిర్వాహణశక్తి ఔత్తరాహులనుకూడ ఆశ్చర్యచకితులను జేసెను.

1926 సం॥రంలో అనంతపురంలో జరిగిన మహిళాసభకామె యధ్యక్షత వహించి, స్త్రీలయందు పాదుకొనియున్న సంకుచిత వాతావరణాన్ని పోగొట్టి 'స్త్రీ లాదర్శమాతలు, ఆదర్శ సహధర్మచారిణులునై జాతీయాభ్యుదయానికి తోడ్పడాలని దివ్యసందేశమిచ్చారు. తను ఆశయవ్యాప్తికై ఆంధ్రదేశ మంతటను సంచారము సలిపి మహిళాసంఘ కార్యదర్శినిగా బద్ధు

ప్రచారం అమితంగా వేసి, "తిలకు స్వరాజ్యనిధి" కి—సొమ్మును ప్రోగుచేసినది

1929—30—34 సం॥రములలో అఖిలభారత కాంగ్రెస్ యొక్క స్థాయిసంఘమందు కమలాదేవిగారికి స్థానమిచ్చి, ఆమె యొనర్చిన దేశసేవను ప్రజలు గుర్తించి, గౌరవించిరి

1930 సం॥రంలో దేశమంతటను స్వాతంత్ర్యోద్యమము ప్రబలి ఉప్పుసత్యాగ్రహరూపము కార్యాచరణకు వడంగెను. అప్పుడు కమలాదేవి పక్షవాతముచే మంచముపట్టెను కాని దేశంనిమిత్తం తన్ను తనకుటుంబాన్ని ఆహుతిచేయవలెనన్న ఉ దేకం గలిగినది.

తమ 'ఆనందనిలయ' గృహమును •కాంగ్రెస్ చికిత్స శాలగా మార్చివేసి లాటీదెబ్బలుతిని బాధపడువారి కుపచార ముల నేయుచు, అన్నపానాదులొసంగి రక్షిస్తున్న తమ భర్తకు తాను సాయపడలేకపోతినని చాలవిచారించెను.

ఇంతట్లో ఈఉద్యమాన్ని విశాఖపట్నంజిల్లాలో నడ పుట కెవ్వరూలేరని సాంబమూర్తిగా రాపెను హెచ్చరించిరి.

వెంటనే యీపె తన శరీరస్థితిని లెక్కచేయుక విశాఖ పట్నంజిల్లా అంతా పర్యటనముజేసి జాతీయ వాతావరణము అంతటా రగుల్కొల్పెను. ఉప్పుసత్యాగ్రహములో వాలుకను స్త్రీ పురుషాదులను త్యాగజీవనులయ్యేటట్లు ప్రబోధంచేసి, నౌపడా ఉప్పువల్లీవద్ద అరెస్టు చేయబడి జైలునకు వెళ్లెను.

ఆరు మాసముల యనంతరము విడుదల చేయబడగా తిరిగీ కాంగ్రెస్ ప్రచార మారంభించెను.

1931 సం॥ రం లో ఇచ్ఛాపురంలో జరిగిన మహిళా సభకు అధ్యక్షురాలయెను.

## కాంగ్రెసు ప్రచారం

1932 సం॥రంలో కాంగ్రెస్ కార్యక్రమము కేవలం అసి ధారావ్రతముగా పరిణమించినది. అఖిలభారత జాతీయమహా సభను జరుపుటకు వీలులేదని ప్రభుత్వం ఆంక్షపెట్టినది ఢిల్లీలో శ్రీమతి సరోజనిదేవి ఆధ్వర్యమున జాతీయసభ సమావేశమైనది. అప్పుడిచ్చిన బహిరంగోపన్యాసమున కామెకు ఆరు మాసములు శిక్ష విధింపబడెను పిమ్మట పక్షవాతముచే బాధపడెను గాని త్వరగా తేరుకొనెను.

జైలునుండి విడుదలైన పిమ్మట రాజకీయ వాతావరణములో మార్పులు కలిగి కాంగ్రెస్‌వారి ఎన్నికలలో పాల్గొనుట తటస్థించినది.

1934 లో సెంట్రల్ అసెంబ్లీ ఎన్నికలలో కమలాదేవి దత్తమండలపర్యటనముజేసి గావించిన ప్రచార మద్వితీయము. అపుడు దత్తమండలమునుండి కేంద్రశాసనసభకు అభ్యర్థిగా (Candidate) అనంతశయనం అయ్యంగారు నిలిచినపుడు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ఆదేశానుసారము అపార ప్రచారంచేసి కాంగ్రెస్ విజయానికి తోడ్పడినది.

1935 మదరాస్ కార్పొరేషన్ ఎన్నికలలో రుక్మిణీ లక్ష్మీపతి అభ్యర్థిత్వమును బలపరచి, చేసిన ప్రచారపు విలువకు ప్రతికక్షుల తరపువా రీమెను తిలకు ఘాటులో కొట్టినప్పటికీ ఈమె శాంతముగా భరించినది.

1937 సం॥ రంలో మద్రాస్ అసెంబ్లీ యెన్నికలలో బొబ్బిలి సీమలో ఏకాకిగ, కాంగ్రెస్ అభ్యర్థి యెదుటనే యుండి, ప్రత్యర్థు లెన్ని యిక్కట్టుల పాల్జేసినను లెక్కచేయక, తనలక్ష్యమునకే ఆత్మార్పణ మొనర్చుకొని, ధనజనపశు అధికార ప్రాబల్యముల భేదించి దేశీయగౌరవమునకు విజయభేరీ వేయింపగల్గిన వీరవనిత.

శ్రీ బొబ్బిలి రాజాగారికి ఎదురుగా అసమానమైన కాంగ్రెస్ ప్రచారమును గావించి, గిరిగారి విజయమునకు కారణభూతమైన దాపె తనస్థాన మన్యాక్రాంతమైనప్పుడు గూడ ఎట్టి స్వార్థముగాని, ఆక్రోశముగాని వహించక కాంగ్రెస్ ఆజ్ఞను శిరసావహించి ద్విగుణీకృతోత్సాహముతో సేవచేసిన త్యాగశీల కమలాదేవి.

దేశారాధనమునకు సమయం తటస్థించినప్పుడెల్ల—పరిమితిలేని కుటుంబసేవ దీనజనసేవ మున్నగునవి విడిచి దేశసేవకు గడంగుచుండెను దేశము—జాతి యివి రెండూ కమలాదేవి ఆరాధ్యదైవములు. ఇదిగాక, కాంగ్రెస్ కార్యక్రమములు కౌన్సిలు బాధ్యతలు—స్త్రీజనోద్యమములు, గ్రామ నిర్మాణ కార్యాలు ఈమెకు నిత్యకృత్యము లైనవి.

గుంటూరు, చెన్నపురి, బొబ్బిలిగాథలు ఆమెధైర్య సాహసములకు విజయాంకములు.

కడప, కర్నూలు, చిత్తూరు, పర్యటనము లామెదీక్షకు కార్యచతురతకు చిహ్నములు.

ప్రత్యేకగౌరవముల కాస్పదమగుచున్న స్త్రీవర్గమునకు చెందియున్న తనసేవానిరతికి ఏమాత్రం దాటరాని సామాన్య గౌరవపదవులను ఉదాసీనముగ నాశించినప్పుడు కల్గిన ఆటంకములయెడ ఆమె జూపినది కేవల మౌదార్యము. ఆమె రాజకీయరంగమున చూపిన సామర్థ్యములు, సాహసౌదార్యములు, ఒసంగిన ఉత్సాహపూరిత ప్రసంగములు, సహించిన లాఠీదెబ్బలు, క్షుత్పిపాసలు, కారాగార శిక్షలు నిరుపమానోపేతములు. నూలు వడుకుట, అస్పృశ్యతానివారణము వివిధ జాతి సఖ్యతాసంఘటనము, ప్రారంభవిద్యావ్యాపనము, మొదలగు నిర్మాణ కార్యక్రమములు ప్రశంసనీయములు.

చిట్టచివరకు మరణశయ్యపైనున్న కొలది మాసములకు పూర్వమే, ఆమె వడికిన నూలు సుమారు 20,000 గజము లుండును. ఇది ఆమె కార్యదీక్ష యెట్టిదో సూచించును. ఈనూలును 15-7-40 తేదీని కాకినాడలో జరిగిన స్మారక సభలో ప్రదర్శించిరి.

## సంఘసేవ

ఈమె దేశసేవ ఒక్క రాజకీయముగానే గాక, సాంఘిక ముగ గూడ పేరుపొందినది.

ఈమె అతిథి అభ్యాగతులను సత్కరించుచుండెడిది. అసహాయులగు స్త్రీలను బిడ్డలను కన్నబిడ్డలవలె పోషించెడిది. ఇదిగాక ఎల్లప్పుడు రోగుల కుపచారము గావించెడిది. ఈమె హరిజన సేవలో మెప్పుగొన్నది. వారిని తనయింటిలో పని చేయుటకు నియమించి యితరులకు మార్గదర్శిని యైనది.

ఈమె మూడు (Terms) టెరములు కాకినాడ మునిసిపల్ కౌన్సిలర్‌గా పనిచేసెను.

సాంసారికముగా నామె చక్కనివంటనేర్పుకలది. చమికీ మొదలైన కుట్టుపనులలో నేత్రానందకరమైన యీమె ప్రవీణత వారిగృహములో ప్రతిఫలించుచుండును. మొక్కలను పెంచి వృద్ధిచేయుటయన్న ఈమెకు మంచి సరదాగలదు. పనివాండ్రకు తలమానికమైన నీళ్ళుమోసి స్వహస్తకాయగూరలు దొడ్డిలో పండించుచు, గృహప్రాంగణమును నందనవనమువలె, పుష్ప ఫలశోభితముగా జేసిన ఆదర్శగృహిణి.

కమలాదేవి అసామాన్యమైన దేశసేవాపరాయణత గల్గిన వీరనారీమణి. విద్యాధైర్యము, స్థైర్యము, సేవానిత్పరత, ఆత్మార్పణం, త్యాగబలం, నిర్భయత్వంగల్గిన మహిళ. ఈమె చెందిన బ్రహ్మ సమాజమువారికి అత్యంత యాదరణీయమైన ఆదర్శములు. స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరభావం ఈమె జాతిలో సూత్రాలుగానుండెడివి.

ఈమెకు లలితకళలయం దభిరుచిమెండు. కమలాదేవి దేహ సౌందర్యముననేగాక హృదయ సౌందర్యమునగూడ పరి

పూర్ణత్వవహించిన రూపవతి. ఈమెకు నల్గురు కొమరులు, యిద్దరుకొమార్తెలు గలరు. ఈసంతానముకూడ తాదృశ సౌందర్యమునే పొందివుండిరి. ఆమె మనోహర కంఠధ్వనియే బిడ్డలకుకూడ నలవడినది.

చిన్నబిడ్డలు సరళారామానందములు. తారకమంటు సన్ననికంఠధ్వనితో గీతములు పాడునప్పు డామెయానందము వెల్లివిరియునది. ఇతరగరితలు పాడునపుడుకూడా అట్టియానంద మునే ఆమె పొందుచుండెడిది.

ఇది యామెసర్వసమ భావమును కళాప్రియత్వమును జాటుచున్నది.

## అ స్త మ య ం

వీరచిహ్నాలు వెల్లివిరిసే మూర్తిత్వము, వేదికపై నిల్చొని ప్రజానీకములో అగ్నిని రేకెత్తించగల వాగ్ధాటి, యువక యువతీ ప్రపంచమునకు మార్గదర్శినియై కదుము తొక్కించ గల ధీరత్వము, కాంగ్రెసుకు నమ్మినబంటై, నిర్మాణకార్య క్రమములో ఆరితేరిన చాతుర్యమును బ్రకటింపగల నిర్వహణ శక్తి, ఒడుదుడుకులులేని సంసారమును సమరసముగా సాగించు కొనుచు కన్నబిడ్డలను ఆదర్శభారత యువతీయువకులుగా తయారుచేయగల చాకచక్యము, దీనజనోద్ధరణ మున్నగు సుగుణజాలముల కాటపట్టగు కమలాదేవియను నీభారత ఆశాజ్యోతి పక్షవాతవ్యాధికి గురియై 14—7—40 తేదీని

రగం. కు ఆత్మపతికి, కన్నబిడ్డలకు, మాతృభూమికి దూరమై పోయినది.

స్వతంత్ర సమరములో జయభేరులు మ్రోగించి, మాతృదేవతకు పుష్పాంజలులు పట్టనెంచిన చేతులలో దేశభక్తుల అస్తమయ పుష్పాంజలులర్పించవలసిన రోజువచ్చినది

మబ్బులుగ్రమ్మిన భారత రాచకీయ తారాపథములో మెరసెడి జ్యోతులనుండి ఒక ధృవతార — దీపిక రాలిపోయినది. స్వర్గీయసోదరి ఆత్మ అమరమై దీపించుచున్నను భౌతిక జగత్తులో నియ్యది తీరని కొఱంత —

ఆమె యోధురాలు, ధీరచిత్త, ఆ శౌర్యసాహసములు సేవాదృష్టి యొక్కవోనివి. ఆ త్యాగము, పట్టుదల శ్లాఘనీయములు.

కన్నీళ్లలో, నిట్టూర్పులలో కీర్తిశేషులకు తిలాంజలు లిచ్చి—వారి చితులపైని సానుభూతిపుష్పములను జల్లి, స్మారక సభలు జేసి సాంత్వనము జేసినంతమాత్రమున మన బాధ్యత తీఱదు. దేశభక్తుల యథార్థస్మృతిని మన హృదయములలో నెలకొల్పినచో అది నిత్యజీవనంగా వుంటుంది

ఏ జీవి ఏ ఆశాజ్యోతికి ఆహుతి అయిపోయినదో, అది లోకశ్రేయమైనదైతే ప్రదీప్తమొనర్పవలసిన బాధ్యత మనయందున్నది. అది యథోచితముగా నెరవేర్పగలిగితేనే వారికి ఆత్మశాంతి, మనకు మనశ్శాంతి. జాతీయవీరుల స్మృతి

చిహ్నములు ముద్రించవలసిన విజయపతాక మానాడు ప్రతి ష్ఠిత మగును.

ఈ సోదరి జీవయాత్ర చరితార్థమైనది. సర్వదా ప్రజాసేవలో పరమార్థమును పెంపొందించినది. సదా ఆర్యస్త్రీ లభిలషించెడి పుణ్యసాధ్వీకరణ మీమెకు ప్రాప్తించుటచే ఆమె నిండుహృదయముతో నిర్యాణమును పొందినది

దుఃఖ నిమగ్నమై యున్న ఆకుటుంబమునకు మన శ్శాంతి, ఆ స్వర్గీయాత్మకు పరమశాంతిని ఈశ్వరుడు ప్రసాదించు గావుత.

## శ్రీ. బారు రాజారావుగారు
## రాజమహేంద్రపురం

( 17 - 9 - 1888 – 8 - 6 - 38 )

వీరు గోదావరిజిల్లా నర్సాపురంలో 17-9-1888 కి సరి యగు సర్వధారి నామ సం॥ర భాద్రపద శుద్ధ పాడ్యమి రోజున మాధ్వసాంప్రదాయమునకు జెందిన ఒక యున్నతవంశమున నర్సాపురంలో జన్మించిరి

వీరు 1905 సంవత్సరమునాడు బెంగాలువిభజన ఆందోళనములో పాల్గొన్న గాఢస్వదేశాభిమానపూరితులు.

1906 సం॥రం లో మెట్రిక్యులేషన్ పరీక్షయందు త్తీర్ణులై - 1907 సం॥రంలో వందేమాతరం జాతీయ ఆందోళనలో పనిజేసి వీరు రాజమండ్రిలోని ఆర్ట్సుకాలేజీ విద్యాధికారుల కోపాగ్నికి గురి అయిరి. కాలేజి ప్రిన్సిపల్ మార్కుహంటర్ గారు వీరిని తొలగించివేసిరి అనంతరం మరుసంవత్సరం కలకత్తా పోయి బి. ఏ (ఆనర్సు) చదివి యుండిరి కాని 1916 సం॥ రంలో కొన్ని సాంసారిక చిక్కులచే పట్టమును స్వీకరించలేను.

కాని రాజారావుగారు, అదృష్టశాలియని చెప్ప వచ్చును, సంకల్పసిద్ధుడు.

అప్పుడు అఖిలభారత కాంగ్రెస్ సభకు ప్రధానకార్య దర్శిత్వమును వహించి గొప్ప పేరుప్రతిష్ఠలను పలుకుబడిని సంపాదించిన ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుగారు శ్రీ రాజారావుమహాశయుని చాకచక్యమును నిర్వహణపటుత్వ మును తీవ్రబుద్ధిని గ్రహించి వీరు సహాయకార్యదర్శి పదవి కెంతేయు తగుదురని ఆదవిలో వీరిని నియమించిరి. అంతకనుక భారతకాంగ్రెస్ కార్యాలయము కట్టుదిట్టములలో లేకుండెను. కాని రాజారావుగారు అధికారమును స్వీకరించగనే దాని నొక ప్రభుత్వకార్యాలయమువలె తయారు జేసిరి. వారే ప్రథమ సహాయకార్యదర్శిత్వమును వహించిన ఆంధ్రు లని ఆంధ్రులు గర్వింపదగిన యంశము.

వీరు 1917 సం॥ నుండి 1934 డిసెంబరు వరకు అఖిల భారత కాంగ్రెస్ సభ కార్యాలయ వ్యవహారముల నవిచ్ఛి

న్నముగా నిర్వహించిరి. గాంధీమహాత్ముని మహత్తర సహాయ నిరాకరణోద్యమము వీరి కార్యదర్శిత్వములోనే నెరవేరెను. మరియు విపు నిర్బంధ పరంపరలు జరుగుచున్నప్పుడు రాజీ సమయములందు, శాంతి వేళలలోను, హిందూదేశములోని మహాత్ముల సమస్యలను కాలంకషముగ హృద్గతముచేసికొని వ్యవహరించుచు వచ్చిరి. ఈకారణముచేతనే వీరిని కాంగ్రెస్ అధ్యక్షులు, కార్యదర్శులు మెచ్చుకొనుచుండిరి. ఒకరి మెప్పు కొరకుగాని, ఉద్యోగవృద్ధికిగాని, రాజారావుగారెన్నడును అధ్యక్షుల నాశ్రయించుట నెరుగని స్వతంత్రజీవి. తానేకీభవింపనిచోట అధ్యక్షకార్యదర్శులతో వాదించుచుండెడివారు కాంగ్రెస్ ధర్మములను ఖచితముగ బాటించుచు వచ్చెను. అందుకనియే కాంగ్రెస్ నాయకులందరికిని వీరనిన అత్యంత గౌరవభావము కలదు.

1919-20 సం॥ రం॥ లో గోకర్ణనాథ మిశ్రాగారితోను 1920-22 సం॥ రంలో విఠల్‌భాయితోను కలసి పనిచేయగా వారీతని వ్యవహారనిర్మాణశక్తిని పలువిధముల శ్లాఘించిరి.

1926 సం॥ రంలో రావుగారిని ఉపకార్యదర్శిగా చేసిరి 1928 సం॥ రం లో కాంగ్రెస్‌సాంవత్సరిక నివేదిక వ్రాయుచు, కార్యదర్శులైన జవహర్‌లాలు, సుభాస్‌చంద్రబోస్ గార్లీతని "కాంగ్రెస్‌యొక్క నిత్యవ్యవహారమును అతిసమర్థతతో నిర్వహించుచున్న శ్రీ రాజారావుకి మా ప్రత్యేకహృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు" అని ఉద్ఘాటించిరి.

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ప్రధాన కార్యదర్శిగా యున్నతరి వారితో మోతీలాలు నెహ్రూగారు పండితుడు ప్రశంసించుచు (Mr Rajarao is the power behind the throne) అనగా శీనశక్తిసామర్థ్యములచే కాంగ్రెస్ ఔన్నత్యమును దెలుపుచున్న ప్రజ్ఞావంతుడు రాజారావు అని అనెను 1929 సం॥ రంలో లాహోరు కాంగ్రెస్ జరిగినపిమ్మట వీరు శాశ్వత కార్యదర్శిత్వమును వహించిరి.

1930 సం॥ రంలో శాసనోల్లంఘనమును జేసినవారిలో ముఖ్యులైన డా. ఎం. ఏ అన్సారీ, శ్రీయుత మదనమోహన మాలవ్యాజీ, విఠల్ భాయి పటేలుమున్నగు కాంగ్రెస్ సభ్యులలో కార్యదర్శియైన రాజారావుకూడ జైలునకుపోయి వుండెను వీరందరు యితని ఉత్తమ గుణగణములకు సంతసించి ఇతని అమూల్యసలహాలను శిరసావహించిరి.

1930-31 సర్దారువల్లభాయిపటేలు గారితో బొంబాయి, అహమ్మదాబాద్, బార్డోలీలలో పనిజేసియుండిరి. ఈ సంవత్సరంలో శిక్షింపబడినపుడీయన అలసెన్నుపుచ్చుకొనక పోవుటచే గాంధీజీ వీరిని ప్రశంసించిరి.

1932 సం॥ రంలో (Special ordinance) ప్రత్యేక శిక్షా చట్టముక్రింద (డిటిన్యూ)గా నిర్బంధింపబడి అహమ్మదాబాద్‌లోని సాబర్మతీజైలులో నుంచబడిరి. విడుదలయైన పిమ్మట తిరిగిపట్టుకొనబడి ఆరునెల కారాగారవాసము సంపాదించెను.

1934 సం॥ రం ఆగస్టులో శ్రీరావుగారికి చాలాజబ్బు చేసినది. ప్రాణాపాయస్థితిలోనున్న కమలానెహ్రూను చూచుటకు పోకపోయినను, ప్రత్యేకంగా రాజారావును చూచుటకు జవహర్లాల్ వారింటికి వెళ్ళి యుండిరి. ఇతని నిర్మాణ కుశలతకు మెచ్చుకొని (C R) ప్రస్తుత గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు వీరిని (Home Secretary of swaraj government) స్వరాజ్యదొరతనమువారి ప్రధానకార్యదర్శి అని వర్ణించెను.

వీరు ఆరుసంవత్సరములు అఖిలభారత కాంగ్రెస్ సంఘ సభ్యులుగానుండి, పలుకార్యకనముల నతిజాగరూకతతో నిర్వహించి, జవహర్లాలు మున్నగు సహోద్యోగులను తమ కార్యదీక్ష సౌమ్యస్వభావం, నిర్మలప్రవర్తనము, నిర్మాణ మాటము మున్నగు గుణసముచ్చయముచే వారిని మిత్రుల జేసెను.

వీరు దేహమునందుకలిగిన అస్వస్థతచే తమఉద్యోగము నుండి 1948 సం॥ రం లో విరమించిరి.

పిమ్మట తన స్వస్థానమైన రాజమహేంద్రనగరునకు మరలివచ్చి తన బంధుమిత్రులతో సుఖముగ కాలము బుచ్చుచుండియు, రాజమండ్రిలోని స్థానికరాచకీయములలో పాల్గొనుటయేకాక, తిరిగి మంచిరాచకీయవాతావరణ మెప్పుడేర్పడునా, యని మిత్రులతో చర్చించుచుండెడివారు.

1937 సం॥ రంలో జరిగిన శాసనసభల ఎన్నికలకు వీరు కాంగ్రెస్ పక్షమున రాజమహేంద్రవరనియోజకవర్గమునుండి నిలువ గోరగా, వీరు తగరని, వీరికివోట్లు రావని, అచ్చటినాయకులు వారిని త్రోసిరాజుచేయుటకు ప్రయత్నించిరి. కాని నెహ్రూ గారి ప్రత్యేక హుకుంపైని వీరిని నిలుపవలసి వచ్చినది. ప్రత్యర్థిని సహస్రాలకొలది వోట్లుబలంలో ఓడించుటయేగాక, సంకుచిత నాయకవర్గమునకుకూడ ఒకగుణపాఠమును నేర్పెను. ఆంధ్రదేశములో కాంగ్రెస్ ప్రచారకులఖ్యాతిని వృద్ధిచేసిన వారిలో వీరొకరు.

రాజారావుగారు శాంతస్వభావులు. యుక్తాయుక్త పరిజ్ఞానముగల్గి అభిప్రాయముల నేర్పరచుకొను ఆకర్షణీయమైన వ్యక్తి. ఆజానుబాహువు స్ఫురద్రూపుడు. వీరు తమ మాతృదేవతను కడుశ్రద్ధాభక్తులతో పూజించుచుండెడి గుణోత్తరుడు.

## ఆధ్యాత్మిక జీవితం

వీరికి గొప్ప చిత్తసంస్కారము కలదు. వీరు కలకత్తా యూనివర్సిటీలో విద్య నభ్యసించు కాలములో రామకృష్ణ మఠమందలి సన్యాసులతో సాంగత్యము జేసెను. రాజారావుగారు బ్రహ్మానందస్వామిజీ (రఖలు మహారాజు) శారదామాయిగార్ల నెరుగుదురు. కాంగ్రెసు వ్యాపారములలో తీరిక లభించినపుడు వీరు మరముగా గడుపుచుండిరి. అందుచే వీరికి శ్రీరామకృష్ణ పరమహంస భగవదవతారమని గాఢ

నమ్మికగల్గి వారిని 'ఠాకూర్' అని బిలచుచుండెడివారు. ఆ నమ్మకమే వీరి జీవితానికి జీవగఱ్ఱవంటిది. వీరికి ఒకసారి ప్రయాగలో జబ్బుచేసినపుడు శ్రీ పరమహంసగారు (Vision) దివ్యదర్శనములో కనబడి, అభయహస్త మిచ్చిరట. అంతట వారివ్యాధి నిమ్మళించెను. శ్రీ పంతులుగారి హృదయ మెంత సరళమైనదియు, విశ్వాస మెంత దృఢమైనదియు స్పష్టంగాకి మానదు. వారు శిశువులవలె సరళస్వభావులు సత్ప్రవర్తనులు.

వారికి జ్యోతిషమునందు గాఢ నమ్మకముగలదు వీరెట్టి క్లిష్టపరిస్థితులలోనున్నను భావికాలనిగూర్చి ఆందోళన పడుట యెరుగరు. ముందు ముందు ఏదో గొప్ప దశరానున్నదని వీరి నమ్మకం.

వీరి చరిత్రము స్ఫటికంవలె నిర్మలమైనది. మనో వాక్కాయకర్మలచే రామబాణంవలె దానికున్న లక్ష్యశుద్ధి అద్భుతావహము. చేతలకు—మాటలకు ఏమియు వ్యత్యాసములేదు.

1937 సం॥రంలో వారు శాసనసభలలో ప్రవేశించిన పిమ్మట వీరి కాంగ్రెస్ అనుభవము నుపయోగించుటకై కాంగ్రెస్ పక్షనాయకులు వీరికి పార్లమెంటరీ సెక్రటరీ పదవి నైన నిచ్చెదరేమోయని దేశీయు లాశపడిరి. గాని దానికి భిన్నపరిస్థితు లేర్పడినను కాంగ్రెస్ పట్లనున్న భక్తిప్రపత్తు

లేమాత్రమును వీరికి తగ్గలేదు. దీనికి కారణము ఆంధ్రుల దౌర్భాగ్యమే.

8-6-1938 తేదీని (జ్యే శు ౧౧) రోజున వీరు స్వర్గమలంకరించిరి.

నిష్కళంక జీవనులైన వీరికి సద్గతి తప్పదనుటకు వీరి పరిశుద్ధ జీవితమే తార్కాణము.

వీరి ఆత్మకి భగవంతుడు శాంతి నొసంగుగాక!

ఓం శాంతిః

## ౨౯. నడింపల్లి సుబ్బరాజుగారు ఎం. ఎల్. సి (తూ॥ గో)

( 21 - 2 - 1888 – 1940 )

వీరు సుప్రసిద్ధమైన ఆంధ్ర క్షత్రియ వంశములో పండితపోషకులని పేరందిన శ్రీ నడింపల్లి నారాయణరాజుగారికిని, పతివ్రతా తిలకమనియు, దీనజనపోషణియనియు పేరొందిన శ్రీ లక్ష్మీనరసయ్యమ్మగారికిని ఏకైకపుత్రులై ది 21-2-1888 తేదీని అమలాపురం తాలూకాలో జన్మించిరి.

మెట్రిక్యులేషను వఱకును పాఠశాలయందు చదువుటయేగాక గీర్వాణాంధ్రముల యందును గిష్టానము గడించిరిం

పండితుల నాదరించుటయందు వీ రాంధ్రభోజులని ఖ్యాతి నార్జించిరి.

1907 లో ప్రారంభింపబడిన వందేమాతరం ఉద్యమము వీరి రాజకీయ జీవితమునకు ప్రారంభము.

1913 నుండి జీవితాంతము వఱకును స్థానిక సంస్థల యందు సభ్యులుగ నుండి ప్రజోపయోగములగు పెక్కు కార్యముల నొనర్చి ప్రజానీకముయొక్క మన్ననలకు పాత్రులైరి.

1921 లో గాంధీయుగ ప్రారంభమున తమ " గ్రామాధికారి " పదవికి రాజీనామా నొసగి నాటినుండియు దేశసేవానిరతిచే ప్రజాసేవ చేయుచుండిరి.

1924 లో తమ స్వంతధనమును వెచ్చించి రాట్నములు చేయించి బీదలకుచితముగా ఆ రాట్నము లొసంగి నూలు తీయించి తద్వారా ఖద్దరు నేయించుటయేగాక పెక్కు బీదకుటుంబములకు ఈవిధముగా జీవితపోషణాధారముల గలిగించిరి.

1930 లో ఉప్పుసత్యాగ్రహ సందర్భమున నిరతాన్నదాతలగు శ్రీ రాజుగారు "శాంతి సైనికులకు భోజనము పెట్టుట" అను నేరమునకై ఆరు మాసములు ప్రభుత్వముచే శిక్షింపబడి రాజమండ్రి సెంట్రలు జైలులో 'బి' తరగతిలో నుంచబడిరి. ఆసంవత్సరమే "తిలకు స్వరాజ్యనిధి" కై పదివేల రూప్యముల సమకూర్చి యొసంగిరి.

1932 నుండి అమలాపురం తాలూకా బోర్డు అధ్యక్షులుగను, 1936 మొదలు రెండున్నరసంవత్సరములు రాజమండ్రి

జిల్లాబోర్డు అధ్యక్షులుగను ఎన్నుకొనబడి పెక్కు ప్రజోప యోగములైన కార్యము లొనర్చి యుండిరి. కోనసీమ సెంట్రలు బ్యాంకు స్థాపించిన నాటినుండి జీవితాంతము వఱకు దాని కధ్యక్షులుగానుండి ఆ బ్యాంకు నెంతో వృద్ధిలోనికి తీసు కొని వచ్చిరి.

1937 లో మదరాసు కౌన్సలుకు కాంగ్రెసు తరపున అభ్యర్థిగా నిలుపబడి గొప్పగొప్ప జమీందార్లు ప్రత్యర్థులుగ నున్నను జిల్లాయందలి మూడుస్థానములలోను తక్కినవాని కంటె వోట్లు సంపాదించుకొని విజయము నొందిరి.

1940 వ్యక్తిసత్యాగ్రహోద్యమములో పాల్గొనుటకు డిసెంబరు 16 వ తేదీని నిశ్చయింపబడి యుండగా నింతలోనే అకస్మాత్తుగ డిసెంబరు 7 వ తేదీనే గుండె నిలిచిపోవుటచే స్వర్గస్థ

వీరి రాజకీయ జీవితములో 'ప్రజాసేవ' నిర్మాణకార్య క్రమము ముఖ్యములు. కావుననే ప్రజలలో వీరికెక్కువ పలుకుబడి, మన్నన లభించినవి.

వీరి కైదుగురు పుత్రికలును, నలుగు పుత్రులునుగలరు. వీరి మూడవకుమారుడు శ్రీ నడింపల్లి రామభద్రరాజుగారు ప్రస్తుతము మదరాసు కౌన్సిలులో కాంగ్రెసుపక్ష సభ్యులుగా నున్నారు.

— —

# ౩౦. సామవేదం అచ్యుతరామయ్యగారు

## స్వస్థలం: వసంతవాడ (తూ. గో.)

( 1877 – 1936 )

1921 సహాయ నిరాకరణోద్యమం ఆరంభమైన వెంటనే ప్లీడరు గుమాస్తాపనిని విసర్జించి వీరు జాతీయోద్యమమున కుఱికిరి. 31-3-21 తేదీని బెజవాడ రాష్ట్ర కాంగ్రెసు సభకు వెళ్లిరి రాజమహేంద్రవరమునను, ఆ తాలూకాలోనేగాక యితర తాలూకాలలో గూడ సహాయోద్యమమును గూర్చి ప్రచారము చేసిరి. అందును ముఖ్యముగా ఖద్దరు ఉద్యమములో నెక్కుడు దీక్షవహించి యింటింటికి గ్రామగ్రామమునకు ఖద్దరు తీసికొనిపోయి ప్రచారము సలిపియుండిరి.

సీతానగరమున సత్యాగ్రహాశ్రమము స్థాపించక పూర్వమే శ్రీ భుసలూరి కోదండరామయ్య, చేబియ్యం సోమయ్యగార్లు కుటుంబములతో ఉండి ప్రచారము చేయుచుండగా వారితో పాటు శ్రీ అచ్యుతరామయ్యగారు కూడ ఉండి ఏజన్సీలోను రాజమహేంద్రవరం తాలూకాలోను గొప్పప్రబోధముచేసియుండిరి.

1932 వ సంవత్సరములో వీరొక పర్యాయము జైలుశిక్షననుభవించి యుండిరి.

రాజమహేంద్రవరంలో ఖాదీప్రచారము చేయుచుండగా శ్రీ వెన్నేటి సత్యనారాయణగారితోబాటు ఖాన్‌బహద్దరు ముస్తాఫాలీ (డిప్టీసూపరెండెంటు) గారిచే తీవ్రమైన లాటీచార్జికి గురియై ఒక కాలు అవిటిపడి, క్రమక్రమేపీ ఆ బాధతోనే పరమపదించిరి.

1930 వ సంవత్సరములో కాకినాడ ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొని లాటీచార్జికి గురియై మద్రాసు వెళ్ళి అక్కడను లాటీచార్జికి గురియైరి. ఆఉప్పు సత్యాగ్రహోద్యమము ననే వీరు శ్రీకృష్ణజన్మస్థానమును 6 మాసా లలంకరించిరి.

1932—33 సంవత్సరములో తిరిగి ఏజన్సీకి వచ్చిరి. జీవనోపాధికి వీరు చాలశ్రమపడవలసినవారైరి. తుదకు వీరు మలేరియాజ్వర పీడితులై ఆజ్వరముతోనే తీసికొని 1936 సం॥ రములో చనిపోయిరి.

చనిపోవునప్పటికి వీరికి 60 సంవత్సరములు గలవు.

# 3. నాళం చినభీమరాజుగారు-రాజమండ్రి

వీరు సుప్రసిద్ధమగు వైశ్యవర్ణమున నాళంవారి కుటుంబమున జన్మించిరి. సహాయనిరాకరణోద్యమ మారంభమైనదాది కాంగ్రెసు మహోద్యమములో పాల్గొని నిత్యఖద్దరుధారియై

పరిశ్రమాలయమను పేరిట ఖాదీసంస్థనొకదానిని రాజమహేంద్ర వరంలో నెలకొల్పి వేలకొలది రూప్యములు ఖరీదుగల ఖద్దరు వస్త్రములను తయారుచేయించి రాజమహేంద్రవర పట్టణము లోను తాలూకా గ్రామములలోను గూడ హాకింగులో పాల్గొని పనిజేసిరి.

పట్టణ జిల్లా రాష్ట్ర సంఘములలోను తదితరప్రజాహిత సంస్థలలోను గూడ సభ్యులుగా నుండి బహుకాలము పనిచేసిన యువకులు.

కేవలము ఖద్దరుప్రచారమే గాక, కాంగ్రెసు ప్రచారముగూడ చేసిన ధీరుడు

వస్త్రములు తయారు చేయించుటయేగాక రంగుల కార్ఖానాగూడ నెలకొల్పి నూతన ఫక్కీని రంగులు అద్ద కములుగూడ ఖద్దరు వస్త్రములకు వేయించి, ప్రజల కాకర్షకముగ నుండునట్లు తయారు చేయుచుండెడివారు.

1921 వ సంవత్సరములో విదేశవస్త్రములు, సారా పికెటింగులలో పాల్గొని విజయవంతముగా పనిచేసిరి అనేకము లైన కష్టములకు లోనైరి.

1923 సం॥ లో అఖిలభారత దేశములో జెండా గౌర వం నిలపడానికి బయలుదేరిన ప్రథమోద్యమం నాగపూరు సత్యాగ్రహం. జూన్ నెలలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం నెల్లూరులో సమావేశమై నాగపూరు సత్యాగ్రహసమరాన్ని అఖిలభారత సవాలుగా స్వీకరిస్తూ చేసిన తీర్మానం ప్రకారం

బయలు దేరిన మొదటి దళంగా శ్రీ భమిడిపాటి సత్యనారాయణ, శ్రీ రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ, శ్రీ బాచిన సూర్యనారాయణ, శ్రీ మామిడి లక్ష్మీపతి, శ్రీ మాచాప్రగడ కృష్ణారావు, శ్రీ బోడపాటి శివరామయ్యగార్లు ధీరత్వముతో బయలు దేరినారు. 18-6-23 తేదీని నాగపూరులో సివిలులైనున పర్వతాలవంటి గుఱ్ఱాల మెట్ల విజృంభించిన ఘూర్ణాదళాలు ప్రదర్శించిన బీభత్సం యిప్పటికి జ్ఞాపకం వస్తూంది.

ఆరోజు ఉదయమే శాంతి సైనికుడని అనుమానమున్న వారినందరినీ పోలీసులరెస్టు చేయుటచేత, ఆరోజు సాయంత్రము సత్యాగ్రహము చేయుడానికి నిక్షత్రం అయిపోయిందా అని నెహ్రూపండితుడు సంశయిస్తూఉంటే, ఈ ఆంధ్రదళం దిగి ఆయనకు ధైర్యము చెప్పింది ఆరోజున ఆసివిలులైనువద్ద జెండాతో సత్యాగ్రహంజేసి ఆంధ్ర పౌరుషాన్ని నిలబెట్టిన వీరులలో శ్రీ నాళం భీమరాజుగారు అతిమూత్రవ్యాధి వలన ఆకలి యెక్కువ, ఆజైలులో కాగితము మెరుగుబెట్టుపని రోజంతా వంగి చేయవలసి వచ్చేది. క్రూరులై పచ్చినెత్తురుతాగేజాతికి సంబంధించిన వార్డర్ల మధ్య జీవితం గడిపెను. ఇట్టి నరకపురి అయిన నాగపూరుజైలులో ధీరత్వంతో ఆగర్భ శ్రీమంతుడయ్యు కాలం గడిపెను.

1927 వ సంవత్సరములో శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారిచే సీతానగరంలో స్థాపింపబడిన గౌతమీ

సత్యాగ్రహాశ్రమములో నుండి ఖద్దరుశాఖకు బహువిధముల తోడ్పడిరి

విదేశవస్త్రముల పికెటింగులో కఠోరమైన దీక్ష వహించి, విదేశవస్త్రముల కొనుగోలును ఆపుచేయుటకుగాను సుమారు పదిరోజులు నిరాహార దీక్ష వహించి కృతకృత్యులైన వీరుడు.

ఇంతేగాక వీరు ఆకాలమున శిక్షపడి జైలునకు పోవుచుండిన వీరులకు ప్రతినిత్యము గావలసిన సౌకర్యములను రాజమహేంద్రవర పౌరులతరఫున చేయుచుండెడివారు.

1930 వ సంవత్సరంలో ఉప్పు సత్యాగ్రహమున పాల్గొని తీవ్రముగా పనిచేసి జైలునకు వెళ్ళిరి.

గాంధీ ఇర్విన్ పాక్టురోజులలో గూడ విదేశ వస్త్ర బహిష్కరణములో బాల్గొని పనిచేసిరి.

1932 వ సంవత్సరములో మరల కాంగ్రెసు ఉద్యమములో తీవ్రముగా పనిచేసిరి. ఈ వత్సరములో 26 వ జనవరి ఇండిపెండెన్సు తేదీన వీరు ఇంటిలో నుండగా పిలిచి వీరిని డాక్టరు సుబ్రహ్మణ్యంగారిని గూడ తీవ్రముగా లాటీచార్జీచేసి జైలులో నుంచిరి.

ఈ లాటీచార్జిలో జరుపబడిన ఘోరకృత్యములను లాటీచార్జియొక్క మోటుతనమునకును కంట తడిపెట్టని వ్యక్తియే

ఆంధ్ర దేశమున లేడని చెప్పవచ్చును. అందును ముఖ్యముగా రాజమహేంద్రవరం పౌరులు పొందిన దుఃఖమునకు మేరలేదు.

మద్యపాన పికెటింగులోను ఉప్పుసత్యాగ్రహం రోజులలోను మిగతా పికెటింగులలోను ఆయావర్తకులకు గలిగిన నష్టమునకు శ్రీ భీమరాజుగారి ప్రాణములను దీయుటకుగూడ వారు సంసిద్ధులైరి. ఈసంగతి తెలిసియుండికూడ సదరు భీమరాజుగారు ధైర్యస్థైర్యములతో నిలబడిన ధీరుడు.

మొత్తముమీద జాతీయోద్యమములో పాల్గొని ధన ప్రాణములను కోల్పోయిన ధీరుడు, సహృదయుడు, నిర్మాణ కార్యక్రమ దక్షుడు, అహింసా పరాక్రమముజూపిన యీ భీమరాజు 1932 వ సంవత్సరము ఆగష్టు ప్రాంతమున ప్రాణములను బాసెను. ఈ జిల్లాలోగల ఆర్యవైశ్య యువకులలో కాంగ్రెసు మహోద్యమములో పాల్గొని వీరస్వర్గ మలంకరించిన వారిలో వీరొకరు.

ఈయనను వీరస్వర్గానికి పంపించిరో యన్నట్లుగా రాజమండ్రి పౌరసహస్రాలు బ్రహ్మాండమైన ఉత్సవంతో అమృత యశోరూపమైన భీమరాజు కళేబరాన్ని స్మశానవాటికకు జేర్చి అగ్నిసంస్కారముజేసి తమ ఆఖరు కృతజ్ఞతను వెల్లడించారు.

---

# ౩౨. గ్రంథి నరసింహంగారు

## రాజమహేంద్రవరము

( –1941 )

వీరు సుప్రసిద్ధ వైశ్యకుటుంబమున జన్మించిరి. సహాయ నిరాకరణోద్యమారంభమునుండియు గూడ కాంగ్రెసు ఉద్యమములో పాల్గొని పనిచేయుచుండిరి. మద్రాసులో జరిగిన నీల్ సత్యాగ్రహోద్యమములో పాల్గొని శ్రీకృష్ణజన్మస్థానమలంకరించిరి.

కాంగ్రెసు సోషలిష్టుపార్టీలో ప్రవేశించినదాది ఆమరణము అహర్నిశలు కాంగ్రెస్ సేవచేసిన ధీరుడు

1941 వ సంవత్సరములో జరిగిన సత్యాగ్రహోద్యమములోనూ మరియొక పర్యాయమూగూడ శ్రీకృష్ణజన్మస్థాన మలంకరించిరి.

ఆఖరుపర్యాయము జైలున కేగినదాది శరీరారోగ్యము పాడై అచిరకాలములోనే మృత్యుదేవతచే ఆహ్వానింపబడిరి.

(అడ్డాల వెంకటస్వామి)

---

## 33. రామినీడి రంగనాయకులుగారు

## రాజమహేంద్రవరము

వీరి జన్మస్థల మీ నగరమే. వీరు మొరకవీధి తెలగ కుటుంబమునకు జెందినవారు నిత్యఖద్దరుధారులు. సహాయ నిరాకరణోద్యమారంభమునుండి పనిచేయుటకు ప్రారంభించి సుమారు నాలుగు సంవత్సరములు కాంగ్రెసులో సేవజేసి యుండిరి రాజమహేంద్రవరం పట్టణములోనేగాక తాలూకాలోగూడ కాంగ్రెసుప్రచారము చేసియుండిరి. పట్టణ జిల్లా కాంగ్రెస్ సంఘములలో సభ్యులుగా నుండిరి.

కల్లు సారాయి పికెటింగులలోను విదేశ వస్త్రదహనము లోను పికెటింగులోను గూడ పాల్గొనిరి. వీ రొకపర్యాయము జైలు ననుభవించిరి.

సీతానగరంలో శ్రీ సుబ్రహ్మణ్యంగారు ఆశ్రమము స్థాపింపకపూర్వమే సీతానగరం ఫిర్కాలో ఉండి పనిజేసిరి.

వీరి యింటిపేరు రామినీడివారు. తుట్టతుదకు కుటుంబము జరుగక వైద్యవృత్తి నవలంబించిరి

(మామిడిపూడి వెంకటకృష్ణారావు)

## ౩౪. సబ్బారపు అప్పలస్వామిగారు
## రాజమహేంద్రవరం

వీరు తూర్పు వెలమ సంఘమునకు జెందినవారు. గొప్పపలుకుబడి గలవారు. సహాయనిరాకరణోద్యమారంభము నుండియు గూడ కాంగ్రెసు వాదియే. ఖద్దరు ధారియే. రాజమహేంద్రవరంమ్యునిసిపాలటీకి వైసుప్రెసిడెంటుగానుండిరి. వీరు నెలాపదునైదు దినములు జైలుశిక్ష ననుభవించిరి.

ప్రతి సంవత్సరము కాంగ్రెసు సభ్యులుగాజేరి వారికి వీలున్నంతవరకు కాంగ్రెసుసేవ జేయుచుండిరి.

కాంగ్రెసు మీటింగు నిమిత్తము మ్యూజియంహాలు నిచ్చినందులకు అరెస్టు జేయబడిరి. నికరమైన దేశభక్తులు.

ఈసంఘమున జన్మించినవారిలో దేశసేవకై ప్రాణార్పణ జేసిన వీరులలో వీరే మొదటివారు

(మానాప్రగడ వేంకటకృష్ణారావు)

## ౩౫. గాడిచెర్ల రామమూర్తిగారు-రాజమండ్రి

( 1882 – 2 - 4 - 1939 )

(స్వగ్రామం వాకలగరవు, అమలాపురం తా॥)
శ్రీ రామయ్య వెంకమాంబల పుత్రరత్నము. జననం-1882.

ఈయన 1907 నుండి కాంగ్రెసువాది నిత్యఖద్దరుధారి. జిల్లా పట్టణ సంఘములలో సభ్యులు. 1907 వ సంవత్సరములో స్థాపింపబడిన నేషనల్ స్కూలుకు చనిపోవు వరకు మేనేజరుగా పనిచేసి యుండెను

సహాయనిరాకరణోద్యమము నుండి కాంగ్రెసువాది. వీరు ఉత్తమదేశభక్తులలో నొకరు. వీరు ఉప్పుసత్యాగ్రహములో ఆరుమాసములు జైలుశిక్ష ననుభవించిరి.

వీరి యింటిలోని స్త్రీ పురుషులు బాలురు బాలికలు గూడ కాంగ్రెసు ఉద్యమములో పాల్గొని పనిచేసి యుండిరి.

వీరి బాలికలు దేశీయనాటకములలో పాల్గొని పాత్రలను ధరించి ప్రబోధము చేయుచుండెడివారు.

వీరు సుప్రసిద్ధ చిత్రకారులు, దామెర్ల రామారావు వెంకట్రావుగార్ల తండ్రియు గృహశిక్షణ నిచ్చుటలో ఆదర్శనీయులును సుప్రసిద్ధ వైద్యశ్రేష్ఠులు నైన దామెర్ల కిష్ణారావుగారి బావమఱిది. జూన్ 1౨ తేదీ 1930 సం॥రంలో జాతీయ విద్యాలయం పోలీసువారిచే శోధింపబడినది. అప్పుడు వారీయనను కొట్టిరి. ఈయనకు ఆరుమాసాల 15 రోజులు శిక్ష విధింపబడెను.

# ౩౬. వడ్లమూడి బుల్లి సుబ్బరాజుగారు

## రాజుపాలెం

వీరు సీతానగరం ఫిర్కా వాసులు—క్షత్రియులు. నిరాడంబరజీవి. ఫిర్కా తాలూకా జిల్లా కాంగ్రెసు సంఘములలో సభ్యులు.

1932 వ సంవత్సరములో ఆరుమాసముల శిక్ష విధింపబడి కారాగార వాస క్లేశము ననుభవించిరి.

1921 వ సంవత్సరమునుండి కాంగ్రెసులో పాల్గొని పనిచేయుచుండిరి.

కల్లు సారాయి విదేశ వస్త్రముల పికెటింగులలో పాల్గొని ఎంతయు సేవజేసిరి.

ఇంతేగాక కాంగ్రెసుకు ఎన్నియో విధముల సహాయము చేయుచుండెడివారు.

చుట్టుప్రక్క గ్రామములలో కాంగ్రెసు తరపున తగవుల పరిష్కార సంఘములో సభ్యుడుగా నుండి పనిచేయుచుండేవారు.

వీరు ఉమ్మడి కుటుంబీకులు.

(చట్టు కృష్ణయ్యగారు)

# ౩౭. గుత్తి సుబ్బరాజుగారు-సీతానగరం

( 1885 – 1942 )

వీరు సుప్రసిద్ధ దేవాంగకులమున జన్మించిరి. వీరి జననము 1885 వ సంవత్సరము. అనగా వ్యయసంవత్సరమున-కాంగ్రెసుతో బాటే సీతానగరమున జన్మించిరి. సహాయ నిరాకరణోద్యమ ప్రారంభమునుండియు గూడ కాంగ్రెసు సేవయందు నిమగ్నులై యుండిరి. అనేక సంవత్సరములు తాలూకా జిల్లారాష్ట్ర సంఘములలో సభ్యులుగా నుండిరి. నిత్య ఖద్దరుధారి.

రఘుదేవపురం సీతానగరం గ్రామములలో కల్లు పారాయి పికెటింగులలో తీవ్రముగా పనిచేసియుండిరి.

1931 వ సంవత్సరంలో పెద్దాపురం తోటవిందులో లాటీచార్జికి గురియైరి.

1932 వ సంవత్సరంలో తీవ్రమైన లాటీచార్జి చేసి ప్రభుత్వమువారు వీరిని శ్రీ కృష్ణజన్మస్థానమునకు బంపి యుండిరి.

వ్యక్తి సత్యాగ్రహములో గూడ పాల్గొనియుండిరి.

వీరు 1942 వ సంవత్సరములో వీరస్వర్గ మలంక రించిరి.

# ౩౮. ధరణిప్రగడ శేషగిరిరావుగారు

## రాజమండ్రి

( 1901 – 6 - 1 - 49 )

ఈయన సీతానగరాశ్రమ స్థాపకులలో నొకడు. ప్రారంభమునుంచి చివరవరకు ఆశ్రమవ్యవహర్తగా పనిచేసిన నిరాడంబర కాంగ్రెసుభక్తుడు. అతిసౌమ్యుడు, ఉత్తమమిత్రుడు.

ఈయన 1920 సంవత్సరములో రాజమహేంద్రవరములో ఆదర్శపురుషుడైన గాంధీజీ ఆజ్ఞానుసారము కళాశాలను వదలిపెట్టిన 55 గురు విద్యార్థులలో నొకడు. నాటినుండి కాంగ్రెసు సేవలో నిమగ్నుడైన ఉత్తమదేశభక్తుడు.

డాక్టరు సుబ్రహ్మణ్యముయొక్క ఆదర అభిమానాలకు పాత్రులైన కొద్దిమందిలో నొకడై జిల్లా కాంగ్రెసు ప్రచారము జేసెను

1924 లో కాకినాడ కాంగ్రెసు అనంతరము శాసనసభా కార్యక్రమమునాటి కాలములో గాంధీజీ సూచన ప్రకారము ఖద్దరు, అస్పృశ్యతానివారణ మున్నగు కార్యక్రమములను గ్రామసేమలలో సాగించడానికి డాక్టరు సుబ్రహ్మణ్యం తలపెట్టినప్పుడు ఆయన మొదటి అనుచరుడు శేషగిరిరావే. సత్యాగ్రహ ఆశ్రమ స్థాపన జేసినప్పటినుండి సుబ్రహ్మణ్యంగారితో కలిసి

యావత్తు కార్యక్రమాన్ని నిర్వహించిన దిట్ట. ఖద్దరుత్పత్తిలో ప్రత్యేక ప్రతిభను కనపరచి, ఆశ్రమఖద్దరునకు ప్రత్యేక విశిష్టతావిశేషాలను సముపార్జించిన ప్రతిభాశాలి.

ఉత్తమకాంగ్రెసు సేవకునిగాను, ప్రతిభాశాలిగాను, యితనిని కాంగ్రెసు గుర్తించింది 1927-28 సంవత్సరాలలో మద్రాసులో సిటీ సత్యాగ్రహోద్యమాన్ని నడిపించిన కర్ణధారు డీయన.

1932 సం॥ రంలో శాసనధిక్కారోద్యమంలో పాల్గొన్నందుకు ఆరుమాసాలు శిక్షననుభవించాడు. అపుడాశ్రమమే విధ్వంసమైంది.

1933 సం॥ రం ఆఖరున ఆశ్రమాన్ని తిరిగీ సుబ్రహ్మణ్యాని కప్పచెప్పిన తర్వాత, దాని పునర్నిర్మాణము చేసిన వారిలో ముఖ్యుడు

1936 లో సుబ్రహ్మణ్యం గతించిన తరువాత ఆశ్రమం శిథిలావస్థలో నున్నా, దానిని విడువకుండా తన స్వశక్తిపైననే కాలక్షేపం జేశారు

1946 సం॥ రంలో కస్తూర్బా ట్రస్టువారి యాజమాన్యాన స్త్రీలకు గ్రామసేవా తర్ఫీదు నిచ్చి కేంద్రాన్ని సీతానగరంలో స్థాపించడానికి ప్రథమకారకుడితడే సుమారు 10 సంవత్సరాలు పాడువడిన ఆశ్రమాన్ని కేంద్రంగా నిలుపవలసినదని శ్రీ సాంబమూర్తి శ్రీమతి దుర్గాబాయమ్మలను ప్రోత్సహించి వారికి కావలసిన సహకారాన్ని యితడిచ్చాడు. దేశ

సేవారంగములో పాల్గొనడమేకాక, మిత్రుల కెప్పుడూ అమూల్య సలహాలు, సహాయము నిచ్చుచూ వచ్చిన ఆపద్బాంధవుడు కష్టసమయాలలో కూడ చిత్తస్థైర్యమును గంభీరతను గోల్పోలేదు.

రక్తపుపోటు (Blood pressure) చేత బాధపడి 6-1-47 తేదీని స్వర్గస్థుడయ్యెను. ఓం శాంతిః

## ౩౯. మాచిరాజు శ్రీరామచంద్రమూర్తిగారు (బండరాముడు) రాజమహేంద్రవరం

ఇతడు చార్లిచాప్లినువలె గొప్పహాస్యనటుడు అందుచే నితనికి బండరాముడు అన్న సార్థకనామం వచ్చింది. హాస్య ప్రసంగాలలో యెల్లప్పుడు మిత్రుల నాహ్లాద పరిచేవాడు. ధారాళమనస్కుడు. ప్రాచీన వ్యాయామ శాస్త్రనిధి. ఫొటోగ్రాఫికి నమ్మినబంటు. అన్నిటికంటె యెక్కువగా ఉత్తమ దేశభక్తుడు.

రాజమండ్రిలో శ్రీ ప్రకాశంపంతులు (ఆంధ్రకేసరి)గారు ఉన్నప్పుడే ఇతడు వ్యాయామపరిణతి జెందియుండెను. ఆనాడు కంఠము నలంకరించిన హనుమత్ప్రతిమ ఆమరణాంతమూ ఇతే

చిని విడువలేదు. ఇతడు కడు సామాన్యకుటుంబకుడు నెల్లూరులో కొన్నాళ్ళు ఫొటోగ్రాఫరుగా పనిచేసెను. కొంతకాలము అడ్డతీగల మున్నగు గ్రామాలలో కాంపౌండరుగా కూడా పనిజేసెను

1920-21 సంవత్సరాలలో కాంగ్రెసు ఉద్యమంలో జేరెను 'వందేమాతరం' రోజులలోనే ఇతనికి దేశభక్తి అబ్బినది. రాజమండ్రిలో 144 సెక్షను నుల్లంఘించిన శ్రీ కందుల వీరరాఘవస్వామి, శ్రీ డా. పాలకోడేటి గురుమూర్తి, శ్రీ చేతిన వీరన్నగార్లతో కలిసి, ఇతడుకూడ ఆర్డరు నుల్లంఘించడం చేత జైలుశిక్ష ననుభవించెను. అదే జైల్యాత్రకు ప్రథమము. ఆరోజులలో కారాగారవాస మున్న భూలోకనరకమే అయినను, గాంధిగారి ఆదర్శసూత్రాలకన్న ఇతని హాస్యసంభాషణలే జైలువాసము సుఖప్రదంగానుండెనని డాక్టర్ గురుమూర్తిగారు చెప్పేవారు. ఇతడు చాలకాలము కాంగ్రెసు వాలంటీరుగా పనిజేసెను. సంఘసేవలోదిట్ట. కొన్నాళ్లు రాజమండ్రి అఖిలభారత చరఖాసంఘంవారి దుకాణాన్ని నడిపించి ఖద్దరు విక్రయించెను ఆరోజులలో నాగలాపురం మోటుఖద్దరు ఎక్కువగా ఉత్పత్తయ్యేది. దారిపోయేవారిని పిలిచి, నర్మోక్తులతో వారిని పలకరించి వారిచేత ఖద్దరు నంటకట్టేవారు.

1926-27 సంవత్సరపు ఎన్నికలలో శ్రీ ప్రకాశం పంతులుగారి ఆధ్వర్యాన కాంగ్రెసు ప్రచారము సాగించెను. తుదివరకు ఖద్దరుధారులై యుండిరి.

ఇతడు గున్నేశ్వరరాయల చింతామణి నాటక కంపెనీలో హాస్యనటుడుగా నటించెను చాకచక్యంతో నటించి ప్రేక్షకుల మన్ననలను జూరగొనెను. ఆఖరిదశలో 10 ఏండ్లు మాత్రం సినీమానటుడుగా పనిజేసెను. అజ్ఞాతముగ నటుడు. దేశభక్తుడు. వ్యాయామోపకారుడును నై షష్ఠి వత్సరములను పూర్తిజేసి కీర్తిశేషుడైన యీ వ్యక్తి అజ్ఞాత చరిత్రుడు. ప్రఖ్యాతసినిమానటుడైన కస్తూరి శివరావు ఇతనిశిష్యుడేనట—

## ౪౦. శ్రీమతి శివరాజు వెంకటసుబ్బమ్మ
## రాజమండ్రి

(1857 – 29 - 8 - 1931)

రాజమండ్రిలో సుప్రసిద్ధ వైద్యులైన డాక్టర్ రామారావుగారి మాతృశ్రీ ఈమె ఈమె గొప్ప దేశభక్తురాలు ఖద్దరుదీక్షావ్రతురాలు. 1930—32 ఉద్యమాలలో కారాగారశిక్ష ననుభవించి ఆగస్టు 29—1931 లో 80 వ ఏటను మరణించిరి

## ౪౧. దయానిధి: పాలకోడేటి శ్యామలాంబ

### రాజమండ్రి

(12-6-1902 — 18-6-53)

శ్రీమతి శ్యామలాంబ—ఆంధ్రులకాదర్శగృహిణి—ఈమె జనన తేదీ 12-6-1902 దేశసేవికయై తనరారెను ఈమె దేశసేవకులైన శ్రీ పాలకోడేటి సూర్యప్రకాశరావును 9-6-1914 లో వివాహమాడెను. వీరి అన్యోన్యదాంపత్యం గొప్పది. అమాయకురాలు. భర్త అంటే సాక్షాత్తు దేవు డనే విశ్వాసము గలది ఈమె రెండునాళ్లు (1932-1941 సం॥ లలో) జైలునకు వెళ్లినది. 1941 వ్యక్తిసత్యాగ్రహ ఉద్యమములో, స్త్రీల పక్షాన తూర్పుగోదావరిజిల్లా మొత్తము మీద పాల్గొన్న యువతీరత్న మీమె యొక్కతే.

1946 నుండి 18-6-1953 వరకు అనగా మరణించు వరకు రాజమండ్రి మ్యునిసిపలు కౌన్సిలు సభ్యురాలుగా ఉన్నది. ఉపన్యసించే శక్తి లేకపోయినా-విషయగ్రహణ పారీణురాలు. మంచిచెడ్డలను గ్రహించి ఆమెకు నచ్చినట్టు Vote చేసేది. వార్డుపని అంటే అమితశ్రద్ధ

ఈమె చదువుకొన్నది 4 వ తరగతి అయినా హృదయ పరిపక్వతను సంపాదించింది. నాఖరులను కన్నబిడ్డలుగా జూచిన మాతృదేవత. సజ్జనులను దుర్జనులనుకూడ సమాన భావంతో

చూచేది. ఇతరుల కష్టాలను బాటించి దానధర్మాలు చేయ చూచేది. ఆపె జీవితం యొక్క ముఖ్యలక్ష్యం బీదలసేవయే.

పికెటింగులు, జయిళ్లు, దేశసంచారం—ఆపె స్వస్థతను భ్రమింగేశాయి. ఈపె తలిదండ్రులు దుగ్గిరాల వియ్యన్న సుబ్బమ్మగార్లు ఈపె 51 వ ఏట—15-6-53 తేదీని మరణించినది.

## ౪౨. ఒల్లిడి సత్యనారాయణరెడ్డిగారు కుతుకులూరు

( — మ 1944)

ఇతడుసుప్రసిద్ధ భూమంచిరెడ్డికులమునకు జెందినవాడు. సహాయనిరాకరణోద్యమవాదిగా, కాంగ్రెసువాదియే. రెడ్డి కులాలంకారభూతుడు. రామచంద్రపురం తాలూకా బోర్డు వైస్ప్రెసిడెంటుగా పనిజేసెను.

శ్రీబిక్కిన వెంకటరత్నం మున్నగు దేశభక్తులతో కలిసి నిర్మాణకార్యక్రమమునకు గడంగెను.

1930 సం॥లో ఉప్పుసత్యాగ్రహ సమరములో బాల్గొని పనిజేసెను. ఇతడుప్రభుత్వం వారి కోపాగ్నికింధనమై 7 మాస

ములు శిక్షింపబడెను పైగా వేయిరూపాయలు జుర్మానా విధింపబడెను. రాజమండ్రి, బళ్లారి సెంట్రలుజైళ్ళలో శిక్ష ననుభవించిరి.

పందొమ్మిదిసంవత్సరములు ఏకాగ్రచిత్తతతో కాంగ్రెసు పార్టీ తరఫున జిల్లాబోర్డుసభ్యులుగా నుండెను ఇతడు, గ్రామ, తాలూకా, జిల్లా రాష్ట్రసంఘము లలో బహుకాలము సభ్యత్వ మును నిర్వహించెను

రామచంద్రపురం బోర్డున కధ్యక్షుడుగానుండి పనిని చాకచక్యముతో నడపెను 'రెడ్డి కంపెనీ' అనుపేరుతో ఒక విద్యాప్రచారకశాఖ నేర్పాటుజేసి, వాచకపుస్తకముల నచ్చు వేయించి బాలురను దేశసేవకులుగా తయారుచేసెను పార్టీక కట్టుదిట్టముగా నిలబడిన రెడ్డిగారు నిరాడంబరజీవి. శ్రీపల్లం రాజునకు కుడుభుజము వంటివాడు. కాంగ్రెసు సంఘానికి, మహాసభ లకు ఎలక్షన్ ప్రోపగాండాలోను బనిజేయుటకొరకు విశేషద్రవ్య మును వసూలుజేసిన కాంగ్రెసువాది. బహుసామాన్యకుటుం బీకుడైనను అహర్నిశలు రామచంద్రపురం తాలూకా కాంగ్రెసులో పాల్గొని పనిజేసి 1944 సం॥ రంలో వీరస్వర్గ మలంకరించిన వీరరత్నము

---

## ౪౩. మామిడి లక్ష్మీపతిగారు - రాజమండ్రి

ఆర్యవైశ్యులు మామిడి దేవేంద్రుడుయొక్క సోదరుడు ఆ జన్మాంతం కాంగ్రెసువాది. నాగపూరు పతాకోత్సవ సందర్భములో శిక్షింపబడి, నాగపూర్ - అకోలా జైళ్లలో కఠినశిక్ష ననుభవించెను. సీతానగర సత్యాగ్రహ ఆశ్రమ సభ్యులలో నొకరు నిర్మాణ కార్యక్రమములో గొప్ప పని జేసెను. దేశసేవకై ఆత్మార్పణజేసిన ప్రముఖుడు గొప్ప కలపవర్తకుడు. స్వయముగా నూలువడికి బట్టలు నేయించు కొనే వాడుక వుండెను ఆగర్భశ్రీమంతుడయ్యు అమృత ప్రాయంగా జొన్నరొట్టెను ఆవనూనె పులుసుతో అన్నమును భుజించిన త్యాగి. తిండివిషయమై ఎన్నడూ ఎట్టి తాపత్రయమూ పడలేదు తలచిన కార్యాన్ని చివరవరకు సాధించుచు, తాను నమ్మిన నాయకునిచేతిక్రింద ఎట్టి కష్టపుపనినైనను, నిరాడంబరముగా జేసెను ఎప్పుడూ ప్రసన్నవదనం గలిగి వుండెను. జైళ్లలోనున్నపుడు, సభావేదికలపై నున్నట్లు వాడా విడ చేసియెరుగడు. 1930 సం॥రంలో సర్పదష్టుడై మరణించెను.

# ౬౮. పెన్మెత్స సూర్యనారాయణ రాజుగారు

# ర్యాలి

( 3 - 3 - 1906 — 6 - 3 - 44 )

ఆంధ్రసుక్షత్రియ కుటుంబానికి జెందినవారు. నిరాడంబరజీవి. నిత్యఖద్దరుధారి. కొన్ని పాఠశాలలకు మేనేజరుపనిని జేసెను. సోషలిస్టు. కాంగ్రెసుసంఘములలోను సోషలిస్టు సంఘములలోను, యువజన సంఘములలోను, రైతుసంఘములోను సభ్యుడు. పీ రొకపర్యాయం జైలునకు బోయి వుండిరి. జిల్లారైతు సంఘానికి కార్యదర్శిగా బనిజేసెను. నిర్మాణ కార్యక్రమానికి సంబంధించిన అన్నిభాగాలలోను పనిచేసిరి ఆజన్మకాంగ్రెసువాది అహర్నిశాదులుపనిజేసెను. గుండెజబ్బుతో మరణించెను. 1930 సం. రంలో ఉప్పుసత్యాగ్రహంలో తుణుకులో అరెస్టుగావింపబడిరి. 1921లో వాడపల్లి కేసులోను — 1934లో Socialist పార్టీలోజేరి పని జేసినందుకు, 1940 లో కమ్యూనిష్టువర్గంలో చేరినందుకును 2 సంవత్సరాలు శిక్ష విధింపబడెను జైలులో నిరశనవ్రతదీక్ష గావించి — 6 - 3 - 44 న మరణించిరి.

# ౭౫. శ్రీమతి మద్దూరి వేంకటరమణమ్మ
## రాజమండ్రి

( 3 - 3 - 1906 – 6 - 12 - 43 )

జన్మస్థలం పెద్దాపురం – తండ్రిపేరు కొల్లూరు బ్రహ్మాజీ శర్మ సుప్రసిద్ధ జాతీయవాదులును, సోషలిష్టు మెంబరునైన అన్నపూర్ణయ్యధర్మపత్ని సీతానగరం, గౌతమీ సత్యాగ్రహ కార్యక్రమములలో భర్తకు అండగానిలిచిన సతీమణి నిత్య ఖద్దరుధారిణి. ఆజన్మాంత కాంగ్రెసువాదిని. కారాగారవాస శిక్ష ననుభవించిన ఆంధ్రయువతీమణులలో నొకర్తె. నిత్యమునూ నూలు వడుకుచూ నిర్మాణ కార్యక్రమాదులలో బాల్గొను చుండెడిది

ఈమె విదేశవస్త్ర దుకాణములవద్ద పికిటింగు చేస్తున్నపుడు ( 26 - 1 - 1932 ) నిర్బంధింపబడి C క్లాసు ఖైదీగా వేలూరుజైలునకు పంపబడెను. 1943 సం॥రం డిశంబరు నెలలో ఆమెకు జబ్బుగానుండుటచేనైనా నామె భర్తయగు అన్నపూర్ణయ్యను పెరోలుపైని విడువరైరి. తనభర్త జైలులో నున్నపుడు ప్రభుత్వంవా రతనిని విడుచుట కంగీకరింపకపోతే కూతురు వివాహమును తానే జేయవలసివచ్చెను.

ఈ శీలవతి 1943 సంవత్సరాంతమున మరణించెను.

# ౪౬. సుసర్ల శ్రీరామనరసింహంగారు

( జూలై 1899 – 1-1-46 )

వీరి నివాసస్థానం ర్యాలిగ్రామం. వీరు ఆదియందు సంపన్నులైన పండిత వంశీకులు ఇతని జన్మతేదీ జూలై 1899 సం॥రం – ఇతడు బాల్యదశలో తండ్రివద్ద జ్యోతిశ్శాస్త్రము నభ్యసించెను.

1916 సం॥రంలో అలహాబాద్‌లో ఇంటర్మీడియేటు పరీక్షను చదువుచుండగా శ్రీ లోకమాన్య బాల గంగాధర తిలక్‌గారి ఉపన్యాసమువలన శ్రవణానందమును బొంది, రాజకీయ జీవితమే పరమావధియని విద్య పరిసమాప్తి జేసిరి.

1919 సం॥రంలో గాంధీ ఉద్యమములో పాల్గొని ప్రచారము గావించిరి.

1921 సం॥రంలో పన్నుల నిరాకరణోద్యమములో పాల్గొని ర్యాలిలో ప్రచారము గావించిరి.

1922 సం॥రంలో వాడపల్లి శ్రీ వేంకటేశ్వరస్వామి వారి రథోత్సవములో గాంధీ ఫొటోను రథస్థాపనం చేయగా అరెస్టు చేయబడినారు

1930 సం॥రంలో యిద్దరు సోదరులతోసహా ఉప్పు సత్యాగ్రహములో రాజోలు అమలాపురం తాలూకాలకు

నాయకత్వమును వహించి అరెష్టుకాబడి కారాగార శిక్ష ననుభవించిరి.

1932 - 38 వరకు ఆంధ్ర మహాసభ కార్యదర్శి పదవి నలంకరించిరి

ఇతడు నిత్యఖద్దరుధారి. నిరాడంబరజీవి. వీరు 1-1-1946 సం॥రంలో టైఫాయిడు జ్వరముతో బాధపడి మరణించిరి.

## ౪౭. ఆకెళ్ల ప్రకాశంగారు భట్నవిల్లి

(1893 – 1943)

ఇతడు ఆకెళ్ల సీతయ్య—వెంకమాంబగార్లకు భట్నవిల్లి గ్రామములో జన్మించెను. అమలాపురంలో నాల్గవ ఫారము వరకు అభ్యసించెను.

1919 సం॥ ఇతడు సహాయనిరాకరణోద్యమములో చేరెను 192· సం॥ అఖిల భారత కాంగ్రెస్ సంఘమువారు చెప్పి పర్యంతమూ పన్ను ఆపుచేయుట గ్రామోద్యోగస్థులచే రాజీనామా లిప్పించుట, కల్లు, సారా, విదేశవస్త్ర బహిష్కారముల పికెటింగులోను, కోర్టుబహిష్కారములోను పాల్గొని తీవ్రముగ పనిచేసెను.

విదేశవస్త్ర దహనమునకు విదేశవస్త్రముల ప్రోగు చేయుట, తిలక్ స్వరాజ్య నిధికి ధనమును వసూలు జేయుట, కాంగ్రెసు సభ్యులను విరివిగా జేర్పించుట, ఖద్దర్ హాకింగ్ లోను, 'తుఫాన్ రిలీఫ ఫండ్' లోను, స్థానిక సంస్థల ఎలక్షన్లలోను, తీర్థములలోను పనిజేసెను ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని ఉప్పుజేయుట ఇతరులకు అమ్ముట మొదలగు కార్యక్రమమున పాల్గొనెను.

1923 సం॥ రంలో నాగపూర్ కాంగ్రెసునకు వెళ్లెను. ఇతడు మల్లపరాజుగారితో కలిసి స్వంత బండిపై పోయి ఖద్దరు ప్రచారం గావించెను.

1930 సం॥ రంలో ప్రభుత్వ ఆగ్రహమునకు గురియై జైలునకు పోయెను. ఇతడు 1932, 1933, 1940 వరకు కాంగ్రెస్ కార్యక్రమములలో పాల్గొని జైలుశిక్షను—రాయ వెల్లూరు—రాజమండ్రి జైళ్లలో అనుభవించెను. జైలులో నున్నపుడు పట్టాభిగారికి సహాయం జేయుచుండెను. ఇతడు నిరాడంబరజీవి పేరెన్నికగన్న కాంగ్రెసు నాయకుడు. ఆజన్మాంతం కాంగ్రెసు వాదియే. నిత్యఖద్దరుధారి సెం ట్రల్ డెల్టా అంతటా యింటింటికీ, గ్రామగ్రామానికి ప్రచార మొనర్చిన దేశసేవకులలో నొకడు. మరియు గ్రామ, జిల్లా, తాలూకా, రాష్ట్రసంఘములలో బహుకాలం సభ్యులుగా నుం డిరి. వీరి కృషి చేయుట వలన సెంట్రల్ డెల్టా ను ముఖ్య ముగా తూ॥ గో॥ జిల్లాకు తీరని లోటు సంభవించినది. వ ర

ణానికి పూర్వం హిందూస్థాన్ ఇన్సూరెన్సు ఏజంటుగా సైకిలు పైపోయి 2 లక్షల వరకు—ఇన్సూర్ చేయించెను. కాంగ్రెస్ వాది యగుటచే తన సర్వస్వమును గోల్పోయెను. ఇతనికి 3 కొడుకులు 4 కూతుళ్లు కలరు

1943 సం॥ రం డిశెంబరులో మరణించెను. అప్పటికి వయసు సుమారు 50 సంవత్సరములు.

## కీ. శే. మండపాక రంగయ్యనాయుడుగారు

## కాకినాడ

( 1886 – 1941 )

జగత్ప్రఖ్యాత ఆంధ్రకవిశేఖరులైన కూచిమంచి తిమ్మన కవి, జగ్గకవి, వేదులపల్లి సుబ్బరాయశాస్త్రి, కృష్ణశాస్త్రి మున్నగువారు జన్మించిన చంద్రపాలెంగ్రామం ఇతనిజన్మస్థలం. కాకినాడలో ఇతడు అయిదుఫారములవరకు చదివెను. సుమా స్త్రాగానుండి టూ్యటికొరన్ ట్రివేండ్రం కొలంబోలు వెళ్ళి వారి తరఫునపనిజేసి వారివ్యాపారము నభివృద్ధిజేసెను.

19 1 సంగరంలో ఇతడు కీ॥ శే॥ దరిసేటి శేషారావు గారికి వ్యతిరేకంగా 'No vote campaign' నడిపించెను. పిమ్మట మహర్షి బులుసు సాంబమూర్తిగారి అనుచరుడై చాలకాలము దేశసేవ చేసెను.

1923 సం॥రంలో కోటమర్తి రఘుపతిరావుగారితో కలసి ముద్రాక్షరశాల నడిపించెను.

1922, 1930, 1932, 1941, వ్యక్తిసత్యాగ్రహాంలలో పనిజేసి, రాజమండ్రి, కన్ననూరు, కడలూరు, రాయవేలూరు జైళ్లలో శిక్షననుభవించెను.

1941 సం॥రంలో ఆలీపూర్ జైలులో తమ 54 ఏట జబ్బుచేసి చనిపోయిరి. వీరికిమునిసిపల్ ఎరిపాలనపైని చాలఇష్టంగలదు. చాలపుస్తకాలు వ్రాసెను. కాకినాడమునిసిపాలిటీ వ్యవహారాలలో చాలాశ్రద్ధవహించెను ఇతడు డిస్ట్రిక్టుకాంగ్రెస్ ప్రెసిడెంటు, ప్రా. కాంగ్రెస్ సెక్రటరీ, మునిసిపల్ కౌన్సిలర్, చైర్మన్ పదవులనుకూడ జేసెను.

## ౪౯. సభ్నవీస్ కృష్ణారావుగారు-పోణంగిపల్లి

సహాయనిరాకరణోద్యమ ప్రారంభము నుండియు కాంగ్రెసువాది, నిత్యఖద్దరుధారి. పోణంగపల్లి జమీందారు. శ్రీమంతుడైయుండి ప్రభుత్వంవారి ఖాతికి ఎదిరించి, కాంగ్రెస్ కార్యక్రమంలో పాల్గొనెను. పంచవిధ బహిష్కారం, కాంగ్రెస్ సభ్యులను జేర్చుట, విదేశవస్త్రదహనం శాంతిసైనికులదళాన్ని చేకూర్చుట, ఖద్దరు ప్రచారం చేయుట, తిలక్ స్వరాజ్యనిధికి

ధనసేకరణ, గ్రామోద్యోగియులచే పనికి రాజీనామా యిప్పించుట, కాలేజివిద్యార్థుల సమ్మె, కాంగ్రెస్ సందేశాన్ని ఇంటింటికిపోయి ప్రచారంచేయుట, గ్రామోద్యోగస్థులసభ, కాంగ్రెస్, జిల్లా తాలూకాసభలు, విద్యార్థుల సభల నేర్పరుచుటలో అగ్రగణ్యులు. అఖిల భారత కాంగ్రెస్ సంఘంవారు తీర్మానించే వరకూ పన్నులు కట్టకూడదని చెప్పుట మున్నగు కార్యాలలో పాల్గొనెను

1922 సం॥ రంలో శిక్షింపబడి రాజమండ్రి, కడలూరు చెరసాలలలో నుంచబడెను. B A చదువుతూన్నపుడు ప్రథమంలో కాలేజిని బహిష్కరించారు.

## ౫౦. కోడేటి రంగాచార్యులుగారు - తుని

సాతానివైష్ణవశాఖకు జెందినవారు. సహాయనిరాకరణ ఉద్యమంనాటినుండీ కాంగ్రెస్‌వాది. ఖద్దరుధారి. పట్టణ, జిల్లా, తాలూకా. రాష్ట్రసంఘాలలో బహుకాలం సభ్యుడుగానుండెను. తునిలో ఒక గ్రంథాలయాన్ని స్థాపించెను దానిపేరు వివేకానంద గ్రంథాలయము. చాల జాతీయ గీతాలను వ్రాసిన కవియై జైలుకుపోయెను. అన్నిటికి ముఖ్యమైనది బొబ్బిలి పాట. కాంగ్రెస్ నిర్మాణకార్యక్రమంలో పాల్గొనెను.

# ౫౧. పప్పు అప్పయ్యదాసుగారు

## కాకినాడ

( 1880 ప్రాంతం — 1952 సెప్టెంబరు )

ఈయన విశాఖపట్నం జిల్లాలో ఒక ద్రావిడ వైదిక కుటుంబమున జన్మించినవారు. నాలుగు వైదికముక్కలు నాలుగు ఇంగ్లీషుముక్కలు మాత్రం నేర్చి ఉభయవిధముల స్వపోషణ చేసుకొనుచుండెను. అసహాయోద్యమములో నుంచికెను "కాషాయ ఖద్దరుశాటి వస్త్రధారి. విభూతి కుంకుమ, గంధాదివిలేపన త్రిపుండ్రధారి. ఉద్ధూత జాతీయ త్రివర్ణ పతాకోదాత్త గోపురాకార రుద్రాక్ష కిరీటధారి. తంత్రీ వాద్యహస్తధారి, సహాయ నిరాకరణాది దేశభక్తి ప్రచోదన గేయ వక్త్రధారి," గృహములు, వాకిళ్లయందే కాదు, వీధుల్లోనేకాదు, సభలందేకాదు, కలక్టర్ కచేరీలు, ప్రభుత్వస్థాన కార్యాలయాలవద్ద కూడా తన యీ హరిదాస్ వేషంతో తంబూరాగానంతో "మాకొద్దీ తెల్ల దొరతనము" అనే గీతాలతో ఒక శిష్టపద్ధతిని ప్రచారం చేస్తూండేవారు. ఈయనకు మేజస్ట్రేటుగారు 1-3-22 తేదీని సత్ప్రవర్తనకై శిక్షించి ఒక సంవత్సరం కఠిన కారాగారశిక్ష విధించారు. చాల దారిద్ర్యజీవితంలో శ్రీ అప్పయ్యదాసుగారు నందన సంవత్సరం భాద్రపద శుద్ధ సప్తమీ బుధవారం కాంగ్రె

గీతముల తంబురావాద్యముతో పాడుచూ, ప్రచారము గావించి, బజారు వీధులలో హఠాత్తుగా గిట్టున పడిపోయి పరమపదించారు.

## ౫౨. దేవులపల్లి సూర్యనారాయణ మూర్తిగారు

(1892 – 6 - 5 - 1938)

ఇతడు కొవ్వూరు గ్రామంలో 1892 సం॥ రంలో దేవులపల్లి రామయ్య మంగమ్మగార్లకు జన్మించెను. ఇతను నిడదవోలులో చదువు నభ్యసించుచూ 1907 సం॥ రం లోని జాతీయోద్యమములో పాల్గొని చదువుకు స్వస్తి చెప్పెను. చిన్ననాటనే తండ్రిని గోల్పోవుటచే మేనమామల పోషణకు పాత్రుడయ్యెను. ఇతనికి ఒక సోదరుడు గలడు.

బంగాళా విభజనకాలములో బి. యన్. రైల్వేలో చేయుచున్న ఉద్యోగానికి రాజీనామా నిచ్చి – పిఠాపురం రాజాగారి రాణాలో నౌఖరీకి కుదిరెను. దీనికి మరల అంత రాయము కల్గినది.

1921 స ॥ రంలో గాంధీ మహాత్ముడు జల్లిన జాతీయోద్యమ సంరంభంలో ఉత్సుకుడై ఖద్దరు ప్రచారమునకు

గడంగెను తదుపరి క్రొత్తపేట తాలూకా కాంగ్రెస్ సంఘా ఎకి కార్యదర్శిత్వమును వహించి, తిలకు స్వరాజ్యనిధికి ఖద్దరుకు ప్రచారము చేసెను. గ్రామమునకుబోయి కాంగ్రెస్ సందేశము నందించెను. 18 వ గోదావరిజిల్లా మండలమహాసభకు (పలివెల) కార్యదర్శిగా నుండి సభను జయప్రదముగా జరిగించుటకు నాయపడెను గాంధీగారి ఖద్దర్ ప్రచారానికి పలివెల గ్రామస్థులచే 5 వేల రూపాయలు సమర్పింప జేసెను. మరియు ఇచ్చోటనే బాలభారతీ పుస్తకభాండాగారమును స్థాపించి కృతకృత్యు డయ్యెను ఇతడు పలివెల కో ఆపరేటివు సొసైటీని 5 వేల రూపాయలలో ప్రారంభించి, ఒకలక్ష రూపాయలు పరపతిని కలగజేసెను ఇతడు చాలా కాలం కో ఆపరేటివు సెక్రటరీగాను, అమలాపురం సెంట్రల్ కో ఆపరేటివు బ్యాంకు డైరక్టర్‌గాను నియోగింపబడిరి. చాల కాలము జిల్లాసంఘ శక్రటరీగా వుండిరి.

1930 సం॥రంలో ఉప్పుసత్యాగ్రహం ప్రారంభమాయెను. సెంట్రల్ డెల్టాలో శాంతిసైనికులని గూర్చి గ్రామగ్రామము సంచారము గావించి, అమలాపురంలో శిబిరమును స్థాపించిరి. అందుకొరకు ప్రభుత్వము వారు వీరికి 2½ సంవత్సరములు కఠిన శిక్షను విధించిరి. రాజమండ్రీ, తిరుచినాపల్లి, ... జైళ్ల యందు గడిపి, తొమ్మిది మాసముల అనంతరం గాంధీ-ఇర్విన్ ఒడంబడిక మూలముగా ... గ విడిపబడిరి. విముక్తి అయినవెంటనే, (By Indian Stores) స్వదేశీ

వస్త్ర విక్రయశాలను నెలకొల్పిరి. వారికి చేతుపనులమీద చాలా మక్కువ ఒట్టలకు రంగువేయడంలో కూడ గలదు.

1934 సం॥రంలో బట్టల కంచుల నద్దుటచేసి, జీవనో పాధిని వెలిబుచ్చుచుండిరి ఈపరిశ్రమలో వారికి రాజమండ్రిలో తగినంత ప్రోత్సాహము లభించనందున, Electro-Plating) వలన వీరు సుమారు 4 సం॥రములు గడిపిరి. భద్రాద్రిరాముని ఆలయముపైని పసిడికుండలకు బంగారు మలామాను వీరే చేసిరి. వీరియొక్క శక్తిసామర్ధ్యములను రాష్ట్రమునందలి దేశీయవాదులు ప్రశంసించియున్నారు. వీరిచేత శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు 'Nature Cure disco' చేయించి ప్రోత్సహించియున్నారు. వీరు రాజమండ్రిలో ఆమరణాంతం గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారితో కలిసి 'వారు ప్రారంభించిన' తెలుగుపత్రికకు అన్నివిధములచేత మిక్కిలి సహాయమును జేసిరి. అసంబ్లీ ఎలక్షనులో వీరు ప్రచారంచేసి, రాజమండ్రి మ్యునిసిపల్ ఎన్నికల సందర్భములో దండెత్తిరి ఆ సమయములోనే రాజమండ్రి మ్యునిసిపాలిటీ కాంగ్రెస్‌వారి హస్తగతమైనది. 6-5-38 తేదీ ఉదయం 8 గం॥కు అరాత్తుగా గుండెనొప్పిచే మరణించిరి. వీరికి పలివెల లోవున్న య 10 లు భూమిని కాంగ్రెసు ఉద్యమానికి త్యాగించి .

పశ్చిమ గోదావరి జిల్లా

## ౫౩. గజవల్లి రామచంద్రరావుగారు-పలూరు

వీరు M. A పరీక్షలో నుత్తీర్ణులైనారు. వందేమాతరం కాలమునుండియు కాంగ్రెసువాదియే.

1916 సం॥ రంలో రాజమండ్రి వీరేశలింగం ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయ పదవిని నిర్వర్తించి, 1921 లో సహాయనిరాకరణోద్యమారంభములో వృత్తికి తిలాంజలినిచ్చి కాంగ్రెస్ సేవకుడుగామారిన మహామహుడు.• 1922 సం॥ రం లో ప్రభుత్వంవారి ఆగ్రహానికి పాత్రుడై కారాగారశిక్ష ననుభవించిన భక్తుడు. స్కూల్సు బహిష్కారం, శాసనసభల ధిక్కారం, విదేశవస్త్ర వస్తు బహిష్కారం, కల్లు సారాయి పికెటింగులలోను జోక్యం కలుగజేసుకొనెను నిత్యం నూలు వడికేవారు. పట్టణ జిల్లా రాష్ట్ర సంఘాలలో చాలకాలము సభ్యుడుగా నుండెను. 1921 లో పోటీలేకుండా మ్యునిసిపల్ సభ్యు డయ్యెను.

నిడాంబరవ్యక్తి. అస్పృశ్యతానివారణలో చాల పని జేసెను. కాంగ్రెసువాదిపై సాక్ష్యమిచ్చుటకు నిరాకరించిన దోషాన 1 మాసము రోజులు శిక్ష ననుభవించెను.

పిమ్మట మరియొకసారి సం॥ లో తిరిగి జైలుకు వెళ్లిరి. ఈయన రాజకీయ పరిజ్ఞానము ప్రౌఢమయిన ఆంగ్లభాషావక్తృత్వమును బట్టి ఆంధ్రగోఖలే, యని పిలుచుచుండెడివారు.

## ౫౪. సర్దార్ దండు నారాయణరాజు గారు

## ఏలూరు

(15 - 10 - 1889 — 1944)

స్వగ్రామం - నేలపోగలు. 15 - 10 - 1889 సం॥రంలో జన్మించిరి. 1915 సం॥రంలో ప్లీడరుపట్టాను పొంది, హైకోర్టు వకీలుగా 1917 నుండి ఏలూరులో పనిచేయుట ప్రారంభించిరి. ఈ సమయంలోనే వీరు భారతరక్షణ సైనిక సంఘమునకు (I. D. F) సభ్యులు. 1920 సం. రంలో ప్లీడరువృత్తినిమాని వేసి ప. గోదావరి జిల్లా కాంగ్రెసు కార్యక్రమంలో 15 సంవత్సరాలపాటు కార్యదర్శి, అధ్యక్ష పదవులను నిర్వర్తించిరి. 1920 సం॥రం నుండి ఆమరణాంతము, కాంగ్రెసు సభ్యులుగా నుండిరి. Re-settlement Enquiry committee లో 1926 - 31 వరకు పనిచేసిరి రైతులపై భూమిమీద పన్ను భారమును హెచ్చుచేయుటకు మద్రాసుప్రభుత్వం సంకల్పించిన

Re-settlement విధానంయొక్క లోట్లను చూపించుచూ బయలు దేరిన ప్రజాందోళనలో శ్రీ మందేశ్వరశర్మ, వెన్నేటి సత్యనారాయణ, మాగంటి బాపినీడు, కానూరి వెంకటా చలపతిఅయ్య మున్నగువారితో కూడి, కృష్ణ, ఉభయగోదావరి రైతు కేంద్రసంఘంలో సభ్యులు ఇందునుగూర్చి శాసనసభవారు ఏర్పాటుచేసిన ఆరోగ్యస్వామి మొగలియార్ కమిటీలో ముఖ్య సభ్యుడు ఉప్పు సత్యాగ్రహ కార్యక్రమంలో పాల్గొనిరి. ఈయనకు ప్రజలు 'సర్దార్' అన్న బిరుదు నిచ్చారు.

1926 లో ప.గో. జిల్లాబోర్డు ప్రసిడెంటుగాను, ఏలూరు బోర్డు ప్రసిడెంటుగాను నియమింపబడి, 1930, 1932, 1933, 1940 సంవత్సరాలలో జైలుశిక్షను అనుభవించారు. ప. గో. జిల్లాబోర్డు అధ్యక్షులుగను, సభ్యులుగను, గోదావరి కోఆప రేటివు సెంట్రల్ బాంక్ కార్యదర్శిగానుండిరి. స్వరాజ్యపార్టీ కాలంలో శాసనసభా సభ్యుడుగా నుండెను. ఆఖరుసారి భీమవరం జనరల్ నియోజకవర్గము, 1927-1930 లో శాసన సభకు సభ్యులుగా ఎన్నుకోబడిరి. 1940 సం॥ రంలో తంజా వూరు కారాగారములో మరణించిరి మోహన్‌దాసు వస్త్రాలయంపేరిట న్యూ ఖద్దరు వస్త్రాలయాన్ని స్థాపించివుండిరి. అనేకరూపాయలు తిలక్‌స్వరాజ్యానికి వసూలుచేశారు. సివిల్ పార్లమెంటరీ బోర్డులలోకూడ సభ్యులుగా పనిచేసెను.

## ౫౫. వేలూరి సత్యనారాయణగారు

## భీమవరం

(1898 – 1943)

సుప్రసిద్ధ గ్రంథకర్త – దేశభక్తుడు పశ్చిమ గో. జిల్లా భీమవరంకాపరస్థులు. విజయనగరం కళాశాలలో దేశచరిత్ర నభిమానవిద్యగా బరించి, పట్టభద్రులై – M A. పరీక్షకు చదువనిశ్చయించుకొనగా, గాంధీజీ ఆదేశానుసారం, చదువును విరమించి, శ్రీ ముష్టి లక్ష్మీనారాయణ, సుబ్రహ్మణ్యం, శ్రీ అడివి బాపిరాజు, శ్రీ వేమూరి రామకృష్ణరావులతో కలసి, కాంగ్రెస్ ప్రచారముచేసి 1920 సం రంలో సహాయ నిరాకరణములో 1 సం. రం చెరసాలలో శిక్షననుభవించెను అప్పటికి A B. క్లాసులులేవు. సామాన్యఖైదీలతో పాటు వీరిచేత నూనె గానుగను లాగించిరి. ఆనాటిజైలు అనుభవాలు వారు చెప్పినపుడు గుండెనీరయ్యేది.

వారు మిత్రులతో కలసి ఉత్తరహిందూస్థానమంతా కాలినడకను నడిచి దేశభ్రమణంచేశారు. ఆరావళీప్రాంతాల చెంత ప్రకృతి వైచిత్ర్యాన్ని అజంతాఎల్లోరా గుహలలోని చిత్రకళానైపుణ్యం యింకా ఎన్నోవిశేషాలు వర్ణిస్తూవుంటే ప్రత్యక్షంగా గోచరమయ్యేటట్లు వుండేది. ఇతడాంధ్రరాష్ట్ర కాంగ్రెస్కమిటీ కార్యదర్శకత్వమునందు నియోజితుడై

1922 సం. మొదట కొంతకాలం బెజవాడలో వుండెను. ఆ కాలంలోనే కొన్ని వ్యాసాలను, గ్రంథాలను, వ్రాసియు, ప్రపంచకోద్యమాలలో స్వాతంత్ర్య పోరాటమునల్పి వీరుల విషయాలనువివరిస్తు వ్యాసాలను కృష్ణాపత్రికలో ప్రకటించారు. ఫ్రెంచివిప్లవ చరిత్రను వ్రాసిరిగాని, శ్రీకాళేశ్వరావు చరిత్ర ముందుగా అచ్చువుటచే దీనిని ముద్రింపలేదు.

వీరి రచనలు 1925 సం. రంలో బౌద్ధమహాయుగం, ఫాహిమాన్, భరతవర్ష యాత్రలు, విజ్ఞానచంద్రికా గ్రంథమాలలో ప్రకటింపబడిన సుప్రసిద్ధ ఆంధ్రగ్రంథాలు —

మనజాతి కవమానరకంగావుండె అంశాలలో ఆంగ్లేయ చరిత్రకారులు రచించిన అబద్ధపు చరిత్రలను ఖండించి, యథార్థ చరిత్రను బహిర్గత మొనర్చుటలో వీరికి మంచి నైపుణ్యంగలదు. మన దేశచరిత్రలోని ఘట్టాలను, విదేశచారిత్రక ఘట్టాలతో పరిపోల్చిచూపడంలోనూ, అంశాలను సహృష్టితో వర్ణించడంలోనూ ప్రజలు గ్రహించవలసిన సంగతులను వివరించడంలోనూ, ఇతనికి నిరుపమానమైన కౌశల్యంగలదు. ఇతని రచనలు చదువుతూ వుంటె తిలకునిగారి దేశభక్తిపూరిత మైన వుపన్యాసాలు వింటూన్నట్టు, ఒకొక్క గీతంవింటే దేశాభిమానం ఉరకలెత్తుతూ వుంటూంది దేశచరిత్ర అనేది ప్రజలలో నిజదేశవేషభాషలైన అభిమానాన్ని భక్తిపూరితముగా పుట్టకొల్పే వీరచరిత్ర మని వీరి ఆశయం. ఇతడు చరిత్రలో అపూర్వదర్శకుడై అలరారెను.

## న్యాయవాదవృత్తి

ఉండవల్లి గుహలనుగురించి వీరు 1924 సం॥రం కార్తిక భారతిలో వ్రాసిన అద్భుతవ్యాసమే, ఉండవల్లి జీర్ణగుహల యొద్ధరణ, సంఘసంస్థాపనకు, ఆగుహలను సంస్కరించుటకును కారణ భూతమైనదని చెప్పడం అతిశయోక్తి కానేరదు వీరి రచనాపటిమ కట్టి విలువ లేదు.

1925 సం॥రంలో న్యాయశాస్త్ర పరనము (B L) జేసి కొద్దిరోజులు బెజవాడలో నుండి పిమ్మట భీమవరంలో న్యాయవాదవృత్తిని ప్రారంభించారు కాని భాషాసేవ మానలేదు ఆంధ్ర దేశచరిత్రలో జరిగిన పరిశోధనలను క్రోడీకరించి బౌద్ధాంధ్ర గ్రంథాన్ని వ్రాసిరి. గాని ప్రచురింపకుండానే స్వర్గస్థులయిరి ఇటీవల చిన్నపిల్లలకొరకు చారిత్ర వాచకాలను రచించి ప్రకటించారు వీరికి కడుపులో Pancreatic duct ను పట్టుకొని ఒక గుల్మం బయలుదేరింది. శస్త్రచికిత్సకు లొంగక అది జీర్ణశక్తిని హరించి, శరీరాన్ని శుష్కింపజేసి ప్రాణాన్ని తీసివేసి వీరి బంధువుల నపారదుఃఖ సంద్రంలో ముంచివేసింది.

---

# ౧౬. మంగిపూడి పురుషోత్తమశర్మగారు

## పిప్పర

(1897 – 16 - 2 - 1946)

పశ్చిమ గోదావరిజిల్లా పిప్పర గ్రామంలో, జననం. తల్లిదండ్రులు విశ్వపతి, సీతమ్మగారలు. ప్రాథమిక విద్య ముగిసిన పిమ్మట, ఉంగుటూరు గ్రామంలో కావ్యపఠనం గావించి, బందరు జాతీయ కళాశాలలో మెట్రిక్యులేషను చదివిన తదుపరి ధనాభావముచే చదువు విరమించెను. పిమ్మట అగ్రజుడైన శ్రీ వేంకటశర్మగారి ప్రేరేపణతో పిఠాపురం మహారాజావారి విద్యార్థి వేతన సహాయముతోను మదరాసులో డి. గోపాలాచార్యులుగారి ఆయుర్వేద కళాశాలలో చేరెను. అచట కొంతకాలము చదివిన తరువాత వారి యందు విభిన్నమైన సారస్వత ప్రధాన ఆయుర్వేద వైద్యవృత్తి యందు విముఖులైచెప్పి ఆకళాశాల నుండి విరమింపజేసెను. వైద్యవిద్యా పోషణ నిమిత్తమై యుద్దేశించబడినట్టి మహారాజావారి విద్యార్థి వేతనమును తిరిగి వారికి వాపసు చేసిరి. అప్పటి నుండియు యింటివద్దనే ఆంధ్రగీర్వాణ, సాహిత్యముల నభ్యసించిరి ఈ వయసుననే అనగా శర్మగారు 17 వ సంవత్సరమునందే 'భీష్ముని చరిత్ర' యను గ్రంథమును రచించిరి. ఈగ్రంథ మప్పటి S S L. C బోర్డువారి దృష్టి నాకర్షించి, పాఠ్యగ్రంథముగా నిర్ణయించిరి అప్రయత్నముగా లభించిన.

యీ ధనసహాయమున మదనపల్లిలో దివ్యజ్ఞాన సమాజము వారి కళాశాలలో చేరి Intermediate B. A , లు చదువ సాగిరి. ఆవిద్యార్థి దశలోనే వీరు మిగుల ప్రతిభాశాలి అని ఖ్యాతిగాంచిరి 1919 లో మహాత్ముని అహింసాసమర శంఖారావమును విని B A Senior తరగతిని వదలి రాజకీయములందు ప్రవేశించిరి కళాశాల యందుండు నప్పుడు వీరు రచించిన "కోయిల పాటలు" కాలేజి మేగజైనుయందు ప్రచురింపబడెను. దీని యింగ్లీషు తర్జుమా రవీంద్రకవి మన్ననలను కూడ పొందెను. వీరు రాజకీయములందు ప్రవేశించునపుడు కాలేజీ ప్రిన్సిపాలు అయిన కజిన్సుగారు, శర్మగారిశక్తి సామర్థ్యములచే ముగ్ధులయి వీరి నుద్దేశించి 'మీరాజకీయ జీవితము సాహిత్య ప్రపంచమునకే తీరనిలోటు' అని చాలవరకు నివారింప ప్రయత్నించి విఫలులైరి. శర్మగారికి సారస్వత తృష్ణతో బాటు తత్వానుభవముకూడ కలిగెను. దానిఛాయలు "కోయిల పాటలు" లో కానసగును. వీరి రాజకీయ ప్రచారము ముఖ్యముగా పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాల యందు కేంద్రీకృతమైనది. సభావేదికలపై వీరి యుపన్యాసములు మిక్కిలి చైతన్యవంతము, ఉత్తేజపూరితములై ప్రజల నుర్రూతలూగించెను విశ్రాంతి దొరకినపు డెపుడును, భాషాపరిశ్రమ చేయుచు గ్రంథరచన సాగించెడివారు

దివ్యజ్ఞాన కళాశాలయందు పఠించినను, దివ్యజ్ఞాన సమాజము వీరి నాకర్షించలేదు రామకృష్ణమఠమందు వీరిని

మొదటి నుండియు, అభిమానముండుటచే కొంతకాలము భక్తుడై శ్రీవివేకానందుని కర్మయోగమును ఆంధ్రీకరించిరి.

ఆర్యసమాజముయొక్క సంఘ సంస్కరణ వీరి నాకర్షించి శ్రీదయానందుని జీవితమును, వారి ఉపదేశములను వచన గ్రంథములుగా వ్రాసిరి.

బౌద్ధమతము యొక్క నిరాడంబరత్వము, సంఘసేవా తత్పరత వీరి హృదయము నాకర్షించెను. కడకు శ్రీఅరవిందుల భావములు వీరిని వందీకృతుని చేసుకొనుటచే వారి వాఙ్మయమంతయు వీరు తమకు జాతీయపాఠశాల యందున్నపుడు కడు శ్రద్ధగా పఠించిరి. ఈకాలములోనే శర్మగారు అరవిందుని దర్శించి వారితో అరగంటసేపు సంభాషింపగలిగిరి.

శ్రీఅరవిందుని దర్శనానంతరము శర్మగారు వారినే అంతరంగిక గురువుగా స్వీకరించి వారినే ఆరాధించుచు వారి యోగపథమునే అనుసరించిరి. అరవిందుల 'Object of Yoga' తెనిగించిరి. శర్మగారికి కర్మమార్గము నుపదేశించుటచే అరవిందుల ఆశ్రమమునందుచేరి వారి సమక్షమున యోగమభ్యసింపవలయు ననెడి కాంక్ష యున్నను అది కార్యరూపము దాల్చలేదు పైగా మరియొక వంక దేశసేవా పిపాస వీరిని కర్మవీరుని జేసెను. గాంధీమహాత్ముని అనుయాయులలో ఒకరైనను కొన్ని యెడల వారి పద్ధతులలో భేదాభిప్రాయము కలిగి యుండెడివారు. ఉదా॥ ఖిలాఫతుఉద్యమము. సత్యాగ్రహోద్యమారంభకాలమున శర్మగారియందు యుక్తవయస్సు నుండియు నిబిడీకృతమై

యున్న బ్రహ్మచర్యోపాసన వారు రచించిన భీష్మునిచరిత్రగా మూర్తీభవించినది. అట్టి అభీష్టము నిశ్చయమున దేశసేనా పరాయణత్వము, జిజ్ఞాస - దృఢసంకల్పునిజేసి, జీవితాంతము వరకు బ్రహ్మచారిగా జీవితము గడపజేసెను.

వీరు ఐహికాముష్మికములకు చక్కని సమన్వయము కల్పించుకొని అసామాన్యమగు దృక్పథము నలవరచుకొనిరి. ఎన్నడును నైతికమార్గమునుండి జంకలేదు. ఆర్థికముగా ఎంత కష్టపడవలసి వచ్చినను ధనార్జన కొరకై ఎట్టి ప్రయత్నమును చేయక గ్రంథరచనమూలమున వచ్చిన కొలది ఆదాయముతోనే తృప్తినొంది నిరాడంబరముగా నుండెడివారు. స్వీయ సంసారము లేకుండినను, నాకిఅన్నగారియు, అక్కగారికుటుంబములకు చాల సహాయసంపత్తులుగానుండి వారి అభివృద్ధికి తోడ్పడిరి.

1920 సహాయ నిరాకరణోద్యమము 1930 ఉప్పు సత్యాగ్రహోద్యమమువరకు దేశసేవాకార్యక్రమముల యందు, అవిరామముగా పనిచేసిరి. 1924 - 27 సంవత్సరములలో తెనుగుజాతీయ విద్యాలయమును, ఆశ్రమముగా మార్చుటకు శ్రమించినను, స్థానికనాయకుల వ్యతిరేకమువలన సాగలేదు. వీరి యుపన్యాసములందు ఆధ్యాత్మికభావానువృత్తి ఎక్కువగా యుండుటచే పండితుల నెక్కువగా ఆకర్షించెడిది వీరి కంఠధ్వని చాల మధురము. ఒకప్పుడు రాధాకృష్ణ నాటక ప్రదర్శన మధ్యమున రాధా కృష్ణ, ప్రేమతత్వమును గూర్చి

పిరిచ్చిన విపులప్రసంగమును సభాసదుల ఉద్రిక్తులను చేయు టయేగాక చిరకాలము హృదయములహత్తుకొని పలువురప్రశంసా పాత్రమయ్యెను.

ఉప్పు సత్యాగ్రహోద్యమకాలములో (1930) వీరికి ఒకవత్సరము కఠినశిక్ష విధింపబడినది. జైలులో శర్మగారి ఆరోగ్యము పూర్తిగా చెడెను. అప్పుడు మృత్యువు తథ్యమని అందరు భావించిరి జైలుపూపరింటెండెంటు వీరిని రాజకీయము లలో పాల్గొనని వ్రాసిఇత్తుయిచ్చినచో విడుదల చేసెద మన్నను అందుకు అంగీకరింప మరణమే కాంక్షించిరి. ఇంతలో గాంధీ-యిర్విను ఒడంబడిక ఫలితముగా అందరితోపాటు 10 నెలలు పూర్తిగాకమున్నే విడుదలయిరి.

1946 సెప్టెంబరు 16వ తేదీని చివరిదనుక మిత్రులతో మాట్లాడుచు, ఉత్తరాయణసమయముకై వేచియున్న భీష్ముని వలె యీవీరుడుకూడ బంధువులందరు, పరివేష్టితులై యుండు సమయమున, ఆత్మగురువగు అరవిందపదారవిందధ్యాయియై యిహలోకమువిడచిరి. అది నిర్వాణమేయని దగ్గరున్నవారు ఉగ్గడించిరి

ఓం తత్ సత్.

(సంకలన. తల్లాప్రగడ నారాయణమూర్తి మం విశ్వప్రసాదు.)

# ౫౭. విరాల వీరభద్రరావుగారు

## తాడేపల్లిగూడెం

(1895 – 1939)

ఈయన ప్రప్రథమములో నిడదవోలు వాస్తవ్యులు. గౌరవ మర్యాదలకు లోటులేనటువంటి ఒక బీదబ్రాహ్మణ కుటుంబములో 1895 సం॥ రం లో జన్మించిరి. వీరి తండ్రిగారి పేరు సీతయ్యగారు.

వీరు హెచ్చుగా ప్రాణవిద్య నభ్యసింపకపోయినప్పటికీ రెండు పర్యాయములు చిన్నతనములోనె కాశీకి వెళ్లివచ్చిరి.

ప్రప్రథమములో పండలపర్రు గ్రామములో జిల్లాబోర్డు స్కూలులో ఉపాధ్యాయులుగా పనిజేసి ప్రజలయొక్క మన్నన లకు బాత్రులైరి. పిమ్మట భీమవరములో మాష్టరుగా నుండిరి.

1921 సం॥ రంలో సహాయనిరాకరణోద్యమారంభ దిన ములో ఉపాధ్యాయవృత్తికి రాజీనామా నొసంగి కాంగ్రెస్ రంగములోనికి దుమికిరి పిమ్మట తాడేపల్లిగూడెము నివాస ముగా జేసుకొని కాంగ్రెసు ఉద్యమము నుంచి తీవ్రముగా నడిపించిరి. 1921 సం॥ రంలో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొ న్నందుకు 6 మాసములును, రాజీరోజులలో 2 సంవత్సరము లును ఖైదు ననుభవించిరి

ఇతడు జిల్లా, తాలూకా, పట్టణ సంఘములలో చాల కాలము సభ్యులుగా నుండెను. కల్లు సారాయి విదేశ వస్త్రముల పికెటింగులలోను, కాంగ్రెస్ సభ్యులను జేర్చుట, తిలకు స్వరాజ్యనిధికి వసూలు జేయుటలలో బహుతీవ్రముగా పని జేసి వుండెను. తుదకు భార్యకు ఆపత్కాల సమయములో సైతము కొంచమైనను జంకక జైలున కేగినధీరుడు.

ఈయన ఉపన్యాసములు హాస్యరసప్రధాన మగుటచే జనసామాన్యము నెక్కువ ఆకర్షించి కాంగ్రెసు ప్రబోధమున కెక్కువ ఉపకరించెడివి. తాడేపల్లి గూడెమునుండి కొంతము కాలం ఆంధ్ర దినపత్రికలకు విలేఖరిగాకూడ నుండెను. కాంగ్రెసు కార్యక్రమములో నిమగ్నుడై తిరుగుచుండుటచేతను, ధన లేమిచే కూడ తన పుత్రులకు దగినవిద్య నేర్పింప లేకపోయెను. నిరంతర కార్యదీక్షతో కాంగ్రెసు ప్రచారం జేసియున్నందు నను, జైలుతిండి పడకను, తుదకు గుండెజబ్బు ప్రవేశించి వైద్యమువలన కుదరక యింటివద్దనే 1939 సం॥రం డిశెంబరు నెలలో స్వర్గస్థులైరి.

వీరి కిర్వురు కొమాళ్లు నొక కొమార్తెయు గలరు. పెద్దకుమారుడు విశ్వనాథం అను నాతడు తండ్రి యడుగుజాడల ననుసరించుచు తండ్రిగతించిన కొలదికాలములోనకే అనగా 940 సం॥ రం లో మరణించెను ఇక్లై ఈయన భార్య శ్రీమతి రత్నమ్మగారు 'పట్కార్యయుక్తా ఖలుధర్మపత్నీ'

అను ధర్మప్రకారం భర్త ననుసరించి దేశసేవ నిర్మాణ కార్యక్రమం చేస్తూ 1945 అక్టోబరునెలలో భర్తృసన్నిధి కేగినది. ఇట్టి వీరి కుటుంబము దేశీయులకు, ముందు తరములవారికి మార్గదర్శక మగుగాక.

## ౫౮. జనాబ్ డాక్టర్ నసీరహమ్మద్ గారు
## తాడేపల్లిగూడెం

( 27 - 4 - 1878 – 1937 )

ఈ మహనీయుడు, ప్రథితయశస్వి, ఖండాంతర విఖ్యాతి నార్జించిన వైద్యాచార్యుడు. 1878 సం॥ రం 27 ఏప్రియలురోజున తూర్పుగోదావరిజిల్లా కొత్తపేటగ్రామములో పోలీసు హెడ్ కనిస్టేబులు అగు షేకుమౌలాసాహెబ్ అమీర్‌బీగార్లకు జన్మించిరి.

కడు బీదసంసారులగుటచే ఎన్నో కష్టములలో చదివి 1910 సం॥రంలో కలకత్తాలోని జాతీయ వైద్యశాలలోను "నేషనల్ కాలేజి ఆఫ్ ఫిజిషన్సు అండ్ సర్జన్సు ఆఫ్ ఇండియా" లోను వైద్య శాస్త్రము నభ్యసించిరి. విద్యాపూర్తిని సాధించి, విస్తృత ప్రాక్పాశ్చాత్య దేశములకేగి అఖండ అనుభవములను సంపాదించవలెనని మహోత్సాహవంతుడయ్యెను.

1912 సం. ... లగాయతు 1916 స॥ రం. వరకు జరిగిన టర్కిష్ బాల్కన్ యుద్ధములో ఇండియన్ రెడ్‌క్రాస్ మిషీనులో ప్రథమ భారతీయుడుగా జేరి, చెన్నపట్నంలో రొమేనియన్ పొగయోడలో బయలుదేరి, కాన్‌స్టాంటి నోపిల్ ... Palace Hotel తో తర్కీసుల్తాన్ వారిచే స్వాగతమును ఒడసిరి.

త్యాగశీలుడైన నసీరహమ్మద్‌గారు University Hospital లో జరిన గాయపడిన తర్కీ సైనికులకు వైద్యము చెప్పుచు కడు జాగరూకతతో వారికి చికిత్స జేయుచుండెను.

టర్కీ, జర్మనీ, ఫ్రాన్సు, ఈజిప్టు, ఆల్బేనియా గ్రీసు, రొమేనియా, హంగేరి, ఇటలీ, పోలండు, లండన్ మున్నగు దేశములలో పెక్కు వత్సరములుండి గౌరవార్థం (Honorary Service) కాన్‌స్టాంటి నోపులు బుఖారెస్టు, హేడంబర్గు మున్నగు ప్రదేశములలోని వైద్యశాలలలో పనిజేసి ఉన్నాట చక్రవర్తి కమాల్ పాషా, ఎలిజబెత్తురాణీ వారున్నగు అనేక రాజాధి రాజులచే యోగ్యతాపత్రములు, సువర్ణపతకములు రజితపాత్రములు బహూకరింపబడెను.

1911 స ...ంలో ఢిల్లీవ ర్బారులో జరిగిన పంచముజార్జి పట్టాభిషేక సమయములో వీరికి రజితపతకము 1913 సం. ...లో ... ర్కీసుల్తాన ... రు ... ర్ణపతకమును సత్కరించి ... ... ప్రభుత్వముల ... బ్రి... దొరతనమువారు వీరికి ఇతర దేశములలో లభించిన పతకములను (బిళ్ళలను) ధరింపరాదని శాసించిరి.

ఈవిషయమై, Secretary to Govt of India (Foreign Affairs,) Delhi, వారికి అనేక ఉత్తరములువ్రాసి వారి చర్యలను తీవ్రముగ విమర్శించెను

1918 సం॥ రంలో వివాహము జేసికొనెను. ఈ సంవత్సరములోనే ఇతడు జాతీయోద్యమములో ప్రవేశించుటయు, కూలికి, స్వార్ధపరులైన బ్రిటిష్ దొరతనమువారిక్రింద నౌకరీ చేయుట కిష్టపడక, స్వతంత్రముగ వైద్యశాలను తెరచి రోగులకు చికిత్సచేయ మొదలిడెను.

1920 సం॥ రం వరకు వైద్యవృత్తిలో అపార ధనము నార్జించి దివ్యభవనమును కట్టించెను గాని దానిని తాడేపల్లిగూడెం తాలూకా బోర్డు ఆఫీస్ వారికి విక్రయించెను. ఇపుడు దానిలో Local Funds Hospital ను పెట్టినారు.

1922 సం॥ రం లగాయతు వైద్యసంపాదనను తగ్గించి భారతదేశ స్వాతంత్ర్య రక్షణమె పరమలక్ష్యముగా భావించి భారతదేశపు పునరుద్ధరణమే శ్రేయముగా నెంచెను.

1928 సం॥రంలో జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా వ్యవహరించిరి.

1930 సం॥రంలో ఉప్పు సత్యాగ్రహములో పాల్గొని నర్సాపురం వద్దనున్న తూర్పు తాళ్లకు పయనమై అచ్చట సత్యాగ్రహ వ్రతాల నాచరించి బ్రిటిష్ వారతంత్ర్య శృంఖలలను ఛేదించ నడుకట్టిన మహావీరుడు.

1930 — 1931 సం॥ రంలలో ఉప్పు సత్యాగ్రహం, విదేశవస్తు బహిష్కరణము గావించి, (పికెటింగ్) నిర్బంధం చేయుటచే మూడుసార్లు శ్రీకృష్ణ జన్మస్థానమున కేగి, దేశ గౌరవమును నిలబెట్టిన ప్రతిభాశాలి తెల్లదొరతనంవారు, వారిరాజ్యసంపదలు, వారి నిరంకుశ ప్రభుత్వమును గూర్చి ఉద్రేకపూరిత ఉపన్యాసములను సభలలో సింహనాదముచే యుచున్న ప్పుడు ప్రజలు త్తేజితులై జయజయధ్వానములనుజేసి ఆనందాశ్రువులను రాల్చుచుండెడివారు 1931 సం॥రంలో ప॥ గోదావరిజిల్లా తరపున A I C. C మెంబరుగా జేరిరి.

1935 సం॥ రంలో జిల్లాబోర్డు ప్రెసిడెంటు ఎన్నికల సందర్భములో వీరి మిత్రులు వీరికి గొప్పధనసంచయము నిచ్చె దము Vote యిమ్మని ఆశపెట్టినను తిరస్కరించిన సత్య సంధుడు, ధర్మమూర్తి ఇతడే.

1936 సం॥ రంలో తణుకు ఫిర్కా జిల్లాబోర్డు అభ్య ర్థిగా దిగ్విజయముతో గెలుపొందిన మహమ్మదీయులలో నగ్ర గణ్యుడు— ఈసంవత్సరంలోనే ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్‌లో అబ్దుల్ కలాం అజాద్, మహాత్మాజీలవద్ద నుండి స్వాగతపత్ర ములు, ఆశీర్వచన పత్రము లనేకము వచ్చినవి.

1937 సం॥ రంలో మదరాస్ శాసనసభకు మెంబ రుగా నిలబడినప్పుడు, విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లా మున్నగు ప్రదేశములలో ప్రచారముకొరకు అహర్నిశాదులు పర్యటనముజేసి తనయావజ్జీవితమును ధారబోసిన దేశభక్తుడు.

ఈయన విదేశముల కేగినప్పటికి, చుట్ట బీడీలు, మద్య పానం మున్నగు దుర్వ్యసనముల పాలుగాలేదు. కడుబీద రోగులకు స్వగృహములో నాశ్రయమిచ్చి వారి కన్న పానాదుల నొసంగి ఉచితవైద్యము జేసెడివాడు ఇతడు పాశ్చాత్య దేశయాత్ర సాగించుటచే యితడు తుర్కీ, రోమేనియా, జర్మనీ, ఫ్రెంచి, ఇటాలియన్ భాషలలో ప్రవీణతను సంపాదించి సంభాషించెడి వారు. స్నేహితులతో— 'తాను తిరిగి మహోజ్వల తుర్కీ సామ్రాజ్యమున కెప్పుడు పోదునా' అని చెప్పు చుండెడివాడు.

ఇతడు స్వాతంత్ర్య రక్షణ దీక్షాబద్ధుడై ప్రజల కష్టముల నివారించుటకు ఆతురతతో మెలంగుచుండెడివాడు.

ఇతనికి హిందువులయెడ అమితభక్తి, ప్రీతియు గలవు. ఇతని ముఖ్యస్నేహితులు శ్రీ T ప్రకాశం పంతులు, సర్దార్ దండు నారాయణరాజు, శ్రీ మాగంటి బాపినీడు, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు, విరాల వీరభద్రరావు. శ్రీ నా. మందేశ్వరశర్మగారు మున్నగు జాతీయవాదులు. ఇతనిని వీరు 'నాయబు శాస్త్రి' గా రనే ముద్దుపేరుతో పిలిచెడివారు.

1937 సం॥ రంలో వృద్ధాప్యంచేతను, ఆహారమైన జైలు శిక్ష ననుభవించుటచేతను, ధీమా గాంభీర్యము తగ్గి, నాల్గు మాసములు రాచకురుపుచే బాధపడి అసువులను గోల్పోయెను.

(S. A. Mohamad)

## ౫౯. తూము రామారావుగారు-పోలవరం

వీరు గోలకొండవ్యాపారులశాఖకు జెందినవారు గోదావరి ఏజన్సీ పోలవరంగ్రామంలో వ్యాయామోపాధ్యాయులుగా పనిచేస్తూ ఉండేవారు. అసహాయోద్యమము రాకపూర్వమే సేవకావృత్తిని విసర్జించి తదుపరి అసహాయోద్యమంలో చేరి ఒక ఖద్దరుషాపు నెలకొల్పి కాంగ్రెసుసేవ చేయుచు సర్వవిధముల కాంగ్రెసుసంస్థకు తోడ్పడుతూ ఉండేవారు.

1921వ సంవత్సరంలో కాంగ్రెసుకార్యాలయములపై ప్రభుత్వము నిరంకుశపర్వ నవలంబించినరోజులలో రామారావుగారు తమయింట్లో కాంగ్రెసుకార్యస్థానము నుంచుటకునూ జండాలు స్థాపించుటకునూ పూనుకొని అందువల్ల కలుగబోవు కష్టనిష్ఠురములకు సర్వాత్మనా సంసిద్ధులైరి.

1932 వరకూ కాంగ్రెసు సభ్యుడుగా ఉంటూ ఏజన్సీలో కాంగ్రెసు ప్రచారము చేస్తూ తమ తోడి కాంగ్రెసు ప్రచారకులు శ్రీ పుసులూరి కోదండరామయ్య, చేబియ్యం సోమయ్యగారు మున్నగువారితో సంచారంచేస్తూ ఉండేవారు.

1932 లో పోలవరంలో గవర్నమెంటు ఉత్తరువుల నుల్లంఘించి స్వరాజ్యపతాక చేబూని వీధులలో జాతీయ గీతములు పాడుకొంటూ వెళ్ళుచుండగా పోలీసువారు వీరిపై తీవ్రముగా లాటీచార్జీ చేసిరి

వెంటనే సతీసమేతులై విదేశ వస్త్రాలయంవద్ద పికెటింగుచేయగా ప్రభుత్వమువారు సతీపతుల నిరువురను అరెస్టు చేసి 6 మాసములు కఠినశిక్షను జరిమానాను గూడ విధించిరి.

వీరు అప్పటినుండియు పేదతనమునే వరించి నిరాడంబర జీవనమును నెఱపుచూ 1943 ప్రాంతములో పరలోకగతులైరి.

ఈ సమస్తవిధములగు కష్టనష్టములను భరించి సర్వవిధముల త్యాగముచేసిన దేశభక్తులలో వీరు నొకరు.

(చేబియ్యం సోమయ్య,
కలగ సత్యనారాయణ)
3—1—46

# ౬౦. సూరికుచ్చి సూర్యనారాయణగారు
## నిడదవోలు

వీరు సహాయ నిరాకరణోద్యమము నుండియు కాంగ్రెసువాది. నిత్యఖద్దరుధారి. వీరి జన్మస్థలము ఖండవిల్లి ముకాంముల పూర్వము బియ్యపువర్తకులు. ఆమరణము కాంగ్రెసువాది, నిత్యదరిద్రులు. జిల్లా తాలూకా పట్టణ సంఘములలో సభ్యులు

వీరు కల్లు సారాయి విదేశవస్త్రముల పికెటింగులలో పాల్గొని విశేషముగా పనిచేసిరి.

ఉప్పు సత్యాగ్రహములో జైలునకు బోయియుండిరి. ఇన్స్యూరెన్సు ఏజంటుగానుండిరి

దేశీయ కార్యక్రమము లన్నిటిలోను ఉత్సాహముగా బాల్గొన్నవారు.

(మానాప్రగడ వెంకట కృష్ణారావుగారు)

## ౬౧. ఈదూరి సత్యనారాయణగారు

### ఈదూరు

వీరు పశ్చిమగోదావరిజిల్లా వాస్తవ్యులు. వందేమాతరం ఉద్యమము నుండియు వీరు దేశసేవానిరతులై పని చేయుచుండిరి. నిత్యఖద్దరుధారులు. తాలూకా జిల్లా సంఘములలో సభ్యులుగానుండిరి.

వీరు ఇంగ్లండు వెళ్ళి వచ్చిరి పశ్చిమగోదావరి జిల్లా శాంతిసైనికులకు కెప్టెన్‌గా నుండిరి. కాకినాడలో జరిగిన అఖిల భారత మహాసభలలో గూడ పాల్గొని చక్కని ట్రుడెట్టుడం లతో పనిచేసియుండిరి.

వీరు ఆ మరణము కాంగ్రెసువాదులై యుండిరి. పశ్చిమగోదావరి జిల్లాలోనే గాక ఆంధ్రరాష్ట్రములోని యితర జిల్లాలలో గూడ పనిచేసియుండిరి.

వీరు నాగపూరు పతాకోత్సవ సందర్భములో శిక్షను బొంది జైలున చేగి యుండిరి. చనిపోవు నప్పటికి వీరికి 50 సంవత్సరములు

(కలగ సత్యనారాయణ)

## ౬౨. మానాప్రగడ సుందరమ్మ గారు

### ఖండపల్లి

( —1936 )

ఈమె పశ్చిమగోదావరిజిల్లా ఖండపల్లి గ్రామంలో జన్మించినది తల్లిదండ్రులకు ఏకైకపుత్రిక 1926 వ సంవత్సరంలో గౌతమీసత్యాగ్రహాశ్రమం సభ్యులగు శ్రీమానాప్రగడ కృష్ణారావుగారికి వివాహము చేయబడెను. తదాది భర్తతో పాటు నిత్యఖద్దరుధారిణియై ఆమరణాంతము భర్తతోపాటు దేశసేవయందు దీక్ష వహించిన ధీరురాలు.

1933 లో నైజాం డిక్టేటరుగా ఆంధ్రరాష్ట్ర మహిళా డిక్టేటర్సు మహాసభలో పాల్గొనినందున 15 మాసములు విడి

పై మన్నూ రెండువేల రూపాయల జుర్మానాను గవర్న మెంటు విధించెను.

రాయవేలూరు, కెన్ననూరు చెరసాలలయందు 'సి' క్లాసు ననుభవించినందున ఆరోగ్యము చెడిపోయి క్షయరోగం అంకురించి 1936 వ సంవత్సరంలో వీరస్వర్గ మలంకరించిన ప్రప్రథమ దేశసేవిక.

( గృహలక్ష్మి )
సెప్టెంబరు 1936

---

## ౬౩. భూపతిరాజు సోమరాజుగారు
## కుముదవల్లి
## ( 1878 – 1945 )

శ్రీభూపతిరాజు పల్లంరాజుగారికి కుముదపల్లి గ్రామంలో బహుధాన్యనామ సంవత్సరమునకు సరియైన 1878 సం॥లో జన్మించిరి.

1930 లో వీరు ఉప్పుసత్యాగ్రహం సందర్భమున ఒంటింప బడి రాజమండ్రి జైలులో కొంతకాలము, రాయవెల్లూరులో కొంతకాలము పద్మాట పదిమాసముల పాటు బళ్లారిలోని అలీపురం జైలులోను C క్లాసు శిక్ష ననుభవించిరి.

1932 రెండోతూరి పన్నుల నిరాకరణ సందర్భములో ఒక సంవత్సరకాలము మరల శిక్షాపాత్రులై 200 రూపాయలు జరిమానాయును, వీరి తాలూకు య 50 ల భూమికి దాళ్వా సాగుకు నీటిసప్లయిలేకుండా అభ్యంతరపర్చిరి.

1941 వ్యక్తిసత్యాగ్రహ సందర్భములో వొకఏడాది శిక్షయు రూ 1000 లు జరిమానాయును విధించి బళ్లారి జైలులో 'B' క్లాసు ఖైదిగా నుంచిరి.

వీరి ఇతర కార్యక్రమములు, సంస్థలకు సహాయములు.

1950 సం॥రం నుండి మృత్యుపర్యంతం అనగా బంగాళా విభజన మూవ్మెంటు లగాయతు 1945 సం॥ వరకు భీమవరం తాలూకాలో. సిద్ధాపురమును స్వస్థానముగా జేసుకొని అచ్చట గ్రంథాలయోద్యమము, ఖద్దరుప్రచారము, అస్పృశ్యతా నివారణ మున్నగు విషయములలో శక్తివంచనలేక తోడ్పడుటయే కాక, ఆర్థికసహాయమును జేయుచు అన్ని ఉద్యమములకు ప్రధానిగా నుండెను

భీమవరపు కాలేజీ సంస్థాపనకొరకు అవిరళకృషి చేసి 1,116 రూపాయలు చందానిచ్చిరి కుముదవల్లిలో "శ్రీ వీరేశ లింగ సమాజ గ్రంథాలయము" నకు రు 250-0-0 లు విరాళమును, సిద్ధాపురం మిషన్‌చర్చికి ( గిరిజాపుర్ ) రు 100/లున్ను అచ్చటనే సువర్ణ పతీగ్రంథాలయ నిర్మాణమునకు రు300/లున్ను సిరిపల్లెలోని వేదపాఠశాలకు రు 100/లున్నూ యిచ్చిరి.

వీరు కాంగ్రెస్ సేవకుల కెప్పుడునూ సహాయము చేయు చుండెను. మరియు హరిజనోద్ధరణకు పాటుపడెను.

వీరికి జాతీయోద్యమములో అన్ని విధాల వీరిసోదరులైన లచ్చిరాజుగారు సహాయపడుచుండిరి. వీరి ధర్మపత్నియైన సాగి సోమమ్మగారు ఖద్దర్ ప్రచారం, నూలువడకుట, విద్యాభివృద్ధి మున్నగు కార్యక్రమములలో వీరి కెంతేని సానుభూతిని జూపెను.

1919 సం॥ రంలో కుముదవల్లినుండి సిద్ధాపురమునకు తమ నివాసమును మార్చి అచ్చట స్వకీయ పరిశ్రమచే య 150 లున్నూ, కాళహస్తిలో సుమారు య 50 ల భూమునీ సంపాదించిరి.

వీరికి ఏడ్గురు పుత్రులు. నల్గురు కుమార్తెలుగలరు. వీరిలో రెండవవాడు కైన రామమోహనరాజు జైలునకు వెళ్ళెను. ఇతడు 1939 సం॥ రం లగాయతు 1942 సం॥ రం వరకు జిల్లాబోర్డు మెంబరుగ నున్నూ, ఇరిగేషన్ అడ్వయిజరీ బోర్డు మెంబరుగా నున్నూ, రాజపుత్రి సమాజసభ్యుడుగా నున్నూ వుండిరి. వీరు చాల దృఢకాయులు, చురుకు గలవారు. పారిశ్రామికులు. దుర్వ్యసనములేమీలేని సౌజన్యస్వభావులు.

(బి. రామమోహన్ రాజు)

---

## ౬౮. సామవేదం సత్యనారాయణగారు

### వసంతవాడ

ఈయన ఏలూరు తాలూకా వసంతవాడగ్రామ నివాసులు సుప్రసిద్ధ దేశభక్తులు, కాంగ్రెసువాది. దేశస్వాతంత్ర్యము కోసం కాంగ్రెస్ ఉద్యమాలలో పాల్గొని కారాగారశిక్షల ననుభవించిన మేటిధీరుడు

సహాయనిరాకరణోద్యమమునుండి నేటివరకూ ఆంధ్ర రాష్ట్రకాంగ్రెస్ ట్రిబ్యూనల్ లో సభ్యుడుగా నుండెను సహాకారోద్యమములోనూ, సంఘసేవలోనూ, హరిజనాభ్యుదయానికి చాలాకృషిసల్పెను. కీ॥ శే॥ కున్నేశ్వరరాయనాటకసంఘములో సభ్యుడుగానుండి నాటకకళకు సేవజేసెను. – 62వ యేట మృతి జెందెను.

## ౬౯. గొట్టుముక్కల బలరామరాజుగారు

### భీమవరం తాలూకా

వయస్సు 17సంవత్సరములు. చినఅమరం. విద్యార్థి. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కార్యవర్గసభ్యులగు శ్రీ గొట్టుముక్కల రామచంద్రరాజు సోదరుడు. తుపాకికాల్పులకు గురియై మరణించెను.

## ౬౬. వేగిసిన నారాయణరాజుగారు
## వేంపాడు

బలశాలి స్ఫురద్రూపి కత్తి, కర్రసాముగరిడీలలో అందెవేసినచెయ్యి. తాలింఖానాలు పెట్టి ఎందరినో తర్ఫీదు చేసెను. భీమవరం సత్యాగ్రహసమరంలో కోరమీసం తిప్పి పంచె విరచికట్టి, కోరతలపాగాతో, ఠీవిగా జెండా చేతగా దాల్చి పురవీథులలో నడిచినారు రెండు తుపాకిగుండ్లు తగిలి వీరు మరణమును పొందిన యోధాగ్రేసరుడు

## ౬౭. ఉద్దండి [illegible]రాములుగారు - ఆకివీడు

జైలువాసంలో ఆరోగ్యంచెడి, విడుదలైన కొద్దికాలానికే కీర్తిశేషుడయ్యెను.

## ౬౮. ఇందుకూరి సుబ్బరాజుగారు
## సత్యవాడ

( — 1945 )

వీరు ఆంధ్ర క్షత్రియ వంశజులు మంచి ధైర్యసాహసా లుగల కాంగ్రెసు కార్యక్ర[illegible]న్ని నడిపిన యువకులు. పంచవిధ

బహిష్కారాలను అవలంబించి పనిచేసివుండెను. కొంతకాలము తణుకు తాలూకా కాంగ్రెసు సంఘానికి అధ్యక్షపదవి నలంకరించెను. జిల్లా తాలూకా గ్రామసంఘ సభ్యుడుగా నుండెను. కాంగ్రెసులో అనేకులను సభ్యులుగా జేర్చెను ప్రభుత్వంవారి ఆగ్రహమునకు గురియై, డిటిన్యూగా గొంపోబడి కోయంబత్తూరు చెరసాలలో గుండెజబ్బుతో 1943 సం॥ రం లో మరణించెను.

## ౯౯. సూరంపూడి మహాలక్ష్మమ్మ గారు

### తణుకు

ఆంధ్ర బ్రాహ్మణ వంశస్థురాలు. సహాయనిరాకరణోద్యమము ప్రారంభించినప్పటినుండీ కాంగ్రెసు సేవికగా పనిజేసెను. ఉప్పుసత్యాగ్రహంలోను కాంగ్రెసు కార్యక్రమాలలోను పాల్గొనెను. పట్టణ, జిల్లా, తాలూకా సంఘ సభ్యురాలు. పంచవిధ బహిష్కారాలను అమలులో పెట్టెను. మంచి పట్టుదలగల స్త్రీ రత్నం. నిత్యఖద్దరుధారిణి స్వయంగా నూలు వడికి బట్టలు నేయించుకొనెను. దేవులపల్లి సత్యవతమ్మ, కొవ్వలి కనకమ్మగార్లతో కలిసి దేశసేవను జేసెను. ఈమె గ్రామ పర్యటనముజేసి కాంగ్రెసు సందేశము నింటింటా ప్రచా

రము చేయుటచే ప్రభుత్వంవారాగ్రహించి ఈమెను 1932 సంవత్సరం లో శిక్షించిరి. తణుకు తాలూకా కాంగ్రెసు కార్యరంగములో దుమికి వీరస్వర్గమలంకరించిన ప్రథమ స్త్రీ రత్నము. నిరంతర కార్యదీక్షచే ఆరోగ్యముచెడి, మూర్ఛరోగముచే కాలువలోబడి 1937 లో మరణించెను.

## ౨౮. బోడే రామలింగస్వామి చౌదరిగారు

### యండగండి

సుప్రసిద్ధ కమ్మకులజుడు. ఖద్దరుధారి. గ్రామ, తాలూకా, జిల్లాసంఘములలో సభ్యులుగా పనిచేసిరి. పంచవిధబహిష్కారములలోను అఖిలభారత కాంగ్రెసు సంఘము వారి ఆజ్ఞానుసారం పన్నులను ప్రభుత్వానికి చెల్లింపకుండా ఆపుదలచేయించెను. గ్రామోద్యోగస్థులచే రాజీనామాలనిప్పించెను కల్లు, సారాయి, విదేశవస్త్ర బహిష్కరణములో పాల్గొనెను. నిరాడంబరుడు. స్వయంగానూలువడికి బట్టలు నేయించేవాడు. ఆమరణాంత కాంగ్రెసువాది.

1921 సం॥రంలో [illegible] వందలాది రూప్యములను తిలక్ స్వరాజ్యనిధికి వసూలుచేసి అర్పించెను.

1931 లో రామచంద్రపుర శిబిరములో లాటీచార్జికి గు॥ యయ్యెను. చాలాకాలము తాలూకా, జిల్లాబోర్డు మెంబ రుగా నుండెను.

1932 లో భీమవరంలో లాటీచార్జికి గురియై మరణించెను.

## ౨౧. భాస్కర్ల ఈశ్వరదత్తుడుగారు

### నర్సాపురం

కళావంతుల సంఘానికి చెందినవారిలో, ఆదర్శ ప్రాయుడు, ఉత్తమోత్తముడు. సహాయనిరాకరణోద్యమా రంభమునుండీ, కాంగ్రెస్ వాదియే. నిత్య ఖద్దరుదారి. సంఘ సంస్కరణ కొరకు గొప్ప సేవజేసెను. ఉపధ్యాయవృత్తి జీవనో పాధిగాగలవాడు. విద్యార్థుల అభివృద్ధి కొరకును ఉపాధ్యా యుల జీతం వృద్ధిచేయుట కొరకును ఇతడు గొప్ప ఆందో ళనను చేసెను.

1934 సంవత్సరము వరకు ఉపాధ్యాయవృత్తిని నిర్వ ర్తిస్తూ, కాంగ్రెసు కార్యకలాపాలలో పాల్గొనుచుండేవాడు.

1931 లో Buy Indian వస్తువుల ప్రచారం చేయు చుండగా తీవ్రముగా లాటీచార్జికి గురియయ్యెను. కాంగ్రెసు సభ్యులకు జేవ్రెడం, కల్లు సారాయి, విదేశవస్త్రాల

బహిష్కరణ కార్యాలు నెరవేర్చెను. 1941—42 సం॥ రము లలో కారాగారవాసము జేసెను ఇతనికి హేమచంద్ర భాస్కరావు అను కొడుకుగలడు. కాంగ్రెసు వాది, ఖద్దరు వస్త్రధారి. జిల్లా, రాష్ట్ర, అఖిలభారత విద్యార్థి కాంగ్రెస్ సంఘానికి కార్యదర్శిగా పని జేసెను. ఇతడు ఆదర్శప్రాయుడై విద్యార్థి జీవితాన్ని గడుపుతూ బందరులో గతించెను.

## ౭౨. చెంగల్వ చిట్టిపంతులుగారు

## రాయకుదురు

ఇతడు సహాయనిరాకరణోద్యమములో చేరకపూర్వము విద్యా ఇనస్పెక్టర్‌గా పనిజేసెను. ఆపనికి రాజీనామాయిచ్చి, కాంగ్రెస్ సేవలో నిమగ్నుడై యుండెను. గ్రామ, తాలూకా, జిల్లా సంఘములలో చాలకాలం పనిజేసెను. నిర్మాణ కార్యక్రమములో గూడ నమితశ్రద్ధను వహించెను. నిత్యఖద్దరు ధారి. ఒకపర్యాయము జైలుకుకూడ పోయివుండెను. కొంత కాలము ప॥ గోదావరిజిల్లా సంఘానికి కార్యదర్శిత్వమును వహించెను. హరిజనసెవ, అస్పృశ్యతా నివారణము - ఇందలగు కార్యక్రమాలలో పనిజేసిన దిట్ట. ఖద్దరు ప్రచారం జేసేవాడు.

## ౨౩. హనుమంతవఝల జోగయ్యశర్మగారు

### ఏలూరు

ఇతడు ప్రసిద్ధ వైద్యశేఖరుడు. సహాయనిరాకరణోద్యమ కాలంనుండి—కాంగ్రెస్ వాదియే. నిత్యఖద్దరుధారి. ఏలూరు మునిసిపాలిటికి కాంగ్రెస్ పార్టీతరపున అధ్యక్షులుగా నుండిరి నిర్మాణ కార్యక్రమములో పట్టుదలతో పనిజేసిన ధీరుడు. చాలకాలము పట్టణ, జిల్లా, రాష్ట్రసంఘసభ్యుడుగా, పని జేయుచూ రెండుపర్యాయములు జైలుకుకూడ బోయెను. ఖాదీప్రచారం, విదేశవస్త్ర బహిష్కారంలోను పాల్గొనెను. బీదసాదల కుచితవైద్య సేవను జేసెను.

## ౨౪. వడ్లమాని లక్ష్మీనరసింహంగారు

### ఏలూరు

ద్రావిడ బ్రాహ్మణులు స్వస్థలం అమలాపురం తాలూకా నందంపూడి గ్రామం సహాయనిరాకరణోద్యమము ప్రారంభించి నప్పటనుండ కాంగ్రెసువాదియే వారి కుటుంబ మంతా నూలు వడికి, ఖద్దరు ధరించెవారు గాంధీ జాతీయ

విద్యాలయం (ఏలూరు) లో హిందీ అధ్యాపకులుగా పనిజేసిరి. కొంతకాలం, పట్టణ, జిల్లా, రాష్ట్ర కాంగ్రెసు సంఘములలో సభ్యులుగా నుండెను. అంతులేని వుత్సాహం, కరోరదీక్ష, పట్టుదలగల మనిషి. నిద్రాహారాలునైతేం సరకుచేయక, ప్రజాసేవచేసి తరించిన వీరుడు కార్యరంగములో దుమికి నప్పుడు తీవ్రమగు లాటీచార్జికి గురిఅయ్యెను రెండు మూడు పర్యాయాలు కారాగారశిక్ష ననుభవించెను. సంపూర్ణదీక్ష కొరకే బహుప్రయాసపడి పనిజేసెను అనేకమంది దేశసేవ కులను తయారుజేసి, వేలకొలది రూపాయలు కిమ్మతుగల ఖద్దరు వస్త్రాల నమ్మెను 'ఆంధ్రకాంగ్రెసు ప్రచారక సమితి' నిర్మాతలలో నొకరు— ఆమరణాంతరం కాంగ్రెసువాది.

ప్రసిద్ధ కళాస్రష్ట, సాహిత్యవేత్త, గేయకవి, నవలారచయిత

## ౭౫. 'కులపతి' అడవి బాపిరాజుగారు భీమవరం

కళలలోనే పుట్టి, కళలలోనే పెరిగి, కళలకు జీవితం అంకితంచేసి, కళాసేవలోనే కాలధర్మం చెందినవాడు శ్రీ బాపిరాజు

ఇతడు 1895 సం॥రంలో సురహాడ, ధర్మవరం. విశేష లింగం ఆధునిక సాహిత్యసౌధా నిర్మాణానికి పునాది వేసిన

కాలంలో, కళాహృదయంగల బాపిరాజు ఆ సౌధానికి వక స్తంభములాంటివాడు. అదొక విశిష్ట స్తంభం — హంపీహజార-రామాలయ స్తంభమువలె, ఎంతటి స్పందనానికైనా చెమ్మగిలేది, విరలరాయని గుడికంబంవలె రాగరంజనలు పలికేది; కష్టాలు పైకొన్నప్పుడు కొంత సంచలించినా, మందరంవలె మథించేగాని ఆయన కరచిచూడని కళారూపం కానరాదు. కథకుడు, వికావడం, కవి నవలారచయిత కావడం, నవలారచయిత చిత్రకారుడు కావడం, వీటన్నిట నిష్ణాతుడు, నాట్యకోవిదుడు కావడం అరుదు.

శ్రీ బాపిరాజు కథకుడు, నవలారచయిత, నాట్యాచార్యుడు కవీశ్వరుడు, సిద్ధహస్తుడైన శిల్పి, కళాకోవిదుడు, రసజ్ఞుడు, సహృదయుడు ఆంధ్ర విజ్ఞానాభ్యుదయానికి జీవితం ధారపోసిన మహావ్యక్తి.

ఇతనికి O J కూల్డ్రే, రాజమండ్రి ప్రిన్సిపాలుగా నున్నప్పుడు — కవిత్వంలోను చిత్రలేఖనములోను, మంచి అభిరుచిని చూపించి పుణ్యం గట్టుకొన్నాడని ప్రశంసించేవాడు.

ఇతడు కళామూర్తి — ఇతను గీసినగీతల్లా చిత్రమై, ఆడిన మాటల్లా పాటగా పరిణమించిందని, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారన్నారు. ఇతనిలోవున్న భావుకతే, కవిత్వమే ఇతని వర్ణచిత్రాలలోను కనుపిస్తుంది. ఇతని గృహం ఒక కళాపీఠం నవ్యాంధ్రలో కొన్ని, సాహిత్యంలోను, కళలోను తనకుగల ప్రజ్ఞావిశేషంచేత, ధీవిశేషంచేత దీప్తి

మంతంజేసిన ప్రతిభావంతులలో ఇత డొకడు. ఇతను ప్రేమ మూర్తి. ఇతనున్నచోటల్లా ఆనందం తాండవిస్తూ వుండేది.

ఇతడు బి. ఎల్. పట్టాను పొందినతర్వాత కొంతకాలం భీమవరంలో ప్లీడరీప్రాక్టీసు చేశాడు

వ్యత్యాసాలెరుగని సుందర సమాజ నిర్మాణం ఆయన ఆదర్శం దానిని సాధించడానికే ఆయన 1920 సం||రంలోనే జాతీయ సమరంలో పాల్గొని కారాగారవాసక్లేశం అనుభ వించడం. ఇంతకుపూర్వం ఈయన బందరు జాతీయ కళా శాలలో శ్రీ ప్రమోదకుమార్ భటర్జీవద్ద చిత్రకళా శిక్షణను పొందారు.

తర్వాత ఆయన ఉత్తమ చిత్రకారుడై; స్వయంగా పెక్కు మేటి చిత్రాలను లిఖించడమేకాక, అనేకమంది చిత్ర కారులకు శిక్షణ నిచ్చెను చివరకు ఆంధ్ర జాతీయ కళాశాల ( బందరు ) కు ప్రిన్సిపాలు పదవిని స్వీకరించాడు ఆంధ్ర జాతీయ కళాశాలను విడిచిపెట్టిన తర్వాతకూడా, గుంటూ రులో కళాపరాన్ని నెలకొల్పి, పెక్కుమంది చిత్రకారులను తయారుజేసెను.

పిమ్మట హైద్రాబాద్‌లో వెల్వడిన, మీజాన్. తెనుగు దినపత్రికకు సంపాదకత్వం వహించెను ఇటీవల మదరాసు ప్రభుత్వంవారిపనుపున సిలోనుపోయి, అక్కడనున్న 'సగి రియా' గుహాచిత్ర ప్రతికృతుల రచనలో ఆయనచూపిన

ప్రామాణికతకు, పాటవానికి, మెచ్చి వానిని మదరాసు మ్యూజియంలో భద్రపరిచారు.

"విశ్వశ్రేయః కావ్యం" అనేది తెనుగువారికి వెన్నతో బెట్టిన నానుడి. అయినప్పుడు, సమాజానికి వేరుపురుగైనా జమీందారీ' విధానాన్ని మాపుమాప సమకట్టిన 'నారాయణ రావును' (నవల) సృష్టించెను. దానిలో వీరికిగల కళాప్రవేశం, పాండిత్యం, వివిధవిషయ పరిజ్ఞానం. అన్నీ యీ నవలలో స్పష్టంగా గోచరిస్తాయి. ఈనవలకు ఆంధ్రయూనివర్సిటీవారు బహుమతి నొసంగారు. ఇదిగాక, యితడు గోన గన్నారెడ్డి, తుఫాను, హిమబిందువును రచించారు. ఇతని శైలబాల, శశికళ, ఆధునిక కన్నడసాహిత్య ప్రవర్తకుడగు మిస్తి వెంకటేశయ్యంగారినికూడా ముగ్ధుడిని గావించింది. ఇతడు కథలను, గేయాలను పెక్కింటిని కన్నడంలోని కనువదించాడు. కలానికి కుంచెకు పొత్తుకలపిన ఇతని 'మృత్యుంజయుడు' తెనుగువారికేకాక కన్నడులకుకూడా కనువిందువైంది.

నవలలుమాత్రమేకాక అసంఖ్యాక గేయాలు, కథలు, సినిమాకు పనికివచ్చే Scenaries కూడ వ్రాశారు ఇతడు ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రానికి సలహాదారుగ ఉండేవాడు.

తన ఆదర్శవ్యాప్తి కళాసందేశవిస్తృతి అవిచ్ఛిన్నంగా సాగడానికి ఆయన ఒక నూతనసంప్రదాయం, శిష్యపరంపర

నెలకొల్పారు. కనుకనే నవ్యసాహిత్య పరిషత్తు ఆయనను 'కులపతి' గా పేర్కొని తనను సత్కరించుకొంది.

నవ్యసాహిత్య పరిషత్తు పుట్టినప్పటినుంచీ ఆయన దాని కార్యకలాపాలలో శ్రద్ధగా పాల్గొన్నారు.

ఆయన జీవితం పూలపాన్పు కాదు. అది కంటకావృతం— సంకటమయం. మధ్యతరగతివారికుండే కష్టాలు, కరువులను అధిగమించి ఆదర్శమాధుర్యంలో కరిగిపోవాలన్న సత్యాన్ని గుర్తెరిగి, ఎన్నికష్టాలు క్రమ్మినా, అనుక్షణమూ సాహిత్య సమారాధనలో నిమగ్నుడై వుండేవాడు — అమలినహృదయం. అజాత శత్రుత్వం, బహుముఖ కళా ప్రాభవం వెల్లివిరిసిన శ్రీ బాపిరాజు 1952 సం॥ రంలో ఈ తనువును చాలించి స్వర్లోకానికి పోయినాడు.

## ౭౬. దోనేపూడి లక్ష్మయ్యగారు

## పెదసంద్రకోలను

కొవ్వూరు తాలూకాలో భారతీయ జాతీయోద్యమములో ప్రవేశించిన నిష్కళంక దేశసేవాపరాయణులలో వకరు శ్రీ లక్ష్మయ్యగారు.

ఇతని స్వస్థలం కృష్ణాజిల్లా పెదనింద్రకొలను గ్రామం. తలిదండ్రులు యానాందాస్లు, పద్మనాభ సీతమ్మగార్లు ఇతని మాతామహస్థలం యర్నగూడెంతాలూకా, కృష్ణంపాలెం గ్రామంలో 1882 సం॥రంలో జన్మించెను. చిన్ననాటనే తల్లిని గోల్పోవుటచే యిత డిచ్చటనే పెరిగి పెద్దవాడయ్యెను. ఇతని మేనమామయైన వడలి పాపయ్యగారు నామాన్యస్థితిపరు డగుటచే లక్ష్మయ్యగారు రెడ్డిపోలవరంలో 3వ ఫారందాక చదివెను. ఇతను స్వయంప్రతిభచే లౌకికవిజ్ఞానమును సంపాదించెను. ఇతని ప్రథమభార్య, పెండ్లి అయిన స్వల్పకాలములోనే చనిపోవుటచే తిరిగి తన ఇరువదిఅయిదవయేట పురుషోత్తపల్లిగ్రామ కాపురస్థులు, ఈమని రామసోమయాజులుగారి కుమార్తె బంగారమ్మను పెండ్లియాడెను

1906 సం॥రంలో ధుమంతుగూడెంజమీందార్, నూరంపూడి అప్పారావుగారికి ఎస్టేటు వ్యవహారము లల్లకల్లోలముగ నుండుటచే సమర్థుడైన గుమాస్తా ఒక డవసరమయ్యెను. కాని యెవరును తగినవారు దొరుకలేదు, కాని లక్ష్మయ్యగారిప్రజ్ఞను విని వీరిని వెంటనే తమవద్ద జేర్చుకొనిరి. అప్పారావుగారు గొప్ప వ్యవహారకర్త గనుక వీరికి మంచితర్ఫీదు కొసంగుటచే లక్ష్మయ్య స్వల్పకాలములోనే ఎస్టేటువ్యవహారములను దిద్ది చక్కజేసెను మరియు ధుమంతగూడెం కరణంగారైన, ధుమంతరావు సుబ్బారాయుడుగారి మైత్రికూడ సంపాదించుటచే

నాటినుండి వీరి జీవితములలో నూతన అధ్యాయం ప్రారంభ మయ్యెను

ఇంతవరకును వీరు మేనమామగారి యింటియందే భార్యతోగూడ నివసించుచుండెను క్రమేపి వీరు పిత్రార్జితపు ఆస్తినివృద్ధిచేసి గృహనిర్మాణమునుకూడ జేసి, స్వంతవ్యవసాయ మారంభించెను రైతులలో కలసిమెలసి జీవించుచు వారి కష్ట సుఖముల నరయుచుండుటచే రైతుబాంధవు డయ్యెను.

శ్రీ సుబ్బారాయుడుగారితో కలిసి పత్రికాపఠనం, గ్రంథపఠనము గావించుచుండుటచే దేశము దలి నాయకులరాజ కీయాది వివిధ సమస్యలను తెలుసుకొనుచుండెను ఆంధ్ర రాష్ట్రోద్యమం, వీరేశలింగ వితంతు పునర్వివాహోద్యమము - మొదలగువానియందు సానుభూతిని జూపెను పట్టణములో జరిగెడి జాతీయ మహాసభలకు వీరిద్దరు బోవుచు అచ్చటి విషయములను గ్రహించుచుండెడివారు.

1921 సం॥ గాంధిమహాత్ముని అసహాయోద్యమ శంఖా రావం భారతదేశమం దంతటను మ్రోగ నారంభించెను. లక్ష్మయ్య సుబ్బారాయుడుగార్లిందు ప్రవేశించిరి సుబ్బారాయుడు గారు తమ కరిణీకమునకు రాజీనామా నిచ్చిరి

కొవ్వూరు తాలూకాలో గాంధీమహాత్ముని నాయకత్వ మున బయలుదేరిన కాంగ్రెస్ ఉద్యమచరిత్ర ప్రారంభించిన స్థలం దేవరపల్లి ఫిర్కా అని చెప్పవచ్చును అప్పుడు

తాలూకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా నుండిన శ్రీ శర్మ గారిని వీరు ప్రత్యేకముగ నాహ్వానించి అనేక సదుపాయములు చేస్తూ ధుమంతుగూడెం, కృష్ణంపాలెం గ్రామ కేంద్రములుగా నియమించి చుట్టుపట్ల గాలిక ముప్పది గ్రామములలో అఖండ ప్రబోధమును గావించిరి.

1920 శాసనసభా బహిష్కరణోద్యమ ప్రచారంవలన దేవరపల్లి ఫిర్కాలోని అన్ని పోలింగులనుండి కేవలము ఖాళీ పెట్టెలు మాత్రమే వెళ్లినవనుట అతిశయోక్తిగాదు. ఈ ఉద్యమముయొక్క సత్యము దానినుండియే బోధపడగలదు.

ఆమరుచటి సంవత్సరమే కొవ్వూరులో జరిగిన కల్లు పాటలు, ప్రజాబహిష్కారం వలన ప్రభుత్వమునకు పూర్తిగా నష్టము వచ్చినది. తిరిగి మారుమూల ప్రదేశం గదా యని యర్నగూడెంలో పెట్టిరి. లక్ష్మయ్య సుబ్బారాయుడుగార్లవంటి ప్రచారకుల సహాయంతో అప్పటి తాలూకా కాంగ్రెస్ కమిటీవారు చేసిన ప్రచారమువలన ప్రభుత్వం పూర్తిగా దెబ్బ తినెను. తర్వాత 1932 లో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక లనంతరం ప్రభుత్వ మంగీకరించిన పికెటింగు హక్కుల ననుసరిస్తూ దేవరపల్లి సంతదుకాణంవద్ద లక్ష్మయ్య సుబ్బారాయుడుగార్ల సహాయంతోనే విదేశీబట్టల దుకాణాలకు సంపూర్తిగా సీళ్లు వేయబడెను. ఈ విధముగా వీరిచ్చట తీవ్రమైన కాంగ్రెస్ ప్రచారమును సాగించుచు పేరుబడ్డ కాంగ్రెస్ నాయకుల

నాహ్వానించి ఫిర్కా మహాసభలు, తాలూకా మహాసభలు ఏర్పాటు గావించుచు, శారదా ఖద్దరు నిలయమను పేరుతో నొక సంస్థను స్థాపించి ఖద్దరు నుత్పత్తి గావించు చుండిరి. దీనిలో ఖద్దరు తయారై విశేషముగా ప్రచారము జరిగినది.

కాని కారణాంతరములచే క్రమముగా నీసంస్థ క్షీణించెను. దేవరపల్లి గ్రామమునుండి యీసంస్థను నడుపుటకు అవకాశము లేకపోవుటచే, తమసంస్థను ఏలివేయుట కిష్టములేక పోవుట చేత కానూరు గ్రామములో, తెంపెల్లి కుటుంబరావుగారిద్వారా నడిపించిరి

లక్ష్మయ్యగారి అనంతరం, సుబ్బారాయుడుగారి యాజమాన్యంక్రింద యిప్పటికిని పైపేరతో నాసంస్థ పని చేయుచున్నది.

1928 సం॥రంలో గాంధీమహాత్ముడాంధ్ర దేశపర్యటనము జేసినపుడు, దేవరపల్లికి వారి నాహ్వానించి కొంతనిధిని వసూలు చేసి వారికర్పించిరి.

1931 సం॥ రంలో కాంగ్రెస్ జండా నెగురవేసినందులకు లక్ష్మయ్యగారి కారుమాసములు శిక్షవిధించబడెను. వీరికి నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుట మిక్కిలియిష్టము. వేదికలపై నెక్కి ఉపన్యసించుట యన్న చాలఅసహ్యము. కష్టపడి పనిచేసి చూపుటయే వీరి ఆశయము.

లక్ష్మయ్యగారికి బంగాళవిభజన నాటినుండియు జాతీయాభిమానముండుటచే భారతరాజకీయ రంగమందు జరుగు

కార్యకలాపములను శ్రద్ధతో గమనించు చుండిరి. భాషా ప్రయుక్త రాష్ట్రవిభజన సిద్ధాంతమున ననుసరించి మన ఆంధ్ర దేశ మందు నాయకులాచరించు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర అందోళన యందు చాల అభిరుచి గల్గి యుండిరి. గాంధిమహాత్ముడు కాంగ్రెస్ సారధ్యమును బూనినది మొదలు అసహాయోద్యమ మందు జేరి దీక్షతో పనిచేయసాగిరి

తాలూకాలోని కాంగ్రెస్ సేవకులకందరికినీ వీరు ప్రేమ పాత్రులు. నాయకత్వముకొరకును, పేర్ప్రతిష్ఠలకొరకును యెన్న డును వీరు ప్రాకులాడియెరుగరు నిరాడంబరమగు జీవితమును స్వార్ధ రాహిత్యమగు దేశసేవ యొసర్పుటయే వీరి ఆశయములు. తదాశయసిద్ధికై నిరంతరము పాటుపడి తమజీవితమును గడపి ధన్యులైరి వారాస్తినికోల్పోవుటయె కాక, అనేక కాయ క్లేశముల ననుభవించిరి వీరిసహధర్మచారిణియైన శ్రీమతి ఒంగారమ్మ భర్తమాటను జవదాటక ఆతని అడుగుజాడలలో నడుచుకొన్నది.

ఇతనికి పిల్లలులేరు. ఉన్నంతలో భోగి, త్యాగి. చనిపోవు టకు ముందొక సంవత్సరమునుండి అతిమూత్ర వ్యాధితో బాధపడి శస్త్రచికిత్సకు విశాఖపట్టణమునకేగి అచ్చట 12-7-40 తేదీని స్వర్గస్థులైరి.

---

## ౭౭. నెక్కలపు వీరయ్యగారు
## ధర్మాజీగూడెం

ప్రసిద్ధ కమ్మకుల వంశోద్భవులు. సహాయనిరాకరణోద్యమారంభము నుంచీ కాంగ్రెస్ వాదియే. నిర్మాణ కార్యక్రమానికి సంబంధించిన అన్నిభాగాలలోను గూడా కాంగ్రెస్ వాదియే. ఒకపర్యాయం జైలునకుకూడ బోయెను.

## ౭౮. కొమ్మారెడ్డి సత్యనారాయణగారు
## (పోతునూరు)

సుప్రసిద్ధ కమ్మకుల సంజాతుడు. సహాయనిరాకరణోద్యమములో ప్రథమము నుండీ బాల్గొన్న వీరుడు జైలువీరుడు. ఆమరణాంతరం కాంగ్రెస్‌వాది. ప॥ గోదావరిజిల్లా కాంగ్రెస్ సంఘానికధ్యక్షులుగా నుండెను. జిల్లా రైతుసంఘానికి, రాష్ట్ర రైతుసంఘానికి అధ్యక్షపదవి నలంకరించెను. అహర్నిశాదులు కష్టించి, కాంగ్రెస్ సందేశాన్ని గ్రామాదుల కందజేసిన యువకుడు. జిల్లా, రాష్ట్ర, అఖిల భారత కాంగ్రెస్ సభ్యులుగా కూడ పనిజేసిరి. ఉత్సాహ హృదయుడు, స్నేహపాత్రుడు.

కృష్ణా జిల్లా

## ౭౯. శ్రీమతి బొప్పన మాణిక్యాంబగారు

### బందరు

శ్రీ మాగంటి బాపినీడు సోదరి రత్నం. సహాయ నిరాకరణోద్యమం ఆరంభంనుండీ పాల్గొన్న కాంగ్రెసువాదిని. నిర్మాణకార్యక్రమంలో హెచ్చుగా బనిజేసెను. తిలక్ స్వరాజ్యనిధికి సొమ్మును వసూలు జేసెను. పంచబహిష్కరణాలలో పాల్గొనెను. ఖద్దరుప్రచారము జేసెను. ఇదిగాక శాసనసభా బహిష్కారంలోను, సభ్యులను జేర్చుటలోను అతి చతుర అంత్యదశలో మతిభ్రమణముచే మరణించెను.

## ౮౦. రామిరెడ్డి సుబ్బారెడ్డిగారు—కాజ

( 1902 – 1940 )

ఈయన రామిరెడ్డి రామయ్యగొడుకు. 1928 నుండి, కాంగ్రెస్ ప్రచారకుడు — నామాస్త పిష్కం గ్రంథాలయం, కాంగ్రెస్ సంఘాలుమున్నగునవి స్వగ్రామంలో పెట్టించడానికి

పాటుబడెను. 1930 సం॥ రం॥ లో 144 శెక్షను ఉల్లంఘించి బందరులో ఖైదీచేయబడి 1 సం॥ రం॥ C క్లాసు ఖైదీగా నుండెను అలీపురం జెయిలులో చాలజబ్బుపడి, అంతా క్షమాపణ కోరుకొమ్మనగా పెడచెవిబెట్టెను. General release లో విడుదలను బొందెను. 1932 సం॥ రం॥ లో లాటీచార్జీలదెబ్బలు తిన్నాడు. బుర్రపగిలి నెత్తురొచ్చింది, గుంటూరు సబుజైలులో 15 రోజులు రిమాండువుంచి వదలివేశారు.

ఇలాగే రెండుమూడుసార్లు జరిగింది. ఇతనికి జైలులో అతిమూత్రవ్యాధికలిగి దానివల్లనే 1940 లో మరణించిరి. ఇతడు మంచివక్త. జిల్లాకాంగ్రెస్ సంఘసహాయకార్యదర్శిగా 1937 – 38 ప్రాంతంలో పనిజేశారు. పంచాయతీబోర్డుమెంబరు, కాంగ్రెసుసంఘాలలో జిల్లామెంబరు. హరిజనసంఘాలు, రైతు సంఘాలు, మున్నగువానిలోకూడా బాగుగా పనిజేశారు. గాంధిభక్తులు

## ౨౧. పీసపాటి వెంకటసుబ్బారావుగారు

## బెజవాడ

గుంటూరుజిల్లా వాస్తవ్యుడు. సహాయనిరాకరణోద్యమ ప్రారంభమునుండి పనిజేయుచుండెను. నిత్యఖద్దరుధారి. సర్వాణ కార్యక్రమశాఖలన్నింటిలోను బాల్గొనుచుండెను. నిరాడంబర వ్యక్తి.

1919 సం॥ రం నుండి దక్షిణహిందీ ప్రచారకసభవారి తరఫున విద్యాప్రచారము జేసెను. మంచివక్త. సీతానగరపు ఆశ్రమంలోను ఉప్పు సత్యాగ్రహములోను బాల్గొని తూర్పు గోదావరిజిల్లాలో బనిజేసియుండెను. జైలుశిక్షనుకూడ అనుభవించారు. గాంధీటోపీ పెట్టుకోకూడదని గుంటూరుజిల్లాలో బహిష్కరించినపుడు ధైర్యంగా నిలబడి ఎదుర్కొన్న వీరుడు.

అనంతరం ఆంధ్రరాష్ట్రహిందీ ప్రచారానికి ఒక పత్రికను స్థాపించి నడుపుచుండేవాడు. బెజవాడను కేంద్రముగా నేర్పర్చుకొని, ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారకసభకు కార్యదర్శిగనుండి పని జేసెను పేర్గాంచిన కాంగ్రెసువాది అనేకమంది హిందీ విద్యార్థులను, ప్రచారకులను తయారుజేసిన మహానుభావుడు.

## ౮౨. రాయప్రోలు సీతారామశాస్త్రిగారు

## విజయవాడ

(1896 - 1944)

ఈయన మదరాసు విశ్వవిద్యాలయములో L M. S. వైద్యపట్టము నంది విజయవాడలో డాక్టరువృత్తి నవలంబించి నెలకు మంచిధనమును సంపాదిస్తూ 1930లో ఉప్పుసత్యాగ్రహోద్యమంలో తనస్నేహితుడైన శ్రీ డాక్టరు వెలిదండ్ల హనుమంతరావుగారిచే గాంధీజీ సందేశాన్ని విని కట్టుబట్టలతో మైలవరం నైపునకు ప్రచారకులతో వెళ్ళి అరెస్టయినాడు. ఆ

పె ~ ట్లలో ఒకసభకు అధ్యక్షుడైనాడు. ఆసభలో కొంతమంది వుపన్యాసాలిచ్చుటచేత - కేసుమోపుజేశారు. ఇతడు ఉపన్యాసను గురించి మాట్లాడారో ఏదో తెలియదు కాని కోర్టులోమాత్రం వాదించలేదు. 1½ సం||రాలు కఠినశిక్ష విధించారు. 1930 సం||రం లో డాక్టర్ శ్రీ హనుమంతరావు, ఘంటసాల సీతా రామశాస్త్రి, వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి మొదలగు వారితో రాజమండ్రీ జైలులో లాటీదెబ్బలుతిని వేలూరు చెఱ సాలకు జేరుకొనెను ఈయన అనారోగ్యముచే జైలులో చాలా బాధలు పడిరి. కాళ్లవాతం, నొప్పులచేత నడవలేక, కరకు కట్టుకొని పడివుండేవారు. స్నేహితుల దయచే 1½ మాసాలు ఈకారాగారశిక్షను గడపెను. ఇంతలో గాంధిజీ - ఇర్విన్ వొడంబడిక 1931 సం||రంలో నచ్చుటచే మార్చి నెలాఖరుకి మిత్రులతో సహా విడుదలై వచ్చెను. తిరిగి వైద్యవృత్తి నవలంబించారుగాని కాల క్షేపానికి లోటులేకుండామాత్రం జరిగిపోయింది జైలునుండి విడుదలైనప్పటికూడా యథాశక్తిగా వీరు కాంగ్రెసుసేవను మానలేదు అయితేసభలలో వుపన్యాసాలీయడం, ఎలక్షన చెయ్యడం, పతాకోత్సవాలలోపాల్గొనడం మున్నగునవి త్యజిం చెను. తుదకు కాంగ్రెస్‌పదవులను కూడా అభిలషించి యెరుం గడు. మునిసిపాలిటీలు లోకలుబోర్డులు శాసనసభ్యులలో పోటీ చేసే టప్పుడు అభ్యర్థుల నియామకంలో జరిగే చాణక్యనీతి కాజ్యతంత్రాలు ఇతనెరిగి యుండడు. కాంగ్రెసువిజయాన్నే సదా కోరుతూ యథాశక్తిని పాటుపడెను.

పదవీ వ్యామోహంలో తగుల్కొన్న వారిని చూచి ఆయన అపహాసించేవాడు. కాంగ్రెసు ప్రభుత్వమువచ్చినపుడు మిడిసిపడడంగాని పోయినప్పుడు అణగుబాటుగాని యెరుగడు. రోగార్తుల కుపశమనం చేయడంలో వీరిది పెట్టినపేరు బాహ్యాని కెంతకరోరుడుగా కనపడెనో, అంతరంగమున అంతదయార్ద్రహృదయుడు. పరోపకారానికి అవకాశముగల వృత్తిని శ్రద్ధతో నిర్వహిస్తూ వుండగా వీరికొక విపత్తు వచ్చింది. కూతురు వివాహమైన కొద్దిరోజులకే మరణించెను. దానితో వీరికి మనశ్శాంతి పోయింది ఇంతలో భార్యకు జబ్బు. స్వగృహాన్నమ్మివేసి ఋణవిమోచనముచేసి కొంతకాలం ఇంకొక వూరికిపోయి అక్కడ కూడా కాలక్షేపం జరుగకపోతె తిరిగిబెజవాడవచ్చి, మూడునెలలు వ్యాధిగ్రస్తుడై మరణించెను అప్పటికి వీరి వయస్సు 48 సం॥ రాలు. వీరికి ఒకకొమరుడు గలడు.

శాస్త్రీజీకి వైద్య విద్యయుందేకాక, గీర్వాణభాషపైని కూడ మంచి అభిరుచివుండెది. శ్రీహర్షుని నైషధాన్ననుసరించి, వీరొక సంస్కృత పద్యకావ్యాన్ని రచించారుగాని పూర్తిచేయలేను. దానిలో మనఆంధ్రదేశపు బ్రాహ్మణ ఆచార వ్యవహారాలను, సాంఘికపరిస్థితులను గూర్చిన తీవ్ర విమర్శ లున్నవి. ఈయన ఆయుర్వేదమునందు కూడా కృషి జేసి త్రిదోషసిద్ధాంతాన్ని గూర్చి ఇంగ్లీషులో ఒకగొప్ప వ్యాసాన్ని వ్రాసిరి. కొందరు వైద్యశాస్త్రజ్ఞులు దీనినిచాలా

శ్లాఘించారు. ఇతడు నిడారంబరజీవి. పరోపకార పగా యణుడు. అజ్ఞాతవీరుడు.

---

## ౨౩. వెలిదండ్ల హనుమంతరావుగారు L.M.S. బెజవాడ

వీరి జన్మస్థలం విజయవాడ. 1930 సం॥రం వరకు వీరు కాంగ్రెసు సానుభూతిపరులు అయివుంటూ ఉప్పు సత్యాగ్రహ ద్వితీయ దళనాయకులుగా నుండి బందరునకు వెడలిరి. తిరిగి వస్తున్నపుడు బెజవాడలో బందీకృతుని గావించిరి. B క్లాసు ఖైదిగా నిర్ణయించి 1½ సం॥రలు శిక్ష విధించి రాజమండ్రి పంపివేశారు అక్కడ భోజనసౌకర్యం బాగుగ లేకపోవుటచే సమ్మె (strike) చేసినపుడు దానికి నాయకత్వం వహించెను. అచ్చటి రాచకీయ ఖైదీలందరికీ నాయకులుగా ఎన్నుకోబడ్డారు. సమ్మె అనంతరం భాగాలుక్రింద విడదీసి, బదలీ చేస్తూన్నపుడు వీరికి తీవ్రగాయాలు తగిలాయి. రాజువేలూరునకు బోయి అచ్చటినుండి General release లో విముదల పొందారు. తిరిగి విదేశ వస్త్రముకాణాలను (పికెటింగు) బహిష్కారసేవ జేశారు వారు స్వతహాగా బలహీనులగుటచే లాటిఛార్జిలో అనారోగ్యం హెచ్చయి బెంగుళూరు ఆస్పత్రిలో 21-10-1934 తేదీని మరణించారు.

గుంటూరు జిల్లా

# రా॥. గార్లపాటి శివసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

## గుంటూరు

( 1903 – 1942 నవంబరు 29 )

వీరు 1903 లో సత్తెనపల్లి తాలూకాలో నొక బీద కుటుంబమున జన్మించిరి. వీరు గార్లపాటి పిచ్చయ్యగారికి దత్తత వెళ్ళియుండిరి. వీరి బాల్యమంతయు గుంటూరులోనే గడచెను. అచ్చటనే వీరు స్కూలుఫైనలు వరకును చదువు కొనిరి. స్కూలులో మామూలుగానే ఉండెవారు. వీరు 1920 లో గాంధీగారి తొలిపలుకునకే ఉత్సాహముగొన్న వారైరి. కాంగ్రెస్ సంగీతములను పల్లెపల్లెకు పాడచూపిన ప్రచారము చేసిరి. వీరి ప్రచారము సందర్భమున 1920 లోనే తమ స్వస్థలమగు సత్తెనపల్లిలోనే తీవ్రమైన లాఠీచార్జికి గురియైరి. తరువాత గుంటూరులో విదేశవస్త్ర బహిష్కారార్థమై పికెటింగు చేయగా గుంటూరు మేజస్ట్రేటు ఆరుమాసములు శిక్షవిధించి గుంటూరు సబ్ జైలులో పెట్టిరి. ఆశిక్షననుభవించి విడుదలయైనవెంటనే వీరు ఖద్దరు ప్రచారము తీవ్రముగా జేయుచు తాము స్వయముగ ఖద్దరు నింటింటికిని గొనిపోయి అమ్ముచుండెడివారు. 1925 లో స్వరాజ్యపార్టీలో పనిచేసి యీ జిల్లాలో ప్రాముఖ్యము వహించినవారిలో వీరు నొకరు.

1930 లో ఉప్పుసత్యాగ్రహ సమయంలో ఒకయేడాది శిక్షపడి బళ్ళారి జైలులో సి క్లాసులో నుండిరి.

అటనుండి విడుదలయైన వెంటనే 1930 లో "సివిల్ డిజొబీడియన్సు" చేయగా మరియొక సంవత్సరము శిక్షవిధించి తిరిగి బళ్ళారిజైలునకే పంపిరి వీరు మంచిధైర్య స్థైర్యములు గలవారు. ఛలోక్తులంటె ఎంత మహాసరదా, అంచేతనే గాబోలు ఏ సెంత జైళ్లలోనైనా ఎంతకష్టంలోనైనా నంతోషంగా ఉన్నట్లే ఉండేవారు.

పిమ్మట 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరుమాసాలు శిక్షవేశించారు ప్రభుత్వంవారు. వీరి కాలమును రాజమండ్రి సెంట్రల్ జైలులో గడిపారు.

వీరికి నిరంతరకృషివలనను అంతరత కారాగార వాసము వలను 1942 లో క్షయరోగము సంభవించినది. ఈక్షయ వ్యాధివలననే వీరు 1942 నవంబరు 29 వ తేదీ గుంటూరు పురముననే పరమపదించిరి.

వీరికి యేశాఖయందును ప్రత్యేకతలేదుగాని కాంగ్రెస్ ఆదేశానుసారం సర్వసమర్థత గలిగి అన్నిశాఖలలోను సర్వ సమర్థతతో పనిచేసి కాంగ్రెస్ ఉద్యమమునందును తత్రాపి జిల్లాయందును సర్వజనాదరణము నొందగలిగిన ధీరోదాత్తులు.

ఏయుద్యమమునందుగాని శ్రీశాస్త్రిగారిదే ముందంజ. వెనుకంజ యనునది వీరిజన్మమున లేదు.

వీరికి రెండువివాహములు. వీరిద త్తస్థానమున పదునా రెకరముల మాగాణిభూమిగలదు. చనిపోవునరికి సర్వశూన్యము అర్థం ప్రాణం అంతాఉద్యమమే అనుకున్నారువీరు.

వీరి మొదటిభార్యకు ఒక ఆడపిల్ల. ఈపిల్లను సరదారు గొల్లపూడి సీతారామశాస్త్రిగారి జ్యేష్ఠకుమారున కిచ్చిరి. రెండవభార్యకు ఒకఆడపిల్లయు నొక మొగపిల్లవాడు నున్నారు. వారింకను చిన్నపిల్లలు. మేనమామఇంటివద్ద కొలకలూరులో పెరుగుచున్నారు.

వీరికి గుంటూరులో ఒక చిన్న యిల్లున్నది. ఇపుడు ఆఇంటి మీాద 20 రూపాయల అద్దెమాత్రం వచ్చుచున్నది.

1940 వ సంవత్సరంలో వీరు రాజమండ్రి సెంట్రలు జైలులో నుండగా (సి) క్లాసు రాజకీయ ఖైదీలంతా స్ట్రయికు చేసిరి. ఆ సందర్భమున వీరినిమాత్రం సింగిల్ సెల్లులో పెట్టిరి. తీవ్రంగా లాటీచార్జీకూడా చేసిరి. అప్పటినుండియు వీరి యారోగ్యము చెడిపోయినది. క్రమముగా క్షయలోనికి దింపి నది. వీరు చివరరోజులలో డబ్బులేక పలుబాధలుపడిరి. పై విధ మున సర్వస్వము దేశమునకై ధారవోసి పలుబాముల బడినను ధర్మపథము దప్పక మాతృదేశము నిమిత్తము ప్రాణములను పణముగా నొడ్డిన త్యాగవరేణ్యులలో వీరికి నొక యుత్తమ స్థానము గలదు.

( నేతి వేంకటాచలః

## ౨౫. భీమవరపు లక్ష్మణరావుగారు

### భీమవరం

(1870 – 28 - 7 - 1928)

వీరు 1870 ప్రాంతమున గుంటూరుజిల్లాలో సత్తెనపల్లి తాలూకా భీమవరం గ్రామంలో నియోగిబ్రాహ్మణ కుటుంబమున జన్మించిరి. వీరిద్ద రన్నదమ్ములు వీరికొక తోడబుట్టువును కలదు. వీరు జ్యేష్ఠులు వ్యవసాయం జీవగఱ్ఱ. వీరు అప్పటి ప్రాథమిక విద్యయం దుత్తీర్ణులైరి. కరిణీకం సర్వేపరీక్షలు పూర్తిజేసిరి. వీరు కొంతకాలము ఉపాధ్యాయవృత్తియం దుండిరి. వీరు స్వభావతః ఉదారహృదయులు ధార్మికులును. వీరి పరమధార్మికత కారణముననే వీరియాస్తి సంగోరు పోయినది. మరియు వీరు నిష్కపట స్వభావులు.

మహాత్ముని తొలిపలుకననే 1921 సంవత్సరమున జాతీయరంగమున చురికిరి. గుంటూరు కడపజిల్లాలలో శ్రీ దేశభక్త కొండా వేంకటప్పయ్య పంతులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు శ్రీమాన్ వేదాంతం నరసింహాచార్యులు మున్నగు వారితో కలిసి శాసనసభా బహిష్కరణ ప్రచారము నతితీవ్రముగా జరిపిన వారిలో వీరొకరు. అంతేగాక 'విదేశవస్త్ర బహిష్కరణ' 'పన్నుల నిరాకరణ' అను నీ రెం డుద్యమములను స్వయముగా కర్నూలు జిల్లాలోని

కోయిలకుంట్ల తాలూకా అంతటను నడిపి తుదకు నందాల సబ్ కలెక్టరు వలన అరస్టయి రెండుసంవత్సరములు కఠినశిక్ష బడసిరి. బళ్ళారి సెంట్రలు జైలులో శిక్షాకాలమును పూర్తి జేసిరి జైలుజీవితము వలన నారోగ్యమును గోల్పోయి తీవ్రవ్యాధిగ్రస్తులైరి అయినను ఉత్సాహమును వెనుకంజయు లేనివీరు, ఖద్దరుప్రచారము మున్నగు దేశోపకారక కార్యము లను కొనసాగించుచునే యుండిరి. వట్టి ఖద్దరు ప్రచారమే గాక తాము స్వయముగ ఖద్దరు ఉత్పత్తిచేయుట ఇతరులచే చేయించుటయు ముఖ్యముగా బెట్టుకొనిరి.

1923 లో వీరు జైలునుండి విడుదలబడి నప్పటినుండియు తీవ్రమైన అనారోగ్యమున బాధపడుచు గూడ నిరంతర దేశ సేవాసక్తులై 1926 వ సంవత్సరము వరకును కాలము గడిపి తుదకు 1928 జులై 28 వ తేదీన పరమపదించిరి.

వీరికొక పుత్రరత్నము మాత్రము గలరు. వీరి నామ ధేయము భీమవరపు లక్ష్మీనరసింహారావుగారు. జన్మము 12-12-1903 వారికుటుంబమున కేలాటిలోటు లేకుండా వారి సాంప్రదాయమును గౌరవప్రతిష్ఠలను నిలువబెట్టిరి.

సత్తెనపల్లి
13-10-1946

భీమవరపు లక్ష్మీనరసింహారావు
పోచిరాజు హనుమంతరావు

# ౨౬. గొర్లపాటి హనుమంతరావుగారు

## గొర్లపాడు

( 1892 – 1933 )

గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా గొర్లపాడు అనే గ్రామం వీరి జన్మస్థానం. ఏర్పడిన సు 127-వ సంవత్సరప్రాంత మున. అత్యంతానుసంధానమైన రైతుకుటుంబమున జన్మము వ్యవసాయము జీవనము తెలుగు పత్రికలు చదువగలిగిన విజ్ఞానము. తల్లిదండ్రులకేకైక పుత్రులు, నిష్కృష్టమైన భాషా పరిచయము. కార్యదీక్ష, దయాళుత, విశాలహృదయము. పట్టుదల మున్నగునవి వీరియందున్న ఉన్నతగుణములు. మిక్కిలి ఆయుర్వేద వైద్యమునందనుభవపూర్వకమైన అనుభవ ప్రజ్ఞ గలవారు.

1921 వ సంవత్సరమున మహాత్ముజీ పిలుపందిన వెంటనే జాతీయోద్యమములో దిగి శాసనధిక్కార ప్రచారం సలిపిరి. ఖద్దరుద్యమమును ప్రోత్సహించి జిల్లా నలుమూలలను సంచారము చేసిరి. అటుపిమ్మట అదనెఱిగి, విదేశవస్త్రదహనము తామున్వయముగా నొనరించుటయేగాక తీవ్రమగు ప్రచారము సల్పిరి. ఈసందర్భమున గుంటూరు సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు వలన ఆరుమాసములు కఠినశిక్ష విధింపబడి ఆశిక్షా కాలమును రాజమండ్రి సెంట్రలుజైలులో పూర్తిచేసిరి.

జైలు జీవితమువలన శరీరారోగ్యమును పూర్తిగాం గోల్పోయిరి. ఆరోగ్యముతోపాటే ఆస్తిపాస్తులును శూన్యము లయ్యెను.

పదిసంవత్సరముల పై కాలము ఏయితరవృత్తియులేక ఏకదీక్షతో కాంగ్రెస్ సంస్థయే సమస్తమని నమ్మి పనిచేసి తుదకు కూడుగుడ్డలకు గూడ కఱవై చెప్పరాని బాధలతో చరమకాలముఁగడపి 1933 సంవత్సర మధ్యమున వీరు కాలధర్మము నొందిరి.

సత్తెనపల్లి
13 — 10 — 46

పోచిరాజు హనుమంతరాజు
భీమవరపు లక్ష్మీనరసింహారావు

# ౨౭. కాశీరాజు అశ్వత్థనారాయణగారు

## పాపాయిపాలెం

( 1882 )

వీరు చిత్రభాను సంవత్సర భాద్రపదశుద్ధ చవితినాడు పాపాయిపాలెంలో కాశీరాజువారియింట పుట్టిరి. వీరి ఏడవ సంవత్సరమున వీరి పెదతండ్రిగారైన పట్టాభిరామయ్యగారికి పెంపకము వెళ్లిరి. పెంపకమురీత్యా వీరికి ఎనిమిదెకరాలుభూమి ఒక యిల్లు మాత్రం సంక్రమించాయి. ఈయన బాల్యంనుండీ

గూడ మంచి పట్టుదల దీక్షగలవారు. వీరు అప్పటి ఎలిమెంటరీ విద్యను మాత్రం పూర్తిచేసిరి క్లాసుల్లో వీరిదే మొదటి మార్కు. ఆస్కూలుకు తనిఖీకిగాను వచ్చిన అధికార్లందరు గూడా యీయన తెలివితేటలకద్భుతపడుతూ ఉండేవారు ఈయనను ప్రశంసించని, యీయననుగూర్చి సంతోషించని విద్యాధికారులు అవాడు లేచేలేరు.

పిమ్మట కరణం మునసబు పరీక్షలకు కట్టి గుంటూరు జిల్లా మొత్తముమీద ప్రథమశ్రేణిలో ప్యాసయినారు. వీరి స్కూలు జీవితంలో గూడ వీరు స్వతంత్రభావములు, స్వంత పోకడలుగలిగి ఉండేవారు.

విరామకాలంలో స్కూలు పిల్లలలో పదిమందికి తాను నాయకుడై వాళ్ళతో కలసి వ్యాయామక్రీడలయం దత్యంతప్రీతి తోను శ్రద్ధతోను కాలము గడిపేవారు. వీరికి పదునాలుగు సంవత్సరములు వచ్చేసరికి మంచి దైవభక్తి సైతం అలవడింది. ప్రతి యేకాదశి శనివారం ఉండి జయంతులు చేయుట పూర్ణిమావాస్యాది పర్వములందు పవసించి యేకభుక్తములు చేయుచు నిత్యము విష్ణునామజపములును, లక్ష్మీనారాయణ కవచపారాయణమును జరుపుచుండెడివారు. మాసశివరాత్రులకు సత్యనారాయణ వ్రతములు చేయుచుండెడివారు.

అంతేగాక ప్రతి ద్వాదశికిన్నీ 12 మంది తక్కువ గాకుండా సమారాధనలు నిర్వహించు అతిథి అభ్యాగతులకు పూజలున్నూ జరుపుతూ ఉండేవారు.

వీరు మైనారటీ తీరగానే చుట్టుపట్ల గ్రామాలకు ఖాళీ వచ్చినప్పుడెల్లా ఆక్టింగు కరణీకములు మునసబు ఉద్యోగములు చేస్తూఉండేవారు. వీరు కంట్రాక్టులు కూడా చేస్తూఉండేవారు.

వీరిలో ప్రత్యేకత ఏమంటే సుమారు పదునైదు గ్రామములకు వీరే తిరుగులేనిపెద్దగా ఉండెవారు వీరు చెప్పిన తీర్పుకు తిరుగులేదు. వీరి ప్రతిభావిశేషంవల్లనూ వ్యవహార దక్షత వల్లను వీరి ఆధీనంలో ఉండే గ్రామాల్లోని యే కేసు గాని యే వ్యవహారం గాని కుంఫినీవాడి కోర్టుకు పోకుండా చూస్తూండెవారు.

వీరికి మొదటినుండి ఆదాయమునకు మించిన వ్యయమే అయిపోయింది దానధర్మముల క్రిందనూ సంతర్పణ సమారాధనములక్రిందను వీరు ఉద్యమములో అడుగుపెట్టేనాటికే అర్ధంఆస్తి హరించుకుపోయింది.

వీరు 1921 లో పాపాయిపాలెం ఆక్టింగు కరణంగా పనిచేస్తున్న కాలంలోనే గాంధీగారి శాసనసభా బహిష్కరణో ద్యమము మారంభమైనది. వెంటనే యీాయన కరణీకానికి స్వస్తి చెప్పి "నోవోట్సుకాంపెయిన్" లో ప్రవేశించి పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభించిరి. ఆదర్శప్రాయులగు వీరు స్వంత ఆస్తికిసైతం పన్ను ఇవ్వడం మానివేయగా ప్రభుత్వమువారు వీరిఆస్తిని జప్తుచేసిరి. అయినను వీరుచలింపక వీరిగ్రామము చుట్టును ఆసమీపమునను గల అడవికి గ్రామస్థులిచ్చే పుల్లరి శిస్తును సైతం వారిచే ఎగబెట్టించిరి.

ఈప్రబోధ ప్రచారములలో వీరు ప్రభుత్వమువారి తీవ్రతర కోపావేశమునకు గురియైరి. అందుచే గుంటూరు డిప్యూటికలెక్టరుగారు వీరిని తాము ఖుద్దునఉండి లాటీచార్జి చేయించి అరెష్టుచేయించి తామే కేసువిచారించి 108 వ సెక్షన్ క్రింద 1 సంవత్సరము కఠినశిక్ష విధించి రాజమండ్రీ సెంట్రల్ జైలుకు పంపిరి

ఈ సందర్భమునందే గవర్నమెంటు శిస్తులులేవని మిలిటరీ రిజర్వు వచ్చినందున వారి ఖర్చులకుగాను వీరియొద్దను వీరి బంధువులయొద్దను అయిదువందల రూపాయలు జుర్మానా క్రింద వసూలుచేసిరి

పిమ్మట జైలునుండి రాగానే నిర్మాణ కార్యక్రమాభిమానులై "లక్ష్మీనారాయణ హాండ్ వీవింగ్ హాండు స్పిన్నింగ్ కోఆపరేటివ్ సొసైటి లిమిటెడ్" అను నొక కంపెని స్థాపించి 1924 నుండి పెద్ద స్కేలుపైని బహుచాకచక్యంగా నడిపిరి.

తరువాత స్వరాజ్య పార్టీలో పాల్గొని తాలూకాబోర్డు మెంబరుగాను గుంటూరుజిల్లా కోఆపరేటివ్ బ్యాంకు డైరెక్టరుగాను ఉండి బీదలపాలిటి కల్పవృక్షంలాగా వ్యవహరిస్తూ ఉండెవారు.

వీరు 1930 నాటి ఉప్పు సత్యాగ్రహం నాటికి తమ స్వానుభవంవల్ల జైళ్ళకు వెళ్ళుటద్వారాకన్న జైళ్ళబైట నుండుటద్వారానే ఎక్కువ పనిచేయనగునను తీర్మానమునకు

వచ్చిరి. అందుచేత వా రా ఉప్పుసత్యాగ్రహమున బాల్గొనక తీవ్రముగా ఖద్దరుప్రచారము చేయుచు తదితర నిర్మాణాత్మక కార్యక్రమములకును తమ చేయూత నిచ్చుచు పరిశుద్ధ మన స్కులై తమ కర్తవ్యమును నెరవేర్చుచుండెడివారు

వీరికి పదునారు సంవత్సరములు కుమార్తెయు రెండు సంవత్సరములుగల కుమారుడును మాత్రము గలరు. గాని సత్పురుషులకే సకలకష్టము లన్నట్లు పరమేశ్వరుడా సంతానఫలమును వీరికి దక్కనీయక ఇరువుర నెత్తుకొని పోయినాడు.

సంతానప్రాప్తి లేదుసరిగదా ఆస్తియు సర్వనాశనమై తుదకు కమికెడు గంజికైనను నోచుకొనక పలుబాముల పాలైరి.

పై రీతిని చెప్పరాని చింతలతో పడరాని బాధలతో శరీరము చివికి చివికి క్రమేణా వాతత్వములోనికి దిగినది. వారమురోజులుశ్లేష్మముతో నానాబాధపడిరి తుదకు రామ నామ జపము చేయుచు (ఈ రామనామ జపమునకై మరొక మందిరమును సైతము నిర్మించిరి.) పార్థివనామ సంవత్సర వైశాఖబహుళ తదియనాడు అఱువదిమూడవయేట వీరస్వర్గ మలంకరించిరి.

వీరుచేసిన ఖద్దరు వ్యాపారంలో వీరివంతు పదివేల రూపాయల నష్టంభరించిరి. వీరి సతీమణి హనుమాయమ్మగారిపుడు వారిస్వగ్రామమైన పాపాయిపాలెంలోనే ఉన్నారు

వీరిదాయాదులు దయతలచి యిచ్చిన కొద్దిభూమిలో వచ్చే సాలుసరిఆదాయంవల్ల ఏదోగడిచీగడవకగా కాలంగడుపుతున్నారు వీరి సతీమణి హనుమాయమ్మగారు.

(కాశీరాజు యోగానన్ద లక్ష్మీనరసింహరావుగారు)

15—10—46

# ౨౨. నల్లగొండ జానకిరామయ్యగారు

## గుంటూరు

(1888 — 1934)

వీరు 1888 వ సంవత్సరంలో గుంటూరులో ఒక సుప్రసిద్ధ బ్రాహ్మణకుటుంబమున జన్మించిరి. వీరు నలుగు రన్నదమ్ములు. వీరే జ్యేష్ఠులు వీరు వస్తుతః అల్లరిపిల్లల్లోనే చేరిక. వీరిబాల్యంలో వీరుచేసే చిలిపిపనులకు అంతూపంతూ లేదు. అయితే వీరిలోఅల్లరితనం యెంతగా ఉన్నదో అంతకు మించిన తెలివితేటలూ స్వయంప్రతిభ ఉంటూ ఉండేవి. పరీక్షలో తప్పడమనేది యీమనజన్మలోనె లేదు.

1922 లో పశువుల వ్యాధులను గూర్చియు అడవుల కష్టములనుగూర్చియు వీరు ఉపన్యాసము లిస్తూ ప్రచారంచేయగా

ప్రభుత్వమువారు 144 వ సెక్షన్ ఉత్తర్వు జారీచేసిరి. సహజ ధైర్యశాలులును కార్యదీక్ష తత్పరులైన శ్రీ జానకిరామయ్యగారు ఆ ఉత్తరువును ధిక్కరించిరి.

పిమ్మట గురజాల సబ్ మెజిస్ట్రేటుగారు కేసువిచారణ చేసి ఆరుమాసాలు కఠినశిక్ష విధించెను. వీరాశిక్షాకాలమును బళ్ళారి సెంట్రల్ జైలులో గడపిరి.

జైలులో నున్నంతకాలం వీరికి, జైలు అధికారులకూ తూర్పుపడమర సంబంధం జాస్తీగాఉండెది. జైలు అధికారులు అన్యాయం చేయకుండా ఉండేవారూగారు. న్యాయసమ్మతమైన కోరికలకై వీరు దెబ్బలాడకుండా ఉండేవారూ గారు

వీరికి ఖద్దరుఉద్యమంలో చాలాప్రీతి. వీరు గ్రామ గ్రామానికివెళ్ళి ఎక్కిగుమ్మం దిగేగుమ్మంగా ఖద్దరు అమ్మేవారు.

వీరిలో ఇంకొక విశేషం ఎంతదూరమైనాసరే విరి ప్రయాణలన్నీ నూటికినూరుపాళ్ళు నడకమీదనే సాగుతూ ఉండేవి. వీరుమున్ముందు కొంతఔద్ధత్యంగలవారే అయినా క్రమేపీ శాంతమూర్తులుగా తయారయ్యారు.

వీరికి వస్తుతఃనే ఆస్తిపాస్తులుతక్కువ. జీవనోపాధి కూడ గడిచేయెత్తులేక కష్టముతో అఖిలభారతచరఖాసంఘం ఆంధ్రశాఖలో గుంటూరు బాపట్లగ్రామములలో పనిచేసిరి.

వీరు టవున్ జిల్లా కాంగ్రెస్ కమిటీలలో ఉండి కాంగ్రెస్ మెంబర్లను అధికంగా చేర్పిస్తూఉండేవారు వీరెన్ని కమిటీలలో మెంబరైనా పోటీ అంటే గిట్టేదికాదు. పోటీలేనిపద్ధతిలో సభ్యత్వం లభ్యమైతేనే ఉండేవారు. లేకపోతే అట్లు నిలిచేవారేకారు.

1931 చరఖాసంఘసేవకులు ఉద్యమంలో ప్రవేశింపకూడదనే తాఖీదుపై అప్పటి మూమెంటులో వీరు ప్రవేశింపక ఖాదీపనులు చూస్తూఉండేవారు

వీరు 1932లో నైజాంవెళ్ళిపోయి అక్కడ ఖాదీఉద్యమం ప్రారంభించి అఖండఖ్యాతి నార్జించిరి.

వీరికి చరమావస్థలో దాయాదులతాలూకు కొంతఆస్తి సంక్రమించెను. ఆ ఆస్తితోపాటు అజీర్ణరోగముకూడా సంభవించి దీనితోనే వీరు చాలాఅవస్థపడిరి.

తుదకీవ్యాధితోనే వీరిపనిముంచి మరణానై 1934 నవంబరు మాసమున కాలధర్మము నొందిరి.

వీరికి సంతానంగాని భార్యగాని యెక్కడ ఉన్నారో తెలియదు.

( నరసింహారావు )

---

# ౨౯. పెరుమాళ్ళ శాయన్న శ్రేష్ఠిగారు

## రెంటచింతల

( 1885 – 1924 )

వీరు 1885వ ప్రాంతమున రెంటచింతల గ్రామంలో ఆర్యవైశ్యకులమందు జన్మించిరి. వీరి బాల్యంలో మహాగొప్ప దశలో ఉండేవారు. అప్పట్లో ఎలిమెంటరీ విద్య మాత్రం పూర్తిచేసి గుంటూరుగ్రామంలో మెట్రిక్యులేషన్ వరకు చదువుకున్నారు గాంధీగారి తొలిపిలుపు రాగానే 1921లో 'నోటెట్సుకాంపైను' లో పాల్గొని మిక్కిలి దీక్షతో పనిచేసిన వారిలో వీరొకరు. వీరుకూడా 22 లో 144 వ సెక్షన్ ధిక్కరించి పలనాడు మేజస్ట్రీటుచే శిక్షితులై శిక్షాకాలము ఆఱుమాసములును రాయవేలూరు సెంట్రల్ జైలునందు గడిపిరి. జైలులో వీరు చాల బలహీనత నొందిరి. విడుదల [illegible]నది మొదలు వారి గ్రామంలో విద్యావ్యాప్తికి చాల [illegible]పడిరి వీరికి గ్రంధాలయోద్యమమంటే ప్రత్యేకాభి[illegible] ఈసహజాభిమానంతో వీరు చాలాఊళ్ళల్లో గ్రంధా[illegible]లు స్థాపింపజేశారు, ఆయా పౌరులను పురికొల్పి. మత[illegible]పీఠికి యెక్కువ పట్టుదల. స్వామివివేకానందుని శిష్య[illegible]టిలోవారు. వీరు ముఖ్యంగా వారి వేదాంత గ్రంధాలనే [illegible]ననచేస్తూ ఉండేవారు. వీరికి ఒక కుమార్తెమాత్రం కలదు.

వీరు చాలా సంపన్నులు వీరు 1924 ఫిబ్రవరి నెలలో కాల ధర్మము నొందిరి. వీరిలో గొప్ప విశేషమేమంటే యెప్పుడు ఉల్లాసంగా నిత్యానందంగా ఉండేవారు. వీరి భార్య ప్రస్తుతము స్వగ్రామములోనే ఉన్నారు.

(నరసింహం)

## ౯౦. తిరునాగారి వేంకటనరససూరిగారు

## గంగవరం

(1901 – 1935)

వీరు సుప్రసిద్ధ సాతానివైష్ణవకులమునకు జెందినవారు. గంగవరం వీరి జన్మస్థానం. వస్తుతః చాలా తెలివి తేటలు గలవారు. ఎలిమెంటరీ విద్యమాత్రంపూర్తిచేసి ట్రైనింగయినారు. పదునైదవ సంవత్సరంవచ్చేసరికే తెలుగులోను సంస్కృతంలోనూ కూడా మంచిపాండిత్యం సంపాదించారు. మైనారిటీ తీరగానే (1901 లో వీరు జన్మించారు) 1918 లో ఒక ప్రైవేటుస్కూలు స్థాపించి విద్యాదానం చేస్తూ ఉండేవారు.

ఇంతలో గాంధీగారి దేశోద్ధరణోద్యమం తాలూకు రోలి కేక వినిపించింది. పాఠశాలసాగుటకు దగిన కట్టుబాట్లు చేసి

వీరు శాసనసభా బహిష్కరణంయున్నగు పనులలో పూర్తిగా పనిచేసిరి. స్కూలుపూర్తిగా మానివేసిరి. భారతమాత మీదను మహాత్మాగాంధీగారిమీదను చక్కని శైలిలో పద్యములు పాటలు వ్రాసి ఊరూర తీవ్రప్రచారం చేస్తూఉండేవారు. ఈయనచాలా ఉదారస్వభావులు. కోపానికి వీరికీ చాలాదూరం. ఎప్పుడూ నిర్మలమనస్కులై మూర్తీభవించిన శాంతదూతయో అన్నట్లుండేవారు. పిమ్మట, పలనాటి పుల్లరిశిస్తులబహిష్కరణములో పాల్గొని 1922లో 144వ సెక్షన్ ధిక్కరించిరి ఈసందర్భములో గురజాల స్టేషనరీ సబ్ మేజస్ట్రీటుచే ఆరుమాసాలు శిక్షవిధింపబడెను. శిక్షాకాలం రాజమండ్రి సెంట్రల్ జైలులో పూర్తిచేసిరి. వీరికి జైలులో కొంచెంగా జబ్బుచేసినది. జైలునుంచి విడుదలయైనపిదప అనారోగ్యకారణంగా వెంటనే తీవ్రంగా పనిచేయలేకపోయిరి అందుచేత నిరంతరసేవాభ్యాసం గల వీరు జాతీయవస్త్రములపై నేతపాఠశాలస్థాపించి అందు పని చేయుచుండిరి. ఇంతలో 1930 లో ఉప్పుసత్యాగ్రహోద్యమమారంభమైనది. వీ రిందుపాల్గొని గుంటూరులో తీవ్రప్రచారమొనర్చి ఉప్పుపండించిరి. ఈ సమయమున గుంటూరు మేజస్ట్రీటు వీరికి 2 సంవత్సరములు కఠినశిక్ష విధించిరి. వీరి శిక్షాకాలమును బళ్ళారి కన్ననూరుజైళ్ళలో గడపిరి. 1932లో కన్ననూరు జైలులో హంగరుస్ట్రయికు సందర్భమున వీరిపై తీవ్రంగా లాటీఛార్జీ జరిగినది. జైలునుంచి విడుదల కాగానే మరల స్కూలు ప్రారంభించిరి. వీరికి జైళ్ళలో కలిగిన

అనారోగ్యం కారణంగానే క్షయవ్యాధి ఆరంభమైంది. ఈవ్యాధితోనే వీరు ౧౯౩౫ మే నెలలో వీరస్వర్గ మలంకరించిరి.

వీరికి ఒకపుత్రికమాత్రంకలదు. వీరు చనిపోవు నరికి వీరికేలాటి ఆస్తియులేదు వీరి ఏకైకపుత్రికకు వివాహము మాత్రమైనది. వీరి ధర్మపత్నియు గుంటూరు జిల్లాలోనే వీరి అల్లుడు గారులవద్దనే ఉండి కాలక్షేపంగా చేయుచున్నారు.

( నరసింహారావు )

## ౯౧. బిట్రగుంట వెంకన్నగారు

### పాపాయిపాలెం

( 1850 – 1935 )

వీరు సుప్రసిద్ధమైన ఒక కాపుకులంలో జన్మించారు. 1850 లో వీరి జననం. వీరేమీ చదువుకోకపోయినా చక్కని అనుభవజ్ఞానం గలవారు. భూస్వాములు. భగవద్భక్తి బ్రాహ్మణాభిమానం గలవారు. వ్యవసాయంలో ఆసక్తి జాస్తి. దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు వారి గ్రామం వెళ్ళినపుడల్లా ఉభయులు కౌగిలించుకొనేవారట. వారి యుభయులమైత్రి పరస్పరాభిమానము లట్టివి. ఈ తాలూకా కాంగ్రెస్ నాయకులకూ కార్యకర్తలకు కూడ వీరొక పెద్ద

పట్టు కొమ్మగా ఉండేవారు. ఊళ్ళో యేపనియైనా వీరిదే పెత్తనం అనేమాట అలాఉంచి ఆచుట్టుపట్ల ఉద్యమంతాలూకు ఏపనివచ్చినా వీరి హస్తముద్ర లేనిదే అయ్యేదేగాదు.

వీరు నిశానీదారే అయినా సహజానుభవంవలన ప్రతి పనిలో వీరే నాయకత్వం వహించవలసి వచ్చేది అతిచాక చక్యంగా ఎంతపనినైనా అట్టే నిర్వహించేసేవారు.

ఈ తాలూకాలో పన్నుల నిరాకరణోద్యమంలో వీరే ప్రప్రథములై అందరికి మార్గదర్శకులైనారు నోటీట్సు కాం పైనులో పంతులుగారికి వీరే కుడిభుజంగా ఉండి పనిచేశారు.

ఈ తరుణంలో ప్రచారం నిమిత్తం వీరు తిరగని పల్లె గూడా లేదంటే అతిశయోక్తి ఎంతమాత్రంలేదు. ఈ ప్రచా రంసందర్భంలో సత్తెనపల్లి మేజస్ట్రీటు ఆరుమాసాలు కఠినశిక్ష విధించి రాజమండ్రి సెంట్రలుజైలుకు పంపాడు.

జైలుజీవితం అయినతర్వాత మామూలు వ్యవసాయం తోనే కాలం గడుపుతూ ఉండేవారు. వీరి కుటుంబంలో ఉద్యమంముందు గూడా నూలు తీయడం ఆనూలుతో తాము స్వయంగా నేయించుకొన్న బట్టలే కట్టుకోడం పరి పాటి అందుచే జైలుజీవితం తర్వాత ఖద్దరు ఉద్యమంలో బాగా పనిచేశారు.

వీరికి ముగ్గురు కొమరులు ఇద్దరు కొమరితలు గలరు. 1935 లో వీరు కాలధర్మమును నొందిరి. అప్పటికి వీరికి 65 సంవత్సరములు.

వీరి కుటుంబీకులంతా స్వగ్రామంలోనే ఉన్నారు. వీరి ప్రథమపుత్రులు పకీరయ్య అనువారుకూడా ఉద్యమంలో పని జేసిరి. తండ్రీ కొడుకు లిద్దరినీ జైలులోనుంచిరి నాటి ఉద్యమంలో. అయినా వీరి కుటుంబీకులు ఉద్యమాభిమానమును కోల్పోక తీవ్రముగా ఉద్యమ ప్రచారము చేయుచునే యుండిరి.

పకీరయ్యగారు నేటికి సజీవులు. మామూలు సంసారమునకు లోటులేకుండా వీరి కుటుంబీకులు స్వగ్రామమైన పావాయిపాలెంలోనే కాలక్షేపం చేస్తున్నారు.

( నరసింహారావు )

## ౯౨. మన్నె నాగయ్యగారు

( 1902 )

వీరును సుప్రసిద్ధమైన తెలగకులమునకు జెందినవారే. 1902 లో వీరి జననం. వీరికి స్వానుభవంతప్ప చదువంతగా యేమీలేదు. పనులకాపరి. ఊరిచుట్టునున్న అడవులలో ఊరివారి పశువులను మేపి దానితో జీవిస్తూ ఉండేవారు.

వీరు చక్కని అనుభవజ్ఞానం గలవారవుటచేత గాంధీగారి పిలుపు రావడంతో " పశువుల కాపరి నిక నేను ప్రభుత్వం వారి కీయను గాంధీగారి కిస్తాను " అని గ్రామకరణం మున

సబులతో చెప్పిరి. అంత మునసబు కరణములు పశువులను పలుమార్లు బందిలదొడ్లో పెట్టిరి. అయినను నాగయ్యగారు వీరికి లొంగలేదు. అంత తమకు సాధ్యము గాక ప్రభుత్వము వారికి దెలిపిరి. ప్రభుత్వమువారు నాగయ్యగారిపై 144 సెక్షను ప్రయోగించి అడవులు చాయకు గూడ పోరాదని నిషేధించిరి నాగయ్యగారు అతి ధైర్యంతో 144 వ సెక్షన్ ధిక్కరించి పశువులను మందలు మందలుగా తోలుకొనిపోయి అడవిలో మేపి ప్రభుత్వమువారికి పుల్లరినీయక గ్రామస్థులలో గూడ నిషియము బాగా ప్రచారముచేసిరి.

1922 లో ఈ సందర్భమున పోలీసువారు వీరిని తీవ్రముగా లాటీచార్జిచేసి అరెస్టుచేసిరి. నరసరావుపేట సబ్ మెజస్ట్రీటు వీరికి ఆరుమాసములు కఠినశిక్ష విధించి రాజమండ్రీ సెంట్రల్ జైలుకు పంపిరి.

జైలులోనే వీరికి కొంత అనారోగ్యం ఆరంభమైనది. శిక్ష ననుభవించి జైలునుంచీ రాగానే వీరికి మలేరియాజ్వరం తగిలినది ఆ జబ్బుతోనే ఒక యేడాది చాలా బాధ పడ్డారు. అకాలమృత్యు వాతనుబడి అసువుల బాశారు.

వీరు అవివాహితులు. వీరి తల్లిదండ్రులు ఆ గ్రామంలోనే పరిపాటలతో కాలక్షేపం చేస్తూన్నారు.

( నరసింహారావు )

# ౬౩. మందపాటి పూర్ణచంద్రరావుగారు

## గుంటూరు

( 31-3-1922 – 14-8-1942 )

ఈ యువకుడు సుప్రసిద్ధమైన ఆకావేలి నియోగి కుటుంబమునకు చెందినవారు. 31-3-1922 న వీరి జననం. ఈయనకు ఒంటరిగా ఉండటం ప్రతివిషయాన్ని తీవ్రంగా ఆలోచించి చేయటం అలవాటు. ఒంటిఆట అంటే బహుప్రీతి. బాల్యం నుండిగూడా ఖద్దరే ధరిస్తూఉండేవారు.

ఇక్కడి హిందూహైస్కూలులోనే S L C పూర్తి చేసి ఆ కాలేజీలోనే ఇంటర్మీడియట్ చదివారు. స్వాతంత్ర్యము ఉద్యమంలో పని చేయుచుండుట చేతనే 1941 లో వీరి పరీక్ష పోయినది.

మరల 1942 సెప్టెంబరు పరీక్షకు కట్టిరి. 1942 ఆగష్టు 13 వ తేదీన "క్విట్ ఇండియా" తీర్మానం సందర్భమున గాంధీ గారిని, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మెంబర్లనూ అరెస్టు చేసిరి.

కాలేజీ విద్యార్థులు స్ట్రయికు చేసి 13 వ తేదీననే గాంధీ పార్కులో మీటింగు పెట్టిరి. వీరు ఆమీటింగులో ప్రముఖ పాత్ర వహించిన విద్యార్థులలో నొకరు.

ప్రశాంతముగా మీటింగుజరుగుచున్న సమయమున నేవిధమైన వార్నింగు లేకుండగనే కేశవరావునాయుడు అను సబ్

ఇన్‌స్పెక్టరుగారు పోలీసులచే ఫైరుచేయించిరి. పెద్దబజారువైపు పార్కుగోడ ఆవలివైపునుండే ఫైరింగు జరిగినది.

ఆఫైరింగులో చాలామందికి తీవ్రములైన గాయములు తగిలినవి. వీరికి గొంతుకలో నుండి గుండు దూరిపోయినది. వెంటనే అందరినీ హాస్పటలులో నుంచిరి. కాని యీవీరుడు మరునాడే 14 వ తేదీని మరణించినాడు.

వీరి తలిదండ్రులు నేటికినీ సజీవులైయున్నారు. వీరి తలిదండ్రులకు వీరు ఏకైకపుత్రులు. తండ్రిగారైన శ్రీమందపాటి సూర్యారావుగారు హిందూహైస్కూల్లోనే ఉపాధ్యాయులుగా నేటికినీ పనిచేయుచున్నారు. వీరికి కొద్దిపాటి భూవసతి మాత్రం కలదు.

(మందపాటి వెంకటసూర్యారావు)

## ౯౮. అక్కుల పాపిరెడ్డిగారు

(1840 – 1 3?)

1840 లో వీరిజననం. కొద్దిగా చదువుకొన్నారు. అప్పట్లో వీరిఊళ్ళో మంచిమాటచలామణీ అదీ ఉండి గ్రామ నాయకులుగా ఉంటూఉండేవారు. ఎంతపనినైనా చక్కగా నిర్వహించేశక్తి వీరిలోఉండేది.

1921 లో కరాచీకాంగ్రెస్ తీర్మానానుసారం "వాలం

టెరుకొాగు'' ఆర్గనైజ్ చేసి వారికిచక్కని శిక్షణనిచ్చి తీవ్రంగా ఉద్యమప్రచారం జరిపిరి.

కాంగ్రెసు మోామెంటుకు దోహదంగా ఉన్నారని ప్రభుత్వమువారూ వారినొక్కర్లు పీరివిశలుమార్గ్లు పలురీతుల మందలించిననూ వీరువినరైరి. అందుచే ప్రభుత్వము వారి తీవ్రదృష్టికి వీరుగురియైయుండిరి.

ఇంతలోపన్నుల నిరాకరణోద్యమమురాగా ఆగ్రామములో నాయుద్యమమునను వీరేముందంజవేసిరి. ఆప్రాన్తము నందంతటను ప్రతికాంగ్రెస్ ఉద్యమమునను వీరు మార్గదర్శకులగుచుండిరి

1922 లో రిజర్వుపోలీసులు వీరిగ్రామంవచ్చి నూరు రూపాయలకు వీరిపశువులనన్నిటిని వేలంవేసి వీరిని అరెస్టుచేసి నరసరావుపెటకు తీసికొనిపోయిరి.

నరసరావుపేట సబ్ మేజస్ట్రేటు వీరికి ఒక సంవత్సరం కఠినశిక్ష విధించి రాజమండ్రిపంపిరి ప్రభుత్వమువారు వీరినెంతబాధించినను తిరిగి కాంగ్రెసువారు పన్నులుచెల్లించమనునంతవరకున్నూ చెల్లించలేదు.

వీరికి ముగ్గురు మగపిల్లలు నలుగురు ఆడపిల్లలు. వీరు తొంబది సంవత్సరములు జీవించిరి. వృద్ధాప్యంవల్ల 1931 లో మరణించిరి. వీరికుటుంబమువారిపుడాగ్రామంలోనే ఉన్నారు.

(నరసింహారావు)

# ౯౫. పెండ్యాల నరసింహారావుగారు

( 18882 – 1924 )

వీరు సుప్రసిద్ధ ఆర్యవైశ్యకులమునకు జెందినవారు. మంచిభూవసతి వడ్డీవ్యాపారమూ గలవారు. 1882 వీరి జననం.

కరాచీ తీర్మానము ననుసరించి వీరును వాలెంటీరు ఉద్యమమున పనిచేసిరి. పన్నులనీయ నిరాకరించిరి.

అందుకొరకు ప్రభుత్వమువారు వీరిని 108 వ శెక్షను క్రింద అరెస్టుచేసిరి. అంతేగాక అదనపు పోలీసుటాక్సు 200 రూపాయలు విధించి ఆరుమాసములు రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపిరి.

జైలు అనుభవించి యింటికి రాగానే క్షయవ్యాధి పీడితులై 1924 లో కాలధర్మము నొందిరి.

వీరును బాల్యాదారభ్య శుద్ధరువస్త్రధారులు. ఆమరణము వీరీదీక్షను తప్పలేదు. వీరియింట స్త్రీలుసైతం ఒక్కనాడూ విదేశవస్త్రమును ధరింపకుండుట విశేషము.

వీరికి నలువురుపుత్రులు నిరువురుపుత్రికలుకలిగి నష్టమైరి. ఇపుడువీరికుటుంబమున నెవ్వరునులేరు. అందరు నశించిపోయిరి.

( నరసింహారావు )

# ౯౬. మట్టి వెంకటస్వామి రెడ్డిగారు-ఇంటూరు

( 1870 – 1925 )

వీరు 1870 లో జన్మించిరి. వీరి కుటుంబములో వీరే జ్యేష్ఠులు. వీరు యెక్కువ చదువుకున్న వారు కారు. కాని మంచి అనుభవము గలవారు. వ్యవసాయమే వీరివృత్తి.

వీరికి మొదటినుండి ఖద్దరంటె మహాభిమానం. తాము తమ యింట్లోనే గాక గ్రామంలో అందరిచేతా నూలు వడకడం వగైరా నిర్మాణకార్యక్రమం చేయిస్తూ ఉండేవారు.

వీరు 1920 లో వీరి యేబదియవపడిలో వాలంటీర్లలో చేరి చిన్నవాళ్లతో కలసి వారికంటె యెక్కువగా ఉత్సాహంతో పనిచేసిరి. అప్పటి ఆగ్రామ వాలంటీర్ కోరుకు నాయకులు గా ఉండెవారు.

వాలంటీర్లను ప్రతి గ్రామం తీసుకొనివెళ్లి పన్నుల నిరాకరణ ప్రచారం బాగా చేసినవారిలో వీరును ముఖ్యులు.

వీరు వస్తుతః చాలా త్యాగి. ఎవరేమి అడిగినా వీరికడ "నాస్తి" అనే శబ్దంలేదు

1922 లో వాలంటీర్లను చేర్చి ప్రచారం చేసినందుకు గాను నరసరావుపెట సబ్ మేజస్ట్రీటు ఏడాది కఠినవరం వేసి రాజమండ్రీ పంపిరి.

శిక్షానుభవానంతరము అనారోగ్యకారణమున వ్యవసాయవృత్తిలో నుండిరి. వీరి యనారోగ్య మభివృద్ధియై 1925 లో యేబది యైదవయేట మరణించిరి

వీరికి 2 కొమరులు 5 గురు కొమరితలు గలరు. ఇప్పుడును వారి కుటుంబము ఆగ్రామములోనే యున్నది వీరికి అదనపు పోలీసు పన్ను ఏబదిరూపాయలు వేసి బలవంతముగా ప్రభుత్వమువారు వసూలు చేసిరి.

## ౯౭. మాటూరి శివసత్యనారాయణగారు

### ఇంటూరు

( 1912 )

వీరు ఇంటూరు గ్రామంలో ఆర్యవైశ్య కుటుంబమునకు జెందిన మాటూరి వేంకట సుబ్బయ్యగారికి యేకైక పుత్రులు. ఇంటూరు హైస్కూలులో స్కూలుఫైనలు వరకూ చదువుకున్నారు. స్వభావతః శాంతస్వభావులూ మిక్కిలి మేధావులును

1912 జూన్ నెలలో వీరిజననం. వీరి దే ప్రతితరగతిలోను మొదటిమార్కు. ఆ స్కూలు చర్చాసంఘంలో స్వయం

ప్రతిభతో వీరు క్రొత్తపోకడలలో మాట్లాడేటప్పుడు విరి తెలివికి సంభ్రమాశ్చర్యములు చూపనివారుగాని వీరిని ప్రశం సింపనివారు గాని లేరనుట అతిశయోక్తిగాదు.

వీరు చదువుకునేటప్పుడు కూడా దేశం అన్నా దేశో ద్ధరణకార్యక్రమములన్నా వీరికి అభిమానం ఎక్కువగాఉండేది.

ఇంతలో జాతీయోద్యమం వచ్చింది. ఆ తాలూకు మీటింగుల్లో వీరు పాల్గొంటూ ఉండేవారు ఇంట్లో విదేశ వస్త్రాలు కడుతూఉంటే యీ యువకుడు పెద్దలందరితో దెబ్బ లాడి ప్రత్యేకం ఖద్దరు తెప్పించి కడుతూ ఉండేవాడు.

అప్పట్లో వీరికి మంచిస్థితి ఉండెది అపారమేధావి. అందులో స్థితిపరుడు. అందేత యీయన యెంత అభ్యంతర పెట్టినా అయి తీరిందిగాని వివాహం ఆగలేదు.

ఈయనకు ఆటపాటల్లో మహాసరదా ఆరితేరిన చేయి గూడా. 1931 లో చదువు పూర్తిగా చాలించి ఉద్యమంలో దిగాడీయువకుడు.

మద్యపాన నిషేధప్రచారం బాగా చేస్తూ ప్రభుత్వము నకు వ్యతిరేకంగా కల్లుగీతకు ఉపయోగించే ఈతచెట్లను తాడి చెట్లను తాను నరకుటయేగాక గ్రామస్థుల నందరినీ గూడా నరకుమని ప్రోత్సహిస్తూ ఉపన్యాసా లిచ్చాడీ యువకుడు అనేక చోట్ల. ఈయన సహజవాగ్ధోరణిచే జనం అట్టే ఆకర్షింపబడేది. అందేత యీయన ప్రచారంతో తెనాలితాలూకా అంతటా గీత కుపయోగించే చెట్లు నరికవేత చాలా తీవ్రంగా సాగింది

దీనితో ఇతడు ప్రభుత్వోద్యోగుల కోపాగ్నికి యింధన మైనాడు. తెనాలి డిప్యూటీ కలెక్టరుగారు ఈతని అరెస్టు చేయించి రెండు సంవత్సరములు కఠినశిక్ష విధించి రాజమండ్రి పంపిరి. కొంతకాలం తరువాత వరుసగ వీరిని బళ్ళారి, రాయ వేలూరు, కన్ననూరు జైళ్ళకు మారుస్తూ చాలా బాధలు పెట్టిరి.

వీరు బళ్ళారి జైలులో ఉండగా 32 లో తీవ్రమైన లాటీచార్జికి గురియైరి. వీరిని కన్ననూరునుంచి రాయవేలూరుకు మార్చిరి ఈ జైలులోనే వీరికి టైఫాయిడ్ జ్వరము వచ్చినది. ఈ వ్యాధియే తీవ్రమై నవంబరు 6 వ తేదీన అకాలమృత్యు వాతపడిరి. శవమును తలిదండ్రుల కిచ్చివేసిరి సక్రమముగ దహనసంస్కారాదులు జరిగినవి

ఈ యేకైకపుత్రుడు మరణింపగనే తండ్రిగారును రెండు మాసములలో ఈ బెంగతోనే మరణించిరి వీరి తల్లిగారు మాత్రం ఇపుడు జీవించియున్నారు వీరి భార్య బాపట్లలో పుట్టినింట నున్నారు వీరి తల్లిగారు వేరు జీవనాధారమేమీ లేనందున కూతురువద్దను అల్లునివద్దను ఉండి కాలక్షేపము చేయుచున్నారు.

( దావులూరి రంగయ్య
తెనాలితాలూకా ఇంటూరు )

# శ్రీ తోట సుందర్రావుగారు - గుంటూరు

( 1917 – )

వీరు 1917 సం॥రంలో గుంటూరు పట్టణమున ఒక మర్యాదగల పేద కుటుంబమున జన్మించిరి. ఈయన కేవలం అయిదవ తరగతి వరకే చదువుటచే ప్లీడరుగుమస్తా వృత్తిని స్వీకరించ వలసిన వారాయెను. ఈయన స్వతహాగా దేశసేవ పరాయణు డగుచే తనవృత్తికి సంబంధించిన పనితో కాంగ్రెస్ పనిని కూడ నిర్వహించుచుండెను. ఈయన దేశభక్తి ఆయూరి ప్రముఖ కాంగ్రెస్‌వర్గంవారి నాకర్షించెను వెంటనే ఈయనను కాంగ్రెస్ ఆఫీస్ మేనేజరుగా నియమించిరి. ఈపదవి ఈయన మృత్యు పర్యంతము నిర్వర్తించెను.

1941 సం॥రంలో సత్యాగ్రహమును జేసి మూడుమాస ములు కారాగృహశిక్షను ననుభవించెను. వీరు జెయిలునుండి విముక్తి కాగానే అనేక ఈతిబాధల ననుభవించెను. ఈసంవత్సర ములోనే యితడు Rate Payers సంఘమువకు కార్యదర్శిత్వమును గుంటూరు ప్లీడరుగుమస్తాల సంఘ కార్యదర్శిత్వము ను వహించెను. ఈయన ఆగష్టు ప్లవంలో ముఖ్యపాత్రను గైకొను టచే, గుంటూరులో డిస్ట్రిక్టుకోర్టు సమీపమున బాంబు కన్పడు టచే — ప్రభుత్వగూఢచారులు (C I D) వీరిని ప్రశ్నించిరి.

విషజ్వరబాధితుడై ఈయన స్వర్గము నలంకరించెను.

( గొల్లపూడి సీతారామ శాస్త్రి )

# ౯౯. వైశ్యరత్న శనగపల్లి రామస్వామి గుప్త గారు

## గుంటూరు

ఈయన పూర్వీకులు చాల వత్సరాలక్రితం నెల్లూరుజిల్లా తెట్టు గ్రామం నుండి గుంటూరు పురమునకు వలసవచ్చి అచ్చట స్థిరవసతి నేర్పచుకొనిరి. వీరు ఔదార్యోపేతులు, విశిష్టాద్వైతులు అనేక ధర్మసంస్థలను, సత్రములను నిర్మించిన పరోపకార పరాయణులు.

బాల్యావస్థలో గుంటూరు టవున్ హైస్కూలులో విద్యాభ్యాసముచేసి మెట్రిక్ పరీక్ష యందు త్తీర్ణుడయ్యెను. వీరి సహపాఠీయగు చేగు కనకరత్నముతో కలిసి నాటకాభివృద్ధి కొరకు నాటకశాలను కట్టించుటలో సహాయపడిరి అందుచె త ఈయన ఉద్యోగప్రయత్నానికిబూనుకోలేదు. కొంత కాలము గుంటూరు కాలేజీలో రైటరు పనిని నిర్వర్తించెను ఈయన మంచి ఉపన్యాసకుడు ఎట్టివారైనను నిముషములో వశపర్చుకొనెడి తెలివితేటలు గలవు. గంభీరస్వరము బహుదూరాకర్షణము, జనాకర్షణము, మధురభాషణము రసపూర్తి , సుశబ్దవిరాజితము ఆనందయుతము నై ఈయన వాగ్ధోరణి విరాజిల్లుచుండెడిది. ఈయన ప్రసంగములో హాస్యరసము

మిక్కుటము. కృష్ణామండలములో ఆ నాడాంధ్ర ఆంగ్లభాష లలో అనర్గళంగా మాట్లాడెడి వ్యక్తి ఈయన. రాజప్రతి నిధులు ఆప్రాంతము వచ్చినపుడు, వారికి మండలోద్యోగుల నెరుకబరుచుచు, ప్రజాకష్టములను, మండల పాలనా కష్ట నిష్ఠురములను, పట్టణ పాలనా లోపములను వారికి దెలియ బర్చుచుండెను. 1909 సం॥ రంలో ఆర్యవైశ్య పత్రికను నెల కొల్పెను. ఇదిగాక ఏలూరులోను గుంటూరులోను (జూటు మిల్లులు) నార యంత్రశాలలు స్థాపించెను.

1920 గాంధీజీ అసహాయోద్యమమును ప్రారంభించి నపుడు దానిలో ప్రవేశించి ఖద్దరుధారణ దీక్షను వహించెను. 1921 సం॥రంలో నగరపాలక సంఘ సభ్యత్వాన్ని సంపాదించి ప్రజానుగుణ్యముగా నడచెను. విశాఖపట్టణములో బారెట్లా టి. ఆదినారాయణశ్రేష్ఠి యాజమాన్యముక్రింద సమావేశ మైన పదనొకండవ వైశ్యమహాసభకు ప్రతినిధిగాపోయి 'వైశ్య రత్న' బిరుదమును సంపాదించెను చేగు సుబ్బారాయుడు, వెంకట కృష్ణయ్య, గ్రంధి రంగయ్యగార్లతో కలిసి వేద పాఠ శాలను నెలకొల్పి వర్తకుల ధర్మ కాతాలనుండి కొంత వరు మానము నేర్పరచెను

1931 లో పొన్నూరులో సమావేశమైన గుంటూరు మండలసభ కధ్యక్షపదవి నలంకరించెను. ఈయన సంపూర్ణ స్వాతంత్ర్యవాది అస్పృశ్యతా నివారణము కొరకై పాటు పడెను.

1928 లో కలకత్తాలో స్వర్గీయ పండిత మోతీలాల్ నెహ్రూగారి అధ్యక్షతక్రింద జరిగిన భారతదేశీయ మహాసభకు వెపలి అచ్చట విషయనిర్ధారణసభలో పాల్గొని సంపూర్ణ స్వాతంత్ర్యమేగాని, భారతదేశానికి అధినివేశ రాజ్యాంగపద్ధతి పనికిరాదని వాదించిన వారిలో వీరొకరు. ఈ మహాసభలోనే గుంటూరుసీమకై సభ్యత్వము వడసియుండెను ఈయన మన రాజధాని సభలకేగాక మైసూరు, గుల్బర్గా, పండరీపురం మున్నగు ప్రాంతాలకు బోయి తన ఉపన్యాస ధారాప్రవాహాన్ని ప్రదర్శించారు. 1892 సం॥ రం లో కృష్ణామండలసభను గుంటూరులో సమావేశ పర్చిరి ఈ సభకు ముఖ్యకారణ భూతులు వీరే. పొన్నూరులో జరిగిన 30 వ గుంటూరు మండల మహాసభ కధ్యక్షపదవి నలంకరించెను. దివ్యజ్ఞాన సమాజ సభ్యులతో Tax Payers Association ను స్థాపించెను. దానిలో రాచకీయసభకు సంబంధించిన అన్ని వర్ణాలవారు సభ్యులుగా నుండిరి. 1891 సం॥ రం॥ లో నాగపూరులో జరిగిన దేశీయమహాసభకు ప్రతినిధిగా బోయెను. Lord Wedlock ప్రభువు గుంటూరువచ్చినపుడు నీటియిబ్బందిని తొలగించుటకొరకును, ఎన్నికలహక్కుకొరకును వార్ధత్తము చేయించెను.

గుప్తగారికి, స్వరాజ్యకాంక్ష, అస్పృశ్యతానివారణ మున్నగుగాంధీజీ సిద్ధాంతమును, త్రికరణశుద్ధిగా ననుసరించెను

జవహరులాల్‌ను సయితము హెచ్చరించు నేర్పుగల గడుస్వాతంత్ర్యవాది. సాంఘికవిషయములో వీరేశలింగం పంతులుకుగురువు. స్వసంఘాన్ని నిద్రనుండి మేల్కొలిపి, సంఘాన్ని సర్వవిధాల పునరుద్ధరించిన మహనీయమూర్తి. సంఘోద్ధరణలో అగ్రతాంబూలార్హుడు ఆంధ్రుల భావౌన్నత్యాన్ని వెలిబుచ్చుటలో అతని వాక్కు కళంకరహితం. అస్పృశ్యతానివారణోద్యమాలీయన కొనసాగించిన వేళ్ళపై నాట్యంసలిపే బీజాక్షరాలు. ఈయన దర్శించని జాతీయసంస్థ లేదు ఈయనకు ఆంధ్ర దేశమంతాపుట్టిల్లు. ఆంధ్ర దేశాభిమానులలో ముఖ్యులైనందు పేర్కొనదగినవారి నామములలో స్వామిగుప్తగారి నామము ప్రథమము. ప్రజాసేవ, రాజకీయప్రబోధం, 50 సంవత్సరాల క్రితమే ఈయన గుర్తించి, ఆంధ్రోద్యమం, హరిజనోద్ధారాలు ఉద్యమం, అసహాయోద్యమమును ప్రారంభించెను. వానికి ఈయన ఒనర్చిన మేలు మరువరానిది. దేశీయ మహాసభకు బోయిన ప్రథమ ప్రతినిధి. ఈయన కృష్ణామండలసభ సమారంభానికి వీరే కారకులు గుంటూరుజిల్లా ప్రథమ కాంగ్రెసు వాలా ఈయనే. 12—9—1929 సం॥రంలో స్వర్గస్థు డయ్యెను.

---

# ౧౦౦. వేములపల్లి రామకోటయ్యగారు
## వ్రాలేరు

( 1882 – 1940 )

వీరు వేములపల్లివారి వంశీకులు సుప్రసిద్ధమైన కమ్మ కులమునకు జెందినవారు. వీరిజననం 1882 లో. వీరిది సామాన్యమైన కుటుంబమేగాని విశేషమైన ఆర్థిక స్థైర్యంగల కుటుంబం మాత్రంగాదు. వీరిఅన్నదమ్ములలో వీరు మూడవవారు.

వీరు ఎలిమెంటరీవిద్య మాత్రమే చదువుకున్నవారైనా వీరి అనుభవంమాత్రం చాలాగొప్పది. వీరికి సహజశాన్త స్వభావమూ అప్రతిమానమైన అనుభవమూ ఉండటంవల్ల గ్రామంలోని యేలాటివిషయముగానీ వీరిద్వారానే పరిష్కారమౌతూఉండేది. వీరు గ్రామ పెత్తందారీతనం బహుచాకచక్యంగా నిర్వహిస్తూ ఏవిషయంగూడా ఊరుదాటకుండానే పరిష్కారమయేటట్లు చూస్తూఉండేవారు కోర్టుకుమాత్రం పోనిచ్చేవారుగారు.

వీరికి 1920 నుండి కాంగ్రెస్‌పై అపారమైన అభిమానం. ఖద్దరుతప్ప వేరుగుడ్డ కట్టేవారేగారు. వీరు తమ సహజాభిమానంతో తమగ్రామంలోనే స్వయంగా మగ్గములుపెట్టించి బట్టలునేయించి విరివిగా ఖద్దరుప్రచారం చేస్తూఉండేవారు.

వీ రేపనిచేసినా ఊరు ఉమ్మడిగా చేస్తూ ఉండేవారు. ఉమ్మడిపనులన్నా గ్రామక్షేమమన్నా యీాయనకు మిక్కిలి అభిలాష.

వీరు రేపల్లె తాలూకా కాంగ్రెస్ వాలంటీర్ల దళమునకు కోశాధిపతిగా ఉండి సొంతసొమ్మునే వినియోగించి దళమును సక్రమంగా పెంపొందించారు.

వీరు 1932 లో కాంగ్రెస్ వాలంటీర్లకు అన్నంపెట్టినా రనే నేరానికి రేపల్లె పోలీసువారు వీరిని అరెస్టుచేసి 108 వ సెక్షన్ ప్రకారం కేసుపెట్టిరి రేపల్లెస్థానిక మేజిస్ట్రేటు వీరికా సందర్భమున ఆరుమాసములు కఠినవరకంవిధించి రాజమండ్రీ జైలుకు పంపిరి.

వీరికి జైలులోనుండగానే జబ్బుచేసినది. రెండుమాస ములకే ఆజబ్బు క్షయరోగంగా మారింది.

వీరు స్వతహాగా మంచిఆరోగ్యవంతులు. పట్టుదల గల వారు క్షయరోగంముదిరి జైలునుంచి వచ్చినకొలదికాలముననే అనగా 1934 మార్చినెల 16 వ తేదీన కాలధర్మము నొందిరి.

వీరికి ఒక ఆడపిల్లయు అయిదుగురు మగపిల్లలును రెండవపెళ్ళిభార్యయు గలరు స్వగ్రామంలోనే ఉన్నారు. వీరిది చాలా సామాన్యమైనస్థితి అలాగే దాంతోనే చాలీ చాలక కాలక్షేపం చేస్తున్నారు.

( పరుచూరి రామకోటయ్య )

# ౧౦౭. పుట్టగుంటనరసింహయ్యచౌదరిగారు

## నల్లూరు

( 1902 – 1944 )

వీరు 1902 సం॥రం సెప్టెంబరు నెలలో నల్లూరు గ్రామములో కమ్మవారింట జన్మించిరి. నలుగు రన్నదమ్ములలో జ్యేష్ఠులు. వ్రాలుమాత్రము చేయగల చదువుకలదు వ్యవసాయవృత్తి. ఇరువది యెకరముల భూవ్యతికలదు.

వీరు సత్యభావము, ఔదార్యము, సాహసముగలవారు. నిరతాన్నప్రదాత.

1922 నుండి 1930 వరకు రేపల్లెతాలూకా అంతయు తిరిగి ఖద్దరుప్రచారం తీవ్రంగా సాగించినవారు. వీరి కుటుంబ మంతయు ఖద్దరుదీక్ష కలవారే.

1930 లో జాతీయోద్యమంలో ప్రవేశించి ఉప్పుసత్యాగ్రహ సందర్భమున కల్లు సారా పికెటింగుచేసిన నేరమునకు గాను అరెస్టు చేయబడి శిక్షనుపొంది, గాంధీ ఇర్విన్ ఒడంబడికచే విడుదల చెందిరి

వీరికి ఖద్దరుద్యమమునందు ప్రత్యేకాభిమానము కలదు. జైలునుండి విడుదల పొందినపిమ్మట కూడ ఖద్దరుప్రచారమే చేయుచు 1944 లో జబ్బుచేసి స్వర్గస్థులైరి.

వీరి కుటుంబము నల్లూరునందే ఉన్నారు.

వసు

బట్టల

## ౧౦౨ పుట్టగుంట రాఘవయ్యచౌదరిగారు

## నల్లూరు

( 1908 – 1936 )

1908 లో జన్మించిరి. కమ్మవారు, వ్యవసాయవృత్తి. నరసింహయ్యగారి సోదరులు. ఖద్దరుప్రచారం చేయుచుండువారు.

మద్యనిషేధ కార్యక్రమములో పని చేసినందుకు 1930 లో ఒక సంవత్సరమున్ను, 1932 లో పదిమాసములున్ను కారాగారవాసము చేసిరి.

విడుదల చెందినపిమ్మట తిరిగి ఖద్దరుప్రచారము చేయుచుండిరి.

1936 లో ఖద్దరుప్రచారమునకై గ్రామాంతరమునకేగి అచ్చటనే అకస్మాత్తుగా మరణించిరి.

వీరి కుటుంబము నల్లూరునందే ఉన్నారు.

## ౧౦౩. చిమట మట్టయ్యగారు

## పాపాయిపాలెం

( 1890 – 1940 )

1890 ప్రాంతములో జన్మించిరి. చదువురాదు గొల్లవారు. స్వంతవ్యవసాయము చేసికొనుచు 1922 సం॥ రపు

సత్యాగ్రహములో పుల్లరిచెల్లించని నేరమునకు నరసరావుపేట స్టేషనరీ సబుమేజస్ట్రేటువలన ఆరునెలలు కఠినశిక్ష విధింపబడి అనుభవించిరి.

1940 ప్రాంతములో చలిజ్వరమువలన మరణించిరి. సామాన్య స్థితిగతులుగల కుటుంబము.

## ౧౦౪. పుణ్యాల పేరయ్యగారు

## పాపాయిపాలెం

(1870 – 1935)

1870 ప్రాంతములో జన్మించిరి. రెడ్డికులస్థులు. భూస్థితి కలవారు, అమాయకులు, ఏజాతివారు వచ్చినను భోజనము సంతోషముగ పెట్టువారు.

1922 సత్యాగ్రహములో పుల్లరిచెల్లించని నేరమునకు 6 నెలలు కఠినశిక్ష అనుభవించిరి. పైగా అదనపుపోలీసు పన్ను రు 20/- లు కూడ చెల్లించిరి.

1925 ప్రాంతములో వృద్ధాప్యమునందు కాలధర్మము

## ౧౦౫. యనమదల అప్పయ్యగారు
## వెల్లేరు శివారు తూర్పుపాలెం

( 1886 – 1938 )

వీరు 1886 లో కమ్మ కుటుంబములో జన్మించిరి. వ్యవసాయమువృత్తి. సామాన్యస్థితి నిత్యఖద్దరుధారి. మద్య నిషేధప్రచారమన్న నెక్కువఅభిమానము.

1930 లో ఉప్పుసత్యాగ్రహములో పాల్గొని 6 మాసములు కారాగారవాస శిక్ష అనుభవించిరి. రాయవేలూరు, ఆలిపూరు జైళ్ళలో నుండిరి వీరిభార్యకూడ వీరితోబాటు జైలుశిక్ష అనుభవించెను.

1938 లో వీరుక్షయచే మరణించిరి.

## ౧౦౬. యార్లగడ్డ రామకృష్ణచౌదరిగారు
## నల్లూరు

( 1904 – 1943 )

1904 లో జననం. కమ్మవారు వ్యవసాయం ప్రధాన వృత్తి ప్రాథమికవిద్యను చదివిరి.

కాంగ్రెసుప్రచారకులు. 1932లో కాంగ్రెసుశిబిరమునకై ప్రదేశము నిచ్చి, శిబిరస్థాపకులై కాంగ్రెసు సేవకులకు అన్న పానీయములిచ్చి ఈతాలూకాకు ముఖ్యకేంద్రముగా ఆశిబిర మును నడపిరి. కాంగ్రెసుప్రచారకుల కనేకవిధముల సాయ పడు చుండెడివారు

కాంగ్రెసువారికన్నము పెట్టిన నేరమునకై ఆరు మాసములు కారాగారవాసశిక్షను రాజమండ్రిజైలులో అనుభ వించిరి.

1943 లో జబ్బుచేసి మరణించిరి.

కుటుంబము నల్లూరునందే ఉన్నారు. రెండు మూడు యకరములభూమి మాత్రమే మిగిలిఉన్నది. సుమారు పది యెకరములవరకు ఆస్తిని కోల్పోయినారు.

# ౧౦౭. మద్ది రాధాకృష్ణయ్యగారు - బాపట్ల

( 1890 – 1926 )

ఈయున స్వస్థలంబ్రాహ్మణకోడూరు, బాపట్లతాలూకా సుప్రసిద్ధ ఆర్యవైశ్య కుటుంబంలో 1890 సం॥ రంలో సుద ర్శన లక్ష్మిదేవమ్మగార్లకు జన్మించారు.

1910 సం॥ రం లో వ్యాపారము నిమిత్తము గుంటూరు వచ్చిరి. అక్కడ ఆంధ్రోద్యమ ప్రవర్తకులైన జొన్నవిత్తుల గురునాథంగారితో కలిసి స్వరాజ్యోద్యమంలోకి ప్రవేశించారు. 1912 సం॥ రంలో ఆంధ్ర, ఇంగ్లీషు వార పత్రికకు రాధా కృష్ణయ్యగారు సహాయము చేయుటచే దానికి రాధాప్రెస్ అని పేరు వచ్చినది ఈయన మెట్రిక్యులేషన్ పరీక్షను వ్యాసుచేసినా ఇంగ్లీషులో వ్యాసాలువ్రాసె అలవాటుండేదిది 1913 సం॥రంలో జరిగిన ఆంధ్రసభలో పాల్గొన్న వారిలో వీరొకరు

1918 సం॥ రంలో శ్రీరం వెంకటసుబ్బారావునాయుడు రాధాకృష్ణయ్యగార్లు నవీన పద్ధతులపైని ఈజిప్టు మున్నగు విదేశాలతో ప్రధానంగా ప్రత్తివ్యాపారంచేసి గొప్ప కీర్తిని సంపాదించారు ప్రాచ్యదేశాలలో మొదట ఇండియా పుగాకును ప్రవేశ పెట్టినవారిలో ప్రథములు వీరే

1919 సం॥ రంలో వ్యాపారం అభివృద్ధికాగా ప్రభుత్వపు విధానం (Excnange Policy) వల్ల ధరలుతగ్గి హఠాత్తుగా అరువదివేల రూపాయిలు నష్టం వచ్చాయి. అప్పుడే గాంధీగారి అవతరణ, స్వదేశబోధలు ప్రచారంలోకి వచ్చినవి. ఇవన్నీ రాధాకృష్ణయ్యగారి జీవితంలో ఒక మార్పును కలుగజేశాయి. వెంటనే వ్యాపారం కట్టివేసి తనభార్యా బిడ్డలతో సహా లేచిపోయి సహాయనిరాకరణోద్యమములో చేరిరి ఒక బ్రాహ్మణస్నేహితుని పంచనుండి, భార్యాబిడ్డలను పుట్టింటికి పంపేశారు. బంధువులెన్ని విధాల సహాయము

చేస్తామని ప్రాకులాడినా వ్యాపారంమాట తలపెట్టలేదు. 1921 1926 వరకు గొ. సీతారామశాస్త్రిగారికి కుడిభుజంగా వుండి కాంగ్రెస్ సేవ చేసెను. జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా జైలుకు వెళ్లువరకు పనిచేశారు. 1921 సం॥ రం లో 1 సంవత్సరం పాటు రాజమండ్రి - కడలూరు జైళ్ళ నుండిరి జైలులో కూడా గాంధీ సిద్ధాంతముల ప్రకారం అన్ని పాటులుపడి శల్యముల పుంజమై బహిర్గతమైనారు

డిసంబరు 1926 లో మరణించిరి. వీరున్నూ నీరం సుబ్బయ్యగారు కృష్ణార్జునులవలె Home rule movement లో పనిచేసిరి.

టైఫాయిడుజ్వరంవల్ల వీరుమరణించగా వీరిఊరేగింపులో అనేకులు పాల్గొన్నారు. వీరి స్మారకచిహ్నన్ని నెలకొల్పుటకు ప్రయత్నాలు జరిగినా అవి సఫలము కాలేదు. వీరిఅన్న వెంకట రంగయ్య శ్రీకృష్ణాశ్రమంలో రాధాకృష్ణహాలు అని ఒకటి స్వంతడబ్బుపైని నిర్మించారు శ్రీధక్కరుబాపా వెంకట ప్పయ్య పంతులుగారి అధ్యక్షతల క్రింద యీ హాలు తెరువబడెను. శ్రీ రాధాకృష్ణయ్యగారి పిల్లల విద్యా వివాహాదులు రంగయ్యగారే నిర్వహించారు. ఈయన ధనవంతుడై యున్నపుడు మహాభోగి. బీదదశలో నిశ్చింతతో కాలము గడిపిన ధీరుడు. దేశీయఉద్యమాలలో వీరికి గొప్ప ఆవేశం వుండేది

# గారా. డాక్టర్ చంద్రమౌళి రామారావుగారు
## L M P బాపట్ల

( 1901 – 25 - 3 - 1943 )

వీరి స్వస్థలం బాపట్ల. చంద్రమౌళి వెంకటప్పయ్య బుచ్చెమ్మ గార్లకు 1901 సం॥ర-లో జన్మించారు. వీరు ఖద్దరు వ్రతధారులు. దేశోపకారపారీణులు. 1928 సం॥రంలో వైద్యపరీక్షలో ఉత్తీర్ణులై, 1930 సం॥ రం॥ నుంచి వైద్య వృత్తి నవలంబించారు. 1936 సం॥ రంలో తాలూకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా పనిజేసెను. పిన్మాట పంచాయతీ బోర్డు అధ్యక్షుడుగా పనిచేసెను. శాసనసభలో ఎన్నికలలో నిలువకూడదని, కాంగ్రెసేతరులు వారించినప్పటికీ ఈయన లక్ష్యముచేయలేదు. తుపాను బాధితులకు తనస్వంతసొమ్ము నుండి రూ 300. ల ఖర్చుపెట్టి, ఔషధాలు వగైరాయిచ్చి కాపాడాడు. సాంఘిక సేవాపరాయణుడు. కుష్ఠురోగుల ఆస్పత్రిలో ఒక సంవత్సరంపాటు గౌరవవైద్యుడుగా పనిజేశారు. వీరికి గవర్నమెంటువారు నౌఖరీయిస్తామని చెబితే నిరాకరించారు. ఏడుగురన్నదమ్ములలో వీరు ఆఖరివారు. సంతానములేదు.

1930 సం॥ రంలో ఉప్పుసత్యాగ్రహం చేసినందుకు 'బి' క్లాసు ఖైదీగా వేలూరు కారాగారములో ఆరుమాసాలు

కఠినశిక్ష ననుభవించారు. స్త్రీ సేవాదళాని కాశ్రయంయిచ్చి నందులకు వారిపైని నేరము మోపబడినది. ఆఖరురోజులలో ఉన్మాదావస్థచే, బాధపడి 25—2—43 తేదీని మరణించారు —

---

## ౧౦౯. చల్లపల్లి లక్ష్మీనారాయణగారు

### జంపన

( 1895 – 1937 )

1895 సం॥ రంలో చల్లపల్లి మల్లయ్యా నరసమ్మ గార్లకు పుత్రుడుగా జన్మించెను. 1921 సం॥ రం నుండి, కాంగ్రెను సేవజేసి గుంటూరులో అరెస్టుకాబడి వదలివేయబడిరి. పన్నులనిరాకిరణ్ణంలో పనిచేసెను —

1930 సం॥ రంలో తాటిగెలలను కొట్టి 2 సంవత్స రాలు శిక్ష ననుభవించెను.

1937 సం॥ రంలో మరణించిరి. తదాదిగ ఈయన భార్య వరలక్ష్మమ్మ నిరాధారమైనది —

---

## ౧౧౦. లంక ఆంజనేయులుగారు

( 1892 – 1924 )

ఈయన 1892 సం॥రంలో జన్మించెను. గవర్నమెంటు ఉద్యోగస్తుడుగా పనిచేస్తూ 1921 సం॥రంలో కాంగ్రెస్ లోను

మానేజరు పదవినిన్నీ జిల్లాఖద్దరుబోర్డు మానేజరుగా పని చేయుచున్నను శిక్షింపబడలేదు. ఇతడు నిజమైన దేశసేవకుడు 1924 సం॥ రంలో మరణించెను.

---

## ౧౧౧. అన్నంరాజు వెంకట్రావుగారు
## నాడూరు

1930 లో జైలుకి రెండుసార్లు పోయెను. 6 నెలలు C క్లాసు ఖయిదీగానుండి 1933 లో చనిపోయెను.

## ౧౧౨ కొత్తా చలపతిగారు - ఇటుకంపాడు
(1896 — 11 - 5 - 45)

1896 సం॥రం లో నందూరు శివారు, ఇటుకంపాడు గ్రామములో, కొతా శ్రీరాములు పేరమ్మగార్ల పుత్రుడుగా జన్మించెను

ఈయన ఆంధ్ర క్రిష్టియన్ కాలేజి (గుంటూరు) లో Intermediate వరకు పరీక్ష నిచ్చినపిమ్మట చెన్నపట్టణం క్రిష్టియన్ కాలేజీలో పట్టభద్రులై ఎఫ్—ఎల్ క్లాసు చదువుచూ, గాంధీజీ ఆజ్ఞానుసారం — 1921 సం॥రంలో విద్యకు స్వస్తిజెప్పి ఒంగోలు (National School) జాతీయ పాఠ

శాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసెను. పిమ్మట గుంటూరుజిల్లా కాంగ్రెస్ సంఘంలో పనిచేశారు. గుంటూరులోవుండే ఆంధ్ర ఖద్దరు బాంకిమానేజర్ — A. I. S A ఆంధ్రశాఖ మానేజరుగా 1924 సం॥రం నుండి 1929 వరకు పనిచేసెను.

1930 సం॥ రంలో ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 1 సం॥ రం వేలూరులో 'బి' క్లాసులో కఠినశిక్ష అనుభవించిరి. 1931 లో జబ్బుపడిరి. తరువాత తిరిగి A. I. S. A ఆంధ్రశాఖలో పనిచేశారు. చెన్నపట్నం ఆంధ్రఖాదీనిలయంలో కొన్నాళ్లు పనిచేసిరి. రివిన్యూమంత్రి ప్రకాశంవద్ద కొన్నాళ్లు గుమస్తాగా వుండెను. మదరాస్ Bar Assn. లైబ్రెరీలో కొన్నాళ్లు పనిజేశారు.

1944 సం॥రం రాయలసీమలో కరువు నివారణనిధికి పని చేయుచు డిశంబరులో జబ్బుచేసి, మదరాస్ జనరల్ హాస్పటల్‌లో 11-5-45 లో పరమపదించిరి. ఇతడు గొల్లపూడి సీతారామశాస్త్రిజీ మేనమామ కొడుకుగనుక శాస్త్రిజీ ఇతనిని పెంచి పెద్దగా జేశారు.

## ౧౧౩. గొంది బాలయ్యగారు

( 1910 — 1931 )

1921 సంవత్సరమునుండి కాంగ్రెసుసేవ ఖద్దరుకట్టడం ప్రారంభించి 1930 స.॥రంలో ఉప్పుసత్యాగ్రహం, కాటిగెలలు

కోయుట, మున్నగు కార్యాలుచేస్తూ దొరతనంవారిచే 2 సం॥రాలు 'C' క్లాసు ఖైదీగ విధింపబడెను. రాజమండ్రి అలిపూర్ మదరాస్ జైయిల్లలో ప్రవాసంజేస్తూ, సమిష్టి విడుదలలో బైటబడెను. ఇతని తండ్రిపేరు కోదండరామయ్య, తల్లిపేరు వెంకమ్మ. వీరు యావన్మందీ కాంగ్రెసు సేవకులే.

## ౧౧౪. రామస్వామిగారు – జంపన

ఇతడు నాగయ్య అన్నెమ్మగార్లకు 1885 ప్రాంతాన జన్మించెను. కాంగ్రెసు సేవ జేసినందుకు (ఉప్పుసత్యాగ్రహం) 1930 లో 6 నెలలు కఠినశిక్షను, రాజమండ్రి ఆలిపూర్ జైల్లలో ననుభవించి, 1935 ప్రాంతంలో చనిపోయెను.

## ౧౧౫. పాలంకిపాటి పద్మనాభ రావుగారు

(1914 – 17-4-44)

వారి జనకతండ్రిపేరు అధరాపురపు కృష్ణరావు. దత్తత తండ్రి శ్రీ పాలంకిపాటి వేంకట్రావుపంతులుగారు పద్మనాభ రావును క్రిష్టియన్ కాలేజిలో ప్రవేశపెట్టారు. అక్కడ Intermediate క్లాసులోచదువుచూజబ్బుచేసి 1929సం॥రంలో విద్యాభ్యాసము మానివేసి ఉప్పుసత్యాగ్రహములో వాల్గొని-

దేవరంపాడు, గుంటూరు, పొన్నూరు శిబిరాలలో పనిజేసి 1930 సం॥రం సెప్టెంబరునెలలో నిర్బంధింపబడి, ఆరుమాసాలు రాజమండ్రి, వేలూరు జైళ్ళలో B. క్లాసుఖైదీగా శిక్ష ననుభవించారు. ఇంతలోవారికి క్షయవ్యాధిసోకగా మదనపల్లిబోయి ఆరోగ్యాశ్రమం (Sanatorium) లో చేరి ఆరోగ్యమును తిరిగి పొందినారు.

1940 సం॥రం డిశంబర్‌లో తిరిగి వ్యాధి మళ్ళినప్పటికే పొన్నూరులో సత్యాగ్రహముచేసి అప్పటి మేజస్ట్రీటువారిచే 6 నెలలు రూ 100/లు జుర్మానా విధింపబడి C క్లాసు ఖైదీగా రాజమండ్రి పంపబడెరు. వ్యాధిముదురుటచే, తిరిగి ఆరోగ్యాశ్రమానికి పంపివుండిరి.

1942 సం॥రంలోని సత్యాగ్రహసమరంలో పాల్గొనెను. గాని నిర్బంధింపబడలేదు. ఇతనికి శేషగిరిరావు అను సోదరుడునూ ఇద్దరు కొమార్తెలు, ఇద్దరు కొడుకులు వున్నారు. శ్రీ శేషగిరిరావు బీదవిద్యార్థులకు ఆర్థికసహాయంచేస్తూ అన్నగారిపేరిట (Padmanabha Rao Memorial Hospital) పద్మనాభరావు స్మృతివైద్యాలయం పొన్నూరులో కట్టించివున్నారు ఇదిగాక స్థానిక Salvation Army Maternity Hospital నిర్మాణనిమిత్యార్థం వేయిరూపాయలు ప్రత్యేకంగా కేటాయించిఉంచిరి. S S. L C. పరీక్షలో ప్రథమంలో వుత్తీర్ణులైన విద్యార్థికి సువర్ణపతక బహుమానము నేర్పరిచారు.

శ్రీ పద్మనాభరావుజీ 17-4-1944 లో స్వర్గస్థులయిరి.

## ౧౧౬. కలిదిండి సీతమ్మ గారు

### కావూరు

( 1890 – 1940 )

1930 సం॥రంలో ఉప్పుసత్యాగ్రహంలో వాలంటీరుగా చేరి ఉప్పుచేయుట, పికెటింగుచేయుట మున్నగునవి జరిగించి, జూలై 16 తేదిని 6 నెలలు శిక్షపైదును 'C' class పొంది వేలూరునుండి 15-1-1931 సం॥రంలో విడుదల పొందెను. పిమ్మట గృహకృత్యాలు నిర్వహిస్తూ రాట్నమును అహరహము వడుకుచూ, 1940 ప్రాంతంలో మరణించెను.

## ౧౧౭. మాచిరాజు రామమూర్తి గారు

### చందోలు

( 1900 - 11-8-39 )

పిచ్చయ్య లక్ష్మాయమ్మ గార్లకు జన్మించెను. నాల్గవ తరగతి వరకు, చందోలు, బాపట్ల, తెనాలి స్కూళ్ళలో చదివెను. కరిణీకం పరిక్ష ప్యాసయి, కరిణీకంలో 1918 సం॥రంలో ప్రవేశించెను. వెంటనే జాతీయ పద్ధతిపైని గ్రామపాలనా పత్రిక గుంటూరులో నడుపుట మొదలు పెట్టిరి. ఆంధ్రరాష్ట్రం

మొత్తంమీద కరణము లందరిని జమకూర్చుకొని, ఒక సం॥రం పైగా నడిపేటప్పటికి 1920 సం॥ రం ఉద్యమం వచ్చినది. అప్పుడు రామమూర్తి తమ పినతండ్రి కుమారుడైన అప్పా రావు (చందోలు) కలిసి ఉద్యమంలో పనిచేశారు.

1921 సం॥ రం చివర రోజులలో 108 శిక్షను క్రింద 1 సం॥ రం కఠినశిక్షను బడసి రాజమండ్రిలో అనుభవించెను. 1922 సం॥ లో విడుదల అయి, రాజమండ్రి నుండి వచ్చివేసిరి. విడుదల అయి వస్తూంటే త్రోవలో ఏలూరు పౌరులు వీరికి స్వాగత పత్రం సమర్పించారు. ఇటులనే గుంటూరు పురపాలక సంఘమువారు స్వాగతపత్రం అర్పించారు. కరిణీకం నుండి తొలగింపబడెను.

పిమ్మట గుంటూరు ఆంధ్రట్రేడింగ్ కో ను నడింపల్లి నర సింహారావుతో కలిసి 4, 5 సంవత్సరాలు నిర్వహించెను. జబ్బుగా నుండుటచే ఉద్యమంలో తిరిగి పాల్గొనలేదు.

1921 పూర్వమే జిల్లా కాంగ్రెస్ సంఘములో సభ్యు లుగా నుండిరి. తదుపరి ప్రాథమిక సభ్యులుగా నుండిరి. కాంగ్రెస్ గవర్నమెంటు వారి ఆధిపత్యాన 1938 వ నవం బరులో కరిణీకం జేయుచు 1939 లో స్వర్గస్థులైరి

1923 లగాయితు 1938 వరకు గుంటూరులోనే వున్నారు. గుంటూరు అఖిలభారత చరఖాసంఘములో 1924 నుండి 26 వరకు మానేజరుగా పనిచేసెను. శారదానికేతనంలో కొన్నాళ్లు మేనేజరుగా పనిచేశారు.

దాని తరువాత 1930 సం॥రంలో Traders Assn లో నుండి 1934 వరకు తిరిగి కరిణీకముల తెప్పించుటక ప్రయత్నం చేశారు.

---

# ౧౧౫. కుప్పా గోపాలశాస్త్రిగారు

## చివలూరు

( 1898 – 1935 )

ఇతడు 1922 సం॥ రం నుండి కాంగ్రెస్ సేవకుడుగా నుండెను. 1924 - 30 వరకు గుంటూరు కాంగ్రెస్ ఆఫీస్ మానేజరు పదవిని నిర్వహించెను. ఇతడు వైద్యుడుగా కూడా పనిచేసెను. 1930 సం॥ రం సత్యాగ్రహంలో పాల్గొని ఉప్పు చేయడం, తాటిగెలలు కొట్టడం తీవ్రంగా పనిచేసి 1 సం॥ రం కఠినశిక్షను బొందినాడు. 1935 ప్రాంతంలో మరణించెను.

---

# ౧౧౬. రామినేని అప్పయ్యగారు

## బ్రాహ్మణ కోడూరు

( 1882 – 1935 )

బాపట్లతాలూకా బ్రాహ్మణకోడూరు గ్రామములో 1882 సం॥ రంలో జన్మించిరి. తండ్రిపేరు కృష్ణయ్య. వారికి

గ్రామములో చాలా పలుకుబడిగలదు. ఆనాడు గ్రామములో పార్టీలు ఉండెవి. ఈయన ఆ కక్షలను నివారణజేసి గ్రామమును చక్కబరచెను. శాసనసభ బహిష్కారం, పన్నుల నిరాకిరణ సందర్భములో ఆగ్రామమునుండి పన్నులను ఓట్లను యివ్వకుండా జేసిరి

శ్రీ అప్పయ్య ప్రాథమికవిద్యను బూర్తిజేసి, వ్యవసాయ వర్తకాదులను చేస్తూ, గ్రామపెద్దగా ఉండి పలుకుబడి సంపాదించెను. ఊరివారంతా వీరిమాటను శిరసా వహించేవారు. మామగారి అనంతరం, తోటపాలెం గ్రామమునసబు పనిని వీరు నిర్వహించివుండిరి తాలూకామునసబు లందరిలోనూ, ప్రముఖుడుగానుండి ఉద్యోగస్థుల మన్ననల నందినాడు. 1921 సం॥రంలో కాంగ్రెసులో పనిచేసెను. నాగపూరు Flag Satyagraha కు వెళ్ళివచ్చిన తర్వాత యీ జిల్లాలో శ్రీ స్వామి సీతారాంజీ శిష్యుడుగానుండి వారి చెప్పుచేతలలో మెలగుతూ వుండెను. వర్ణ-జాతి వివక్షత లేమీ లేకుండెను.

1930 సం॥రం లో జైలుకువెళ్ళి 1 సం॥రం పాటు శిక్షననుభవించి ఇతరఖయిదీలతోపాటు విడుదలను పొందివుండిరి.

1932 సం॥రం లో గుంటూరులో జరిగిన రాష్ట్రసభలో విషయాలను రహస్యముగా వుంచిరి. 144 శెక్షను నుల్లంఘిస్తూ జరిగిన Reception Commitee (ఆహ్వానసంఘం) అధ్య

ఖ్యులుగానుండిరి. దానికై 6 మాసాలు శిక్షనుపొందిరి. సభ జరుగుతూ వుండగా పోలీసువారువచ్చి వీరిని నిర్బంధించిరి.

1933 సం॥ర ప్రథమంలో అఖిలభారత దంపుడు బియ్యం సంఘ స్థాపనకు వీరే కారకులయ్యి దాని మానేజరుగా నుండిరి. బియ్యమును పల్లెటూళ్ళనుండి తెచ్చి గుంటూరులో అమ్ముచుండెవారు.

1935 సం॥ రంలో బ్రాహ్మణ కోడూరుగ్రామములో ₹ 250 లు దానంచేసి దానిలో గాంధీజి శిలాప్రతిమను ప్రతిష్ఠించిరి ఆసంవత్సరమే జబ్బుచేసి, కొంతకాలం విజయాశ్రమములోను, కొంతకాలం తెనాలిలోను ఔషధముతీసుకొని 1935 సం॥ రంలో స్వర్గస్థులైరి. ఆమరణాంతము తగవులకై పోకుండ వివాదాలను పరిష్కారముచేయుచుండెడి న్యాయ ప్రవర్తకుడు. 1915 సం॥ రంలో స్వగ్రామంలో ప్రాథమిక పాఠశాలను పెట్టించిరి. 1922 సం॥ రంలో దానినే జాతీయ సంస్థగామార్చివేసి, ప్రభుత్వంవారి ప్రాపకాన్ని రద్దుచేయించిరి. పిమ్మట చేతి పరిశ్రమలను, నవారుచేయుట, నూలువడకుట, చాపలల్లుట, కుట్టుపని మున్నగునవి చేయించి, పాఠశాలా భవనము కట్టుట కహోరాత్రులు కష్టించిరి.

---

# ౧౨౦. గంధం నాగేశ్వరరావుగారు

## పుసులూరు

పుట్టినది బ్రాహ్మణవంశము. చేసినది గ్రామకరణీకం. 100 యకరాల మాగాణికి కామందు. తలిదండ్రుల కేకైక పుత్రుడు. అసహాయోద్యమ సందర్భంలో కరణీకానికి తిలాంజలి యిచ్చాడు. చెరుకువాడ వెంకట నరసింహంగారికి శిష్యతుల్యుడు. పాకశాసనుడు. ఇతనిపైని జామీను శెక్షన్ క్రింద మొదటి కేసు పెట్టగా, గ్రామస్థులు జామీనియ్యవలసినదని ప్రోద్బలం చేశారు. అంతట జామీనియ్యగా, తండ్రి కుపితుడై 'ఆహవరంగంలో పురుషునికి విజయమో మరణమో' తప్ప మూడోదారి లేదని శాసించెనట జామీను రద్దుచేయించు కొని మా 11 – 20 రోజుల జైలుశిక్ష ననుభవించెను. పెద నందిపాడు ఫిర్కా గ్రామోద్యోగులు సభజేసి, ఉద్యోగాలకు రాజీనామా యిచ్చే సందర్భా న్నాలోచిస్తున్నపు డీయన తండ్రి ఈయనచే రాజీనామా నిప్పించి దస్త్రమును పార వేయించెనట.

మనిషి మంచి ఔదార్యస్వభావుడు. ఆత్మపరీక్ష జేసు కొనుచు వెనుకముందు లాలోచించుకొనే ధీశాలి. ఈయన జైలులో నుండగా 8 ఏండ్ల గారాబుపట్టి మరణించెను. పరి క్రోధరా కంటకములమధ్య పుత్రుని ధర్మమార్గాన్న ప్రవర్తింప

జేసే ఇట్టి పితృదేవో త్తముడు ధన్యుడు. తండ్రియాజ్ఞను శిరసా వహించి దుఃఖపరంపరల నెదుర్కొని తన విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చిన యీ వీరపుత్రుడు ధన్యుడు.

## ౧౨౧. అరుమండ్ల ఉషాదేవిగారు - తెనాలి

( – 1946 )

1937 సం॥రంలో కూచిపూడి గ్రామ మహిళాసంఘ స్థాపనకాగా ఈమె దానికి కార్యదర్శిని అయినది. ఆ సంఘాభివృద్ధికై ఈమె పలువిధముల సేవజేసినది. ఆ సేవాఫలితమే తర్వాత తెనాలి తాలూకా మహిళాసంఘానికి కూడా ఈమెను కార్యదర్శినిగా ఎన్నికోవడం, ఆకాలంలోనే, ఈమె కృషిచే తెనాలి తాలూకా మహిళాసంఘం విప్లవాత్మకమైన విడాకులచట్టం సమ్మతిస్తూ తీర్మానింపజేసి పూర్వాచార పరాయణమైన లోకాన్ని హడల గొట్టింది.

1941 సం॥రంలో వ్యక్తి సత్యాగ్రహంలో కూడా పాల్గొన్నది. 1942 లో తెనాలి సబుకోర్టును పికెటింగు జేసి నందులకు ఈమెను పట్టుకొని 1½ సంవత్సరాలు శిక్షించి వేలూరు జైలులో వుంచారు. జైలు విముక్తమైన తర్వాత, ఆర్యసమాజంలో చేరి, ఒక సంఘాన్ని ఏర్పరచి, కృషి చేసింది.

1945 సం. ఎన్నికలు ప్రచారం తీవ్రంగా జేసింది. చేబ్రోలు సాహిత్యశిబిరంలో శిక్షణ పొందినది. హిందీలో కృషిచేసి, రాష్ట్రవిశారద పరీక్షకు మకరాసుపోగా జబ్బుచేసి అప్పుడు చనిపోయెను.

## ౧౨౨. అబ్బరాజు జానకీరామయ్యగారు

### పాంచాలిపురం

( 1910 – 30 - 6 - 1944 )

బ్రాహ్మణులు. శ్రీ అబ్బరాజు శివరామయ్యకు 1910 సం॥ంలో జన్మించెను

విజయనగరంలో ఉభయభాషా ప్రవీణకోర్సుకి ప్రిలిమినరీ చదివి కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠములో ఉత్తీర్ణులయ్యారు.

1930 సం॥రంలో అంగలకుదురులో తాటిచెట్లు కోయించినందుకు 6 మాసాలు బోర్స్టలు స్కూలుకు పంపబడిరి. పిమ్మట తెనాలి హైస్కూలు తెలుగు అధ్యాపకులుగా పని చేసి మంచి కీర్తిని సంపాదించారు. ఈయన గాంధిశతకమును పరిపూర్ణంగా రచించెను.

1944 సం॥రం జూన్ 30 తేదీని ఉబ్బసవ్యాధిచే బాధిస్తూ మద్రాసులోని తాంబరం ఆసుపత్రిలో మరణించెను.

# ౧౨౩. కపియాల పనాదయ్యగారు

## కత్తిపాడు

( – 11 - 2 - 43 )

1936 సం॥లో కాంగ్రెసుటిక్కెట్టుపైని బోర్డుమెంబరయ్యెను. అదివరకు కాంగ్రెసు సానుభూతిపరుడు. అప్పటి నుండీ తాలూకా కాంగ్రెసుకు అండగాఉండేవాడు. 24 ఎకరముల సేద్యముండెను.

1941 సం॥రంలో యుద్ధఫండుకు ఒక్కకానీ కూడా యివ్వకుండా ఎదిరించినిలబడ్డ ధీరుడు.

1943 సం॥రంలో ఫిబ్రవరి 11 తేది సాయంత్రం గం 4 కు అరెష్టుగాబడి ఒంగోలు పోలీసు స్టేషన్‌కు తీసుకొనిపోబడెను. ఉదయం గం 6 కు ఒంగోలుకు 10 మైళ్ళ దూరములోనున్న వెలగపల్లిగ్రామందగ్గిర బావిలోపడి ఆత్మహత్య చేసుకొనెను. సంతానంలేదు.

# ౧౨౪. తూములూరి వెంకటసుబ్బారావుగారు

## పిడపాడు

( 1901 – 1940 )

శ్రీ తూములూరి లక్ష్మయ్య కొడుకు. 1920 సం॥రంనుండి కాంగ్రెస్ ప్రచారకుడు. స్కూలుఫైనలు వరకు చదివెను.

1921-22 లో గుంటూరుకు Civil Disobedience committee వచ్చినప్పుడు గుంటూరులో 144 సెక్షను క్రింద శిక్షింపబడెను. అప్పటి (వాలంటర్ల) స్వచ్ఛంద సేవాదళంలో అధికారధిక్కారంచేసినవారిలో నకడియన. 1925-26 సం॥రంలో కిల్లుపాటలు పికిటింగుచేసినందుకు శిక్షనుబొంది జుల్మానావేయబడెను.

1930 సం॥రం సత్యాగ్రహంలో ఉప్పుచేసి 6 నెలలు 'C' క్లాసు తిరుచునాపల్లి జైలులో అనుభవించెను. ఇతడు పట్టణ కాంగ్రెస్ కమిటీసభ్యుడుగాను, తెనాలిపట్టణ పారిశుధ్య సంఘ సభ్యుడుగాను పనిజేసెను. 1940 సం॥లో పక్షవాతముచే బాధపడి చనిపోయెను.

## ౧౨౫. కొమ్మూరి రామలింగంగారు

### తెనాలి

( 1910 – 1940 )

ఈయన కొమ్మూరి గురవయ్యగారికి 1910 సం॥రంలో జన్మించెను. కులంవైశ్యులు. 1930లో సత్యాగ్రహులకు అన్నము పెట్టినందులకుగాను 1 సం॥ రం 'C' క్లాసు శిక్షను అల్లిపూరు క్యాంపుజైలులో అనుభవించెను. 1940 సం॥రంలో పరమపదించిరి.

## ౧౨౬. పిన్నమనేని కనకయ్యగారు

### పోలుకొండ

1942 సం॥రంలో రైలుపట్టాలు తొలగించిన నేరము క్రిందను 1 సం॥రం శిక్షవిధింపబడి 'C'క్లాసు ఖైదీగాపంపబడెను, అచ్చటనే జబ్బుచేసి మరణించెను.

## ౧౨౭. గోళ్ళమూడి వెంకటప్పయ్యగారు

### వడ్లమూడి

( 1883 – 1945 )

జన్మ 1883 సం॥రం ప్రాంతం. గోళ్ళమూడి కోటయ్య లక్ష్మమ్మగార్ల కుద్భవించెను. ఇతని వృత్తి పురాణములు చెప్పుట, వ్యవసాయం చేయుట.

1932 సం॥రంకు పూర్వమే కాంగ్రెసువాదిగా నుండెను. ఈ సం॥ రంలో ఈయన గుంటూరుసీమలో పికెటింగు చేసి ఆరు మాసాలు C క్లాసు ఖయిదీగా రాజమండ్రిలో వుంచబడెను. పిమ్మట కాంగ్రెసు ప్రచారం చేసెను. 1941 సం॥ రంలో-

వ్యక్తిసత్యాగ్రహమును జేసెను. కాని నిర్బంధింపబడలేదు. గ్రామపర్యటనంచేసి కాంగ్రెసు ఉద్యమప్రచారం జేసెను. 1944 జనవరి స్వాతంత్ర్యదినోత్సవ సందర్భములో మద్రాసులో అరెష్టయి మరల 6 మాసాలు C క్లాసు ఖయిదీగా ఆలీపురం జైలులో వుంచబడెను. దేహ అస్వస్థతచే తిరిగివచ్చి 1935 సం॥ రంలో మరణించిరి. వారి సోదరునికొడుకు, కోడలు కూడ కాంగ్రెస్‌భక్తులై జైలునకు పోయివుండిరి.

## ౧౨౫. షేకు చంగీషాగారు
## అమనబ్రోలు

ఈయన 1938 సం॥ రం నుండీ కాంగ్రెసు సేవకుడుగా పనిజేసెను. 1931 సం॥ రంలో వ్యక్తిసత్యాగ్రహంలో నాల్గు నెలలు శిక్షపడి రాజమండ్రీలో నుండెను

1942 సం॥ రంలో కనపర్తి ఉప్పుకొటార్లవద్ద దాడిని జరిపి అరెష్టయి 20 రోజు లుండి విడుదలను బొందెను.

1945 సం॥ రంలో జబ్బుచేసి మరణించెను.

ఇతరవృత్తి గుఱ్ఱపుబండిని తోలుట. ఎన్నికల ప్రచారములో చాలా ఖచ్చితంగా పనిచేసెను. చనిపోయే టప్పటికి వయస్సు 60 సం॥ అల్లుడు కొడుకులు - పెదకుటుంబం. జిల్లా బోర్డువారే గుఱ్ఱపుబండిని కొనియిచ్చారు.

## ౧౨౯. మర్లపాటి అయ్యావారప్పగారు
## తుర్లపాడు
## ( 1887 – 1942 )

కులం విశ్వబ్రాహ్మణులు. 1887 సం॥ రం ప్రాంతమున తుర్లపాడులో జన్మించెను. 1937 సం॥రం ఇతడు క్రొత్త పట్నం - వేసంగి పాఠశాలలో విద్యార్థిగానుండి దెబ్బలు తినెను అంతకుపూర్వమే కాంగ్రెసు సేవకుడు. 1924 నుండి కాంగ్రెసు సభ్యుడుగా పనిజేసెను. 1941 సం॥రంలో వ్యక్తి సత్యాగ్రహములో 3 నెలలు C క్లాసు శిక్షను రాజమండ్రిలో అనుభవించెను. సామాన్యవిద్య. కులవృత్తిలేదు. కాంగ్రెసు పనిలోనె సతతము కాలక్షేపము జేసెను. బ్రహ్మచారి. ప్రచారముకొరకు నిద్రాహారములను సైతము త్యజించెను. 1942 సం రంలో క్షయవ్యాధిచే మరణించెను.

# ౧౩౦. గుత్తా సుందరమ్మగారు
# గుత్తావారిపాలెం

( 1904 – 1937 )

ఈమె శ్రీ గుత్తా చలమయ్యా అనే కాంగ్రెస్ సేవకుని భార్య. తండ్రిపేరు కొత్తపల్లి అచ్చయ్యగారు. 1932 సం॥రంలో కరపత్రాలు పంచిపెట్టినందులకు వెల్లూరు జైలులో 1 సంవత్సరం శిక్షఅనుభవించెను. కాని కామిల జబ్బురాగా కన్ననూరు జైలుకు మార్చిరి అచ్చట ఎక్కువకాగా బాధ్యతాయుతంగా విడుదలనుజేసె ఆరోగ్యం వచ్చిన పిమ్మట తిరిగి శిక్షననుభవించడానికి పూచీకత్తు పుచ్చుకొని విడుదల జేశారు. ఆమెయు తిరిగి చేర్చుకొనేటందుకు హామీ యిమ్మని కోరినది. 1937 సం॥ రంలో ఈమె చనిపోయెను వయస్సు 33 సంవత్సరములు.

# ౧౩౧. తుమ్మల తులశమ్మగారు - కావూరు

( 1912 )

ఈమె నాగళ్ల మేళయ్యా వరలక్ష్మిగార్ల పుత్రికగా జన్మించి 10-12 ఏండ్ల వయసులో ప్రాథమిక విద్యను అభ్యసించెను. శ్రీ తుమ్మల అప్పారావును వివాహమాడి,

భర్తతోను, అత్తగారైన చంద్రమ్మతోను కలిసి ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని కారాగృహవాసం చేసెను.

ఈమె 1932 సం॥ రంలో బాపట్ల కోర్టు పికెటింగు చేసెను. అప్పుడామెను నిర్బంధించి సబుజైలులో పెట్టి విడుదల జేశారు. పిమ్మట రేపల్లెలో కూడా అలాగే జేశారు. చివరకు మేనెలలో అరెస్టుచేసి ఆరు నెలలు 'C' క్లాసు కఠిన శిక్షను విధించి వేలూరు జైలులో పెట్టిరి. ఆమె గుండె జబ్బుతో నీరుబట్టి బలహీన మయ్యేను. 1932 డిశెంబరు నెలలో ఆయాసము హెచ్చి పరమపదించిన వీరవనిత యీమె. ఈమె సోదరుడు రామకోటయ్య కూడా సత్యాగ్రహ సమర వీరుడే. గనుక పుట్టినింటను, మెట్టినింటనూ అందరు కాంగ్రెస్ సేవను జేసి తరించారు.

# ౧౩౭. ఓరుగంటి మహాలక్ష్మమ్మ గారు
## నెల్లూరు

ఈమె నెల్లూరుజిల్లాలో సుప్రసిద్ధ బ్రాహ్మణులగు తూములూరి శివరామయ్యగారి పుత్రిక. ఈమె సోదరుడు శ్రీశివరామయ్యగారు నెల్లూరులో సుప్రసిద్ధన్యాయవాది ఈమె 1895 సం॥ రంలో న్యాయవాది శ్రీ ఓరుగంటి లక్ష్మీనారాయణగారి కుమారుడు వెంకటసుబ్బయ్యను వివాహ మాడెను. చిన్ననాటనే ఈమె ధైర్యసాహసములను, దేశభక్తిని ప్రకటించెను తాను త్రికరణశుద్ధిగా నమ్మిన సిద్ధాంతములను ఆచరణయందుంచుటలో మిక్కిలి పట్టుదల, ఉత్సాహముల ప్రకటించు చుండెను. పిమ్మట భర్తతో కలిసి జాతీయోద్యమంలో పాల్గొనుచు ప్రజాక్షేమమునకు పాటుపడుచుండెను.

శ్రీ వెంకటసుబ్బయ్యగారిచే కావలిలో నెలకొల్పబడిన అన్నదానసమాజము విషయమీమె అమితశ్రద్ధవహించుచు, తానే ప్రతివారము స్వయముగ అన్నమునువండి బీదల కన్నదానము చేయుచుండెను.

1910 సం॥ రంలో కావలిలో మహిళాసమాజమును నెలకొల్పి ఆసమాజమునకు కార్యదర్శినిగా పనిచేసెను.

ఈమె గొప్ప సంస్కరణాభిలాషిణి.

1914-15 సం॥ రంలో కావలిలో స్త్రీ పునర్వివాహ విషయంలో పుష్పగిరి స్వామిజీగారి ఆంక్షలను, సనాతనుల బహిష్కారములకును గురియై ధైర్యముగా ప్రతిఘటించెను.

1921 సం॥ రంలో సహాయనిరాకరణోద్యమ ప్రారంభమున నెల్లూరులో శ్రీ॥ కాంగ్రెస్ సంస్థాపకులలో నొకరుగా నుండెను.

తన కుమారులతోను, కొమార్తెలతోను, వీధులవెంట తిరిగి ఖద్దరు విక్రయించుటలోను, సారాయికొట్టాల పికెటింగులోను, విదేశవస్త్ర బహిష్కరణోద్యమములోను మిక్కిలి శ్రద్ధతో ప్రచారము చేయుచుండెను.

1922 సం॥రంలో కా॥ శ్రీ॥ తిక్కవరపు సుదర్శనమ్మ, కందాడై యతిరాజమ్మగార్లతో కలిసి ఎల్లాయపాలెం, బుచ్చిరెడ్డిపాలెములలో సంచారముచేసి ఖద్దరు వ్యాప్తికి పాటుపడెను.

కస్తూరీదేవి జాతీయ బాలికా పాఠశాల నిర్మాణములో శక్తివంచనలేక పాటుపడెను.

1928 సం॥రంలో కావలిలో బీదల గృహములు దగ్ధమైనపుడు బాధలు సైరించలేక అల్లలాడుచున్నపుడు, ఈమె వారి కన్నవస్త్రాదుల సేకరించుటలో చాల కృషి చేసెను.

1930 సం॥రంలో మైపాడు, గోగులపల్లెలలో ఉప్పుసత్యాగ్రహములో పాల్గొనెను. ఈ సందర్భమున నేగాక, కల్లంగడులను పికెటింగు చేయుటచే ఆరుమాసములు కారాగారశిక్ష ననుభవించెను.

1931 - 32 లో విదేశవస్త్ర బహిష్కరణోద్యమము పికెటింగ్ నకు వేయిరూపాయిలు జరిమానా 6 మాసాలు శిక్షకు పాత్రురాలయ్యెను. ఆమెతోకూడ ఆమె పుత్రు

లిద్దారు — వెంకటేశ్వరశర్మ రామచంద్రయ్యగార్లు కూడ శిష్యపాత్రులైరి.

1932 సం॥రంలోనే నరములజబ్బు, కారాగృహములో నుండగా కనుపించి క్రమముగానది పక్షవాతముగ బరిణమించెను.

1942 సం॥రంలో తనభర్తను డిటెన్యూగ కొనిపోవుటచేతను, కొమరుడు మృతిచెందుటచేతను ఆమెకు జబ్బు యెక్కువై కొంత కాలమునకు మతిచెడెను.

ఈమె సుగుణవిశేషముచే సంపూర్ణ ధర్మపత్నీత్వమును నిర్వహించిన శీలవతి. ఐశ్వర్యమును, ఇహాలోక సౌఖ్యమును బాటింపక, అర్ధశతాబ్దంనుండి దేశసేవ, సంఘసేవ జేయుచున్న సుబ్బయ్యగారికి అన్నివిధముల ఈపె తోడ్పడినది. సంఘసేవలో సంఘబహిష్కారమును దేశసేవలో జైలు ప్రాప్తిని భర్తతోకూడ నీపె అనుభవించెను. భర్తయు, కుమారుడును కోరినవిధముగ, బంధువులకు జడియక, యథావిధిగ, శాస్త్రోద్దిష్టముగ వితంతూద్వాహం జేసుకొనుటకు తన పుత్రుడైన వెంకటేశ్వర్లున కనుమతి నిచ్చెను. కాని కొంతకాలమున కతడు మృతిజెందెను. కీర్తిప్రతిష్ఠ లార్జించిన భర్త, పండితప్రకాండులైన కుమార రత్నములు సల్గురు. వీరి సాహచర్యముచే ఈపె జీవితమును యథేచ్ఛగ జరుపుకొన్నను — తుదకు విహ్వాలయై — తన 60 వ యేట ఈ భౌతిక శరీరము త్యజించెను.

క డ ప జి ల్లా

## ౧౩౩. బాణా కంబగిరి రెడ్డిగారు

జు మ్మలమడుగు తా॥ సాలెవారి ఉప్పలపాడు

(1882 – 194?)

గౌరవకుటుంబికులు భార్యాభర్త లిర్వురు కలసి ధైర్యముగా దేశస్వాతంత్ర్య సమరములో పాల్గొని పనిచేసిరి. 1942 సం॥ రం ఆగష్టు ఉద్యమములో కూడా పాల్గొనిరి. ఈఉద్యమములో కారాగారశిక్ష ననుభవించుచు విడుదలవైన పిమ్మట రెడ్డిగారు క్షయబాధా పీడితుడై కొంతకాలమునకు స్వర్గస్థు డయ్యెను. అప్పటి వీరి వయస్సు 60 సంవత్సరములు. భర్తతోపాటు వీరోచితముగా, భారతసంప్రదాయాన్ననుసరించి స్వరాజ్య సంపాదన సమరములో పాల్గొన్న శ్రీమతి బయ్యమ్మ యిప్పటికీ శక్తివంచన లేకుండా సంఘసేవ జేయుచున్నది.

## ౧౩౪. ఆరవేటి సుబ్బరాయడుగారు

ముద్దనూరు

( 1907 – 1942 )

వైశ్యులు బాల్యావస్థ నుండియూ, ఆసక్తి వుండుటచే కాంగ్రెసు ఉద్యమానికి దోహదమిచ్చెను. ఇతడు వ్యక్తి

సత్యాగ్రహములో పాల్గొని శైదు ననుభవించెను. 1942 సం॥ రం ఆగష్టు వుద్యమంలో జేరి శక్తివంచనలేక పాటుబడి పనిజేసి చిన్నవయసునందనే కాలధర్మము నొందెను.

## ౧౩౫. రేకూరు సుబ్బారావుగారు

## సున్నపురాళ్ళపల్లి

బ్రాహ్మణులు. కాంగ్రెసు సేవాతత్పరులు. తాలూకా కాంగ్రెసు సంఘములో ప్రముఖపాత్రను వహించి, సత్యాగ్రహోద్యమములో తాలూకాలోని జాతీయవాదు లందరికీ, మార్గదర్శిగా పనిజేసెను. తన కుటుంబము నంతటినీ జాతీయ రంగములో ఉరకడానికి ప్రోత్సహించి, కొంతవరకు సఫలీకృతు డయ్యెను.

( తెలంగాణ )

# ౧౩౬. కీలుకాని వెంకటనారాయణగారు

## సిరికొండ

( 1918 – 1947 )

1918 సం॥ రంలో సిరికొండ గ్రామంలో తెలగాకుటుంబ ములో నల్గురు సోదరులలో జ్యేష్ఠులుగా పుట్టెను. ప్రాథమిక విద్యవరకు అభ్యసించెను. వ్యవసాయపరుడు, కష్టజీవి. కుటుం బము మధ్యతరగతికి చెందినది.

కార్యప్రతిఫలాపేక్షరహితుడు. నిరాడంబరుడు. దీక్షా బద్ధుడు. సాహసి. జనితలక్ష్యము పరమావధిగా గలవాడు. జాతీయఅభిమాని. ప్రాంతీయ కాంగ్రెస్ సంఘములో గ్రామ కమిటీ ప్రతినిధిగావుండి చాలకాలముపనిజేసెను. ఖద్దరుధారి. శ్రమశిక్షణకు యెక్కువ ప్రాధాన్యమిచ్చెను.

ఆగష్టు 15,1947 నాడి స్టేటుకాంగ్రెస్ ప్రారంభించిన సమరములో ఈయన ముందంజవేసి, కార్యకర్తగా పనిజేసెను.

1947 సం॥రంలో నైజాంలోని రజాకార్ దళదుండగీడులు యితనిఆస్తిని స్వాధీనంజేసుకొనిరి. 10 మాసములు మాత్రం ప్రజాపోరాటంలో అజ్ఞాతంగా పనిజేసి, ఆఖరు రోజులలో అనంతగిరి గుట్టలమధ్యను నైజాంమిలిటరీకి, వీరి సాయుధదళా

ఎకి జరిగిన పోరాటములో గుండు దెబ్బ కాహుతియై వీరమర ణము నొందెను. ఇతనిశవం మునగాలపరగణా, రేపాల గ్రామంలో దహనము చేయబడెను. ఇతని కుటుంబమంతా పెరికొండలోనే ఉన్నారు.

## ౧౩౭. కొల్లూరు బాలకృష్ణయ్యగారు ఇప్పగూడెం

( 1914 – 27 - 11 - 47 )

1914 సం॥రంలో వైశ్యకులంలో జన్మించెను. ధారాళ మైన ప్రవర్తనము, స్వతంత్రఆలోచనయు గలవాడు ఇతను 1942 సం॥రంలో జాతీయోద్యమములో ప్రవేశించి, వయోజన పాఠశాల, గ్రంథాలయమును నడిపించెను. ప్రజల దైనందిన సమస్యలను తీసుకొని పనిజేసినాడు. స్టేటుకాంగ్రెసు నిషే ధింపబడినపుడు తెలంగాణాఆంధ్రమహాసభలో చాలాచురుకుగా పనిజేసెను. ఆసభలో ఈయన గ్రామసంఘకార్యదర్శిగా 2సంవత్స రాలు పనిజేసి, 1945 సంరంలో తాలూకా ఆంధ్రమహాసభ కార్యదర్శిగా ఎన్నుకోబడెను. కాంగ్రెస్ నిషేధం పోయిన పిమ్మట తాలూకా కాంగ్రెస్ వర్కింగు కమిటీలో జేరెను. చుట్టుపట్ల గ్రామాలలో చాలా పట్టుదలతో జాతీయోద్య మాన్ని నిర్మించాడు.

1947 సం॥ రం లో స్టేటు కాంగ్రెసు ప్రారంభించిన స్వాతంత్ర్యపోరాటములో సెప్టెంబరు 22 తేదీని సత్యాగ్రహము చేసి 23 వ తేదీన అరెస్టు గావింపబడిరి. ఇతనికి 1 సంవత్సరం జైలు శిక్ష జనగాం మేజస్ట్రేటు విధించెను.

హైదరాబాద్, నల్గొండ, నిజమాబాద్, జైళ్ళలో శిక్షను ముగించుకొని 1948 ఆగస్టు ఆఖరువారంలో విడుదల పొందెను.

ఇతడు విడుదల అయిన వెంటనే గాంధీజీ సిద్ధాంతా లను 50 గ్రామాలకు తక్కువకాకుండా ప్రచారము జేసి తాలూకా స్టేటు కాంగ్రెస్ కార్యక్రమాన్ని విజయవంతము జేసెను. 1948 నవంబరు 27 వ తేదీరాత్రి గం 11 లకు కాంగ్రెస్ ఆఫీసులో నిద్రించుచుండగా నల్గురు కమ్యూనిస్టులచేత కాల్చి చంపబడ్డాడు.

## ౧౩౭. బసిరెడ్డి నరసయ్యగారు
## సముద్రాల, జనగాం

( 1919 – 27-11-1948 )

తెలగా వంశస్థుడు 1919 సం॥ రంలో జన్మించి ప్రాథ మిక విద్యను మాత్రం నేర్చెను. చాలా బీద కుటుంబీకుడు.

అ..వా దైవభక్తి గలవాడు. ప్రజలు యితని అనువర్తనమును జూచి మిక్కిల ప్రేమించేవారు రాజకీయాల పేరుచెబితే గడగడలాడె రోజులలో తెలంగాణాలో రామభజన కార్యక్రమమునతో జాతీయోద్యమాన్ని లేవదీసి, యువకులను జేర్చి పది పన్నెండు గ్రామాలలో నిర్మించారు. ప్రజల దైనందిన సమస్యలను తీసుకొని చక్కగా వ్యవహరించేవాడు.

1947 సం॥ రం స్టేటు కాంగ్రెస్ సమరములో సత్యాగ్రహము చేయగా అరెస్టు చేసి ఇతనికి 1 సంవత్సరం శిక్షను విధించిరి. వీరి శిక్షాకాలం నిజామాబాద్ జైలులో అనుభవించుచుండగా 1947 సం॥ రం లో నైజమాబాద్ జైలుపై రజాకార్లు దాడిచేసి హిందువులను హింసింపగా ఇతని చేయియెముక విరిగినది. అనంతరం విడుదల కాబడి తిరిగి కాంగ్రెసు ప్రచారం జేసి ప్రజలలోనూ తిరిగి సత్యాగ్రహాన్ని రేకెత్తింపగా కమ్యూనిస్టులు సహింపలేక యితనిని 27-11-1948 రాత్రి కాల్చి చంపివేసిరి.

## ౧౩౯. రేనికుంట రామిరెడ్డిగారు-రేనికుంట

రెడ్డికులస్థుడు. 1915 లో జన్మించెను. పట్టుదల మనిషి. ప్రాథమికవిద్యను బూర్తిజేసెను.

1947 సం॥ రం నిజాంపోలీసులు—రజాకార్లు దుండగాలు జేస్తూంటే, నవయువకుల నొకసంఘముగా కూర్చి, వారినొక

దళంగా ఏర్పాటుగావించెను. చుట్టుపల్లె గ్రామాలకు శత్రు వులను రాకుండా అరికట్టారు. ఇతనంటే రజాకార్లు, పోలీసులు హడలిపోయేవారు. అక్కడక్కడ జరిగిన సంఘర్షణలో గవర్నమెంటు సిబ్బందీ గట్టిగానే దెబ్బలుతిని పారిపోయింది. పగసాధించడానికి 1948 జనవరిలో నిజాం మిలటరీ దళం వీరి గ్రామాన్ని ముట్టడివేశారు. ఆముట్టడిలో యిరు కక్షులవారికి సంకులసమరం జరిగింది. 1౮ మంది గవర్నమెంటు సిబ్బంది నాశనమైంది. ఇంతలో రామిరెడ్డివద్ద మందుగుండు సామాను అయిపోయింది. నిస్సహాయుడైనాడు. తానువున్న మేడపై నుండి 15 మంది అనుచరులతోసహా క్రిందికి దింపబడి కాల్చివేయబడెను. ఆగ్రామం అంతా ఆనాటితో నాశనమైంది. అక్కడక్కడ నైజాం సిపాహీలకు, వీరికి యుద్ధం జరుగగా—ఇతడు గుండెకు తుపాకిరవ్వలు తగిలి మరణించెను.

## ౧౪౦. పడమటి కృష్ణమ్మగారు కొడుకు మాలకనకయ్యగారు

( 1985 — 1946 )

1885 సం॥రంలో ఓరుగల్లు గ్రామంలో కృష్ణమ్మకు జన్మించెను.

ఇతనికి యిద్దరు కొడుకులుగలరు. మల్లయ్య అనువాడు 1902 లోను, కనకయ్య 1915 సం॥రంలోను ఓరుగల్లు గ్రామం

లోనే జన్మించిరి. వారంతా దేహకష్టముజేసి జీవనోపాధిని గడుపుకొనేవారు. వీరంతా పరోపకార పారీణులు.

1940 సం॥రంలో ఆర్యసమాజములోజేరి, పిమ్మట కాంగ్రెస్‌లోకి మారినారు. తాలింఖానాలు స్థాపించి, మల్ల యుద్ధం నేర్పేవారు.

1946 సం॥రం ఆషాఢ శు. ఏకాదశికి సరియగు జూలై 29 తేదీ ఉదయం మైదానములో జండావందనము చేశారు. ఆ జెండాను పీకివేయుటకు ముస్లిందండు వచ్చినది. 6 గంటల సేపు ఆదండు నాపి ఈ వీరు లప్రతిహతంగా పోరాడి వారిని ఊరివెలుపలకు తరిమేశారు. సాయంత్రం 5 గం.కు సాయుధ పాణులైన మిలిటిరీ సిబ్బందిని రప్పించి ముస్లిములు అతి దారుణయుద్ధం చేయగా తుపాకీదెబ్బలను తట్టుకోలేక, ఈవీరులు వీరస్వర్గాన్నలంకరించారు. ఈ మల్లయ్యకు యెవరూలేరు.

## ౧౪౧. లక్ష్మణదేవుగారు
## వరంగల్ జిల్లా, కరీంబాద్
### ( 1920 — 1945 )

1920 సం॥రంలో పద్మసాలీల కుటుంబంలో జన్మించెను. శాంతస్వభావుడు మితభాషి, రాజకీయ గ్రంథపఠనంలోను, చరఖాసంఘాలపైని యెక్కువ అభిమానము. కల్లుసారా

మూప్పించడం, చేనేతమగ్గాలు పెట్టించడం యితని దినచర్య కాంగ్రెస్ మెంబర్లను చేర్పించడంలో అతిచాకచక్యం చూపేవాడు.

1942 సం||రం అక్టోబర్‌లో నైజాం కాంగ్రెస్ ఆదేశానుసారం, నిషేధకర పత్రాలను పంచి, మీటింగు చేయుచుండగా, నిజాం పోలీసువారితనిని అరెస్టుజేసిరి. వరంగల్ మేజస్ట్రేటు యితనికి 1 సం||రం కఠినశిక్షనువేసి వరంగల్ సెంట్రల్ జైలుకి పంపెను. శిక్షాకాలం అనుభవించి బయటికి రాగా ఎప్పటివలె కాంగ్రెసు కార్యక్రమం జేయుచు ప్రచారం జేయుచుండెను.

1945 సం||రంలో టైఫాయిడు జ్వరంవచ్చి మరణించెను.

## ౧౪౨. పద్ది జనార్దనంగారు - వరంగల్

(1918 – 14 - 1 - 44)

1918 సం|| రం ప్రాంతమందు ఆర్యవైశ్యకులంలో జన్మించెను. ప్రాథమికవిద్య మాత్రమే నేర్చెను. జాతీయ ఉద్యమమం దెక్కువ అభిమానం. ఖద్దరుధారి. ఈయన కూడా 1942 లో జైలునకు పోయెను. 1 సం|| రం శిక్ష

ననుభవించివచ్చి, మామూలు వ్యాపారము జేసుకొనుచుండెను. జైలులోనుండగానే ఉదరంలో కణితి బయలుదేరెను. ఆజబ్బు చేతనే 14-1-1944 తేదీని మరణించెను.

# ౧౦౩. పుల్ల రాఘవరావుగారు, గార్ల (జాగీరుదారు) సత్యనారాయణపురం (మానుకోట తా॥)

( 1889 — 5-8-48 )

1889 సం॥రంలో జన్మించెను మంచి విద్యావంతులు. భూకామందులు. సంఘసంస్కారాభిలాషి. కాంగ్రెస్‌పైని విశేషభక్తి గలదు. నల్గురు అన్నదమ్ములలో యితడు జ్యేష్ఠుడు. కుటుంబం చాలా పరోపకారానికి ప్రసిద్ధి కెక్కినది. బీదలపైని కనికరం, వ్యవసాయంపైని ఆసక్తి మెండు. గ్రామంలో మంచిచెడ్డలకు తీర్పు చెప్పేవారు. గ్రామీణుల ఉపయోగార్థం బావులు, చెర్వులు, సత్రాలు, కట్టించారు. రజాకార్ల దురగాలకు వీరిగ్రామాన్ని స్వాధీనపడనీయలేదు. ఇతడు గ్రామసేవా దళానికి అధిపతిగాఉండి, అతిచాకచక్యముగా ఆరుమాసాలు నడిపించాడు

5-8-48 తేదీన నైజాం మిలటరీవచ్చి వూరును స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నించుచుండగా, నిస్సహాయుడై తక్కువ బలముతోనే, ఒకదళాన్ని లేవదీసి, నాలుగుగంటల సేపు తీవ్రముగా పోరాటముజేసెను. ఆయుద్ధంలో శ్రీ రాఘవరావును తుపాకీతో కాల్చి చంపివేసిరి. ఇతనితోబాటు, యలగుంచిలి సూరయ్య, యలమంచిలి రామయ్య, కొత్త సిచ్చయ్య గార్లను కూడా హత్యచేసిరి.

## ౨౪౪. వాసిరెడ్డి సత్యనారాయణగారు పాసుగోడు (హుజూర్‌నగర్ తా॥)

(1904 – 18 - 8 - 48)

1904 సం॥ రంలో జన్మించెను. పాసుగోడుకు గ్రామోద్యోగస్థుడు. ప్రాథమిక విద్యను మాత్రమే బడసెను. జాతీయోద్యమమంటే చాలా ప్రీతి స్టేటుకాంగ్రెసు ఆదేశానుసారం 1947 సం॥ రంలో–గ్రామకరిణీకానికి రాజీనామా నిచ్చివేసెను. దానికై పోలీసువారితనిని 8-7-47 తేదీని అరెస్టుచేసి హుజూర్‌నగర్ జైలులో పెట్టిరి. ఆరాజీనామా పత్రములో నైజాం రజాకార్లయొక్క కమ్యూనిష్టులయొక్క దుండగాలను పేర్కొని, నిర్మొగమాటముగా వ్రాసినారు. చాలాధైర్యశాలి.

సత్యాన్వేషణయందును ప్రీతిగలవారు. ఆగ్రామానికి వచ్చిన అతిథి అభ్యాగతులకు లేదనకుండా ఆశ్రయ మిచ్చేవారు. ఇతడు సబుజైలులో వుండగానే 18-8-48 తేదీని అర్ధరాత్రిని పోలీసులు అకారణముగా కాల్చి చంపిరి.

## ౧౮౫. కె. రజితంగారు - నెక్కొండ వరంగల్ తా॥

( 1905 – 4-2-1949 )

1905 సం॥ రం ప్రాంతమున హరిజన్ కులంలో జన్మించెను. మంచి విద్యావంతుడు. బాల్యమునుండి ప్రజాసేవయన్న యితనికి చాలా సరదా. చాలాకాలం నెక్కొండ గ్రామంలోనే ఉపాధ్యాయ వృత్తివల్ల జీవనం చేసెను. శాకాహారి. విద్యార్థులను తర్ఫీద్ చేయడంలో ఆరితేరిన చెయ్యి. చుట్టుపట్ల గ్రామాదులలో చాలాచోట్ల వ్యాయామశాలలను పెట్టి తాలింఖానాలో పిన్నపెద్దలకు వివక్షత లేకుండగా కసరత్తు నేర్పేవాడు.

1947 సం॥ రంలో కాంగ్రెసువారు తాలూకా గ్రామ రక్షణదళాలకు అధ్యక్షునిగా నెన్నుకొని, ఇతని నాయకత్వం క్రింద శిబిరములలో శిక్షణ నిచ్చుచుండెడివారు. 1948 జనవరి

నెలలో కాజీపేటలో వాలంటీర్లకు శిక్షణ నిచ్చుచుండగా రజాకార్లు వీరిని మోసముచే పట్టుకొని కుట్రలో ఆరితేరిన పోలీసులు బంధించి తీసుకొనిపోయిరి. రెండురోజులు స్వాధీనములో వుంచుకొని తమలో చేరమన్నారు. దేశభక్తుడు గనుక అంగీకరించలేదు. అందుచే 4-2-1949 తేదీని అడవిలోనికి తీసుకెళ్ళి చెట్టుకి కట్టేసి కాల్చి చంపేశారు

## ౧౪౬. యాబా రామయ్యగారు
## అన్నారుగూడెం మధిర తాలూకా

( 1882 – 9-7-47 )

ఈయన 1882 సం॥ రంలో జన్మించెను. రైతుబిడ్డ. వ్యవసాయమునందు ప్రఖ్యాతిగన్నవ్యక్తి. దేశభక్తుడు. కాని నిరక్షరుడు. పరోపకారపారీణుడు. ధైర్యశాలి. ప్రజాగౌరవము సంపాదించాడు అన్నదాత. చుట్టుపట్లగ్రామాలకు ఇతడు దండనాయకునివంటివాడు. అట్టివానిని అంతమొందించడం మంచిదని రజాకార్లు 9-7-47 తేదీని ఇతనిని బంధించి కర్రలతో బాదకొట్టిరి. కొట్టి రజాకార్ల కేంద్రస్థానమగు గెద్దనగూడెం (ఖమ్మంతాలూకా) అడవికి తీసికొనివెళ్లి నానా చిత్రవధచేసి, హింసించి చంపిరి.

## ౧౪౭. డి. కృష్ణయ్యగారు - భీమవరం (నల్గొండ జిల్లా)

( 1920 – 9 - 8 - 49 )

ఆర్యవైశ్యుడు. 1920 సం॥రంలో ఆగర్భ శ్రీమంత కుటుంబమున జన్మించెను సహజముగు నడవడిగలవాడు. ప్రాథమికపరీక్షలో నుత్తీర్ణుడైనాడు కాంగ్రెస్ అంటె అపరిమితమైన అభిమానం. గాంధీజీని నిత్యం పూజించేవాడు ఆ ఊరిలో ఒక గ్రంథాలయం నెలకొల్పినాడు జాతరు వుద్యమాలలో తాను త్రివర్ణపతాకాన్ని చేబూని ముందునడిచేవాడు.

6-7-1948 తేదీని పోలీసు సబుయినస్పెక్టర్ తన ఆధీనంలో నుంచుకొని గుడ్లు పీకించేశాడు. అంతకూ చావకపోతే మొండిఘటమని యిటుకపాడు గ్రామంవెళ్ళే త్రోవకు తీసుకొచ్చి తుపాకీతో 9-8-48 తేదీని కాల్చి చంపివేసెను.

## ౧౪౮. షేకు బాలాసాహెబుగారు-రంగుడ్ల మిర్యాలగూడెం తాలూకా

( 1904 )

1904 సం॥ రంలో జన్మించెను. ప్రాథమికవిద్య మాత్రం నేర్చెను. ఉర్దూలో చాలా గ్రంథాలను, ఖురాను చదివెను

దీశాలి. దేశభక్తిగలవాడు. ధైర్యశాలి. కష్టజీవి. వ్యవసాయమే జీవనోపాధిగా గలవాడు. ఎంతసహనం వుండేది. హిందూసంప్రదాయాలను చాలాగౌరవించెను. రజాకార్ల దుండగాలు విన్నపుడు ఉగ్రుడై దానినిరూపుమాపడానికి బహిరంగంగా కాంగ్రెసులోచేరి ఉత్సాహంగా పనిచేసెను. "మహమ్మదీయుడై పుట్టి, హిందూసంఘములో చేరడమే కాకుండా రజాకార్ల రహస్యాలను వెల్లడిచేయడానికి పూనుకొన్న దేశద్రోహి" అని తిట్టి, అకస్మాత్తుగా వెనకనుంచి సీతారామశాస్త్రిఅనే కమ్యూనిష్టు ఇతనిని పొడిచిచంపివేసినాడు. వెంటనే యితడు వీరస్వర్గమలంకరించెను.

## ౧౪౯ సారె రాములు గౌడ - సూర్యాపేట

( 1916 – 19 - 12 - 48 )

1916 సం॥రంలో జన్మించెను. లోయర్ సెకండరీవరకూ చదివెను. పరోపకారపారీణుడు. ఏపనిజేసినా ప్రతిఫలాపేక్ష లేనివాడు. తనకున్న దానిలో దానధర్మాలు చేసేవాడు. ఈ ప్రాంతపు స్టేటుకాంగ్రెసు కితనే ముందడుగు వైచెను. కాంగ్రెసుఆజ్ఞలను శిరసావహించి, కార్యాలను భక్తిశ్రద్ధలతో నెరవేర్చేవాడు. ఇతనికి వాలంటీరు పని అంటే చాలా యిష్టం.

కాంగ్రెసు కార్యకర్తలకు వార్తల నందజేయుటలో ఇంతటివాడు లేడనిపించుకున్నాడు.

19-12-48 తేదీని సూర్యాపేటనుంచి, పరిసరగ్రామాదులకు కొన్ని వార్తాపత్రికలను కొనిపోవుచుండగా, మార్గమధ్యముననే పోలీసువారు యితనిని చెట్టునకుకట్టివేసి, తుపాకితో కాల్చిచంపివేశారు. ఇతడు బ్రహ్మచారి.

## ౧౫౦. పుట్లోజు బాపిరాజుగారు
## పెద్దపాడు
## ( 1906 )

1906 సం॥ జననం. మంచివిద్యావంతులు. సంస్కారులు. మొదటినుండీ గ్రామసంఘాలు పెట్టుటలో మంచి నేర్పరితనం వుంది. ఆసంఘాలద్వారా గవర్నమెంటు సాధించలేని పనులను సునాయాసంగా గ్రామసంఘాలద్వారా చేయించేవాడు. ప్రతి జాతీయోద్యమంలోను ముందడుగు వేసేవాడు. ఇతడు చాలా ధైర్య సాహసవంతుడు గనుక రిజాకార్లదళాలను గోరిల్లా యుద్ధంలో చాలాసార్లు వేడిపించెను. (కాని దురదృష్టవశాత్తు 11-4-49 తేదీని యితడు ఒక్కడు అడవిలోవుండగా పదిమంది రజాకార్లు ఇత్తేహాడ్ ముస్లమానులు చుట్టుముట్టి ముట్టడేశారు.

కాని నిరాయుధుడైనప్పటికీ వారితో అతి చాకచక్యంగా నాలుగుగంటలు పోరాడిఅలసిపోయెను. నిస్సహాయుడైన యితనికి తుపాకిగుండుతగిలి నేలకొరిగాడు.

# ౧౫౧. నెమిలికొండ నరసింహారెడ్డిగారు
## నాభావం, హైదరాబాదు

1892 — 9-4-1948)

1892 సం॥రంలో జననం - ఇతడు చేదువరిగాడు. వ్యవసాయదారుడు. ఆజానుబాహుడు. అరిలోక భయంకరుడు. గ్రామంలోని తగాదాలన్ని యితడు తీర్చవలసినదే. వారికి సామదాన దండోపాయాలచే బుద్ధికి తోచినట్లు సలహానిచ్చి, అందరిని సమాధానపరిచి పంపేవాడు. ఆ చుట్టుపట్ల గ్రామాలకు వీరిల్లు వక పంచాయితీ కోర్టయిపోయింది. వీరింట్లో యెన్నో తరాలనుంచి రాట్నపరిశ్రమ వుండెను. గాంధీ మోమెంటు వచ్చినతర్వాత ఈయన చుట్టుప్రక్క గ్రామాలలో కూడా యీ వుద్యమాన్ని ప్రచారంజేసెను. ఇతడా వూరి ప్రజలనంజరినీ ఏకంచేసి రజాకార్ల నెదుర్కోడానికి ఒకదళంగా జేశాడు. ఇతడంటే తమ ఆటలు సాగవని

9—4—1948 తేదీని వేలకొలది రజాకార్ల సిబ్బంది వచ్చి అర్ధరాత్రి ఇతనిపైబడి బల్లెంతో పొడిచి చంపివేశారు.

# ౧౫౭ గెంటాల సీతారామారావుగారు

## ఖమ్మంమెట్టు

( 1903 — 5 - 11 - 1948 )

1903 సం॥రం జననం నందిగామ తాలూకా తక్కెళ్ల పాడు అగ్రహారంలో — ఇతడు ఇంటర్మీడియేటువరకు చదివినాడు. పెద్దభూస్వామి మంచి జాతీయాభిమాని. 1925 సం॥రం నుంచి స్వయముగా రాట్నమును వడికించేవారు. అనేకమంది గృహాలలో రాట్నాలు నెలకొల్పారు. నిర్మాణకార్యక్రమంలో వీరు నిత్యసేవకులు, ఎంతోమంది జాతీయ వాదులకు వీరిల్లు సత్రం. ఆ చుట్టుపట్ల హరిజనవాడలోకి వెళ్లి హరిజన సమస్యను చక్కగా సాధించేవారు. పరోపకారి. కుటుంబ కార్యభారం నెత్తిమీదబడినా, కాంగ్రెసు కార్యక్రమాన్ని మానలేదు. తనవాగ్ధాటిచే పాటకపు జనాన్ని, కమ్యూనిష్టులను కూడ వశపర్చుకొనెను. కాని కమ్యూనిష్టుల కితనిపైని కన్నెర్రగానే వుంది. ఏకాకిగా పొలంలో గుడిసె వేసుకొని దానిలో జీవించే ఆదర్శప్రాయుడైనాడు. కమ్యూనిష్టు లీఅదను

గనిపెట్టి 5 - 11 - 48 తేదీని ఇతనిని కాల్చి చంపివేసిరి. ఇతనిని చంపినవారంతా వారింట్లో ఆతిథ్యం గొన్నవారే. ఇతని తమ్ముడు డాక్టరు ఉపేంద్రరావు. ప్రస్తుతం కమ్మం మెట్టులో వున్నారు.

## ౧౫౩. పాకనాటి ప్రతాపరెడ్డిగారు

## జనగాం తా॥ చినవంగరం, వరంగల్ జిల్లా

( 1915 – )

1915 సం॥ రం జన్మించిరి. వీరు నలుగురు సోదరులలో రెండోవారు, గొప్పభూస్వాములు. బీదలపాలిటి కల్పవృక్షము. అనేక బీదలకు ఉచిత వైద్యం చేసి చేయించేవారు. అప్పులను వడ్డీలేకుండా యిచ్చేవారు. నిత్య ఖద్దరుధారి. చిన్ననాటినుండి మంచి జాతీయభావాలు కలవారు. గాంధీజీ శాంత స్వభావమంటే ఈయన చెవికోసుకొనేవాడు ఈయన తరుచు కాంగ్రెస్ సభలకు వెళ్లుట కలదు. ఈయన నైజాంలో సహాయనిరాకరణోద్యమం రావడంతోనే అందులో జేరి పనిజేయుట ప్రారంభించెను. ఇతనిని పోలీసువారరెస్టుజేసి జనగాంలో 15 రోజులు రిమాండులో నుంచి విడిచిపెట్టిరి తరువాత వీరిప

వదలిపెట్టమని అర్డరువచ్చినా పోలీసువారు, రజాకార్లు లాలూచి అయి విడుదల చేయుటకు నిరాకరించారు. 4 రోజులయిన తర్వాత యితనిని కొడగండ్ల గ్రామకాపురస్థులను పదిమందిని అడవిలోకి తీసికొనిపోయి కాల్చిచంపేశారు.

## ౧౫౪. బత్తెన ముత్యాలింగంగారు

## ఓరుగల్లుకోట

(1925 – 1948)

కాపుకులస్థుడు. 1925 లో ఓరుగల్లు కోటలో జన్మించెను. కొద్దివిద్యాసంస్కారం గలదు, సాహసుడు-ప్రథమంలో షావుకారు గుమాస్తాగా పనిజేసెను. 1941 సం॥ రంలో మిలిటరీకి వెళ్లి 1946 లో తిరిగి యింటికి వచ్చినాడు వెంటనే ఓరుగల్లు వాలంటీరుదళాన్ని ఒకదానిని స్థాపించి, జాతీయ విధానంపైని ఒహాచాకచక్యంగా నడిపించెను. 1948 సం॥ రంలో కాంగ్రెస్ దళానికి నాయకత్వం వహించి ఒకదళాన్ని జొన్నలగడ్డ తీసుకెళ్లి సరిహద్దులను రక్షించుచుండెను.

ఆయా తెలంగాణా ప్రదేశములలో

జాతీయాభిమానులు కాంగ్రెస్ ప్రచారకులు—రజాకార్ల నైజాంపోలీసుల, కమ్యూనిష్టులనేవార్ల - దాడులలో, దండయాత్రలలో, కేవలం అహింసాయుతంగా కొన్నిస్థలాలోను, ఆత్మరక్షణ ధర్మపరిరక్షణ యుక్తంగా మరికొన్ని స్థలాలలోను ఆత్మార్పణం - చేసిన బలిదాన ఘట్టాల పరంపరలో మాకు లభించిన వీటిని ఈక్రింద పొందుపరుస్తున్నాము.

## ౧౫౫. కోనాయిగూడెం దాడి

మార్చి 16-1948 తేదీని హుజూరు నగరం తాలూకా కోనాయిగూడెం గ్రామంపైని నైజాం పోలీసు రజాకార్ల హత్యాకాండలు దుండగాలు, పోలీసులుదాడిచేసి కాంగ్రెస్ కార్యకర్తలైన సారెడ్డి వెంకయ్య, అంబెడు గోపయ్య, ఆరుటి కృష్ణయ్యలను రాచకీయఖైదీలుగా, చెరబట్ట, జైలులో వుండగా చిత్రహింసలు పాలుజేసి—తుపాకులుపేల్చి చంపారు.

## ౧౫౬. కొణతాపల్లి దాడి

నల్గొండజిల్లా దేవరకొండ తాలూకాలోని కొణతాపల్లి గ్రామముపైని రజాకార్లు దాడిచేసి, ప్రభుత్వ బృందానికి

గ్రామరక్షణ దళాలకు మధ్య జరిగిన సంఘర్షణలో యిద్దరు పటిస్నొక్టష్ల 2 రజాకార్లు చచ్చిపోయారు. యీ వీర సంగ్రామంలో పల్లె వెంకయ్యమరణించాడు. తరువాత ప్రభుత్వ కాల్బలం 600 మంది వచ్చి ఈ గ్రామంపైబడి సర్వనాశనం జేశారు. ప్రజా సైనికులలో గాయాలు తగిలిన వారిలో వీర మూలాస్వామి చచ్చిపోయాడు. ఇతన్ని పురజనులు బాండుమేళంతో వూరేగించి గోదావరనది వడ్డున దహన సంస్కారాలు చేశారు. దానిని యిపుడు మూలాస్వామి ఘాట్ అని పిలుస్తూన్నారు.

## ౧౫౭. ముద్దనూరు దాడి

### మధిర తాలూకా

ఈ గ్రామ వాసుడైన కట్టమూడి నారాయణ్ని, లంబాడి సోములు, అతనిభార్య భామిని-యూనియన్ గ్రామాలకు పోతూంటే దారిలో నిజాం సైనికులు అడ్డగించగా; వారు యెదుర్కొని పోరాడారు. కాని ఆస్త్రీని రజాకార్లు చెరచగా వెంటనే మరణించెను. మగవానిని చిత్రవధజేసి చంపారు.

## ౧౫౮. కోటకొండ దాడి

3-7-48 తేదీని జనగామ తాలూకా కోటకొండ గ్రామముపైని విసనూర్ దేశముఖ్ రాపాక రామచంద్రా

రెడ్డి కుమారుడు బాపురావు నాయకత్వాన రజాకార్లు పోలీసులు కలసి దాడిచేసి కాల్పులు కాల్చగా శ్రీ కోటి వీరయ్య, పొగాకు నరసయ్య, మంగలి అక్కయ్య, కయిరి మోతాబు, కొండుగాం యాదగిరి, బొసంపల్లి పైశాచి, చీకట్ల రామస్వామి, యామగారి గోపాలు, మంగలి వీరమల్లు, కమ్మరి బ్రహ్మయ్య, కోక నరసయ్య, బంజరు సత్తెయ్య, కమ్మరి పద్దయ్య, వెంటనే మరణించారు. పిమ్మట గ్రామంలో జొరబడి 4 లక్షలు కిమ్మతుజేసే వెండి, బంగారము, పాత్రసామాను, ధాన్యం మొదలగునవి దోచుకొని ఒక్కొక్క యింటిపై కిరసనాయిలు పోసి 500 యిండ్లను దగ్ధపరిచారు. పాడిపశువులు, గడ్డివాములు కూడ తగలడిపోయినవి. ఇదంతా చూచి సహించలేక భూమండ్ల అంకయ్య, వీరమ్మ దంపతులు ప్రాణాలకు తెగించి పోరుతూవుంటె వారిని రజాకార్లు కాళ్లుచేతులు బంధించివుంచి మంటలో వారేశారు.

## ౧౫౬. గోరంపల్లి దాడి

15-12-48 గోరంపల్లి-సూర్యాపేట తా॥ సుప్రసిద్ధ కాంగ్రెస్‌వాది అయిన శ్రీ కార్తి సోమయ్యను, రజకారు లింటిలో ప్రవేశించి చిత్రవధజేసి చంపారు.

# ౧౬౦. మరిపెడగ్రామం దాడి

16-12-48 మరిపెడగ్రామం-సూర్యాపేట తా॥ ప్రజలు స్టేటు కాంగ్రెసు ఉద్యమాన్ని బలపరుస్తూ ఊరేగింపు జేశారు. ఆఊరేగింపు తనఇంటిముందునుంచి పోయిందని, దేశముఖ్ దామోదరరెడ్డి ఊరేగింపుపై కాల్పులు సాగించాడు. అప్పుడతనితో సాయుధులైన రాజీలగుంపు వున్నది. వారు కుడితి లచ్చయ్య అను దేశభక్తుని కాల్చిచంపారు

వీరుగాక, పుసులూరి నరసయ్య, చిమిరాల, కొత్తపల్లి వెంకటప్పయ్య, చిగురుపాటి నరసయ్య, వంకాయలపాటి లక్ష్మయ్య, వంకాయలపాటి రాములయ్య మున్నగువారు రజాకార్ల గురికి ఆహుతులై మరణించారు.

[ఏమహనీయుల శ్రమజౌదార్యం లేకుండ ఇంతకుముందు పెర్కొన్న త్యాగులకు, నిర్మాణకార్యకర్తలకు అట్టి వాతావరణ సహాయము కలుగజాలదో, అట్టివ్యక్తుల చరిత్రలుకూడ మాకులభించినంతవఱకు ఈ క్రింద పెర్కొనుచున్నాము.]

# ౧౬౧. దేవత శ్రీరామమూర్తిగారు

## రాజమండ్రి

(మరణం 3-9-41)

సుప్రసిద్ధ ఆర్యవైశ్య కుటుంబములో జన్మించారు. 1906 సం॥రంలో రాజమండ్రి Arts College లో B A పరీక్షయందుత్తీర్ణులై – రాజమండ్రి మ్యునిసిపల్ కార్యదర్శిగా చాలకాలం పనిచేసెను.

1913 నాటికి ప్లీడరుపట్టాను పుచ్చుకొని న్యాయవాదవృత్తి నవలంబించెను. ఇతడు (Local Boards) స్థానిక సంస్థలలో ప్రవేశించి ఎక్కుడు శ్రద్ధాభక్తులతో ప్రజోపయోగములైన కార్యములను నిర్వర్తించుచుండెను.

ఇతడు (Adult Education) వయోజనవిద్య, కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమము, గౌతమీసత్యాగ్రహాశ్రమం- (సీతానగరం) పనులలో పాల్గొని శ్రీ సుబ్రహ్మణ్యమునకు కుడిభుజముగానుండి పనిచేసెను. ఆరోజులలో జాతీయపతాకస్థాపనస్థ

నసతిగృహాలపై జేయకూడదని ప్రభుత్వంవారు నిర్బంధింపగా, ఇతడు ధైర్యంతో పోలీసువారి నెదుర్కొని, High Court వరకు పోరాడి, స్వధర్మాన్ని కాపాడుకొని, ఆదర్శప్రాయుడై నిలబడిన వీరుడు.

విదేశి వస్త్రబహిష్కారాన్ని తీవ్రంగాజరిపిన వైశ్య రత్నము. 1933 సం॥రంలో తిరిగీ, గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమాన్ని Dr సుబ్రహ్మణ్యంకు అప్పజెప్పి పునర్నిర్మాణమునకు అమితధనాన్ని పోగుచేసి ఆశ్రమనిర్వాహణ కొసంగెను.

వృత్తిని విసర్జింపక కాంగ్రెస్ టిక్కెట్టుపైని M L C. సభ్యులుగా ఎన్నుకోబడెను. Upper Chamber నుంచి ఆంధ్ర విశ్వవిద్యాలయ సభ్యులుగా ఎన్నుకొనబడిరి.

---

## ౧౬౨. తల్లాప్రగడ సూర్యనారాయణరావు పంతులుగారు-కొవ్వూరు

ఈ మహనీయుడు పశ్చిమ గోదావరిజిల్లా కోనాల గ్రామమునందు జన్మించెను. ఆరువేల నియోగి. తల్లాప్రగడ వారి కుటుంబము శాఖోపశాఖలు గలిగి పెక్కు జిల్లాలలో వ్యాపించియున్నది.

వీరిద్దరు సోదరులు ఈయన పట్టభద్రుడై తణుకు మునసబుకోర్టులో చిరకాలము ప్లీడరుగా పని చేసెను. సుప్ర

ద్ధ న్యాయవాగ్రమై యుండెను న్యాయవాద వృత్తియందే కాక ఉభయభాషల యందును పండితుడై కవిగా ప్రసిద్ధి గడించెను. నేణుకలో రమారమి 10 సం॥ రములు సువర్ణలేఖా పత్రికాధిపతిగా నుండెను. ఈయన స్వతంత్రముగా రచించిన వియును, ఆంగ్లమునుండియు, సంస్కృతమునుండియు ఆంధ్రము లోనికి అనువదించినవియును పెక్కు నవలలు, నాటకములు, పద్యరచనలు నేటికిని దేశవ్యాప్తములైయున్నవి. 1910 సం॥ర ప్రాంతమున ఈయన కొవ్వూరుకు తన నివాసమును మార్చు కొనెను.

ఈయనకు విద్యాభినివేశమును, పండితాదరమును, అపరిమితముగుటచేత విద్యాపరిషత్తులు, భాండాగారములు, మున్నగు సంస్థలను స్థాపించి పోషించుట జీవితమున ప్రధానకర్త వ్యముగా చేసికొనెను శ్రీ తి॥ సూర్యనారాయణ రాయని యశోనిధానముగా కొవ్వూరునందు నెలకొల్పబడి నేటికిని ఆంధ్ర దేశములోని ప్రాచీన విద్యాకళాశాలలు దలంకారప్రాయమై దేశప్రఖ్యాతి నొందిన "ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము" నెరుగని వారుండరు. ఈవిద్యాపీఠము ఇప్పటికి రమారమి అర్ధశతాబ్ది క్రిందట నొకచిన్న సంస్కృత పీఠ పాఠశాలగా మధ్భవించినది. దానికి బీజావాపము చేసిన మూలపురుషులు మహావిద్వాంసులు నగు శ్రీ పురిపుల్ల రామశాస్త్రులు ఈ సంస్థయందు ప్రప్రథమమందనీయులు. ఆతిగని శ్రీ పంతులుగారు ప్రాపకను గౌణ్యులై నిలిచి స్వశక్తి పరశక్తులవల్ల దోహదము

నొందించి ప్రాచీన విద్యావితరణము నందు కల్పవృక్షమని పించెను. విద్యాపీఠమును జీవితాదర్శముగా చేసికొని నెలకు 7, 8 వందల రూపాయిలు సంపాదించుకొనెడి ప్లీడరు పనికి స్వస్తి చెప్పి పిత్రార్జితమైన రత్నగర్భమగు సుమారు ఏబది యకరముల సుక్షేత్రమును సైతము కొంతవరకు వెచ్చించి తన విద్యాపీఠకార్యక్రమమునకు అవరోధము కలుగచున్నదని అన్నము మొదలగు పక్వాహారములు మానివేసి కేవలము ఫలాహారములతో ప్రాణపోషణ చేయుచు, వానప్రస్థునివలె కాషాయబట్టలను ధరించి అహర్నిశలు దేశాటనము చేయుచు కృశించి జీవితమును విద్యాపీఠమునకు ధారపోసెను. సంసారమునందును భార్యాపుత్రుల యందును నిర్లిప్తుడై విద్యాపీఠమే సంసారముగాను, విద్యార్థిబృందమును ఉపాధ్యాయులనే కుటుంబముగాను జీవించుచుండెను. కేవల విద్యాదానమే కాక, విద్యార్థుల కన్నసత్రము, దేవీ–విష్ణు శివాలయ ప్రతిష్ఠలను, భక్తిపరములగు సప్తసప్తాహము కోటిలింగార్చనము మున్నగు మహత్కార్యములను నిత్యము చేయుచు విద్యాపీఠమును ఐహికాముష్మిక ఫలముల కాటపట్టుగ చేసెను. విద్యాపీఠము శాశ్వతముగా నడచుటకు కావలసిన నిబంధనలను చేసి రిజిష్టరు చేయించెను.

ఈయనను కొంచెము తక్కువగా మదనమోహన మాలవ్యాపండితునితో సరిచేయవచ్చును. కర్మయోగ ప్రవృ

త్రిలో ఆయన కంటెను ఈయనకే అగ్రస్థానము కలదన్నను న్యాయమే ఆయన ఆదేశమాత్రముచేత మహారాజులవద్ద లక్షలుగా ధనము ప్రోగుచేసి కాశీ విశ్వవిద్యాలయమును నెలకొల్పెను శ్రీ తి. సూర్యనారాయణరావుగారు ఒక్కొక్క రూపాయి మొదలుగా రొక్కమును, కుంచెడు మొదలుగా బియ్యమును యకరము అరయకరము మొదలుగా భూమిని ప్రజల యొద్దనుండి స్వశక్తివలన సంపాదించి చరస్థిరాస్తులను సుమారు లక్ష రూపాయల విలువగల వానిని సేకరించెను. ఈయన దృక్పథము నానాటికి ఆధ్యాత్మిక ప్రధానమై మోక్ష దృష్టి ప్రధానమై, తపశ్శక్తిసంపన్నమై మహర్షి జీవితముతో తుల్యముగా మారెను. ఈమహనీయుని చరిత్రమును ఇంత సంక్షిప్తముగా రచించుట సూర్యుని దీపముతో చూపినటులే యగును. వేయేల ఆయనవేసిన కార్యప్రణాళికలే నేటికిని ఎప్పటికిని విద్యావిషయమునకే కాక దేశీయోద్యములకు గూడ మార్గదర్శకములై నెగడుచున్నవి.

ఈపుణ్యపురుషుడు ఏబదియేండ్లకు పూర్వవయస్సునందే 1926 సం॥ ౨౦ మార్చి ౩ వ తేదీని భౌతికకాయమును విడిచి స్వర్గస్థుడయ్యెను.

ఈయన ధర్మచారిణియగుభార్యయు, ఏకపుత్రుడు, ఇద్దరు పుత్రికలు దౌహిత్రులు మున్నగువారు సుఖముగానున్నారు.

తపోవిద్యాభివిశేషములందే గాక యీమహాత్మునకు మహాత్మాగాంధీ యాదేశానుసారము పెద్ద ఆదాయముగల

ప్లీడరీ వృత్తిని వదలుకొనెను. అప్పటిలో పట్టాను వదలు కొన్న న్యాయవాదులలో శ్రీ త. సూర్యనారాయణరావు గారే ముందంజ వేసిరి.

## ౧౬౩ వల్లూరి సూర్యనారాయణరావుగారు
## గౌతమాశ్రమము, కొవ్వూరు

( 1866 – 28 - 4 - 1937 )

శ్రీ పంతులుగారు 1866 వ సంవత్సరములో రాజోలు తాలూకా కడలిగ్రామమున జన్మించిరి. రాజమహేంద్రవర ములోని ప్రభుత్వకళాశాలలో చదివి బి. యే. ప్యాసైరి. వీరు పేదకుటుంబమునకు చెందినవారగుటచే విద్యార్థిదశలో చాల కష్టములుపడిరి. పిమ్మట మదరాసు వెళ్ళి అచట ' లా ' పరీ క్షకు చదివి బి. ఎల్. ప్యాసైరి. ఎల్. టి. కూడ ప్యాసైరి. ఆ కాలముననే వీరికి కీర్తిశేషులైన రెంటాల వేంకటసుబ్బారావు గారితో స్నేహముకలిగెను. కొంతకాలము వీరిరువురునుకలిసి ఫోటో మాన్యుఫాక్టరీ నడిపిరి. శ్రీ పంతులుగారు కొలదికాలము సైదాపేటలోని 'టీచర్సు కాలేజీ'లో ఉపాధ్యాయులుగా కూడ పనిచేసిరి. సుమారు ముప్పదిసంవత్సరముల వయస్సున వీరు

ఒందరులో ప్లీడరీ ప్రారంభించిరి. ప్రారంభించినది మొదలు ధనము సమృద్ధిగా గడింపజొచ్చిరి. 1920 వ సంవత్సరం నాటికి వీరు లక్షరూపాయలు నిలువవేయగల్గిరి. తను జీవిత శేషమున కీధనము చాలునని తృప్తిజెంది, వారంతట సంపాదనమును మానుకొని దేశసేవకై గడింగిరి. ఆ పిమ్మటకూడ నప్పుడప్పుడు కోర్టునకు పోవుచుండిరిగాని ఫీజుతీసికొనకుండ కేవలము ధర్మాదాయముల విషయములో మాత్రమే పోవుచుండెడివారు. శ్రీపంతులుగారు చిన్నప్పటినుండియు ధర్మాదాయరక్షణమునకు పనిచేయుచునే యుండిరి. వందలకొలది ధర్మసంస్థలను వారు కోర్టులో వాదించి నిలిపిరి. ఎన్నియో దేవాలయముల నుద్ధరించిరి.

1926 సంవత్సరమున శ్రీపంతులుగారు ఒందరునుండి నివాసమును కొవ్వూరునకు మార్చిరి. వీరిచ్చటకు వచ్చుటకు కారణము ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమే. కీ. శే. తల్లాప్రగడ సూర్యనారాయణరావు పంతులుగారు వీరినిచ్చటకువచ్చి ఈ కార్యభారమును వహించవలసిన దని కోరుచుండెడివారు, గాని వారి జీవితకాలములో వీరప్పుడప్పుడు వచ్చి పోవుచుండుటయే గాని స్థిరముగ నిచ్చటనుండి విద్యాపీఠభారమును వహింపలేదు. శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావు పంతులుగారు దివంగతులైన పిమ్మట శ్రీ పంతులుగా రిచ్చట స్థిరపడి యీ సంస్థకు ఆలంబముగ నుండి కొంతకాల మధ్యక్షులుగను, కొంతకాలము కార్యదర్శులుగను అతి సమర్థతతో పనిజేసి తమ జీవితమం

తయు దీని యోగక్షేమములకే వినియోగించి ది 9-4-31 తేదీని రు 12000 లను, ది 1-1-36 తేదీ గల విల్లుప్రకారము రు 57,000 ల రొక్కమును, రు 15,000 లు ఖరీదుగల మన స్వాతంత్ర్యమందిరమను భవనమును యీ విధముగా తమ సర్వస్వమును యీ విద్యాపీఠమునకు దానముచేసి మన కందఱకును ప్రాతస్స్మరణీయులైరి బెజవాడలోని రామమోహనా యుర్వేదకళాశాలయు, బందరులోని ఆంధ్రజాతీయకళాశాలయుకూడ నిదివరలో వీరి భూరివితాళములకు పాత్రములై యుండెను. ఈ విధముగా వీరుగడించిన లక్షరూపాయలను కేవలము లోకశ్రేయస్కరములగు కార్యములకై దానములొనర్చి కృతకృత్యులైరి. ఇట్టిమహాత్యాగులు కొన్నిశతాబ్దములకైనను ఒక్కొక్కరు బయలుదేరుట అరుదు. శ్రీ పంతులుగారి విల్లు నమలుజరుపుటలో విద్యాపీఠము వారికంటె ముందడుగు వేయుటయే గాక విద్యాపీఠశ్రేయమునకై తమ సంపూర్ణసహకారమునిచ్చి పాటుపడుచున్న శ్రీపంతులుగారి పుత్రరత్నములగు శ్రీకృష్ణమోహన్, ఎం. ఏ, బి. ఎల్., శ్రీ జగన్మోహన్. బి. ఏ. ఎల్. ఇ. ఇ. గార్లు పంతులుగారికి తగినపుత్రులని చెప్పుటకు చాలసంతోషించుచున్నాము. శ్రీ సూర్యనారాయణరావుగారి సతీమణియగు శ్రీ పార్వతమ్మగారును తనభర్తగారికి నిజమైనసహధర్మచారిణిగా తనజీవితశేషమును ఈమనస్వాతంత్ర్యమందిరముననే గడిపి పతిలోకమును జూఱగొనిరి.

# ౧౬౪ విశాఖజిల్లా మాడుగల

# కొండజాతి సేవాభీష్ముడు - కామయ్యగారు

# కామయ్యపేట

## అస్తమించుట

ది 6–3–52 తేదీ లక్ష్మీవారం సాయంకాలం 5 గంట లకు విశాఖజిల్లా మాడుగల ఏజన్సీ భీష్మాచార్యుడు కామయ్య గారు 70 సంగరముల ముసలితనంలో అస్తమించాడు. విశాఖ జిల్లాలోని యేజన్సీప్రజలు ముఖ్యంగా మాడుగుల యేజన్సీ ప్రజలను పశువులకంటె సకృష్టంగా అప్పటి బ్రిటిషు ఉద్యోగి స్థులు, మురాదార్లు చూస్తూఉంటే, వెట్టీలు, గొత్తిలు, సుగ నాలి కట్నాలు, రాజలాంఛనాలు, దసరా మామూళ్లు అను పేరుతో కొండశ్రామికులు పండించినపంట, కూరగాయలు, డబ్బేగాక అతని చెమట రక్తబిందువులను కూడా పీల్చి వేస్తూంటే తాను ఏకైకంగా లేచి ఈ ధర్మదర్శకుని సలహా సహాయాలక్రింద "అక్రమ వెట్టీ గొత్తి చెయ్యం, చెయ్యం" "మురాదారి విధానం రద్దుకావాలి" "అక్రమ ఫారెస్టు బాధలు తగ్గాలి" అను నినాదం లేవదీసి ఆ నినాదంలోనుంచి బయలుదేరిన ప్రజాశక్తిని అహింసాపథంమీద 1936 నుండి 1938 వరకు వీర మందిరములోని "శ్రామికధర్మ సాధక

సంఘం " క్రిందను, ఆపిమ్మట దేశస్వాతంత్ర్యమునకు అనంతరం "గ్రామీణధర్మ రాజ్యసభ—కొండజాతిశాఖ" క్రిందను మేలొనరించుటలో శ్రీ కామయ్యగారి కానుక అపారం వచ్చి బ్రిటిషు అడ్వైజర్ల గవర్నమెంటులో ( 1939 – 40 ) డేవిడ్ అను ఒక ఫారెస్టుగార్డు తన డ్యూటీ చేస్తుంటే కామయ్యగారు తనను అడ్డగించినాడను కేసులో ముద్దాయిఅయి అప్పటి రాష్ట్ర జమీందారు రైతు సంఘంవారి పక్షమున ఈ ఉద్యమ మిత్రులు శ్రీ కందర్ప రామేశంపంతులు బి.యె. బి యల్. గారు అతిసమర్థతతో 9 నెలలు కేసు వాదించినా అప్పటి ప్రభుత్వ విధానమునుబట్టి అధ్యక్షుడైన ఆయనకున్ను, అప్పటి కొండ జాతి కార్యదర్శి రంగారావుకున్ను ఏడాది ఖైదు విధించారు. దానిని మహోత్సాహముతో స్వీకరించారు వీరుభయులు అది అయినవెంటనే కామయ్య రంగారావులు సంఘసేవకులు వదల బడతారనుకున్నారు. కాని అప్పుడు 'క్విట్ ఇండియా' ఉద్యమంరోజులు ( 1941 – 42 ). ఏ కారణం చెప్పకుండా ఈయనపైని ప్రవాసశిక్ష విధించారు ఒకమూల ఈ ధర్మ దర్శకుడు ప్రాణాపాయకరమైన దీర్ఘవ్యాధిలో మంచంమీద పడియుండెను. కామయ్యగారు విచారణలేని ఈ ప్రవాసశిక్ష అధర్మమని తోచి కాబోలు రాయవేలూరు జైలునుంచి తప్పించుకొని వచ్చి కొండలలోనే నివసించెను. ఇట్లు మూర్ఖ బ్రిటిషు జైలు ప్రవాసమును తప్పించుకొని కొండలలో నివసించుచున్నను, కరడుగట్టిన ఆ బ్రిటిషు ప్రభుత్వం

లోని పోలీసులు ఆయనవాడ తీయలేక పోవుటయే "లక్షల కొలది కొండజాతి ప్రజల అనురాగ కవచ రక్షణం ఈయనకున్నదనుటకు గుర్తు". కేవల మురాచారి మున్నగు కష్టప్రతిఘటనమే గాదు ఈయన జీవిత సందేశం. ఈధర్మోద్ధర్మకుడు ప్రదానం చేసిన ప్రథమ తకిలి పరిగ్రహించినది-కామయ్యగారే ఈసందర్భంలోని ఛాయాపటం సహస్రకళలతో నేడున్న సంచికలో ప్రకాశిస్తోంది. కామయ్య పెట్టిన ఆతకిలీయే నేడు మాడుగుల యేజన్సీలో రెండువేలమంది కొండవారు నూలువడుకుటకున్నూ పదిమగ్గములు పనిచేయుటకున్నూ నూలు చందాలపై నాలీనా సంఘము ఎన్నికలు జరుగుటకున్నూ కారణమైంది. మద్యనిషేధ, గోహత్యమాను ప్రచారము, పయోజన శరగత్తులకు కూడా ఈయన ఊతము నిచ్చెను. ఈఉద్యమం కదులుటలో అప్పటికి ఆఫీసు నిర్వాహకుడు సూత్మబుద్ధి కంరా గవరయ్యే సేవ నెప్పుడు మరువజాలము, అతడు వృద్ధుడై మంచం మీద యున్నను అతని కుమారుడైన మత్స్యలును సంఘసేవ కప్పగించాడు. ఈకామయ్య కుమారుడు మద్రిదన్నను సంఘముకు కార్యదర్శిగా సమర్పించెను. మరియొక కుమారుడు అమికాని ప్రమాదవ్యాధిలో నుండి కూడా శ్రీ మలయప్పన్ గారి పరిశ్రమల బ్రయినింగుకు కాకినాడ పంపించారు. ఈయన నివాస గ్రామమైన వాడెరువద్దనున్న గరుడాపల్లి గ్రామంయీాయన బయటనున్న కాలములో తగులపెట్టబడీ, ఈయన

భూములన్ని పెత్తందార్లు వ్యవహారాలు వశపరచుకొన్నారు ఈయన జైలునుంచి వచ్చిన వెంటనే ఈయన ప్రజానురాగము నకు భయపడి ఈయన భూములు ఈయనకు యిచ్చివేయ బడినా, ఆయన సోదరగ్రామ ప్రజలకు ఇళ్లు నిమిత్తం యిచ్చి వేసెను. ఆ గరుడాపల్లి ప్రక్కనే నేడు కామయ్యపేట వెలసి ఇంటింట నూలువడుకుట, కొన్ని ఇండ్లలో మగ్గంనేతతోను విరాజిల్లుతోంది. గతసాలున మిత్రులు K V N అప్పారావు గారు మాడుగుల వార్షికసభ జయప్రదంగ నిర్వహించివచ్చి నపుడు తీయబడిన ఈకామయ్యపేట దృశ్యాలు, Modern Review పత్రికారాజమును కూడ ఆకర్షించుట, శ్రీ మాల యప్పన్‌గారు ఆసభా సందర్భములో కామయ్యగారి ప్రక్కన కూర్చుని వారి "అంజలి" ఆతిథ్యం స్వీకరించుట ఈయన జన్మధన్యతకు ఋజువులు కామయ్యగారు నిజంగా ఈఉద్య మానికి భీష్మాచార్యుడు. మట్టిదేహం పోయినా ఆయన శాశ్వ తమైన యశఃకాయము యెప్పుడూ మనతో ఉంటుంది. ఆయ నతో పాటు ఉద్యమానికి సహాయపడి నూలువడుకుచు అష్ట కష్టములు పడిన ఆయన భార్యలు తిలకమ్మ, చిన్నమ్మ, బుల్లెమ్మలకు పుత్రరత్నములగు దన్ని, అప్పలనాయుడు వారికి మా సానుభూతి.

(యుగధర్మ ది 25-3-52)

## ౧౬౫ కొత్త సూర్యనారాయణమూర్తిగారు

## సీతానగరం

జననం 1905, నిధనం 1931. ఇతడు ఆర్యవైశ్య సంఘమునం దుద్భవించెను. నిత్యఖద్దరుధారులై ఆమరణాంతము కాంగ్రెసుసేవయందే నిమగ్నులై యుండిరి వారి సోదరులగు విశ్వనాధంతో కలిసి లేత్రప్రాయముననే పికెటింగు వగైరాలలో తీవ్రముగ కృషిచేసి రాజమండ్రి తాలూకాలో పరమపదించిరి. పంచవిధ బహిష్కారములను జేస్తూ రఘుదేవపురం— సీతానగరములలో ధైర్య - స్థైర్యములతో బని జేసిన యువకులు. వీరికుటుంబము యావత్తు గూడ దేశీయ కార్యక్రమములో బనిచేసెను. సీతానగరంలో Dr. సుబ్రహ్మణ్యం ఆశ్రమస్థాపన చేయకపూర్వము నుండియూ, వీరియావత్ కుటుంబమూ దేశసేవలో పాల్గొనుచుండెను. ఏతత్ఫలితమే ఆశ్రమస్థాపనకు ముఖ్యకారణముగ గన్పట్టును.

---

## ౧౬౬. బంగారు రాఘవయ్యగారు

## రాజమండ్రి

ఇతడార్య వైశ్యకులావతంసుడు. గొప్ప వ్యాపారస్థుడు. సహాయనిరాకరణ ఆరంభదినములలో ఈ నగర

కాంగ్రెస్ సంఘమున కధ్యక్షతను వహించి, తిలక్ స్వరాజ్యనిధిని వసూలుజేసెను. కాంగ్రెసునభ్యులను జేర్చుట, కాంగ్రెసు కార్యకలాపములలోను పట్టుదలతో పనిజేసెను. నిత్యఖద్దరు ధారి. అనేకసార్లు కాంగ్రెసుకు విరాళముల నొసంగెను. గాంధీజీ రాజమండ్రి వచ్చినపుడు వారి సన్మానసభకు తగిన యేర్పాట్లు చేయించెను. గాంధీజీకి ఆతిథ్యమిచ్చుటకు పోటీలు రాగా ఆ పోటీలో ధైర్యముతో 2 వేలరూపాయలిచ్చి తన యింటికి తీసికొనిపోయిన నరకశిఖామణి

## ౧౬౭:- కొత్తపల్లి వెంకయ్యగారు
## వీరభద్రపురం

( 1896 – 1936 )

జననం. 1896 సం॥రం. నిత్యఖద్దరుధారి. కాంగ్రెస్ కార్యక్రమములోని యావత్తుపనులను శాంతిసైనికుడుగా నిర్వహించెను. రాత్రులలోగస్తీ (Patrol) వగైరాపనులపైని నాయకత్వాన్ని వహించి ఉత్సాహంతో యువకులచే పనిచేయించుచుండెను. 1936 సం॥రంలో మరణించెను.

# ౧౬౮. పెద్దాపు ధర్మయ్యగారు

## రఘుదేవపురం

ఇతడు హరిజనుడు. సీతానగరం ఫిర్కా రఘుదేవపుర నివాసి కాంగ్రెస్ తరపున హరిజన రాత్రి పాఠశాలను నడిపించెను. ఖద్దరునూలుచే వస్త్రాలను నేయించెడివాడు. చాల మంది హరిజనులను కాంగ్రెసు సభ్యులుగా జేర్చెను. మరియు చరఖాసంఘానికి కూడా తాను సభ్యుడై నూలు పంపడమే కాక, ఇతరులను ప్రోత్సహించి వారిచే నూలు వడికించి సభ్యులుగా జేర్చెను. గాంధీజీ రఘుదేవపురం విచ్చేసినపుడు హరిజనులలో కొంత నిధికూడ వసూలుజేసి యిచ్చెను. డాక్టర్ సుబ్రహ్మణ్యంచే నెలకొల్పబడిన హరిజనాశ్రమములోకూడా పిల్లలకు కావలసిన సౌకర్యములను జేసెను గ్రామ, తాలూకా, జిల్లా, రాష్ట్ర సంఘాలలోనే గాక, ఆంధ్రరాష్ట్ర జాతీయ విద్యా విధాన సంఘములో గూడ సభ్యుడుగ నుండెను. మొత్తము మీద సీతానగరంఫిర్కా కాంగ్రెస్ కార్యక్రమములో పాల్గొని యసువులం బాసిన హరిజన ధీరుడు జాతీయ గీతాలను హరిజన వాడలలో విప్పించి ప్రజలకు ఈ రీతిగా కూడ ప్రబోధము జేసెను.

## ౧౬౯. కనికెళ్ళ నారాయుడుగారు

### వంగలపూడి

నాయీసంఘానికి చెందినవాడు. కలపవర్తకం జేస్తూ నిత్య ఖద్దరుధారియైన దేశభక్తుడు. ఆమరణాంత కాంగ్రెసువాది. గాంధీజీ చేతను పొగడ్తను గాంచెను. ఖద్దరు ప్రచారకుడు.

## ౧౭౦. చాగంటి వీరభద్రరావుగారు

### రాజమండ్రి

సుప్రసిద్ధ వైద్యశేఖరులగు వేరయ్యలింగం యొక్క సుపుత్రులు. వందేమాతరం కాలంనుండీ దేశీయఉద్యమములో పాల్గొన్నవాడు. నిత్యఖద్దరుధారి జాతీయ పాఠశాలలో చాలరోజులు వుపాధ్యాయుడుగా నుండి దేశభక్తి పూరితులుగా యువకులను తయారుజేసెను ఆమరణాంతం కాంగ్రెస్ అభిమాని. జాతీయ కార్యక్రమములో అనేకవిధముల దోడ్పడి యుండెను. 1921 సం॥రంలో తీవ్రమైన కాంగ్రెస్ ప్రచారమును తాలూకా పట్టణములలో జేసియుండెను. నిరాడంబర వ్యక్తి.

---

## ౧౭౧. శంకరమంచి సుబ్రహ్మణ్యంగారు
## ధవళేశ్వరం, తూ॥ గో॥

వెలనాటి వైదికుఁడు. నిత్యఖద్దరుధారి. ప్రజాసేవ జేయుటలో అగ్రగణ్యుడు. గోష్ఠగ్రంథాలయ స్థాపకుడు. సహాయనిరాకరణోద్యమ ప్రారంభమునుండీ కాంగ్రెస్ వాదియే. గ్రామ, తాలూకా, జిల్లాసంఘాలలో చిరకాలం సభ్యుడుగా నుండెను. నిర్మాణకార్యక్రమ భాగాలన్నిటిలోను పనిజేసెను. నిరాడంబరజీవి 1921 లగాయితు 1931 వరకు కాంగ్రెస్ సేవను దీక్షతో సల్పెను.

1937 సం॥ రంలో మరణించెను.

## ౧౭౨. శ్రీమతి బులుసు సుభద్రమ్మ
## కాకినాడ, తూ॥ గో॥

ఈమె బులుసు సాంబమూర్తిగారి సతీమణి. భర్తతో పాటు బాసటయై నిలచిన వీరపత్ని. 1921 సం॥ రం నుండి సహాయనిరాకరణోద్యమములో పాల్గొనెను. నిత్యఖద్దరుధారిణి. ఖాదీప్రచారం, కాంగ్రెసు సభ్యులను జేర్చుట, విరాళములను వసూలుజేయుట, నిర్మాణ కార్యక్రమమును స్త్రీలకు

బోధించుట ఈమెకు ముఖ్యకర్తవ్యములుగా నుండెను. విదేశ వస్త్ర దహనానికి వస్త్రాలను ప్రోగుచేయుట, కల్లు సారాయి మత్తుపదార్థములను నిషేధించుటలోను బనిచేసెను. 1921 సం॥ రంలో ఓట్లనిరాకరణ విషయములో తీవ్రముగా బనిజేసిరి. 1924 సం॥ రంలో కాకినాడ కాంగ్రెసు కార్యక్రమాన్ని కొమారుడు చనిపోయినను నిర్విచారముతో కొనసాగించిన ధీర. ఈమె కార్యదీక్షా దక్షత్వం-నిరుపమశక్తి చేతనే శ్రీ సాంబమూర్తి నేటివరకూ దేశసేవను జేయుజాలెను.

ఈసాధ్వీమణి 1942 లో మరణించెను.

## ౧౭౩. గుమ్మిడిదల సుబ్బారావుగారు
## కాకినాడ

సహాయనిరాకరణోద్యమారంభమునుండి కాంగ్రెసు వాదియే. భార్యతోకూడా కలిసి సహాయనిరాకరణోద్యమములో బనిజేసెను. భార్యకు రాజకీయంలోనూ ఆంగ్లేయ విద్యాభ్యాసములోను సహాయం చేసి అవకాశములు ఇచ్చెను. ఇతడు నిరాడంబర జీవనుడు.

## ౧౭౪ నిష్ఠల శ్రీరామమూర్తిగారు

## పెదమందపల్లి

శ్రీ వెంకన్న సీతమాంబగార్ల పుత్రుడై జన్మించెను. కాకినాడలో స్కూలుఫైనలు వరకు చదివి 1920 సం॥ రంలో రాజకీయములో ప్రవేశించెను. 1930 సం॥ రంలో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనెను. హరిపుర కాంగ్రెసుకు కాలి నడకను బోయెను. 1944 సం॥ రంలో ఆసుపత్రిలో మరణించెను.

## ౧౭౫. మామిడి దేవేంద్రుడుగారు

## రాజమహేంద్రవరం

(జననం 1885)

ఇతడు ప్రసిద్ధ ఆర్యవైశ్యకుటుంబమగు మామిడీవారి ఇంట్లోజన్మించి ఆజన్మాంతము దేశసేవనుజేసినధీరుడు. ఆంధ్ర దేశవీరులు రాజమండ్రిజైలుకకు పంపబడినచో వారికి భోజన ఫలాహార సదుపాయముల నరయుచుండెను.

1921 సం॥రంలో రాజమహేంద్రినుండి బెజవాడవరకు కాలినడ కను వేలకొలది ప్రజా వళిని రామదండులో జేర్పించి బెజవాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కమిటీ జూడ వెడలెను. ఈ రామ దండులో వేలకొలది ప్రజలు చేరిరి. ఈసంవత్సరంలోనే ఆంధ్ర రాష్ట్ర నాలంటీరు దళమునకు జనరల్ కమాండర్‌గా బని జేసెను పంచవిధ బహిష్కారములను నగళ్ళలోను, తీర్ధముల లోనుకూడ అమలుజరిపెను ప్రజల రక్షణము కొరకును, కాంగ్రెస్ ప్రబోధమునకును గూడబనిజేసెను.

రాజమండ్రి పట్టణములోనే కాక, యావదాంధ్రావని లోను, శాంతిసేనను బహుకట్టుదిట్టములతో తర్ఫీదుచేయించి పనిచేయించెను. అనేకసంవత్సరములు పట్టణ జిల్లా రాష్ట్ర సంఘ ములలో సభ్యుడుగానుండెను కాంగ్రెసు సభ్యులను జేర్చుట లోనేమి, తిలక్ స్వరాజ్యనిధిని వసూలుజేయుటలోనేమి హెచ్చు శ్రద్ధాభక్తులతో వ్యవహరించెను.

చనిపోవునప్పటి కితని వయస్సు 48 సంవత్సరములు.

వీరిసోదరులంతా దేశసేవకులే. 1903 సం॥రంలో ఇతడు ఇంగ్లండునకు పోయెను. కాకినాడలో 1924 సం॥రంలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ మహాసభలో పాల్గొని అచ్చటగూడ ఆహ్వానసంఘము తరఫున శాంతిసేనానిగ బనిజేసెను.

## ౧౭౬. చంద్రాభట్ల దత్తాత్రేయులు గారు

## రాజమండ్రి

నిత్యఖద్దరుధారి. అమరశాంత కాంగ్రెస్ వాది. కాంగ్రెసు సభ్యులనుజేర్పుట పంచవిధ బహిష్కారము, పికెటింగు మున్నగు కాంగ్రెస్ కార్యములలో పాల్గొనెను. చనిపోవు నప్పటికి యితనివయస్సు 50 వత్సరములు

## ౧౭౭. ఉపాధ్యాయుల సూర్యచింతామణి గారు, రాజమండ్రి

ఇతను పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురం వాస్తవ్యుడు. సహాయ నిరాకరణ ఉద్యమప్రారంభము నుండియు కాంగ్రెసు వాదియే నిత్యఖద్దరుధారి. సంస్కృతంలోను, ఆయుర్వేదములోను గొప్ప విశారదుడు

పట్టణ, జిల్లా రాష్ట్రీయ, అఖిలభారత ఆయుర్వేద సంఘములలో సభ్యుడు. పేదలకు నిష్పక్షపాతముగా ఉచితముగా వైద్యసేవచేసిన మహానుభావుడు. ఇదిగాక గొప్ప ఉపాసనాపరుడు. సంవత్సరమునకు నాల్గణాలు చెల్లించి కాంగ్రెసు

సభ్యు డగుటయేగాక యితరులనుగూడ ప్రోత్సహించి చేర్చెను. నిర్మాణ కార్యక్రమములో బాగాని తమవృత్తితోబాటు సేవజేసెను. ఇతగు దేశీయవిద్యాలయములో కొంతకాలము వైద్య ఉపాధ్యాయుడుగానుండి నిర్వర్తించుచు ప్రయివేటు విద్యార్థులకుకూడ చక్కని తర్ఫీదొసంగి, దేశసేవకై యువకుల నర్పించిన యుత్తమోత్తముడు.

## ౧౭౫. ముంజులూరి జనార్దనరావుగారు

### రాజమండ్రి

శ్రీ ముంజులూరి రాధాకృష్ణయ్య జ్యేష్ఠపుత్రుడు. గౌతమీసత్యాగ్రహ ఆశ్రమవాసురాలగు ఓలేటి సీతమ్మ సోదరుడు. నిత్యఖద్దరుధారి. సాలుకు నాల్గణాలు చెల్లించి కాంగ్రెసుసభ్యుడై అనేకమందియువకులనుజేర్చిన యువకుడు. పంచవిధబహిష్కారాల నమలులోపెట్టి, శాంతిసేనలోజేరి, నిర్మాణ కార్యక్రమమును చక్కగ నిర్వహిస్తూ విదేశవస్త్ర దహనమునకు వస్త్రాలను పోగుచేసిన సాహసి. ఆమరణాంతం కాంగ్రెసువాదియే.

## ౧౭౮. పందిరి వీరన్న గారు - రాజమండ్రి

ఆర్యలింగధారి వైశ్యకుటుంబానికి జెందినవాడు. వీరి కుటుంబీకులందరు ఖద్దరువ్రతధారులు. నాల్గణాలసభ్యులుగా నుండి అనేకమందిని కాంగ్రెసుసభ్యులుగా జేర్చిరి. ఆమర శాంతం కాంగ్రెసుభక్తుడు. వందేమాతరంకాలంలో 1907 సం॥ రంలో దేశసేవకులు ప్రయత్నముచేయుటకు, దేశీయవిద్యాలయము ను స్థాపించిన వైశ్యప్రముఖులలో నొకడు. ఈవిద్యాలయనిర్వహణ మునకు వందలాదిగ ధనమును ప్రోగుచేసిన వారిలో నొకడు, ఈసంస్థకధ్యక్షుడుగానుండి ప్రోత్సాహకులను, అభిమానులను రంజింపజేసి విద్యకొరకు జీవితమును ధారపోసిన వైశ్యశ్రేష్ఠుడు. కష్టసిద్ధార్జితములకోర్చి రెండు డాబాలు ఒకనూయిగల 14 యకరముల భూమిని సంపాదించి దానిలో బత్తాయి తోటను వేయించెను. ఇతనివంశీకులందరు కాంగ్రెసు అభిమానులే.

## ౧౭౯. తురగా శ్రీరామమూర్తి గారు

## అమలాపురం

ఇతడు సుప్రసిద్ధ ఆంధ్రబ్రాహ్మణ వంశోద్భవుడు. సహాయనిరాకరణోద్యమారంభమునుండియు కాంగ్రెసు

వాదియే. నిత్యఖద్దరుధారి. అఖిలభారత కాంగ్రెసు సంఘము వారి పంచవిధ బహిష్కారాలలోను, నిర్మాణకార్యక్రమముల లోను గొన్నారిరి. కాంగ్రెసు సభ్యులను జేర్పించుట తిలకు స్వరాజ్యనిధికి ధనమును జేకూర్చుట మున్నగు మహత్తర కార్యములను నిర్వహించిన మహనీయుడు. ప్రజాహితైషి. అనేకమందికి ధనసహాయము చేసినదాత. నిరాడంబరజీవి. పేరెన్నికగన్న కాంగ్రెసువాది.

## ౧౨౧. చామకూరి ఫకీరుగారు

## రాజమండ్రి

ఇతడు ఆంధ్ర కాపుజాతికి చెందిన పరోపకార పారీ ణుడు. వృత్తిచేతవడ్రంగి. నిత్యఖద్దరుధారి. రాత్రుల వేళలలో గస్తీతిరుగుట, శాంతిసైనికుడుగా పనిచేయుట మున్నగు కార్యములయందేకాక, విదేశవస్త్రదహనములలోనూ తీర్ధ వాసుల విదేశ వస్త్రబహిష్కారము చేయించుటలోను పాల్గొ నెను. బీదవిద్యార్థులకు చదువు చెప్పుటకు రాత్రి పాఠశాల నేర్పాటు చేయించెను. ఇదిగాక నూలు వడకుటను చాల మందికి నేర్పెను.

## ౧౮౨. తక్కారి నరసింహంగారు
## కోటకేసవరం
(1903 – 1938)

జ. సం 1903. ఇతడు హరిజన వైష్ణవుడు. సహాయ నిరాకరణోద్యమ ప్రారంభము నుండియు కాంగ్రెసువాది. గ్రామ తాలూకా సంఘములలో సభ్యుడుగాజేరి, హరిజన పాఠశాలలో ఉపాధ్యాయుడుగా నుండెను. రామాయణ, భారత, భామకలాపము వగైరాలు, నాటకాలు ప్రదర్శించుచూ, కాంగ్రెస్ ప్రబోధము గావించిన భక్తుడు. సంస్కృతమును బాగుగ నభ్యసించెను ఆమరణాంతము కాంగ్రెసువాది. సీతానగరం ఫిర్కాలో ప్రప్రథమములో పనిజేయుచుండెను 1938 సం॥రంలో మరణించెను.

## ౧౮౩. మద్దూరి నరసింహంగారు
## రఘుదేవపురం

సహాయ నిరాకరణోద్యమ ప్రారంభము నుండియు కాంగ్రెసువాది. 1921 సం॥రములో అఖిలభారత కాంగ్రెసు సంఘమువారి ఆజ్ఞానుసారము గ్రామోద్యోగ పదవికి రాజీనామాయిచ్చిరి. [illegible] దినాలలో నొకరు. అనేక విధములుగ కాంగ్రెసుకు సహాయము చేసిరి. సీతానగర ఫిర్కా వాస్తవ్యుడు.

## ౧౮౪. బొమ్మగంటి శ్రీరామమూర్తిశర్మ గారు

### నిడదవోలు

(1893 – 1939)

ఆంధ్రబ్రాహ్మణ వంశీకులు. సహాయనిరాకరణోద్యమారంభమునుండి కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమునందు పాల్గొనెను. నిత్యఖద్దరుధారి ప్రతి నిత్యము రాట్న పరిశ్రమ జేయుచుండేవారు. పట్టణ, జిల్లా సంఘములలో కాంగ్రెసు సభ్యులుగా నుండెను. అనేక విధముల కాంగ్రెసునకు సేవజేసియుండెను. అనేకమంది శాంతి సైనికులు, సేవకులు వీరి యింటను భోజనముజేసి వెడలేవారు. వీరికి మతివర్గాల భేదము లేకపోవుటచే, అష్టాదశ వర్ణములువారు వచ్చి బసచేసి పోయేవారు జైలునుండి విముక్తి అయినవారికి, నిర్మాణ కార్యక్రమములో పాల్గొని శరీరారోగ్యము చెడినవారికి ఉచిత భోజన ఔషధ సౌకర్యముల నొసంగి, వారు పరిపూర్ణారోగ్యమును బొందిన పిదప పంపివేయుచుండెడువారు. హిందువులు, మహమ్మదీయులు, వారువీరననేల యావన్మతములవారిచేతను ఆదరణను బొందుచుండెను. ఆమరణాంతం కాంగ్రెసువాది. ఆయుర్వేద ప్రచారమును బాగుగజేసెను. వీరి సానుభూతితో అనేక మహాసభలు జరుగుచుండెడివి. 1939 సం॥ రంలో మరణించిరి.

## ౧౮౪. భూపతిరాజు వేంకటేశ్వర రాజుగారు, ఖండవల్లి ఫిర్కా (పెరవలి)

( – 1938 )

ఇతడు క్షత్రియయువకుడు. నిత్యఖద్దరుధారి. నిర్మాణ కార్యక్రమ మన్నచో ఒకాల్ప్రతి. నిరాడంబరవ్యక్తి. ఉప్పు సత్యాగ్రహ రోజులలో పంచవిధ బహిష్కారాలుచేసి ఖండ వల్లికి వన్నె దెచ్చిన యువకులు. కాంగ్రెసు సభ్యులను చేర్చు టలో చాలశ్రమపడెను. ఆమరణాంతం కాంగ్రెసు వాదియే. 1938 సం॥ రంలో సర్పదష్టుడై మరణించెను.

## ౧౮౫. బొల్లాప్రగడ సుందరగోపాలరావు గారు, రాజమండ్రి, తూ॥ గో॥

సహాయనిరాకరణోద్యమం ప్రారంభము నుండి దంపతి యుక్తంగా కాంగ్రెసు సేవచేసి తరించెను. స్వయంగా నూలు వడికి—వస్త్రములను నేయించెడివారు. ప్రతివత్సరము 0-4-0 చెల్లించి కాంగ్రెసు సభ్యత్వమును నిలుపుజేసుకొనెను ఈయన భార్య కూడా అనేకమంది స్త్రీ సభ్యురాండ్రను కాం గ్రెసులో జేర్చెను. ప్రకృతి చికిత్స విషయంలో ప్రధాన దేశి కులుగా నుండి ఉచితవైద్య సేవను సల్పిన మహాసేవకుడు. ణి తత్రికలో తృప్తి నొందక, బాలబాలికలకు, గానపాఠశాల

౧౯ నెలల్కాల్పి, వారికి శిక్షను నిచ్చుటయేగాక, చేతిపనులు కూడ నేర్పుచుండేవారు. నిర్మాణకార్యక్రమము నీవిధము ఉత్సాహముతో జరిపిరి

---

## ౧౨౭. దామోజీపురపు నరసింహారావుగారు

## తాడేపల్లిగూడెం

ఈయన సహాయనిరాకరణోద్యమం ప్రారంభించినప్పటి నుండీ కాంగ్రెసు వాదియే. జైలును గురించిన్నీ ఇతరవిషయాలను గురించీ జాతీయగీతాలను వ్రాసి, హరికథలను జెప్పుచుండెడివాడు. నిత్యఖద్దరుధారి. నిరహంకారుడు. చాలకాలము కాంగ్రెసు సభ్యుడుగా నుండి నిర్మాణకార్యక్రమానికి జెందిన పనులలో నిమగ్నుడై సేవను జేసెను. గుండెజబ్బుచే మరణించిరి.

## ౧౨౮. అల్లూరి రామకృష్ణంరాజుగారు

## భీమవరం

ఉత్తమ క్షత్రియ కులోద్భవుడు. డిప్యూటీ కలెక్టర్ పనిచేసి విశ్రాంతి తీసుకొన్న కాలములో, దేశసేవజేయ నుత్సుకుడై కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమములో బాల్గొనెను. నిత్యఖద్దరుధారి. చాలాద్రవ్యమును వ్యయపరచి, అనేక

రాట్న సులను, మగ్గములను పెట్టి ఖద్దరు నేయించి, ప్రజలకు అందిచ్చుచుండేవారు. అనేక విధాల కాంగ్రెసుకు సహాయము చేసినవారిలో వీరొకరు. వీరు స్వయముగా ఖద్దరు వస్త్రాలను ధరించుటయేగాక, అనేకులను ధరించుటకు ప్రేరేపణ జేసేవారు. తాము ధనసహాయము జేసియు, ఇతరులచే ఇప్పించుచుండేవారు. పదవులకొరకు బాకులాడని నిరాడంబర జీవులు. ప్రకృతి ఆశ్రమాన్ని స్థాపించి, వేలవేలరూపాయలను వ్యయపరచి, అన్నివిధాల ప్రకృతిచికిత్సకు సాయపడిన మహావ్యక్తి. అనేక పునర్వివాహముల జేయించియు బీదలకు ద్రవ్యసహాయము చేసియు పోషించెను. ఇతని చిత్రవధజేసి చంపిరి.

## ౧౮౩. వేదాంతం వెంకటకృష్ణయ్యగారు
## కాకినాడ

స్వస్థలం బాపట్ల. 1890 ప్రాంతములో పురుషోత్తం కామాక్షమ్మలకుజన్మించిరి కలకత్తా జాతీయవైద్యాలయంలో 1920 సం॥ రంలో వైద్యపట్టా L.C.P.S. ను బొందెను.

ఇతడు ప్రసిద్ధవైద్యశేఖరుడు. బీదసాదల కుచితవైద్యసేవనుజేసెను. సహాయ నిరాకరణోద్యమము లగాయతు కాంగ్రెసువాది. నిర్మాణ కార్యక్రమములో చాలగ పాటుపడెను. కాంగ్రెసుశాంతిసైనికుల కాశ్రయమొసంగెను. పట్టణ కాంగ్రెసు సంఘాధ్యక్షుడుగాను, జిల్లాహరిజనసేవాసంఘ కార్యద

ప్లీడరుగాను పనిజేసెను. అస్పృశ్యతానివారణ విషయంలోగూడ కృషిచేసెను. కొంతకాలము మ్యునిసిపల్ సభ్యుడుగా నుండెను. ఇతడు హరిజనహాస్టలును నడిపించుచూ, అనేకులు అనాధ బాలబాలికలకు ఆశ్రయదాతయు, రక్షకుడునై వెలసెను. చాల మందిని కాంగ్రెసుసభ్యులను జేర్చెను. నిరాడంబరజీవి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఉప్పు జేయించుటలోను ఖద్దరు ప్రచారం శిబిరానికికావలసిన పదార్థసేకరణలోను ధనమును వసూలుజేయుటలోను పాల్గొని, దేశసేవనుజేసి తరించినవారిలో ఒకరు. కాంగ్రెసువారికి వీరిల్లుఒక విడిదిగానుండెను

జూలై 11-1943 లో మరణించెను.

## ౧౬౦. జొన్నవిత్తుల గురునాధంగారు
## చేబ్రోలు

స్వస్థలం, గుంటూరుజిల్లా చేబ్రోలు. కార్యస్థానము గుంటూరు. ప్రేమాతిశయుడు, ప్రజాసేవకుడు, కరుణాంతరంగుడు.

ఆంధ్రోద్యమానికి శ్రీ గురునాధుడు గురునాధుడే. 1910 – 13 సం॥ రం నాటి ఆంధ్రోద్యమాని కితడు మూలపురుషుడు. దేశభక్త శ్రీ న్యాపతి సుబ్బారావుకంటె ఈ ఉద్యమంలో యితనిదే ముందుచేయి.

ఆంధ్రకులన్నోగతిలో నున్నారనియు వారి అభ్యున్నతికి వారికొక ప్రత్యేకరాష్ట్ర మవసరమనియూ, ఆత డందరికంటె ముందు గ్రహించెను గ్రహించుటయేకాదు. అనేక కర పత్రము లందును, చిన్నిపొత్తముల ద్వారాను, పత్రికా ముఖ మునను, సభలలోను, ఎంతయో ప్రచార మొనర్చెను. బాపట్లలో జరిగిన ప్రథమ ఆంధ్రమహాజన సభకు ఆహ్వానసంఘా ధ్యక్షుడు దేశభక్తుడైనను, అంతరంగిక మంత్రి శ్రీ జొన్న విత్తుల గురునాథమే యని చెప్పాడుదు. శ్రీ గురునాథము కేవల సంఘతీర్మానాలతోటి, ప్రజాప్రబోధములు ఫలిక్కొని సంతృప్తి పడేవాడు కాడు.

తెనుగు భాషలో నవీనపార్లమెంటరీ విధానమంతా జరగాలనీ, ఆంధ్రుల చరిత్ర ఉత్తేజకరంగా లిఖింపబడాలనీ, ఆంధ్రజాతియొక్క ఆశయూ లహోరాత్రములు ప్రబోధించే 'ఆంధ్ర' యను ఆంగ్ల వారపత్రిక నడిపించాలని, భారతీయు లకు స్వరాజ్యం కావలెననీ, ఉద్దేశాలు కలిగి వానిని సాధించ డానికి తనశక్తికొలది పాటుబడి—ఉద్యమ సాధనలో మడిసిన ఆంధ్రమణి. రాచకీయములలో, గోఖలే వలెనే యితడును మిత వాది. పొడుగుపాటి సన్నని శరీరము, తెల్లని దుస్తులు. మెడ తిరిగిన తలపాగ, రేవియగు పంచకట్టు, కోరమీసం, కన్లజోడు—ఇతని ప్రతిమను ఆంధ్రులెల్లరూ పూజించవలెను. ఆంధ్ర రత్నమువలెనే యితను కూడ, విశాఖపట్టణం ఆసుపత్రిలో క్షయ వ్యాధిచే నడివయసునందే గ్రుక్కిపోయెను.

# ౧౯౧. ధుమంతరావు వేంకటసుబ్బారాయుడుగారు, ధుమంతునిగూడెం

( 27 - 1 - 1834 — 9 - 9 - 1994)

[ఈయన స్వర్భానునామసం॥ర ఫాల్గుణబహుళ ౧౪ న జన్మించిరి.]

శ్రీ ధుమంతరావు సుబ్బారాయుడుగారు కీర్తి శేషులయ్యారని వార్త వచ్చినవెంటనే 1921 సంవత్సరంలో ఆ స్వరాజ్యోద్యమపు తొలిరోజులలో కొవ్వూరు తాలూకా చేనరపల్లి ఫిర్కాలో, ఆ నిరుత్సాహ వాతావరణలో శ్రీ సుబ్బారాయుడుగారు, లక్ష్మయ్యగారు, పాలకోడేటి సుబ్బారాయుడుగారు మావంటి ప్రచారకులకు, కాంగ్రెసు సభ్యులను చేర్పించుటలో, విదేశ వస్త్రదహనంలో, సభలు జరిగించడంలో, పికెటింగు చేయుటలో ఇప్పించిన మహాసహాయము, చేసిన అమోఘసేవ, జ్ఞాపకం వస్తూన్నది. పిమ్మట వీరు కాంగ్రెసు ఆదేశానుసారం తమ కరిణీకమునకు, రాజీనామా (15-6-1921) నిచ్చిరి. యావజ్జీవిత ఖద్దరుధారియేగాక ఉత్పత్తి కర్త. ఈయన, ఈయనతోబాటు ఖద్దరు ఉత్పత్తిలో చాల పాటుబడిన కీ. శే. పాలకోడేటి వెంకటనరసింహంగారు 16-1-1932 న అరెస్టయినారు. 9-11-33 న సుబ్బారాయపురం హరిజనులకోసం ప్రతిష్ఠ చేశారు. 11-12-38 ని తిరిగి ధుమంతునిగూడెం కరిణీకం చార్జీ పుచ్చుకున్నారు. 10-7-43 న వీరిభార్య స్వర్గస్తురాలయినది. 9-9-49 ని వీరు పరమపదించిరి. వీరికి 3గురు పుత్రులు, 4గురు పుత్రికలు. వీరిపుత్రులలో నొకరగు శ్రీ బాపిరాజుగారు భూదానయజ్ఞమునకు య4-0లు దానమిచ్చి తండ్రికి దగిన పుత్రుడనిపించు కొనెను. (11-10-49 యుగధర్మ

సరస్వతీ పవర్ ప్రెస్ - రాజమండ్రి 7768/1953